ఓమ్

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

శ్రీ హరిహరాత్మనే సదాశివాయ నమః

# శ్రీ నీలకంఠీయ
# భగవద్గీతా భాష్యము

(గీతాసార సంగ్రహముతో)



THIS BOOK IS PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF TIRUMALA TIRUPATI DEVASTANAMS UNDER THEIR SCHEME "AID TO PUBLISH RELIGIOUS BOOKS"

భావానువాదము - ప్రకాశనము

**ఆచార్య, శివ శ్రీః నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు**

184/A, వెస్ట్ మారేడుపల్లి, సికింద్రాబాద్-26.

 * మూల్యం రూ. 80-00

ప్రథమ ముద్రణ - 1995-96;
యువనామ సంవత్సరము;

ప్రతులు - 1000





వేములవాడ-శ్రీరాజరాజేశ్వరస్వామి దేవస్థానమువారి యథోచిత ఆర్థిక సహకారమున అధ్యాయ ప్రథమషట్కము ముద్రితము.



వలయువారు

శివశ్రీ॥ ఎన్. హరదత్త (శివకిరణ్) శర్మ,
శివాద్వైత విజ్ఞాన - సర్వమంగళా-సదనము,
(120) 184/A, రోడ్ నెం. 6, వెస్ట్ మారేడుపల్లి,
సికిందరాబాద్-500 026. (ఆం.ప్ర.)

ముద్రణ :
శివాజీ ప్రెస్,
గంజ్ బజార్, సికింద్రాబాద్-3.

శ్రీ శివాభ్యాంనమః

# అభినందన పంచరత్నములు

కె. పి. మల్లికార్జునుడు

కం॥ గీతాశాస్త్రము తెనుగున-
సేత, శివాద్వైత రూప సిద్ధాంత బలో
పేతము, మోక్షదశాస్త్రము-
శ్రౌత పథానుగామి శైవులకెల్లన్ ॥ 1

కం॥ శైవ మహాపీఠాధిపుడీ
పావనకృతి సల్పి, దేవ భాషాగ్రంధ
ప్రావీణ్యములేని, జనావళి
సేవనపరుడౌచు ధన్యజీవుండయ్యెన్ ॥ 2

ఉ॥ నిర్మలవంశ సంభవుడనింద్యుడు, శాస్త్ర విశారదుండు స
ద్ధర్మపరుండు, శైవ జనతా గురుతా మహితాత్మకుండు ప్రా
గ్ధర్మ వివేకదక్షుడు, సకాల మహేశ్వర పూజనార్పణం
బర్మిలి, సేయు భక్తుడు, శుభాంగుడు, శంకరశాస్త్రిగారిలన్॥ 3

తే॥ గీ॥ బ్రహ్మసూత్రార్థ భాష్యంబు పావనంబు
నుపనిషద్వాక్య భాష్యంబు నొప్పుమీర
గీతికాభాష్యమును, నాంధ్ర జాతికొఱకు
తెనుగుజేసిన మహనీయ దీధితికిని
భక్తిమీరంగ వేవేలు ప్రణతులిడుదు ॥ 4

గీ॥ పంచకృత్యాధికార సంపన్నులైన
పార్వతీశులు, శంకర పండితునకు।
మరి సతీమణికిని సర్వమంగళములను
కీర్తి నొసగుచు నెప్పుడు రక్షింత్రుగాత ॥ 5

కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు

ఈ మహామహులు- వయోజ్ఞాన వృద్ధులై సహస్ర చంద్రదర్శన సుకృతము గల దీర్ఘసుఖజీవనులై శైవ మహాపీఠమునకే గాక మాదృశ గ్రంథ రచయితలకు చేయూత నొసఁగుచు అసమాన ప్రతిభతో సమయోచితముగ యుక్తియుక్తముగను సంభాషించువారై, ఉదార స్వభావులునగుటచే వీరిని ఆదర్శ పురుషోత్తములుగ భావించుచున్నాను.

నిర్మల శంకరశాస్త్రి

---

## గీతా రక్షతి రక్షితా

అయిభోః శ్రౌతస్మార్త శైవజనాః! సాదరం నివేదయే. అస్మిన్ ప్రపంచే వివిధాని కావ్యాని సంతి. పరం సర్వాణి సర్వేభ్యో న రోచంతే. కింతు భగవద్గీతా – సర్వస్యాపి రోచత ఏవ. ఆత్మోన్నతేః సుగమమార్గం కర్మసముచ్చిత జ్ఞాన (శివోపాసన) మావేదయంతీ స్వధర్మానుష్ఠాన ప్రాముఖ్యం ప్రతిపాదయతీ త్యతః గీతాసు సర్వాసు అగ్రస్థాన మలంచకార.

శ్రీ శైవమహాపీఠాధిపతినా, ఆచార్య శివశ్రీ॥ నిర్మలశంకరశాస్త్రివర్యైః శ్రీ నీలకంఠీయ భగవద్గీతా భాష్యస్య- మనోరంజనాఖ్య భావానువాదః- మహోపా

ధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రి కృత సంస్కృత గద్యవ్యాఖ్యాన మను స్మృత్య-సముల్లేఖితశ్చ విరాజతే.

శాంకరీయానువాదగ్రంధేషు ప్రస్థానత్రయగత ఏష గ్రంధః మకుటాయ మానః సంస్కృతజ్ఞానాం అనభిజ్ఞానాం చ గీతార్థ సంగ్రహణార్థం సముపయుక్తో భవతీతి మన్యే ఏతస్మిన్ గీతాపాఠశ్రవణ విధానం. అంగన్యాసాదికం సుష్ఠు నిరూపితమ్. శ్రీకృష్ణభగవాన్ ఆచార్యః, పార్థః శిష్యః, ప్రతిపాద్యః శివ ఇతి "ఈశ్వరః సర్వభూతానా" మిత్యాది శ్లోకార్థ ప్రతిపాదనేన నిరూపయామాసుః శాస్త్రిణః; శైవానా మేతత్పఠనేన "భగవద్గీతా శివపరా వా నవా" ఇతి సందేహ నివృత్తి ర్భూత్వా - లింగధారి శ్రౌత శైవారాధ్య సంప్రదాయ ఏవ ఏతస్యాం నిగూఢ ఇతి భావయన్ శ్రీ శాస్త్రిమహోదయేభ్యః సవినయం కృతజ్ఞతతయాచ ప్రణామం సమర్పయన్ విరమామి.

ఇత్థం

రామగిరి సిద్ధరామేశ్వర శర్మా

వీరు వారాసిగుడ బౌద్ధనగరులో స్వార్జిత గృహమున సకుటుంబముగ నివసించుచు నిత్య శివానుష్ఠాన సంపన్నులై విద్యాగురుత్వమును నాయందు సార్థక మొనర్చి - సవినయ సత్ప్రవర్తనుఁడునై సచ్ఛిష్యుల సహకారముతో జీవనమును కొనసాగించువాడగుటచే వీరిని హార్దికముగ అభినందించుచున్నాను.

నిర్మల శంకరశాస్త్రి

శ్రీ ముదిగొండ మార్కండేయ
రిటైర్డు జిల్లా జడ్జి

'శివప్రియ'
ప్లాటు నెం. 43 వెస్ట్ మారేడుపల్లి
రోడ్ నెం. 2
సికింద్రాబాదు - 500026
ఫోను 802508

# ప్రస్తుతి

శ్రీ మద్భగవద్గీత-ప్రస్థానత్రయములో నొకటి. రాశీభూతమైన వేదము లను లోకోపకారార్థమై ఋగ్యజుస్సామాధర్వణములుగ విభజించి లోకమున కందజేసిన వేద వ్యాసులవారిచే రచింపబడిన పంచమ వేదమైన మహాభారతము లోనిదీ భగవద్గీత. ద్వాపర యుగములో వేదోద్ధరణకై సాక్షాత్తు భగవంతుడే త్రిమూర్త్యవతారముగ నవతరించె ననుట జగద్విదితము.

శ్లో॥ అచతుర్వదనో బ్రహ్మా- ద్విబాహు రపరో హరిః
అఫాలలోచన శ్శంభుః- భగవాన్ బాదరాయణః ॥

భగవద్గీత యొక యపూర్వమైన యుపదేశ గ్రంథము. ఈ యుపదేశము, ఉపదేశమున కనువైన ప్రశాంత ఋష్యాశ్రమమునందుగాని, రమణీయనదీ తీరమునందు గాని జరుగలేదు. కురుక్షేత్ర యుద్ధభూమిలో నుభయసేనా మధ్యలో నష్టాదశ యక్షౌహిణుల కలకల ధ్వానములో జరిగినది. ఆశ పూర్తిగ నంతరించి పోయినప్పుడు, లభ్యమైన స్వల్పకాలములోనే జ్ఞానము సాధించి యాత్మను ందయవచ్చునని యనుకొన్నప్పుడు భగవద్గీత యుత్పన్నమైనదని, ఇందు చతనే గీత కంత ఖ్యాతి వచ్చినదని కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్ర శేఖర సరస్వతీ శంకరాచార్య స్వామివారి యనుగ్రహాభిభాషణము.

శ్రీ నీలకంఠ భగవత్పాదులు బ్రహ్మసూత్రములకు, భగవద్గీతకు నుపని షత్తులకును భాష్యములను రచించి లోకమున కందజేసిరి. అసామాన్య పాండితీ సంపన్నులు, శాస్త్రవేత్తలు, మహోపాధ్యాయ బిరుదాంకితులు "శివయోగి"

శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు నీలకంఠీయ బ్రహ్మసూత్ర భాష్యమునకు గీతాభాష్యమునకు నుపనిషద్భాష్యములకును సంస్కృత భాషలో వ్యాఖ్యానములను రచించుటయేగాక, అనేక శైవసిద్ధాంత గ్రంథములను గూడ రచించి శైవమతానుయాయులకు ప్రమాణ గ్రంథముల కొఱత దీర్చిన ధన్యజీవులు. శ్రీ నాగలింగశాస్త్రి గారిచే రచింపబడిన నీలకంఠీయ బ్రహ్మసూత్రభాష్య చింతామణి ప్రభా వ్యాఖ్యానమును శైవమహా పీఠాధిపతి శ్రీ నిర్మల శంకరశాస్త్రి గారు ఆంధ్రభాషలోని కనువదించినారు. ప్రస్తుతము వీరు గీతాభాష్య వ్యాఖ్యానమునకు గూడ మనోరంజనంబను ఆంధ్రానువాదము గావించి పాఠకలోకమున కందించినారు. మఱియు కఠోపనిషత్తునకు, వ్యాసప్రోక్త శివమహా పురాణమునకు నాంధ్రానువాదము గావించి బహుజనోపయుక్తములైన యనేక గ్రంథములను గూడ రచించినారు. ముఖ్యములైన ఇతర ఉపనిషత్తులకు గూడ శ్రీ శాస్త్రిగారు ఆంధ్రానువాదము చేయుచుండుట గర్వకారణము. నిస్స్వార్థముగ లోకకల్యాణమునకై వీరు చేయుచున్నకృషి మిక్కిలి యభినందనీయము.

ఇన్ని యుత్కృష్ట గ్రంథములను వ్రాయుటకు వలసిన వివిధ విషయాభిజ్ఞత ఒకే ఒక వ్యక్తిలో నిక్షిప్తము కావడము అసదృశము, అపూర్వమున్ను; బహుగ్రంథ ప్రతిపాద్యమానమైన వైదిక తత్త్వమును ముఖ్యముగ శివతత్త్వమును నిశితముగ పరిశీలనమొనర్చి ప్రవచనముచేసి ఇన్ని యుద్గ్రంథములను ఆంధ్రభాషలో నింతమనోజ్ఞముగ నావిష్కరించిన శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు తమ జన్మను సార్థకము చేసుకొన్నారు. అతిగహనమైన శాస్త్ర విషయములను ఆధ్యాత్మిక విషయములను సరళముగ సుబోధకముగ హృదయరంజకముగ పండితులకు మాత్రమే గాక జనసామాన్యులకుగూడ నర్థమగు రీతిని చెప్పుటలో శ్రీ శాస్త్రిగారు సిద్ధహస్తులనుటలో నతిశయోక్తి లేదు. వీరి యనువాదములు యథోచితములైనను మౌలిక గ్రంథములవలె నుండుట శ్రీ శాస్త్రిగారికి గల రచనా కౌశలమును ప్రత్యేకముగ చాటుచున్నది.

గీతా వాక్యములకు శ్రుతి స్మృతి వచన సమన్వయము గావించి శివ పారమ్యమును సహేతుకముగ వివరించుచు శ్రీ శాస్త్రిగారు చేసిన రచన ప్రశంసనీయము. మచ్చునకు 54 పుటలో "నకర్మణా న ప్రజయా న ధనేన త్యాగేనైకేన" ఇత్యాది శ్రుతిని, కర్మత్యాగరూపమైన సన్యాసము నిరూపింపబడినది గదా యను ప్రశ్నకు త్యాగము కర్మఫల త్యాగరూపమైనదని నిశ్చయించి, కర్మత్యాగమును

భగవానుడు నిరాకరించెనని యుత్తరువునిచ్చుట శ్రీ శాస్త్రిగారి కూలంకష శాస్త్ర విజ్ఞానమునకు నిదర్శనము.

శ్లో॥ విద్యాసు శ్రుతి రుత్కృష్టా రుద్రైకాదశినీ శ్రుతౌ ।
తత్ర పంచాక్షరీ తస్యాం "శివ" ఇత్యక్షరద్వయమ్ ॥

ఇత్యాది ప్రమాణముల ననుసరించి భగవద్గీతను-సర్వవేదశాస్త్ర సమ్మతమైన శివపారమ్యమును వివరించి - యనువదించిన శ్రీ శంకరశాస్త్రిగారికి శత సహస్ర నమోవాకములు, ఈ యుద్గ్రంథము శివతత్వ జిజ్ఞాసువులకు కర దీపికయై యాచంద్రార్కము ప్రకాశింప గలదని నా దృఢవిశ్వాసము. శైవ జనోపయోగము గల గ్రంథములింకను వీరిచే రచియింపబడు నవకాశమును కల్పించుటకై సదాశివుని ప్రార్థించుచున్నాను.

యువ కార్తీక పౌర్ణమి
7-11-1995

ముదిగొండ మార్కండేయ

వీరు పిత్రార్జితమగు శైవశాస్త్ర విజ్ఞానమును బాగుగా ఆకళింపు జేసికొని ఆంగ్లేయభాషా విశారదులై విశ్రాంత న్యాయాలయాధ్యక్షపదవీకులైనను స్వసంప్రదాయము నాచరించుచు సహృదయులు శాంతస్వభావులు సత్కుటుంబ సంపన్నులు నగుటచే వీరిని సర్వాత్మనా అభినందించుచున్నాను.

నిర్మల శంకరశాస్త్రి

శ్రీనిగమాగమాంతోపాదిత శివాద్వైత సిద్ధాంత ప్రతిపాదక
గీతాచార్యాయ నమః

శ్రీ శైవమహాపీఠము-తత్కార్యనిర్వాహకవర్గము వర్ధిలుగాక !



గ్రంధకర్త

**ఆచార్య, శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు**

స్థిర నివాసము :- సర్వమంగళా సదనము, (120) 184 A
రోడ్ నెం. 6, వెస్ట్ మారేడుపల్లి, సికింద్రాబాద్-500 026.

శ్రీ

శైవాః సర్వే సంపన్నాః, సమున్నతోద్యోగినశ్చ భవేయుః



ఆచార్య శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రిగారి కుమారుఁడైన సమున్నత విద్యానిష్ణాతుఁడు, శైవాచార ప్రవర్తనుఁడు నగు చి॥ శివశ్రీ॥ నిర్మల హరదత్తశర్మ, చి॥సౌ॥ తద్ధర్మపత్ని, చి॥శ్రీ॥ తత్పుత్రికారత్న మున్ను.

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# భగవద్గీతాసార సంగ్రహము

## ముందుమాట

ఒకానొక మహామంత్రమును జపించుటకు ముందు అంగన్యాసమును కర న్యాసమును చేసినచో తన శరీరము మంత్రమయంబగును. అటులే భగవద్గీత గూడ నొక సుదీర్ఘమైన మహామంత్రము కావున గీతను చదువుటకు ముందు ఇందు వ్రాయబడిన విధముగా అంగకరన్యాసముఁగావించిన యెడల తాను గీతామయుఁడు కావచ్చును.

గీతను చదువువానికి, ప్రాణాయామముజేయువానికిని పూర్వజన్మ కృత పాపములు గూడ అంటవని గీతామహాత్మ్యమునందు చెప్పఁబడినది. గీతార్థమును బాగుగా గ్రహించి గీతాపఠనముఁజేయుట శ్రేయస్కరమగునని తెలియవలెను.

గీతను చదువుటయే గాక గీతలో చెప్పఁబడిన కర్మజ్ఞానయోగమును యథాశక్తి ఆచరింపవలెను. సోమవార వ్రతాదులను అభిషేక పూజనాదులను పరమేశ్వర ప్రీత్యర్థము గావించుటయే కర్మయోగమనియు, నియమిత సమయములయందు భగవంతు నారాధించుటయే జ్ఞానయోగమనియు గీతారహస్యమై యున్నది

క్రీస్తునకు పూర్వము మూడవ శతాబ్దమున గీతారచన జరిగినదని తిలక్ మహాశయుఁడు నిర్వచించెను. నాలుగవ శతాబ్దమున గీతాప్రారంభమైనదని భండార్కరు మహోదయుఁడు వక్కాణించెను. ఐదవ శతాబ్దమున గీతా నిర్మాణంబని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. కాని కౌరవులు పాండవులు పోరాడినపుడు

కురుక్షేత్రమున భగవద్గీతా ప్రబోధము శ్రీకృష్ణభగవానునిచే చేయఁబడినది కావున నదియే గీతాకాలమని గుర్తెరుగవలెను.

ఇట్టి గీతకు జగద్గురు శ్రీ నీలకంఠాచార్యులవారు వ్రాసిన భాష్యము ననుసరించి శివయోగి, మహోపాధ్యాయ, శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారి వ్యాఖ్యానముఁబట్టియు తెలిసికొనవలసిన గీతా యథార్థాభిప్రాయముఁదగు స్వరూపమే ఈ "మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాదంబని పాఠకులు గ్రహింతురుగాక!

భగవద్గీతను చదువుటకు ముందు చేయవలసిన ప్రార్థనక్రమము.

## గణపతిస్తుతి

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం-శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయే-సర్వ విఘ్నోపశాంతయే॥

## దక్షిణామూర్తి స్తుతి

శ్లో॥ ఓం నమః ప్రణవార్థాయ-శుద్ధ జ్ఞానైకమూర్తయే।
నిర్మలాయ ప్రశాంతాయ-దక్షిణామూర్తయే నమః॥

## గురుస్తుతి

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః-గురుర్దేవో మహేశ్వరః।
గురుః సాక్షాత్ పరంబ్రహ్మ-తస్మైశ్రీ గురవే నమః॥

,, ఈశాన మీశ్వరీం స్కందం-కేశవం పద్మ సంభవమ్।
నందీశ్వరం కుంభయోనిం-భరద్వాజం చ గౌతమమ్॥

,, దధీచి ముపమన్యుంచ-మార్కండేయం పరాశరమ్।
అఫాలలోచనం శంభుం-వేదవ్యాస మహం భజే॥

,, శ్వేతాచార్యం చ తచ్ఛిష్యం-నీలకంఠ శివాభిధమ్।
తచ్ఛిష్యం హరదత్తం చ-భవదేవ సమాహ్వయమ్॥

,, సోమశేఖర భీమేశౌ-శ్రీ శివాద్వైత బోధకౌ ।
మహా పాశుపతజ్ఞాన-సంప్రదాయ ప్రవర్తకాన్ ॥

,, అంశావతారా నీశస్య-యోగాచార్యా నుపాస్మహే ।
శ్వేతాది నకులీశాంన్తా-ద్వాదశారాధ్య సద్గురూన్ ॥

,, సమ్యఙ్న్యాయకలాపేన-మహతా భారతేన చ ।
ఉపబృంహిత వేదాయ-వేదవ్యాసాయ వై నమః ॥

,, యః పాశుపత విజ్ఞానం-దదౌ గీతామృతం మహత్ ।
కుర్వన్ పార్థాయ సారథ్యం-తస్మై కృష్ణాత్మనే నమః ॥

## గీతా మాహాత్మ్యము

శ్లో॥ గీతాశాస్త్ర మిదం పుణ్యం-యః పఠేత్ ప్రయతః పుమాన్ ।
కైవల్యం సమవాప్నోతి-భయశోకాదివర్జితః ॥

,, గీతాధ్యయనశీలస్య-ప్రాణాయామపరస్య చ ।
నైవ సంతి హి పాపాని-పూర్వజన్మ కృతాని చ ॥

,, మలనిర్మోచనం పుంసాం-జలస్నానం దినే దినే ।
సకృద్గీతాంభసి స్నానం-సంసారమలనాశనమ్ ॥

,, గీతా సుగీతా కర్తవ్యా-కి మన్యైః శాస్త్రవిస్తరైః ।
యా స్వయం పద్మనాభస్య-ముఖపద్మా ద్వినిస్సృతా ॥

,, భారతామృత సర్వస్వం-విష్ణో ర్వక్త్రా ద్వినిస్సృతమ్ ।
గీతా గంగోదకం పీత్వా-పునర్జన్మ న విందతే ॥

,, సర్వోపనిషదో గావః-దోగ్ధా గోపాల నందనః ।
పార్థో వత్సః సుధీ ర్భోక్తా-దుగ్ధం గీతామృతం మహత్ ॥

# గీతాస్తోత్ర మహామంత్ర పఠన ప్రారంభము

ఓం అస్య శ్రీ భగవద్గీతా స్తోత్ర మహామంత్రస్య వాసుదేవ ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ సాంబసదాశివో దేవతా; "ఈశ్వరః సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" ఇతి బీజమ్; "సర్వధర్మాన్ పరిత్యజ్య—మామేకం శరణం వ్రజ" ఇతి శక్తిః; "తమేవ చాద్యం పురుషం ప్రపద్యే - యతః ప్రవృత్తా ప్రసృతా పురాణీ" ఇతి కీలకమ్; మమ సాంబసదాశివ ప్రసాద సిద్ధ్యర్థే పఠనే ప్రవచనే వా వినియోగః.

## కరన్యాసము

"తేషాం జ్ఞానీ నిత్యయుక్త-ఏకభక్తి ర్విశిష్యతే"

ఇత్యంగుష్ఠాభ్యాం నమః.

"మయ్యర్పిత మనోబుద్ధి-ర్మామే వైష్య స్యసంశయః"

ఇతి తర్జనీభ్యాం నమః

"మా ముపేత్య తు కౌంతేయ-పునర్జన్మ న విద్యతే"

ఇతి మధ్యమాభ్యాం నమః

"యత్త పస్యసి కౌంతేయ—తత్కురుష్వ మదర్పణమ్"

ఇత్యనామికాభ్యాం నమః

మన్మనా భవ మద్భక్తో-మద్యాజీ మాం నమస్కురు"

ఇతి కనిష్ఠికాభ్యాం నమః

"మచ్చిత్తః సర్వదుర్గాణి-మత్ప్రసాదా త్తరిష్యసి"

ఇతి కరతల కరపృష్ఠాభ్యాం నమః

## హృదయాదిన్యాసము

"తేషాం జ్ఞానీ నిత్యయుక్త-ఏకభక్తి ర్విశిష్యతే"

ఇతి హృదయాయ నమః

"మయ్యర్పిత మనోబుద్ధి–ర్మామే వైష్య న్యసంశయః"

ఇతి శిరసే స్వాహా

"మా ముపేత్య తు కౌంతేయ-పునర్జన్మ న విద్యతే"

ఇతి శిఖాయై వషట్

"యత్తపస్యసి కౌంతేయ-తత్కురుష్వ మదర్పణమ్"

ఇతి కవచాయ హుమ్

"మన్మనా భవ మద్భక్తో-మద్యాజీ మాం నమస్కురు"

ఇతి నేత్రత్రయాయ వౌషట్

"మచ్చిత్తః సర్వదుర్గాణి-మత్ప్రసాదా త్తరిష్యసి"

ఇతి అస్త్రాయ ఫట్

భూర్భువః సువరో మితి దిగ్బంధః.

## ధ్యానము

శ్లో॥ ఋతం సత్యం పరంబ్రహ్మ-పురుషం కృష్ణపింగళమ్ ।
ఊర్ధ్వరేతం విరూపాక్షం-ధ్యాయే హృది మహేశ్వరమ్ ॥

లం పృథివీ తత్త్వాత్మనే సాంబసదాశివాయ నమః గంధం పరికల్పయామి

హం ఆకాశ తత్త్వాత్మనే సాంబసదాశివాయ నమః పుష్పం పరికల్పయామి

యం వాయు తత్త్వాత్మనే సాంబసదాశివాయ నమః ధూపం పరికల్పయామి

రం తేజస్తత్త్వాత్మనే సాంబసదాశివాయ నమః దీపం పరికల్పయామి

వం అమృత తత్త్వాత్మనే సాంబసదాశివాయ నమః అమృత నైవేద్యం పరికల్పయామి

సం సర్వతత్త్వాత్మనే సాంబసదాశివాయ నమః సర్వోప
చారార్థే అక్షతాన్ సమర్పయామి

అని భగవద్గీతను పూజించి పారాయణమును ప్రవచనమునైనను గావింప వలెను.

## నివేదన

గీతను చదువు వారు గీతకు గల అనేకార్థముల వలన చిత్త విభ్రాంతి కలవారై నిశ్చితార్థమును తెలియఁజాలక తల్లడిల్లుచుండుటను గమనించి జగద్గురు శ్రీ నీలకంఠ భగవత్పాదుల వారు రచించిన గీతా భాష్యమునకు వ్యాఖ్యానమును వ్రాసినట్టి శివయోగి, మహోపాధ్యాయ, శ్రీముదిగొండ నాగలింగశాస్త్రి ఆరాధ్యుల వారి గీతా తాత్పర్య నిర్ణయము ననుసరించి ఈ గీతాసార సంగ్రహమును వ్రాసితిని.

జగద్గురు శ్రీ నీలకంఠ శివాచార్యులవారు కాశేశ్వర క్షేత్రమున గౌరీ విశ్వేశ్వరులను బ్రాహ్మణ మాహేశ్వర దంపతులకు నీలలోహిత రుద్రాంశమున స్వభాను సం॥ చైత్రశుద్ధ దశమి సోమవారము పుష్య నక్షత్రయుక్త శుభ ముహూర్తమున జన్మించి వర్ధిలుచుండగా బోధాయన మహర్షి యాతనిని కాశీ క్షేత్రమునకు తీసికొని వెదలి శ్వేతాచార్యులవారి యొద్ద నుపనయనము చేయించి విద్యల నభ్యసింపఁజేసినందున నీలకంఠాచార్యులు శ్వేతాచార్యులవారి యనుగ్రహమున వేదవేదాంత శాస్త్రములయందు నిష్ణాతుఁడయ్యెను. మరియు శ్వేతాచార్యుల నుండి శాంభవదీక్షఁ బరిగహించెను.

పిదప శ్రీవారు శైవమత ప్రచారము చేయనెంచి ప్రస్థానత్రయమును రచించిరి. అందు భగవద్గీతలకును శివాద్వైతపరముగా భాష్యమును వ్రాయుతఱి హరదత్తాచార్యులు ఏతెంచి "స్వామీ! గీతను గురించి కొన్ని సందేహములు పొడముచున్నవి కావున నవ్వానిని తొలగించి నన్ను ధన్యుఁజేయుడ"ని ప్రార్థించెను.

అంత హరదత్తాచార్యులు ప్రశ్నించుటయు మన నీలకంఠాచార్యులు నుత్తరించుటయే ఈ గీతాసార సంగ్రహముగా వెలసినది.

ప్రశ్న: ఆచార్యా! అభివాదయే.

భగవద్గీతలు "నత్వేవాహం జాతు నాసం" ఇత్యాది శ్లోకములతో ఆత్మ జ్ఞానము ముక్తిఫలకంబని నిరూపించుచున్నవి గదా!

ఉత్తరము: గీతలయందు గల నొక్కొక్క శ్లోకమును విడిగా విచారింపక సమగ్ర శ్లోకములను పరామర్శించినచో శ్రీకృష్ణ భగవానుఁడు అర్జునునకు పశు పాశ పతి జ్ఞానమును బోధించెనని తేటపడును. పశువనఁగా జీవుఁడు, పాశమనఁగా సంసారము. పతి యనఁగా పరమేశ్వరుఁడునని తెలియుము! పతిని తెలిసికొనుటకు పశువైన జీవుఁడు-తన రూపమెట్టిదో మొదట కనుగొనవలెనని యుద్దేశించి రెండవ యధ్యాయమున ఆత్మ (జీవ) స్వరూపము ప్రతిపాదింపఁబడినది. అంత మాత్రమున ఆత్మజ్ఞానమే ముక్తిఫలకంబని భావింపరాదు.

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం-యేన సర్వ మిదం తతమ్ ।
స్వకర్మణా త మభ్యర్చ్య-సిద్ధిం విందతి మానవః ॥

ఇత్యాది శ్లోకములతో-సాధకుఁడు తన వర్ణాశ్రమములకు అనువైన కర్మతో పరమేశ్వరు నారాధించి ముక్తుడు కావలెననియు, కర్మ యోగము ముక్తిసాధనంబ నియు, "జ్ఞానం తేఽహం సవిజ్ఞానం" ఇత్యాది సందర్భమున పాశము సంసార రూపమనియు, పతి పాశమును విడిపించువాడనియు బాగుగా పేర్కొనఁబడినది.

ప్రశ్న: ఆత్మజ్ఞానము-భేదమును తొలగించునదగుటదే మోక్షము నాపా దించును. ఏకమునందు అనేక భ్రాంతి యున్నంతవరకు సంసారము ప్రవర్తించు ననియు, ఏకమైన బ్రహ్మము తానేయని భావించి తన రూపమును గుర్తెరుగుట వలన సంసారము తొలగుననియు చెప్పుట సమంజసము కాదా?

ఉత్తరము: ఆత్మజ్ఞానమువలననే సంసారనివృత్తి యని చెప్పుట భగవద్గీత లకే గాక శ్రుతి సూత్రములకును విరుద్ధము ఎట్లనగా? ప్రజ్ఞానఘనము అద్వితీ యంబు నగు బ్రహ్మమునందు భ్రాంతి యేర్పడినదని చెప్పుటయు కూడదు. "ప్రకృతికన్న వేరు ఆత్మయని మాత్రము తెలిసికొనుట మోక్షహేతు"వని బాదరి, కపిల మహర్షియు తమ మతమును ప్రతిపాదించిరి. కాని వేదాచార్యుఁడగు వ్యాస మహర్షికి బాదరికపిల మతము సమ్మతము కాకుండుటచే పరిహరింపఁబడినది. జీవుఁడు-తనకు గల సత్యసంకల్పత్వాది గుణములను-అనాది కాలమునుండి చేయఁబడు అపచారముల ననుసరించి యేర్పడు ఈశ్వరసంకల్పము వలన-

మఱుగుపరచుకొని సంసారమున ప్రవర్తించునని వేదవ్యాసుఁడు "పరాభిధ్యానాత్తు తిరోహితం, తతో హ్యస్య బంధవిపర్యయౌ" అను బ్రహ్మ సూత్రమున బాగుగా నిరూపించినవాడు. అటులే మోక్షంబును ఈశ్వరానుగ్రహ లభ్యంబని వక్కాణించినవాడు. ఇందువలన బంధమోక్షములు రెండును ఈశ్వరాధీనములే గాని జీవాధీనములు కావని విశదమైనది. ఇవ్విషయమునే "సంసార మోక్ష స్థితి బంధ హేతుః" అను శ్రుతివాక్యము సమర్థించినది

గీతాశాస్త్రము గూడ "తత్ప్రసాదా త్పరాం శాంతిం-స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్" సంసార బంధవిముక్తిని శాశ్వతమైన శివసాయుజ్యమును పరమేశ్వరానుగ్రహమున జీవుఁడు పొందునని ప్రతిపాదించినది.

మరియు-

శ్లో॥ ప్రశాంతాత్మా విగతభీః-బ్రహ్మచారివ్రతే స్థితః।
మనః సంయమ్య మచ్చిత్తో-యుక్త ఆసీత మత్పరః॥

6 అ. 14 శ్లో.

పరమేశ్వరుని పూజించువాడు చిత్తమును శాంతపఱచి ఎట్టి భయము లేనివాడై ఇంద్రియములను నిగ్రహించి బ్రహ్మచర్యవ్రతము నవలంబించి మనస్సు నేకాగ్రము గావించి యంతఃకరణమును పరమేశ్వరునియందు నెలకొలిపి శ్రద్ధాభక్తి సమన్వితుడై శివధ్యానము నాచరింపవలెను.

శ్లో॥ అగ్నిర్జ్యోతి రహః శుక్లః-షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛంతి-బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥ గీత.

బ్రహ్మోపాసకులు-ఉత్తరాయణము శుక్లపక్షము పగలు మొదలగు సమయమున మరణించినచో-వారు ఈ లోకమునుండి బయలుదేరి పరమపదము నొందుదురు. అని చెప్పుటవలన జీవుఁడు ఇచటనే ముక్తుడగునని చెప్పువాదము గీతాశాస్త్రమునకు సమ్మతము కాదని తెలియుచున్నది.

యుద్ధములో శత్రువులను చంపుటను గురించి కర్తృత్వ కర్మత్వాదులు అజ్ఞానకృతములని మాత్రము భగవానుఁడు గీతలయందు నిరూపించెను కాని తదితర కర్మలను గురించి యటుల చెప్పలేదు. ఒకవేళ సర్వకర్మలును కూడవని

భగవానుఁడు చెప్పియుండినచో "శరీర యాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః" అను శ్లోకమున సర్వకర్మ త్యాగమును కంఠరవముతో నిషేధించుట వ్యర్థమగును గదా!

"సర్వకర్మాణి మనసా-సన్న్యస్యాస్తే సుఖం వశీ" అనుచో గల సర్వ పదమునకు నిత్యనైమిత్తికాది కర్మలని యర్థముఁజెప్పగూడదు. మనసా అని చెప్పినందున కర్మత్యాగము మానసికమనియే బోధపడును. అందువలననే "కామ్యానాం కర్మణాం న్యాసం-సన్న్యాసం కవయో విదుః" అనుచో కామ్యకర్మలను విడచుటయే సన్న్యాసమగుననియు కర్మలన్నిటిఁదగు ఫలముల నపేక్షింపకుండుటయే కర్మత్యాగమనియు భగవానుఁడు ప్రబోధించినవాడు.

మరియు కర్మత్యాగమును గురించి భగవానుఁడు ఇట్లు వక్కాణించెను.

శ్లో॥ యజ్ఞ దాన తపః కర్మ-న త్యాజ్యం కార్యమేవ తత్॥

సంధ్యావందనాది పంచయజ్ఞములు, దానము, రుద్రాధ్యాయ శివపంచాక్షరీ జపాది తపస్సు. వీనిని విడువక చేయవలెను.

శ్లో॥ మోహా త్తస్య పరిత్యాగ-స్తామసః పరికీర్తితః ॥

నిత్యనైమిత్తిక కర్మ నవివేకమున చేయకుండుట తామసత్యాగమగును.

శ్లో॥ యస్తు కర్మఫలత్యాగీ-స త్యాగీ త్యభిధీయతే ॥

పుణ్యకర్మల నాచరించుచు యవ్వాని నీశ్వరార్పణము గావించుట-నిజమైన త్యాగమగును.

ప్రశ్న: దేహాభిమానమును విడచినచో కర్మత్యాగము వలన దోషము సంభవింపదు గదా?

ఉత్తరము: దేహాభిమానము లేనట్టి మహాపురుషుని "ఓయీ! నీవు సర్వకర్మత్యాగమును చేయఁగలుగుదువేని ఇందుకు నిదర్శనముగా వస్త్రధారణమును భోజన పానీయాదులనుగూడ విడనాడుదువా? అని ప్రశ్నింపవలసియుండును.

"నత్వేవాహం జాతు నాసం" ఇత్యాది శ్లోకములతో భగవానుఁడు ఆత్మలు అనేకములు అని నిరూపించెను కాని కేవలాద్వైతమును నిరూపింపలేదు.

ప్రశ్న : పురుషోత్తముఁడను పదమునకు-నిర్వచనము నెట్లు చెప్పవలెను?

ఉత్తరము: 'ప్రథితః పురుషోత్తమః" అను గీతాశ్లోకమున క్షరమనఁగా ప్రకృతి (పాశ) యనియు అక్షరుఁడనఁగా జీవుఁ (పశు) డనియు క్షరాక్షరముల రెంటి నతిక్రమించియుండు పరమాత్మ-పురుషోత్తముఁడనఁబఁడునని యు తెలియవలెను.

"పురుషాణాం = ఉత్తమః" అని సామాన్య నిర్వచనము. "పురుషాత్ = ఉత్తమః" అను విశేష నిర్వచనమును పై గీతాశ్లోకము సమర్థించినది

మరియు గీతను ముగించు సందర్భమున

శ్లో॥ ఈశ్వరః సర్వభూతానాం-హృద్దేశేఽర్జున! తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని-యంత్రారూఢాని మాయయా॥

ప్రాణులందరి హృదయ గుహయందు ఈశ్వరుఁడు నివసించుచు ప్రకృతి వికారమైన శరీరయంత్రము నధిష్ఠించియుండు ప్రాణులను తన శక్తిచే జనన మరణాదిరూపమగు సంసారమున త్రిప్పుచున్నవాడు.

శ్లో॥ తమేవ శరణం గచ్ఛ-సర్వభావేన భారత ।

అట్టి పరమేశ్వరునే మనోవాక్కాయ భావములతో శరణము నొందుము! అనఁగా హృదయ గుహయందు జ్యోతిర్లింగముగా విరాజిల్లు పరమాత్మను బాహ్యమునందు నెడబాయక నారాధింతునని నిశ్చయించుకొని సర్వాంగలింగ సాహిత్యముతో ఇష్ట ప్రాణ భావ లింగధారణము నొనర్చి భస్మరుద్రాక్షధారణముతో శివ పంచాక్షరీ మంత్రజపముతోడను శివాగమప్రోక్త విధానమున శివుని సేవింపుమని భావము.

ఐతే కేవలము ఆత్మజ్ఞానము ముక్తిఫలము గలది కాదనియు పరమభక్తి (ఏకేశ్వరోపాసనము) వలన ప్రసరించు పరమేశ్వరానుగ్రహము వలననే మోక్షము చేకూరుననియు అందుకొరకు మానవుడు గీతలలోనిసారమును బాగుగా గ్రహించి లోకమునకందరాని భావములు గీతలో చెప్పఁబడినవని భ్రాంతిఁజెందక తా నాచరించుచున్న ఉపవాస వ్రత పూజన జపాది కర్మయోగమునే గీతయందు భగవానుఁడు ప్రతిపాదించెననియు విశ్వసించి తరింపవలెనని శ్రీ నీలకంఠాచార్యులవారు

హరదత్తాచార్యులకు వక్కాణించి మాధ్యాహ్నిక శివారాధన సమయమైనందున విరమించినారు.

ఇయ్యది గీతాసార సంగ్రహమున శాంకరీయ ఆంధ్రానువాద ప్రవచనముం దగు పూర్వార్థము.

గీతాసార సంగ్రహము-ఉత్తరార్ధము.

మాధ్యాహ్నిక శివారాధనమును నెరవేర్చి విశ్రాంతిగా కూర్చుండిన శ్రీ శ్రీ నీలకంఠ భగవత్పాదుల వారిని వినయ విధేయతలతో ప్రణమిల్లి హరదత్తాచార్యులు దిగువ విధము ప్రశ్నించెను.

ప్రశ్న : భగవద్గీత సగుణ తత్త్వమును ప్రతిపాదించుచు కర్మసముచ్చిత జ్ఞాన (ఉపాసన) యోగము వలననే మోక్షము చేకూరునని నిరూపించినట్లు తమ ప్రసంగ ప్రబోధము వలన తెలిసికొంటిని. ఐతే అట్టి సగుణ తత్త్వము గీతాచార్యుడైన నారాయణుండే నని బోధపడుచున్నది.

ఎట్లనంగా ? శ్రీకృష్ణుడు గీతను చెప్పినందున కృష్ణగీత యను వ్యవహారము లేక-భగవద్గీత యని పేర్కొనుటతో భగవచ్ఛబ్దము వాసుదేవుని యందు ఎట్టి యాక్షేపము లేనిదై వర్తించునను విశేషము పొడగట్టును గదా !

ఉత్తరము : ఇంత మాత్రమున "భగవాన్" అను పదము నారాయణుని యందే ముఖ్యముగా వర్తించునని చెప్పరాదు ఎందుకనగా ? "యో వై రుద్రః స భగవాన్" "నమస్తేఽస్తు భగవన్" ఇత్యాది శ్రుతి వాక్యములు - భగవత్పదము పరమేశ్వరునియందే రూఢిగా వర్తించునని తెలుపుచున్నవి. పురాణ రూఢి-వేద రూఢికన్న దుర్బలము గదా ! నిజము విచారింప "యా ఉమా సా మహావిష్ణుః" "పార్వతీదేవి-తన రెండవ రూపముగా విష్ణువయ్యెను" ఇత్యాది ప్రమాణములంబట్టి భగవతియొక్క యంశమును విశదపరచుటకే వ్యాసులవారు నారాయణునియందు భగవత్పదము నుపయోగించెను.

శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః-పరమాత్మేతి కీర్తితః ॥

"ప్రకృతి పురుషులను మించిన మరియొక ఉత్తమ పురుషుండు (శివుడు)

పరమాత్మ యని చెప్పఁబడును" ఇత్యాది గీతాచార్య సూక్తులు - ఈశ్వరుఁడే విశ్వాధికుఁడనియు సర్వేశ్వరుఁడనియు గీతా ప్రతిపాద్యుఁడనియు నిర్ణయించినవి.

ప్రశ్న : "అహం సర్వస్య ప్రభవః" "నేను సమస్తమునకు కారణుడను" ఇత్యాది వాక్యములు - గీత మొత్తము నారాయణపర మగునని తెలుపుచుండుటచే మధ్య గతములైన ఈశ్వరాది పదములు యోగశక్తిని నారాయణవరములగునని సమర్థింపవలసి యుండును గదా ?

ఉత్తరము : ఈశ్వరాది పదములు—ఇతరులను బోధింపక శివునినే బోధించునవిగా వేదమునందు లోకమునందు ప్రసిద్ధములై యున్నవి. యోగశక్తియు రూఢిశక్తియు పరమేశ్వరునియందు వర్తించుచుండగా యోగశక్తి మాత్రమున నారాయణ పరములుగా సమర్థింపరాదు.

ఇఁక "నేను" "నేను" అని శ్రీకృష్ణుఁడు చెప్పిన "అహం" శబ్దమును సమర్థించుట యెట్లనఁగా ?

"అహం మను రభవం సూర్యశ్చ" అని తానే సర్వాత్మభావమును పొందినట్లు వామదేవుఁడు గావించిన యుపదేశమువలె వాసుదేవుఁడు "శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్" అను బ్రహ్మసూత్ర న్యాయము ననుసరించి తన అంతర్యామి యగు ఈశ్వరుని భావించుచు అభేద దృష్టితో "నేను" "నేను" అని అర్జునునకు గీతలలో బోధింపవలసి వచ్చెను.

ప్రశ్న : "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" "అందరి హృదయములలో నేను నెలకొని యున్నాను" అను పంచదశాధ్యాయ గత వచనముఁబట్టి "ఈశ్వరః సర్వభూతానాం" ఇత్యాది గీతా వాక్యములు విష్ణుపరములగునని చెప్పవలెను గదా ?

ఉత్తరము : "తమేవ శరణం గచ్ఛ" "తమేవ చాద్యం పురుషం ప్రపద్యే" "ఈశ్వరః సర్వభూతానాం" ఇత్యాది వాక్యములు శివునినే బోధించుచున్నందునను "మా ముపాస్స్వ" "నన్ను ఉపాసింపుము" అని దేవేంద్రుఁడు ప్రతర్దనునకు బోధించిన సందర్భమున అంతర్యామియగు పరమాత్మ నుపాసింపుమని చెప్పినట్లు పరమార్థమును గ్రహింపవలెనని పెద్దలు నిర్ణయించినందునను "సర్వస్య చాహం

హృది సన్నివిష్టః" ఇత్యాది వాక్యములలో గల "అహం" శబ్దమును ఈశ్వర పరముగా నిర్ణయించుట న్యాయ్య మగుచున్నది.

ప్రశ్న : దేవేంద్రుఁడు పరమాత్మ కాకుండుటచే శాస్త్రీయమగు వామదేవ న్యాయముమ చెప్పవలెను గాని వాసుదేవునియందు అట్టి న్యాయము చెప్పరాదు గదా!

ఉత్తరము: "శివ ఏకో ధ్యేయః, శివంకరః సర్వమన్య త్పరిత్యజ్య" అను శ్రుతివాక్యము - మోక్షమునకై శివునొకనినే పూజింపవలెనని తెలుపుచుండుటయే గాక "తమేవ చాద్యం పురుషం ప్రపద్యే" "అందరికంటె మొదటివాడగు పురుష (శివుని)నే నేను శరణము నొందుచున్నా" నని వాసుదేవుఁడు భగవద్గీతలయందు విశదముగా చెప్పుట వలన గీతా శ్లోకములన్నియు శివునినే ప్రతిపాదించునని నిస్సంశయముగా గుర్తెరుగవలెను.

ప్రశ్న : శాస్త్రదృష్టి న్యాయము ఉపనిషత్తుల యందు సరిపడినను మహాభారతములో చేరిన భగవద్గీతలయందు వర్తింపదు గదా!

ఉత్తరము: మహాభారతము పంచమవేదమగుటచేతను "భగవద్గీతాసు ఉపనిషత్సు" అని గీతా వాక్యములన్నియు ఉపనిషత్ (వేదాంత) వాక్యములుగా చెప్పఁబడినందునను శాస్త్రదృష్టి న్యాయము గీతలయందును ప్రవర్తించును.

ఇంతియేగాక భగవద్గీత-కూర్మపురాణములో ఉత్తరార్ధమునందలి ఈశ్వర గీతకు ననువాదమగుటచే "అహం సర్వస్య ప్రభవః" ఇత్యాది వాక్యములు-ఈశ్వర గీతయందు నుండుటచేతను భగవద్గీతకన్న ముందు చెప్పఁబడిన కూర్మపురాణమునందలి ఈశ్వర గీతయందు "నేను" అను శబ్దము పరమేశ్వరుని బోధించుట వలనను భగవద్గీత గూడా శివపరమగునని నిర్భయముగా చెప్పవచ్చును.

ఈశ్వరగీతను సనత్కుమారుఁడు శివునివలన విని సంవర్తున కుపదేశించెను. సంవర్తుఁడు సత్యవ్రతునకు: సత్యవ్రతుఁడు పులస్త్యునకు; పులస్త్యుఁడు గౌతమ మహర్షికి, (ఇదే గీత) నుపదేశించిరి. మరియు అంగిరుఁడు భరద్వాజునకు; కపిల మహర్షి-జైగీషవ్యునకు పంచశిఖునకు నీశ్వరగీతను ప్రబోధించిరి. వేదవ్యాసుని తండ్రియగు పరాశరమహర్షి-సనకునివలన పరిగ్రహించి వాల్మీకి మహర్షికి నీశ్వర గీత నుపదేశించినవాడు.

సతీదేహమునుండి పుట్టిన వామదేవుఁడను యోగీంద్రుఁడు-వ్యాసునకు, నుప దేశించెను. దేవకీనందనుఁడగు శ్రీకృష్ణుడు విష్ణురూపమున శివప్రబోధితుఁడై అర్జు నునకు నిదే ఈశ్వరగీతను వక్కాణించెను.

వామదేవునివలన ఈశ్వరగీతా ప్రబోధముఁ బడిసిననాటినుండి వేదవ్యాసు నకు పరమేశ్వరునిపై పరాభక్తి కలిగినది. అని కూర్మపురాణమున కలదు.

మరియు "అర్జునా ! వాసుదేవుఁడు నీకు ఈశ్వరజ్ఞానమును బాగుగా భగవ ద్గీతారూపమున నుపదేశించినవాడు గాన నిజనివాసమునకుఁజని శరణాగత రక్ష కుఁడగు శంకరు నేకాంతభక్తి నారాధింపుము !" అని వ్యాసులవారు చెప్పినట్లు కూర్మపురాణమునందే వ్రాయఁబడినది. అందువలన భగవద్గీత-ఈశ్వరగీత కను వాదమై ఈశ్వరగీతార్థమునే విపులీకరించినదని తెలియవలెను.

ప్రశ్న : వాసుదేఁడు విశ్వరూపమును చూపెను గదా ! అట్టి విశ్వరూపము తనదై యుండవలెను. ఈశ్వరునిదైనచో తానెట్లు విశ్వరూపమును ప్రదర్శిం చును ? విశ్వరూప ప్రదర్శన కారణమున శ్రీకృష్ణుఁదే గీతాప్రతిపాద్యుఁడగు పర మాత్మ యగునని చెప్పుట సమంజసము గదా ?

ఉత్తరము : దధీచి మహర్షి, ఆంజనేయస్వామియు పూర్వము విశ్వరూప మును చూపినారని పురాణములయందు వ్రాయఁబడినది. అటులే వాసుదేవుఁడును విశ్వరూపమును ప్రదర్శించినాడు.

"దర్శయామాస పార్థాయ-పరమం రూప మైశ్వరమ్"
"పశ్య మే యోగ మైశ్వరమ్" గీతావాక్యములు.
"ద్రష్టు మిచ్ఛామి తే రూప-మైశ్వరం పురుషోత్తమ"

ఇచట ఐశ్వర పదము - విశ్వరూపము ఈశ్వరునిదే నని తేటపరచుచున్న యది.

ప్రశ్న : "ఐశ్వరమ్" అనఁగా జ్ఞానవీర్యాది సహితము అను నర్థముఁజెప్పి అట్టి విశ్వరూపమును శ్రీకృష్ణభగవానుఁడు చూపెట్టెనని సమర్థింపవచ్చు గదా ?

ఉత్తరము : "ఐశ్వరమ్" అనుదానికి రూఢ్యర్థము "ఈశ్వరసంబంధమైన" అని యగును. అట్టి యర్థమును విడనాడి యౌగికార్థమును పరిగ్రహించుట న్యాయము కాదు. ఇంతియే గాక "ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా-స్వకం రూపం

దర్శయామాస భూయః" వాసుదేవుఁడు విశ్వరూపమును గురించి విశదముగాచెప్పి తనదైన శ్రీకృష్ణ రూపమును అనంతరము చూపెట్టెనని గీత యందు వ్రాయఁ బడుటచే విశ్వరూపము పరమేశ్వరునిదే నని బోధపడును.

ప్రశ్న : "కృష్ణా! నీ వైష్ణవ రూపమును చూడఁగోరుచున్నా" నని ఉదంకుఁడు ప్రార్థింపగా పూర్వము ధనంజయునకు చూపిన విశ్వరూపమునే ఉదంకునకు చూపెట్టెనని మహాభారతమున ఆశ్వమేధికపర్వము నందు కలదు గాన గీతా ప్రతిపాదిత విశ్వరూపము శ్రీకృష్ణునిదే నని భావింపవచ్చును గదా!

ఉత్తరము : మహాభారతమున భగవద్గీత తరువాత నశ్వమేధపర్వము కలదు. గాపున ముందు చెప్పబడిన గీతలోని ఐశ్వర పదము ననుసరించి వైష్ణవ పదమునకు "వ్యాపించు శక్తిగల పరమేశ్వరుని విశ్వరూపము"అని నిర్వచనము జేయవలసియుండును. ఒకవేళ 'వైష్ణవమ్" అనుదానికి "విష్ణుమూర్తిఁజెందిన" అను నర్థమే సమంజసంబనినచో త్రివిక్రము నుపాసించు హనుమంతుఁడు చూపిన విశ్వరూపము-ఉపాస్య సంబంధముఁబట్టి త్రైవిక్రమ మనియు, ఉపాసక సంబంధముచే హానూమతం బనియు పేర్కొనఁబడినట్లు ప్రకృత విశ్వరూపంబు ఐశ్వరమనియు వైష్ణవ మనియు చెప్పుటలో విరోధ మెద్దియు గానరాదు.

ప్రశ్న : "బ్రహ్మాణ మీశం కమలాసనస్థం" అనుచో ఈశ్వరుఁడు విశ్వరూపములో చేరినవాడని తెలియుచున్నందున విశ్వరూపము వైష్ణవమనియే తేలుచున్నది గదా!

ఉత్తరము : ఈ వాక్యము నందు గల ఈశ పదము బ్రహ్మపదమునకు విశేషణము కావున కమలమునందాసీనుడైయున్న చరాచరమును శాసించు బ్రహ్మదేవుని కౌంతేయుఁడు విశ్వరూపములో చూచెనని చెప్పవలెను. సృష్టిఁజేయు బ్రహ్మదేవుఁడు తాత్కాలికముగా జగమును శాసించు వాడు కావచ్చును. ఒకవేళ ఈశ పదమునకు శంకరుఁడనిఁ యర్థముఁ జెప్పుదు మనినచో విశేషణమైన కమలాసన పదమునకు విశేష్యమైన బ్రహ్మ పదమునకు మధ్య ఈశపదము ఇంకొక వ్యక్తిఁ జెప్పు విశేష్యముగా నుండరాదు. కావున ఈశ పదమును గూడ బ్రహ్మపదమునకు విశేషణముఁజేయుట శాస్త్రవిహితంబగును.

మరియు భారతమున ద్రోణపర్వమునందు—

"యుద్ధమున శత్రువులను బాణములతో కొట్టుచుండగా ముందుచున్న త్రిశూలమును చేతఁబట్టుకొని యగ్నిసన్నిభుఁడగు మహాపురుషుఁడు నా రథముముందు భూమ్యాకాశముల నంటకుండ నడిచెడువాడు ఆతని త్రిశూలముచే వధింపఁబడిన తరువాతనే నా బాణములు శ్రతువులను తాకుచుండెడివి. ఆ మహాపురుషుఁడెవరు?" అని యర్జునుఁడు ప్రశ్నింపగా వేదవ్యాసుఁడు ఆతడే మహాదేవుఁడనియు గీతా విజ్ఞానముఁ బడసితివి కావున వరదుండగు శంకరుని సేవించి కృతార్థుఁడ వగుమనియు ప్రబోధించెను.

శ్రీకృష్ణుఁడు సౌమ్యమూర్తి యగుటచే విశ్వరూపము ఉగ్రముగా నుండ కూడదని భావించి యర్జునుఁడు "ఆఖ్యాహి! మే కో భవా నుగ్రరూపః"అని ప్రశ్నింపగా "కాలో౽స్మి లోకక్షయకృత్ ప్రవృద్ధః" "లోకమును నశింపఁజేయు మృత్యుంజయుడను. ఉగ్రమైన విశ్వరూపము కాలాగ్నిరుద్రునిదే" నని శ్రీకృష్ణుడు విశదీకరింపవలసివచ్చెను. మరియు మోక్ష ధర్మ పర్వమునందు-శంకరుఁడు ముందు చంపిన వారినే నీవు తరువాత వధించితివి. నీ విజయమునకు ముఖ్యకారకుఁడు పరమేశ్వరుఁడే గావున నాతనినే సర్వాత్మనా భావింపుమని శ్రీకృష్ణ భగవానుఁడు పాండవ మధ్యమునకు ప్రబోధించినట్లు కలదు.

పూర్వము కైలాసమున పంచేంద్రులను గురించి "మీరు మానవులుగా జన్మించి యుద్ధమున శత్రువులను సంహరించి మరల నీ యత్యుత్తమ స్థానమునకు రండు" అని పరమేశ్వరుఁడు చెప్పిన యంశమే మహాభారతమున విపులముగా వర్ణింపఁబడియున్నది.

సామాన్యులైన ఋషుల వాక్యముల నర్థ మనుసరించుచుండగా లోకాతీతుఁడు మహర్షియు నగు సదాశివుని వాక్యము వ్యర్థంబగునా?

ప్రశ : "దివ్యం దదామి తే చక్షుః" అను గీతా వాక్యమున "దివ్య నేత్రమును నీ కొసగుచున్నా"నని చెప్పుటచే వాసుదేవుఁడే పరమాత్మయని బోధపడును గదా?

ఉత్తరము : వేదవ్యాసుఁడును సంజయునకు దివ్య నేత్రమును ప్రసాదించుటఁజేసి దివ్యనేత్రప్రదానము యోగసిద్ధిమూలమగుటఁజేసియు నీవనుకొనినయట్లు భావించుటకు వీలులేదు. శ్రీకృష్ణుఁడును శివయోగ నిష్ఠాబలమున దివ్యనేత్రము నొసగుటయు విశ్వరూపమును చూపెట్టుటయు పొసగుచున్నవి. మరియు భగవా

నుఁడు పరమాత్మను నిర్దేశించుటకై తఱచుగా ఈశ్వర పదమునే గీతల యందు వాడెను.

"క్షరం ప్రధానం అమృతాక్షరం హరః' క్షరాత్మానా వీశతే దేవఏకః" "ప్రకృతి-క్షరమనియు, పురుషుఁడు అమృతాక్షరుఁడనియు, ప్రకృతి పురుషులను శాసించు దేవుఁడొక్కఁడే ననియు" చెప్పు ఉపనిషన్మంత్రమును "యస్మాత్ క్షరమతీతోఽహమ్" ఇత్యాది గీతా శ్లోకము సమర్థించుచుండుటచే ఇందు గల "అస్మి"అను పదము అంతర్యామియగు శివునిఁ జెందినదని తెలియుచున్నది.

ఇంతియేగాక "స్థితోఽస్మి గతసందేహః-కరిష్యే వచనం తవ"

"సంశయము లేనివాడనైతిని. నీమాట పాటింతు"నని ప్రతిజ్ఞ నొనర్చిన పార్థుఁడు యావజ్జీవము శివారాధనమునే గావించెను. మరియు శివపూజనమునకై సేకరించుకొనిన గంధాక్షత పుష్ప బిల్వాదులను శ్రీకృష్ణునకు సమర్పించి తరువాత కృష్ణార్జునులు కైలాసమునకు వెళ్ళినపుడు శంకరుని దివ్య విగ్రహముపై నా యుపచారములను గాంచిరను సందర్భము అర్జునుఁడు నిత్య శివారాధకుఁడు అనుటకు ప్రబల నిదర్శన మగుచున్నయది.

"కరిష్యే వచనం తవ" అను వాక్యము యుద్ధవిషయమై ఉపయోగించునదైనను "అనన్యాశ్చింతయంతః" ఇత్యాది భగవద్వాక్యములను వినిన అర్జునుఁడు శివారాధనమునే తన ముఖ్యకర్తవ్యముగా నిశ్చయించుకొని శ్రీకృష్ణుని ప్రబోధమును సార్థకముఁ జేసెను.

సౌప్తిక పర్వము నందు—జగత్కల్యాణము నొనఁగూర్చు శ్రీకృష్ణుఁడు నన్ను సర్వోత్తమునిగా గుర్తించి యారాధించుచున్నవాడు గాన నాతని కన్న ప్రియుఁడు మరి యొకఁడు లేడు అని శంకరుఁడు వాక్రుచ్చినట్లు మహాభారతమున వర్ణింపఁబడినది.

మరియు శ్రీకృష్ణుఁడు ఉపమన్యు మహర్షి గారి యుపదేశము నొంది భస్మ రుద్రాక్షధారియై శివ మంత్రమును జపించుచుండెననియు కైలాసయాత్ర యందు తదితర సమయముల యందును శివ పూజా స్తోత్రాదుల నొనర్చెననియు హరివంశాది గ్రంధములలో విస్తారముగా చెప్పఁబడినది.

మహాభారతాంతర్గత ద్రోణ పర్వమున

శ్లో॥ ఊర్ధ్వ బాహు ర్మహాతేజాః జ్వాలనాదిత్య సన్నిభః!
షష్టివర్ష సహస్రాణి తపత్యేవ శతాని తు ॥
వ్యశోషయత్తదాఽఽత్మానం వాయుభక్షోఽంబుజేక్షణః॥

అగ్ని సూర్యులవలె ప్రకాశించువాడు, గొప్ప సామర్థ్యము గలవాడు, నగు పుండరీకాక్షుఁడు - గాలి మాత్రము పీల్చుచు ఊర్ధ్వ బాహువునై ఆరువదియారు వేల వత్సరములు తపించి తన శరీరమును శుష్కింపఁజేసెను.

అట్టి తపంబున శివుఁడు ప్రసన్నుఁడు కాగా "మహేశ్వరా! చరాచర ప్రపంచ మంతయు నీ వలన నావిర్భవించును. నీ భక్తుడనైన నన్ననుగ్రహింపుము!" అని నారాయణుఁడు ప్రార్థించెను. అంత శివుఁడు నారాయణునకు ననేక వరముల నొసగినవాడని వ్రాయఁబడినది. మరియు శ్రీకృష్ణుఁడు తనకు శివ ప్రసాదమున లభించిన పుత్రునకు "సాంబు"డను నామధేయముఁబెట్టుటకు కారణము "నిరంతరము శివనామస్మరణము ఘటింపవలె"నని యుద్దేశించుటయే గదా!

మహా భారతము భగవద్గీతయేగాక వేదాంతములన్నియు శివుఁడే సర్వాధికుండని ప్రతిపాదించుచున్నవి. వేదాంతము (ఉపనిషత్తు)లు గీతలును సమానార్థకములైనపుడే "భగవద్గీతాను - ఉపనిషత్సు"అను వాక్యము ఉపయోగించును కావున నించుకంత నుపనిషత్తుల సమన్వయార్థమును వ్రాసి యీ గీతా సార సంగ్రహమును ముగింతును

పాఠకులు శ్రద్ధాసక్తులు గలవారై విసుగుఁజెందక సమగ్రముగా చదివి గీతార్థసారమున నిశ్చయబుద్ధి గలవారగుదురు గాక!

విస్తరభీతిచే ప్రమాణబాహుళ్యమును ఉపపత్తిసమగ్రత నుల్లేఖింపలేదు. అందువలన స్థాలీపులాకన్యాయముగా సరసహృదయులు ఇందలి విషయ సామంజస్యమును గ్రహింపగలరని మనవి.

వేదాంత ప్రముఖ స్థానీయమగు ఈశావాస్యోపనిషత్తు "ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించి జ్జగత్యాం జగత్" "స్థిరప్రాణులగు వృక్షలతాదులను చర ప్రాణులగు దేవమానవ పశుపక్ష్యాదుల నీశ్వరుఁడు నధిష్ఠించియున్నవాడు" అని ప్రారంభించి పరమేశ్వరుఁడు—సమస్త జగదంతర్యామి యని నిరూపించినది.

మాండూక్యోపనిషత్తు "శివ మద్వైతం చతుర్థం" ఇత్యాది వాక్యములతో పరమేశ్వరుఁడు-బ్రహ్మవిష్ణురుద్రులను మించిన నాలుగవ తత్త్వమని సమర్థించినది.

ఛాందోగ్యమున-శివుఁడు - సూర్యాంతర్వర్తియగు మహాపురుషుఁడనియు, కఱుగఁబడిన బంగారపు వన్నెవంటి కాంతిగల శరీరముగల వాడనియు వర్ణింపఁబడినందున "శివరూపము-ఇనుమువలె నలుపైన" దని భావించువారి దుష్టచింతనము దూరాపాస్తమగుచున్నయది.

మరియు నదే ఛాందోగ్యమున తృతీయ ప్రపాఠకమున పదునేడవ ఖండమునందు "తద్ధైతత్ ఘోర ఆంగిరసః కృష్ణాయ దేవకీపుత్రా యోక్త్వోవాచ, అపిపాస ఏవ స బభూవ" అనుచో దేవకీతనయుఁడగు శ్రీకృష్ణుడు ఆంగిరస మహర్షి వలన ప్రబోధముఁబడసి స్థితప్రజ్ఞుడై పార్థునకు భగవద్గీత నుపదేశించెనని చెప్పఁబడినందున శ్రీకృష్ణుఁడు గీతాచార్యుఁడు మాత్రమని తెలియుచున్నది.

బృహదారణ్యకమున అంతర్యామి బ్రాహ్మణమునందు "యస్య పృథివీ శరీరం" "యస్యాదిత్యః శరీరం" మొదలగు వాక్యములతో అష్టమూర్తియగు శంకరుఁడు-భూమి శరీరముగా గలవాడనియు సూర్యునిలో నుండువాడనియు సర్వాంతర్యామిగా ప్రత్యక్ష స్వరూపము గలవాడనియు చెప్పఁబడినందున నట్టి శివుని దర్శింప నిచ్చగింపని వారికి వివేకము పొడమునని గ్రహింపవలెను.

ఇఁక నధర్వ శిఖోపనిషత్తు "ధ్యాయీతేశానం ప్రధ్యాయితవ్యం బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాః సంప్రసూయంతే, సర్వాణి చేంద్రియాణి సహభూతైః, ర్న కారణం కారణానాం ధ్యాతా, కారణం తుధ్యేయః, సర్వైశ్వర్యసంపన్నః సర్వేశ్వరః శంభు రాకాశమధ్యే" "ధ్యానింపవలెననినచో - శివుని బ్రహ్మవిష్ణురుద్ర దేవేంద్రాదులను పుట్టించినవానిగాను, కర్మ జ్ఞానేంద్రియములను పంచభూతములను సృష్టించినవానిగాను ధ్యానింపవలెను. కారణ కారణుఁడైన శివుఁడు మాత్రము అనాదిముక్తుఁడు కావున నెవరివలనను జన్మించినవాడు కాడు. సృష్టి ప్రారంభమున బాగుగా ఆలోచించి జగమును నిర్మించువాడు శివుఁడేను. జగత్కారణంబగు శివుని సర్వైశ్వర్య సంపన్నునిగాను సర్వేశ్వరునిగాను హృదయములో ప్రకాశించు ఆకాశమున భావింపవలెను. ఇత్యాది వాక్యములతో ప్రకృతిని పురుషుని ధ్యానింపక పురుషోత్తముఁడైన శివునినే ముముక్షువులు ధ్యానింపవలెనని విశదీకరించినది.

మంత్రోపనిషత్తు "మాయాం తు ప్రకృతిం విద్యా-న్మాయినంతు మహేశ్వరమ్" "శివ ఏవ కేవలః" "తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్' "ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థుః" విశ్వాధికో రుద్రో మహర్షిః" ఇత్యాది వాక్యములతో జగదుపాదానకారణమగు మాయను మహేశ్వరుఁడు తన వశమున నుంచుకొనుననియు, శివుఁడొకఁడే సూక్ష్మ చిదచిచ్ఛక్తి విశిష్టుండనియు, బ్రహ్మ విష్ణ్వాది ప్రభువులను మించిన సర్వేశ్వరుఁడు శివుఁడేననియు, సృష్టికి పూర్వము రుద్రుఁడొకఁడే యుండెను. రెండవవాడు లేకుండెననియు, సర్వజ్ఞ శిఖామణియగు శివుఁడు విశ్వము నతిక్రమించి యుండువాడనియు, సిద్ధాంతీకరించినది.

నారాయణోపనిషత్తు "ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ" ఇత్యాది వాక్యమున మూడు కన్నులుగల శివస్వరూపమే సాక్షాత్ పరబ్రహ్మంబని విశదీకరించినది.

మఱియు ద్విజత్వమును కాపాడుటకు కంకణముఁ గట్టుకొనిన గాయత్రీ మంత్రంబు - వామాంగమున పార్వతీదేవి గల శివునినే ప్రాణుల బుద్ధులను సన్మార్గమువైపు ప్రేరేపించు పరమాత్మగా నుపాసింపవలెనని భర్గశబ్దముతో ధృవపరచినది.

ఇఁక వేదసంహితలయందు "విష్ణు రిత్థా పరమః స విద్వాన్ విష్ణో దేవత్వం పరమస్య విత్సే" "శ్రేష్ఠాతి శ్రేష్ఠమగు బ్రహ్మమును గుర్తెరిగినవాడగుటచే విష్ణువు పూజనీయుఁడై స్వయంప్రకాశమానుఁడయ్యెను" "రుద్ర! యత్తే జనిమ చారు చిత్రం, పదం యద్విష్ణో రుపమం నిధాయి, తేన పాసి గుహ్యం నామ గోనామ్" "శంకరా! నీ యావిర్భావము మనోహరమైనది చిత్రమైనదియు; ఎందుకనఁగా ? లక్ష్మీ సహితమైన స్థానమును విష్ణువునకు ప్రసాదించి యట్టి రూపముతో ప్రాణుల హృదయమును రక్షించుచున్నావు!" ఇత్యాది మంత్రములు - మహావిష్ణువు శివానుగ్రహమువలన వైకుంఠమున లక్ష్మీసహితుడై విరాజిల్లుచు భక్తులచే సేవింపఁబడునని తెలుపుచున్నవి"

ప్రశ్న : భగవద్గీతలయందు వినఁబడు అస్మచ్ఛబ్దమునకు శబ్ద శక్తి ననుసరించి శ్రీకృష్ణ భగవానుఁడని యర్థముఁ జెప్పవలెను గదా! అంతర్యామి పరముగా అస్మచ్ఛబ్దమును నిర్వచించునెడ లక్షణా వృత్తి యగును. వాచ్యార్థమును విడనాడి లక్షణావృత్తి నాశ్రయించుట ముఖ్యమగునా ?

ఉత్తరము : ఈసందర్భమున నస్మచ్ఛబ్దము అంతర్యామి పరంబగునని

పరులుగూడ నంగీకరింప వలసియున్నది. "సర్వస్య చాహం హృది సన్ని విష్టః" ఇత్యాది వాక్యములకు శబ్దశక్తిఁబట్టి శ్రీకృష్ణుఁడు సర్వాంతర్యామి యను నర్థమును పరులుగూడ నంగీకరింపక శ్రీకృష్ణాంతర్యామియగు మహావిష్ణువే సర్వాంతర్యామి యను లక్షణార్థమును చెప్పవలసి వచ్చినది.

ఇంతియేగాక పరిదృశ్యమాన శరీరుఁడగు శ్రీకృష్ణుఁడు సర్వాంతర్యామి యని చెప్పుటయు పొసగదు. మఱియు విభూతి యోగమున "వృష్టీనాం వాసుదేవోఽస్మి" "యాదవులలో వసుదేవ కుమారుఁడను" అని తనను తన విభూతిగా వక్కాణించుటయు సంగతము కాజాలదు.

"మా మేవైష్యసి" "నన్నే పొందగల"వని యుపదేశించు సందర్భమున ప్రత్యక్షముగా కనఁబడు కృష్ణుని యర్జునుఁడు పొందుటయు సరిపడకుండును.

ఇట్టి విరోధములను పరిహరించుటకు గీతలోని "నేను" అను శబ్దమునకు "నాలోని పరమాత్మ"యను నర్థమును అనివార్యముగా నంగీకరింప వలసియుండును.

అట్టి యంతర్యామియగు పరమాత్మ—శివుఁడే నని గీతలోని ఈశ్వరాది పదములు ధృవపఱచుచున్నయవి.

భగవద్గీతల యందు కర్మజ్ఞాన సముచ్చయము "ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే" శివధ్యాన యోగమును సాధించువానికి నిత్యనైమిత్తిక కర్మాచరణము ఆవశ్యకము" అనుచో—చెప్పఁబడినది. మరియు "న కర్మణా మనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే"

"కర్మలను చేయనిది జ్ఞానయోగము సిద్ధింపదు"
"నియతం కురు కర్మ త్వం—కర్మ జ్యాయో హ్యకర్మణః"

"నిత్యమైన సంధ్యావందనాది కర్మను తప్పకుండ చేయుము! ఎందుకనఁగా ? కర్మలను విడచుటకంటే కర్మలను చేయుటయే శ్రేష్ఠమగుమ."

ఇత్యాది శ్లోకములతో భగవానుఁడు కర్మయోగమును బాగుగా నిరూపించెను. కర్మాచరణము విద్వాంసు (జ్ఞాను)లకు అవసరము లేదనునెడ "కుర్యాత్ విద్వాన్ తథాఽసక్తః చికీర్షు ర్లోక సంగ్రహమ్" అనుచో "విద్వాంసుఁడు

(జ్ఞాని) కర్మ ఫలముల నాశింపక లోకసంగ్రహము నపేక్షించి కర్మల నాచరింప వలె" నని గీతల యందు చెప్పఁబడినందున కర్మయోగమే గీతా ప్రతిపాదితం బని తెలియవలెను.

సంధ్యావందనాది నిత్య కర్మలను వంగలేక చేయనివారికి అనేక వ్యాధులు తారసిల్లుటను మనము చూచుచునేయున్నాము.

బ్రాహ్మణాది వర్ణముల వారి సదాచారములను శివుఁడే కల్పించెను కావున శివాజ్ఞను ధిక్కరించు వారికి "రాజాజ్ఞను పాటింపని వారికి శిక్షవలె" నరక దుఃఖానుభవము తప్పదని యీ సందర్భమున చదువరులు గమనింతురు గాక!

గృహస్థునకు వేదాంత శ్రవణాధికారము లేదనునెడ "తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్, సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" అను శ్రుతి వాక్యమున బ్రహ్మ జ్ఞానమునకై వేదాంత శ్రవణమును చేయఁగోరు శిష్యుఁడు సమిధలు మొదలగు వానిని చేతఁబట్టుకొని శ్రోత్రియుఁడు బ్రహ్మనిష్ఠుఁడు నగు గురువు నాశ్రయింపవలెనని చెప్పుటచే గురు శిష్యులు గృహస్థులు కావలెననియే బోధపడును.

గురువు-సన్న్యాసియైనచో సమిధలు మున్నగు వానిని శిష్యుఁడు సమర్పించుట వ్యర్థం బగును గదా!

ఇట్లు అపారకరుణామయుఁడు, కుత్సిత మార్గ బిలమునందు పడిన ఆర్తులను రక్షింప నుద్యుక్తుఁడు నగు శ్రీకృష్ణ భగవానుఁడు యథాశక్తి స్వాభిమతము నుపదేశించినను యథార్థమును స్వీకరించు భాగ్యము లేని వారిని గురించి యేమనవలెనో భగవానుఁడును చెప్పఁజాలడు.

అని శ్రీ శ్రీ నీలకంఠాచార్యుల వారు శ్రీ హరదత్తా చార్యులకు గీతాసార సంగ్రహము నీ విధముగా బోధించి సాయం సంధ్యావందన ప్రదోష శివ పూజ నములకై విరమించి లోకకల్యాణము నొనఁగూర్చినవారు.

హరదత్తాచార్యులును "కరిష్యే వచనం తవ" అని యర్జునుడు ఒప్పుకొనినట్లు నీలకంఠాచార్యుల ప్రబోధము నక్షరాలా పాటించి శైవ సిద్ధాంతమును ప్రచారముఁ జేయుచు శివకంచికి వెడలి ఏకామ్రేశ్వర దేవాలయముపై నెక్కుటకు వేయఁబడిన మండుచున్న ఇనుప నిచ్చెనఁదగు నొక్కొక్క మెట్టు

నెక్కుచు "అపిచ పశుపతిః సర్వదేవ ప్రకృష్టః" "శంకరుఁడు బ్రహ్మ విష్ణ్వాది దేవతలలో శ్రేష్ఠుఁడ"ని సర్వమతముల వారి ముందు నిరూపించినవాడు.

పూర్వము దక్ష ప్రజాపతి శంకరునితో విరోధముఁబెట్టుకొని వీరభద్రునిచే శిక్షింపఁబడెను. ఇంక నెందరో శివ ద్వేషముతో భ్రష్టులైన వారు కలరు. శివుని ఇతర దేవతతో సమానునిగా చెప్పినను "శివుఁడు ఇతర దేవత నుపాసించు భక్తుఁడు" అని సభలలో ఆర్భాటముఁజేసినను శివనిందఁజేసినను శివ భక్తులను తిరస్కరించినను శివ ధర్మములను తూలనాడినను ఇహ పర లోకములయందు నిక్కట్టులు తప్పవని సూత సంహితాది గ్రంధములు, మాధవాచార్య అప్పయ దీక్షితేంద్రాది మహానుభావులును నొక్కి వక్కాణించిరవారు

గీతాపారాయణము ప్రతి ఆస్తికునకు అవశ్యకర్తవ్యము. కాని యద్దానికి సరియైన అర్థమును తెలిసికొనుట-పారాయణమునకన్న ముఖ్యము. కావున జగద్గురు శ్రీ॥ నీలకంఠాచార్యులు చెప్పిన గీతార్థమును తేట తెలుగున వ్రాసితిని. భక్తులు ఈ సదుద్యమమును విజయవంతము చేయ గలరని కోరుచున్నాను.

ఓం తత్సత్ః హరః హరః మహాదేవః

ఆచార్య, శివశ్రీ ॥ నిర్మల శంకరశాస్త్రి, ఆరాధ్యులు,
(శైవమహా పీఠాధిపతి)

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ శివ పంచాక్షరీ మహామంత్ర దేవత




స్తోత్రము- సౌమ్యసుందర సౌభాగ్య-ముఖీం చంద్రార్ధ శేఖరాం ।
నయనత్రయశోభాఢ్యాం_నవయౌవనశాలినీమ్ ॥

మంత్రజాపక భక్తానాం-శంభు దర్శన కారిణీం ।
సప్తకోటి మహామంత్ర-మూలరూపాం షడక్షరీమ్ ॥

సదాశివ సమారంభ-సద్గురుక్రమ బోధితాం ।
మహాకైలాస నిలయాం-వందే శంకరతోషిణీమ్ ॥

# శ్రీ శివపంచాక్షరీ మహామంత్ర జపవిధానము

ఓమ్. అస్య శ్రీ షడక్షరీ (పంచాక్షరీ) మహామంత్రస్య- పరబ్రహ్మ ఋషిః, శైవీ గాయత్రీ ఛందః; పరశివో దేవతా; ఓం బీజం, నమఃశక్తిః, శివాయేతి కీలకం, మమ ఉపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థే జపే విని యోగః.

ఓం = అంగుష్ఠాభ్యాం నమః; నం = తర్జనీభ్యాం నమః; మం = మధ్యమాభ్యాం నమః, శిం = అనామికాభ్యాం నమః, వాం = కనిష్ఠికాభ్యాం నమః; యం = కరతలకరపృష్ఠాభ్యాం నమః॥ ఓం శిఖాయాం, నం శిరసి, మం ముఖే, శిం హృదయే, వాం నాభౌ, యం పాదద్వయే॥ ఓం = హృదయాయ నమః; నం = శిరసే స్వాహా; మం = శిఖాయై వషట్; శిం = కవచాయ హుం; వాం = నేత్రత్రయాయ వౌషట్; యం = అస్త్రాయ ఫట్; భూర్భువఃసువరోమితి దిగ్బంధః.

శివ ధ్యానం -

శ్లో॥ నమః శివాయ శాంతాయ-హరాయ పరమాత్మనే ।
ఓమంత మంత్రరూపాయ-బ్రహ్మణే లింగమూర్తయే ॥

శాంతం పద్మాసనస్థం శశధరమకుటం - పంచవక్త్రం త్రినేత్రం ।
శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం-దక్షభాగే వహంతమ్॥

నాగం పాశం చ ఘంటాం ప్రళయహుతవహం-చాంకుశం
వామభాగే ।
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం — పార్వతీశం నమామి ॥

గురు ధ్యానం -

శ్లో॥ యో గురుః స శివః సాక్షాత్—యః శివః స గురుః స్మృతః।
భుక్తి ముక్తి ప్రదాతా చ—తస్మై శ్రీ గురవే నమః ॥

లింగధారి శైవులు - ఇష్టలింగమును ఎడమ అరచేతిలో భస్మాసనముపై

ఉంచి మజ్జనమును చేయించి తీర్థముఁ దీసికొని, భస్మనలదియు ఇష్టలింగమును ఏకాగ్రముగ చూచుచు - గురుముఖతః లభించిన శివపంచాక్షరీ మహామంత్రమును 108, 600, 1000 జపించి _ శివార్పణమస్తు - అని ఉదకము విడువవలెను. ప్రతిదినము సహస్రము (1000) జపించుట-శ్రేష్ఠము, ఓంకారములేనిది-పౌరాణిక మంత్రమనియు, ప్రణవసహితము వైదికమనియు రూఢికలదని - స్త్రీలకు శూద్రులకు వేదాధికారము లేదని వాదించుచు స్త్రీలకు పౌరాణికమంత్రమునే ఉపదేశింపవలె ననుట- నిష్ప్రయోజనము కాగా - లోక కంటకమగును. ప్రణవరహితము మృతప్రాయమని వారే అంటూ స్త్రీలకు ప్రణవము బదులు "హ్రీం" చెప్పవలె ననుటకు ప్రబలప్రమాణములు గానరావు. ఒకవేళ - ప్రణవరహిత పంచాక్షరి - వైదికము గామి - స్త్రీలకు ఉపదేశింపవచ్చు నను నెడ - రుద్రాధ్యాయమున "నమః సోమాయ చ" అను పనసలో చెప్పఁబడిన "నమః శివాయచ శివతరాయచ" అనునది- అవైదికము కావలసివచ్చును. అవైదికమంత్రము వైదికులకు ఎట్లు ఉపయోగించును ? బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు- ద్విజులగుటచే వారికి ప్రణవాధికారము కలదని చెప్పుటయే వివేకమగును. పంచమవేదమగు మహాభారతములోని భగవద్గీత కూడా స్త్రీలకు పనికిరాదనుట - సముచితము కాదు. ఒకానొక సచ్ఛూద్రుఁడు- ఆర్భాటముతో ప్రణవపంచాక్షరి నుచ్చరింపఁ జేయుచుండగా - జగద్గురువులు మిన్నకుండిరి. శాస్త్రపండిత ప్రకాండులు మహిళలకు ప్రణవము కూడదనుట - దేశకాల పాత్రార్హము కాదని నా యభిమతము.

నిర్మల శంకరశాస్త్రి
(శైవమహాపీఠాధిపతి)

---

## విరాళప్రదాతలు

292 పేజీ తరువాయి.

67\. శివశ్రీ॥ ముదిగొండ లింగమూర్తిగారు,
H.A.L. కాలని, బాలానగర్, హైదరాబాద్.

68\. ,, శ్రీపతి పండిత, రాజేశ్వరరావు గారు,
శ్రీపతి ప్రింటర్స్, బ్రాడీపేట, 4వ లైను, గుంటూరు_2

69\. శివశ్రీ॥ పత్తిపాటి మల్లికార్జునరావు గారు,
C/o శ్రీ పి. ప్రభాకరరావు గారు, అడ్వొకేటు,
3_5_4, స్వామిటాకీస్ వెనుక, రాజేశ్వరిపురం, గుంటూరు_6

ఓమ్. శ్రీ మహాగణాధిపతయే నమః

శివలింగధారులైన ఆరాధ్యులు వైశ్యులును శివలింగమును - నిత్యము ఏక సమయమందైనను భస్మరుద్రాక్షధారణం గావించి మజ్జనము నిడియు సంధ్యా వందన శివపంచాక్షరీ మహామంత్ర జపానంతరము దిగువ విధముగా – పూజింప వలెను. చరకాయ పనికిరాదు.

# శ్రీ లఘుతమ శివపూజా విధానము

సంకలనము- ఆచార్య, శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి

పద్మములతో వేయఁబడిన ముగ్గుపై పూజాపాత్రలను పెట్టి దీపమును వెలిగించి "పరంజ్యోతిషే నమః" అనుచు గంధాక్షత కుంకుమ పుష్పములను దీపమునకు సమర్పింపవలెను.

## ప్రార్థన

శ్లో॥ విఘ్నేశ ! విధిమార్తాండ-చంద్రేంద్రోపేంద్ర వందిత ।
నమో గణపతే తుభ్యం-బ్రహ్మణాం బ్రహ్మణస్పతే ॥

,, సదాశివ సమారంభాం-శ్రీకంఠాచార్య మధ్యమాం ।
అస్మదాచార్య పర్యంతాం-వందే గురుపరంపరామ్ ॥

,, ఉత్తిష్ఠంతు భూతపిశాచాః-యే తే భూమిభారకాః ।
ఏతేషా మవిరోధేన-బ్రహ్మకర్మ సమారభే ॥

,, నమః శంభవే చ, మయోభవే చ, నమః శంకరాయ చ ।
మయస్కరాయ చ, నమఃశివాయ చ, శివతరాయ చ ॥

అనుచు ఆచమనముఁ జేయవలెను.

"ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం" అనుచు ప్రాణాయామముఁ జేసి "మమ షడూర్మ్యాది రహిత షట్స్థల

పర బ్రహ్మ నిర్వాణ సుఖసంపదవా ప్త్యర్థం పరశివేష్టలింగ ముద్దిశ్య పరశివేష్ట లింగ ప్రీత్యర్థం నిత్య లఘుతమ (అవసర) శివపూజాం కరిష్యే" అని సంకల్ప మును చేయవలెను.

కలశమున భస్మగంధాక్షత కుంకుమ పుష్ప శర్కరలను వేసి "గంగే చ యమునే కృష్ణే-గోదావరి సరస్వతి! నర్మదే సింధుకావేర్యా-జలేఽస్మిన్ సన్నిధిం కురు" అనుచు కలశముపై చేయి పెట్టి- కలశోదకమును- పూజాద్రవ్యములపై తన శిరస్సుపైనను చల్లవలెను.

ఎడమచేతిని శుభ్రపరచి — భస్మను ఆసనముగా ఓంకారముతో ఎడమ అరచేతియందు వ్రాసి - లింగకాయ నుండి శివలింగమును తీసి" సర్వలింగగ్గి స్థాపయతి పాణిమంత్రం పవిత్రం" అనుచు - ఎడమచేతిలో పెట్టియు "ఓం నమః శివాయ ఇష్టలింగమూర్తయే నమః ఆవాహయామి" "ఆసనార్థే అక్షతాన్ సమర్ప యామి" అనుచు ఇష్టలింగముపై అక్షతలు వేయవలెను.

ప్రతి ఉపచారమున "ఓం నమఃశివాయ ఇష్టలింగమూర్తయే నమః ... .. సమర్పయామి" అనవలెను.

## గురుధ్యానము

శ్లో॥ అవాచ్యాత్మస్వరూపాయ-శివభావప్రదాయినే ।
నమః సద్గురునాథాయ-షట్స్థలబ్రహ్మమూర్తయే ॥

శివపంచాక్షరీ మహామంత్రమును యథాశక్తి జపింపవలెను. పాద్యం, అర్ఘ్యం. ఆచమనం చ సమర్పయామి-కలశజలముతో అభిషేకమును దిగువ మంత్రముతో గావింపవలెను

"ఓం నమఃసోమాయచ రుద్రాయచ, నమస్తామ్రాయ చారుణాయచ. నమఃశంగాయచ పశుపతయే చ, నమ ఉగ్రాయచ భీమాయ చ, నమో అగ్రే వధాయచ దూరే వధాయ చ, నమో హంత్రేచ హనీయసే చ, నమో వృక్షేభ్యో హరికేశే భ్యో, నమస్తారాయ, నమఃశంభవే చ మయోభవే చ, నమః శంకరాయ చ మయస్కరాయచ నమఃశివాయ చ శివ తరాయ చ" అభిషేకజలమును పైన చల్లుకొనవలెను.

తరువాత ఇష్టలింగమును వస్త్రముతో తుడిచి పాద్యమును సమర్పించి-అట్టి పాదోదకమును పంచాక్షరితో మంత్రించి పుచ్చుకొనవలెను.

వస్త్రోప వస్త్రార్థము అక్షతలు-సమర్పించి విభూతి నలదియు యజ్ఞోప వీతార్థము అక్షతలు సమర్పింపవలెను. పిమ్మట శ్రీగంధం-అక్షతలు పూలు మారేడుదళములు దిగువ మంత్రములతో సమర్పింపవలెను.

"ఓం నిధనపతయే నమః, నిధన పతాంతికాయ నమః, ఊర్ధ్వాయనమః, ఊర్ధ్వలింగాయ నమః, హిరణ్యాయ నమః, హిరణ్యలింగాయ నమః, సువర్ణాయ నమః, సువర్ణలింగాయ నమః, దివ్యాయ నమః, దివ్యలింగాయ నమః, భవాయ నమః, భవలింగాయ నమః, శర్వాయ నమః, శర్వలింగాయ నమః, శివాయనమః, శివలింగాయ నమః, జ్వాలాయనమః, జ్వలలింగాయ నమః, ఆత్మాయ నమః, ఆత్మలింగాయ నమః, పరమాయ నమః, పరమలింగాయ నమః, ఏతత్సోమస్య సూర్యస్య సర్వలింగగ్గ్ స్థాపయతి పాణిమంత్రం పవిత్రమ్"

"ఓం నమఃశివాయ ఇష్టలింగమూర్తయే నమః" ధూపం దీపం అవసర నివేదనం సమర్పయామి.

శ్లో॥ యజన గ్రహణేనానుగ్రహణ ప్రవణాత్మనా ।
ఇష్టలింగస్వరూపాయా-భీష్టదాయాస్తు మంగళమ్ ॥

అనుచు మంగళనీరాజనమును, "ఈశానాయ నమః" అనుచు మంత్ర పుష్పమును నమస్కారమును, సమర్పించి "కాలహర! కంఠహర! దుఃఖహర! దారిద్ర్యహర! సర్వపాపహర! ఓంహర!" అనుచు ప్రార్థించి-వస్త్రముతో సహ ఇష్టలింగమును కాయలో పెట్టి మ్రొక్కవలెను.

"సర్వం శ్రీ సాంబసదాశివచరణారవిందార్పిత మస్తు"



శ్రీ మహాగణాధిపతయే నమః

# ఆచార్య శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులవారి జ్యోతిర్విద్యా నిబంధనలు.

సర్వమంగళా-శివ-సదనము, (120)184/ఎ. వెస్ట్‌మారేడుపల్లి,
సికిందరాబాద్, 500 026, (ఆం.ప్ర.)

| | | |
|---|---|---|
| 1. | జన్మపత్రిక.<br>నవగ్రహ ఫలితాదులతో | రూ. 51-00 |
| 2. | గృహారంభ ముహూర్తము | రూ. 51-00 |
| 3. | గృహప్రవేశ ముహూర్తము | రూ. 51-00 |
| 4. | ఉపనయన ముహూర్తము | రూ. 51-00 |
| 5. | వివాహముహూర్తము | రూ. 51-00 |
| 6. | రాశికూట పరిష్కారము | రూ. 25-00 |
| 7. | నూతన వ్యవహారముహూర్తము | రూ. 25-00 |
| 8. | భూ పరీక్ష | రూ. 116-00 |
| 9. | లకోటా ప్రశ్న | రూ. 11-00 |
| 10. | గృహప్రవేశ నిర్వహణ<br>(రాను పోను సౌకర్యము గాక) | రూ. 516-00 |
| 11. | దుకాణం ప్రారంభం నిర్వహణ<br>రాను పోను సౌకర్యము గాక | రూ. 316-00 |
| 12. | మత్స్యయంత్ర స్థాపన<br>యంత్రముతో, యంత్రశుద్ధితో సహ<br>యంత్ర స్థాపన సామగ్రి, ప్రయాణసౌకర్యము గాక. | రూ. 1116-00 |
| 13. | గోల్డ్ కలరు మహాలక్ష్మి యంత్ర మంత్రములు. | రూ. 1116-00 |

14. మృత్యుంజయ లక్ష్మి గౌరి యంత్ర మంత్ర (రూ. 316-00
ములలో ఒక్కొకదానికి.

15. నవగ్రహదోష పరిహారార్థము జపాభిషేకములు 216-00
ఒకరోజు

16. సంస్కృత హిందీభాషల నుండి తెలుగు
ననువాదము-వ్రాత పేజీ ఒక్కంటికి రూ. 11-00

వలయువారు - శ్రద్ధా విశ్వాసములు గలవారై త్వరలో సంప్రదింపవలెను. రుసుము ముందే చెల్లించవలెను. మన్యార్డరు చేసినచో పోస్టుద్వారా జన్మపత్రికాదులు పంపఁబడును.

సంప్రదించు వేళ : సాయంత్రం॥ 4 నుండి 6 వరకు.

నిర్మల శంకరశాస్త్రి

---

26 వ పేజీ తరువాయి.

## విరాళ ప్రదాతలు

శైవా. శ్రీ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి, భూతపూర్వ శైవ మహాపీఠాధిపతి గారి కుమారుడైన శివశ్రీ ముదిగొండ మల్లికార్జునరావు గారి ప్రేరణతో

70. శివశ్రీ॥ ముదిగొండ పార్థసారథిగారు, నల్లకుంట, హైదరాబాద్.

71. ,, కె.కె. బాలచందర్ గారు, మారేడుపల్లి సికిందరాబాద్.

72. ,, ఎం పి. లింగమూర్తిగారు, సరూర్‌నగర్, హైదరాబాద్.

73. శ్రీ॥ ఆర్. కన్నన్ గారు, పంజాగుట్ట, హైదరాబాద్.

74. శ్రీ॥ బి.ఆర్. సురేష్ గారు, హబ్సిగుడ, ,,

75. శ్రీ॥ సి.యన్. సురేష్ గారు, దోమలగుడ, హైదరాబాద్

76. శివశ్రీ॥ ముదిగొండ కొండయ్యగారు, మహేంద్రహిల్స్,
సికిందరాబాద్-26

శ్రీ పరాశక్త్యై నమః

బ్రహ్మశ్రీ॥ దేశపతి గోపాలకృష్ణశర్మగారు. ఎం. ఏ.
ఆశుకవి శేఖరులు-పారుపల్లి, 1-3-101,
సిదిపేట, 502 103, మెదక్ జిల్లా. ఆం. ప్ర.

ఆచార్య, శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు(శైవమహాపీఠాధిపతి)గారి శ్రీ నీలకంఠీయ భగవద్గీతాభాష్యాంధ్రానువాదమును గూర్చి సదభిప్రాయము.

ఉ. దుర్మతి లేని శైవగణ సుస్థితిహేతు స్వధర్మబుద్ధిమై
కర్మ శివార్పితంబుగ నకాముకులై యొనరింప- గీతలో।
మర్మము శ్రీ శివాఖ్యమగు మాన్యము బ్రహ్మ మటంచు వ్రాయు శ్రీ
నిర్మల శంకరాఖ్యునకు నిస్తుల కీర్తి శుభమ్ము గల్గుతన్॥

గోపాలకృష్ణశర్మ 8-10-1995

---

వాస్తుసమ్రాట్, వాస్తుబ్రహ్మ,
77. శివశ్రీ॥ కాశీనాథుని సుబ్రహ్మణ్యము గారు,
ప్లాట్ నెం॥ 11, జర్నలిస్ట్ కాలనీ, రోడ్ నెం. 3,
బంజారాహిల్స్, హైదరాబాద్- 500 034.
ఔదార్య గాంభీర్య స్వభావులు.

78. సర్వశ్రీ॥ బొల్లెపల్లి- సత్యనారాయణగారు. అశోక నగర్, 4వ లైను,
23293, గుంటూరు 6.

श्री शिवाद्वैत सिध्धांतो विजयतेतराम्.

अवतार समय : कलियुगादि 2044 वर्ष

जन्म समय : श्री स्वभानु सं॥ चैत्र शु॥ दशमी, पुष्य नक्षत्र, सोमवार



# श्री जगदगुरु, शिवयोगि, नीलकंठाचार्य स्वामी

प्रार्थना : आराध्य वंशांबुधि पूर्णचन्द्र - मासेतु शीत-
नगमध्यकृत प्रबोधम् । श्री नीललोहित शिवांश
कृतावतारं - तं नीलकंठ बुधदेशिक मानतोस्मि ॥

3046 जयंती
4-4-1990

प्रकाशक
यन्. शंकरशास्त्री आराध्य

ఓమ్

శ్రీ మహా గణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాం నమః

శ్రీ భద్రకాళీ వీరభద్రేశ్వరాభ్యాం నమః

శ్రీ సౌభాగ్య మహాలక్ష్మ్యై నమః

# శ్రీ భగవద్గీత

## ప్రథమాధ్యాయము

### "మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాదసహితము

ధృతరాష్ట్ర ఉవాచ

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే-సమవేతా యుయుత్సవః ।
మామకాః పాండవాశ్చైవ-కిమకుర్వత సంజయ ? ॥ 1

సంజయా !

పురుషార్థములన్నిటియొక్క మూలమగు ధర్మముఁదగు క్షేత్రమైన శ్రుతి స్మృతిప్రసిద్ధంబు నగు కురుక్షేత్రమునందు-యుద్ధకాంక్షచే కూడినట్టి నా కుమారులు పాండవులును ఏమి చేసినారని ధృతరాష్ట్రుఁడు ప్రశ్నించెను.

వివరణ-యుద్ధముఁజేయుగోరువారైనను కురుక్షేత్రము ధర్మనిలయమగుటచే-క్షేత్రమహిమవలన యుద్ధమును విరమింతురేమో నని ధృతరాష్ట్రుఁడు సంశయించినాడని - ధర్మక్షేత్రపదము స్ఫురింపఁజేయుచున్నది. "ధర్మాత్ ప్రవర్తతే లోకో-ధర్మా త్స్వర్గః ప్రవర్తతే, ధర్మాత్ కైవల్యమాప్నోతి-ధర్మమూలా వ్యవస్థితిః" "ధర్మమువలన లోకము-తన కర్తవ్యములను చేయఁగలుఁగును.

ధర్మము నాచరించుటచే స్వర్గాదిపుణ్యలోకములు లభించును. స్వధర్మము నవలంబించుటఁజేసి మోక్షము సన్నిహితమగును. ఐహిక ఆముష్మిక సంస్థితి యంతయు ధర్మమునందే ఆధారపడియున్నది." అను స్మృతివచనము-ఇందుకు తార్కాణము.

"బృహస్పతిరువాచ-యాజ్ఞవల్క్యం ప్రతి; యదను కురుక్షేత్రం దేవానాం దేవయజనం, సర్వేషాం భూతానాం బ్రహ్మసదనం" అను జాబాల శ్రుతివాక్యంబు "యాజ్ఞవల్క్య మహర్షికి బృహస్పతి-కురుక్షేత్రము దేవతలను సంతృప్తిపఱచుటకు వలయు యజ్ఞముల నాచరించుటకు అనువైనది. ప్రాణులందరిని బ్రహ్మలోకమును చెందించునదియు నని-వక్కాణించెను" అని కురుక్షేత్రమును ప్రశంసించినది.

మరియు "కురుక్షేత్రం దేవయజనం"అను శతపథ శ్రుతిని ప్రోద్బలకముగ గాననగును. పాండవులు యుద్ధకాములైనను క్షేత్రమహిమచే-ఇరుపక్షములవారిని హింసించుట యను అధర్మమునకు భయపడి యుద్ధమును విరమింపవచ్చును. కౌరవులును చిత్తశుద్ధిగలవారై యుద్ధ ధర్మము మంచిది కాదని భయపడిన యెడలను యుద్ధవిరామము జరుగవచ్చును. క్షేత్రమహిమచే పశ్చాత్తాపముగల వారైనా కుమారులు-కపటముచే సంపాదించిన రాజ్యమును పాండవులకు నొసఁగి నచో రాజ్యము లేనివారగుదురు" అను ఆశంక ధృతరాష్ట్రమహారాజునకు కలిగిన దనియు ధర్మక్షేత్రపదము సూచించుచున్నయది.

ఇవ్విధము అందుఁడైన ధృతరాష్ట్రుని హృదయమును గుర్తెరిగిన సంజయుఁడు—నీ కుమారులు పాండవులకు రాజ్యమును ఒప్పజెప్పుదురేమో అని చింతింపకుము! అను భావమును స్ఫురింపఁజేయుచు ధృతరాష్ట్రుఁడు సంతసింప వలెనని మొదట దుర్యోధనుని దుష్టప్రయత్నమును దిగువవిధము నిరూపించెను.

శ్లో॥ దృష్ట్వా తు పాండవానీకం-వ్యూఢం దుర్యోధనస్తదా।
ఆచార్య ముపసంగమ్య-రాజా వచన మబ్రవీత్ ॥ 2

రాజగు దుర్యోధనుఁడు-పాండవుల సైన్యమును గుంపులుగుంపులుగా ధృష్టద్యుమ్నాదులు ఏర్పరచినట్లు గమనించి-ద్రోణాచార్యుని సమీపించి దిగువ విధము న్నవించెను.

వివరణ-దుర్యోధనుఁడు రాజైనను తానే ఆచార్యుని వద్దికి వెళ్ళెను కాని ఆతనిని రప్పించలేదనియు, పాండవసైన్యవ్యూహ రచనను సహింపనివాడై ఆచార్యునిఁజేరి ప్రోత్సహించెననియు. అందువలన నీ కుమారులు-పశ్చాత్తాపమును చెందలేదనియు ఇందు పొడగట్టుచున్నయది.

శ్లో॥ పశ్యైతాం పాండుపుత్రాణా-మాచార్య! మహతీం చమూం ।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ-తవ శిష్యేణ ధీమతా ॥ 3

ఆచార్యా! అనేక అక్షౌహిణులతో నివారింపనలవిఁగానట్టి ఈ పాండవుల సైన్యము-నీ శిష్యుఁడు మేధావియు నగు ద్రుపదపుత్రునిచే యుద్ధమునకు సిద్ధముగా అమర్చబడినది. అవలోకింపుము!

నేను గూడ నీ శిష్యుఁడనగుటచే నిన్ను ప్రార్థించుచున్నాను.

వివరణ-పాండవులు గూడ నీ శిష్యులైనను నిన్ను అవమానించు వారేనని దుర్యోధనుని ఆశయము. "వ్యూఢాం తవ శిష్యేణ" అనుచో శిష్యునికన్న గురువు గొప్పవాడగుటఁజేసి-నీవు శిష్యుల వలన సంభవించు చిన్నతనమును పోనాడుటకు సమర్థుఁడవనియు'' "ద్రుపదపుత్రేణ" అనుచో ద్రోణాచార్యునకు ద్రుపదమహారాజునకు గల పూర్వవైరము జ్ఞాపకము చేయఁబడినదనియు; నిన్ను సంహరింప నుదయించినవాడైనను ధృష్టద్యుమ్నుఁడు నిన్నాశ్రయించినతఱి-పూర్వవైరమును పాటింపక వానికి ధనుర్విద్యఁ గఱపితివి. ధర్మక్షేత్రమున నడుగిడియు ఆచార్యుని యందు దుష్టబుద్ధిని మార్చుకొననట్టి ధృష్టద్యుమ్నుని కరుణింపకుమనియు; ఇందు స్ఫురించును.

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా.భీమార్జునసమా యుధి ।
యుయుధానో విరాటశ్చ-ద్రుపదశ్చ మహారథః ॥ 4

ధృష్టకేతుశ్చేకితానః-కాశిరాజశ్చ వీర్యవాన్ ।
పురుజిత్ కుంతిభోజశ్చ-శైబ్యశ్చ నరపుంగవః ॥ 5

యుధామన్యుశ్చ విక్రాంత-ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ-సర్వఏవ మహారథాః ॥ 6

ఈ పాండవసైన్యమున ధనుర్ధారులలో గొప్పవారు, యుద్ధమున భీమార్జు

నులతో సమానులు కలరు. యుయుధానుఁడు, విరాటుఁడు; మహారథికుఁడైన ద్రుపదుఁడు; ధృష్టకేతువు; పరాక్రమశాలియగు కాశీరాజు; పురుజిత్తు; కుంతిభోజుఁడు; మానవోత్తముఁడగు శైబ్యుఁడు; సుప్రసిద్ధుడైన యుధామన్యువు; శూరుఁడైన ఉత్తమౌజుఁడు; అభిమన్యుఁడు, ఉపపాండవులును; వీరందరు మహారధికులేను;

వివరణ-మహాధనుర్ధారులైనను యుద్ధము నొనర్ప నేర్పరులు కానిచో అట్టి వారి వలన ప్రయోజనముండదని శంకించి యుద్ధమున భీమార్జునులతో సమానులని సుయోధనుఁడు వక్కాణించెను.

ఇఁక మహారథికుఁడనఁగా ?

"ఏకో దశసహస్రాణి-యోధయే ద్యస్తు ధన్వినాం, శస్త్ర శాస్త్ర
ప్రవీణశ్చ-మహారథ ఇతి స్మృతః"

"ఒకఁడే పదివేల ధనుర్ధారులతో పోరాడఁజాలినవాడై ధనుర్విద్య నుపయోగింప సమర్థుఁడగువాడు మహారథుఁడనఁబడును"

"అమితాన్ యోధయే ద్యస్తు-సంప్రోక్తోఽతిరథస్తు సః"

"లెక్కింపనలవిగానట్టి వారితో యుద్ధముఁజేయు మహాపురుషుడు అతిరథుఁడనఁబడును"

"రథీ త్వేకేన యో యుద్ధ్యేత్-తన్న్యూనోఽర్ధరథఃస్మృతః"

"ఒక రథికునితో పోరాడువాడు-రథి యనియు; అంతకు తక్కువ పోరాడువాడు-అర్ధరథుఁడనియు తెలియవలెను.

వీరందరు ఉపేక్షింపఁదగినవారు కారని భావము.

ఇవ్విధము శత్రుసైన్యము బలవంతమగుటచే నవ్వారితో సంధిఁజేయుటయే శ్రేయస్కర మగునని శంకించి దిగువవిధము సుయోధనుఁడు నుడువుచున్నవాడు.

శ్లో॥ అస్మాకంతు విశిష్టా యే-తాన్నిబోధ ద్విజోత్తమ ।
నాయకా మమ సైన్యస్య-సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ॥ 7

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ-కృపశ్చ సమితింజయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ-సౌమదత్తి స్తథైవ చ ॥ 8
అన్యేచ బహవః శూరా-మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్ర ప్రహరణాః-సర్వే యుద్ధవిశారదాః ॥ 9

బ్రాహ్మణశ్రేష్ఠా !

మన సైన్యమున గొప్పవారు నా సేనాధిపతులు నగువారిని గురించి నీ గుర్తునకై చెప్పుచున్నాను. వారిని గమనింపుము !

నీవు, భీష్ముఁడు, కర్ణుఁడు, కృపాచార్యుఁడు, అశ్వత్థామ, వికర్ణుడు, సౌమదత్తియు, ఇంకను నా కొరకై జీవితమును పరిత్యజింప నుద్యుక్తులగు పెక్కుశూరులు, నానావిధఆయుధములను ప్రయోగించు యుద్ధవిశారదులందరును కలరు.

వివరణ- "అస్మాకంతు" అనుచో గల "తు" కారము సుయోధనునిలో కలిగిన శత్రుసైన్య భయమును కప్పిపుచ్చుటను తెలుపుచున్నయది. "ద్విజోత్తమ" అని ప్రశంసించుటచే-ఆచార్యుఁడు తన యుద్ధజయమునకు అభిముఖుఁడై యుండవలెనని స్ఫురించును. "కౌరవులు దుష్టులు'' అను అభిప్రాయము ఉన్నచో మా విషయమై యుద్ధమున అసామర్థ్యము కలిగియుందువని ద్విజోత్తమ పదము సూచించును. అట్లైనను నా పక్షమున కర్ణుఁడు మొదలగు క్షత్రియ శ్రేష్ఠులు కలరు గాన నా సైన్యమునకు ఎట్టి బాధయు లేదని గూడ "ద్విజోత్తమ" పదము స్ఫురింపఁజేయును. పాండవులు నీకు ప్రియ శిష్యులగుటచే వారిని చూచుటతోడనే మనస్సును కలవరపఱచుకొని నీ యుద్ధనైపుణ్యమును మరతువేమో అని నా సైన్యవీరుల నుదాహరించుచున్నానని దుర్యోధనుని ఆశయము పొడగట్టును. సుయోధనుఁడు తన సైన్యవీరులను పేర్కొనుచు "భవాన్" "నీవు" అని మొదట చెప్పుట ద్రోణాచార్యుని సంతసింపఁజేయుటకై ఉపయుక్తంబగుచున్నయది.

"నాయందు పూజ్యభావము గలవారు" అను భావమును "మదర్థే త్యక్తజీవితాః" అను పదము స్ఫురింపఁజేయును.

"యుద్ధ విశారదాః'' అనుటతో భీష్మాదులందరు మహాయోధులని తెలియుటచే "నాకు పాండవ సైన్యమునుండి ఎట్టి భయము లేదని దుర్యోధనుడు ధైర్యమును తెచ్చుకొనినాడని వ్యక్తమగును.

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం-బలం భీష్మాభిరక్షితం।
పర్యాప్తం త్విద మేతేషాం-బలం భీమాభిరక్షితమ్॥ 10

భీష్మాచార్యులచే రక్షింపఁబడినదై వీరవర్యులు కలదైనను మన సైన్యము పగవారితో పోరాడుటకు సమర్థము కాదని తోచెదెని. పాండవులకు చెందిన ఈ సైన్యమైతేనో భీమునిచే కాపాడఁబడునదై మనతో తలపడఁజాలునదిగ కనఁబడుచున్నయది.

ఇరువురి సైన్యములు సమానబలము కలవగుటచే అపజయము నాశంకింపరాదు గదా! అను ప్రశ్నకు పై శ్లోకము సమాధానము నొసఁగినది.

వివరణ–భీష్మాచార్యులు, కురుపాండవసైన్యములపై సమానదృష్టి గలవాడగుటచేతను, భీముఁడు స్వపక్షపాతి యగుటవలనను అపజయము ఆశంకింపఁబడుచున్నదని భావము.

శ్లో॥ అయనేషుచ సర్వేషు-యథాభాగ మవస్థితాః।
భీష్మమేవాభిరక్షంతు-భవంతః సర్వ ఏవ హి॥ 11

మీరందరును సైన్యసముదాయములోనికి చొఱఁబడు త్రోవలన్నిటియందు మీ మీ యుద్ధభూములను విడనాడక నుండువారై భీష్మాచార్యునే రక్షించుడు!

వివరణ–భీష్మాచార్యుఁడు ఇతరులతో పోరాడునపుడు వెనుకనుండి ఎవరు నాతని వధింపకుండునట్లు కాపాడుడనియు, మా జీవితము భీష్మునిపై ఆధారపడియున్నదనియు, సుయోధనుఁడు ద్రోణాచార్యునకు విన్నవించుటయే గాక కర్తవ్యమును బోధించెనని ఇందు విదితమగును.

శ్లో॥ తస్య సంజనయన్ హర్షం-కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః-శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥ 12

కురువృద్ధుఁడు, పాండవకౌరవులందరి తాతయు నగు భీష్మాచార్యుఁడు సుయోధనుని సంతసింపఁజేయుటకై సింహమునాదమువలె గొప్ప కంఠస్వరమున పౌరుషముతో శంఖమును పూరించెను.

వివరణ-దుర్యోధనుడు తనను మెచ్చుకొనినను తూలనాడినను వానికొరకు

తన జీవితమును త్యజింపనున్నవాడు భీష్ముఁడనియు, దుర్యోధనసైనికులందరిని ప్రోత్సహింప శంఖనాదము నొనర్చెననియు, ఇందు ద్యోతకమగుచున్నయది.

శ్లో॥ తతః శంఖా శ్చ భేర్య శ్చ-పణవానక గోముఖాః ।
సహసైవాభ్యహన్యంత-స శబ్ద స్తుములోఽభవత్ ॥ 13

అటుపిమ్మట శంఖములను, భేరులను, పణవములను, ఆనకములను, గోముఖములను కౌరవసైనికులందరు ఒక్కుమ్మడిగ ప్రయోగించిరి. అట్టి వాద్య ధ్వని-వేరువేరుగా వినఁబడుచు యుద్ధభూమి యంతట నిండుకొనెను.

వివరణ -

కౌరవసేనాధిపతియగు భీష్ముని యుద్ధమునకు చెందిన ఉత్సాహమును కౌరవసైనికులందరు గమనించి తమ తమ యుద్ధోత్సవమును ప్రకటించిరని భావము.

శ్లో॥ తతః శ్వేతై ర్హయై ర్యుక్తే - మహతి స్యందనే స్థితౌ ।
మాధవః పాండవ శ్చైవ-దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥ 14

పాంచజన్యం హృషీకేశో-దేవదత్తం ధనంజయః ।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం-భీమకర్మా వృకోదరః ॥ 15

అనంతవిజయం రాజా-కుంతీపుత్రో యుధిష్ఠిరః ।
నకులః సహదేవశ్చ-సుఘోషమణిపుష్పకౌ ॥ 16

అట్టితఱి-కృష్ణార్జునులు తెల్లని గుఱ్ఱములతో కూడిన గొప్ప రథమునందు ఉన్నవారై దివ్యములైన శంఖములను పూరించిరి. శ్రీకృష్ణుఁడు పాంచజన్యశంఖమును, అర్జునుఁడు దేవదత్త శంఖమును, పగవారిని భయపెట్టు భీమసేనుఁడు పౌండ్రమను మహాశంఖమును; కుంతీపుత్రుఁడు రాజు నగు ధర్మనందనుఁడు అనంతవిజయశంఖమును, నకులుఁడు సుఘోషశంఖమును, సహదేవుఁడు మణిపుష్పక శంఖమును పూరించిరి.

వివరణ -

పాండవ సైనికుల సమరోత్సాహమును-ప్రత్యేకనామధేయములు గల శంఖములను పూరించుట రూపముగ-చూపనైనది.

శంఖముల పేరులు చెప్పుటచే కౌరవసైన్యమునందు స్వనామప్రసిద్ధములైన శంఖములు లేవనియు, అట్టి శంఖములను పూరించు పాండవులు కౌరవులకన్న అధికమైన యుద్ధపటిమ గలవారనియు ద్యోతక మగును.

శ్లో॥ కాశ్య శ్చ పరమేష్వాసః-శిఖండీ చ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ-సాత్యకి శ్చాపరాజితః ॥ 17
ద్రుపదో ద్రౌపదేయాశ్చ-సర్వశః పృథివీపతే ।
సౌభద్రశ్చ మహాబాహుః-శంఖాన్ దధ్ముః పృథక్పృథక్ ॥ 18

పృథివీపతియగు ధృతరాష్ట్ర మహారాజా! సావధానుఁడవై వినుము! గొప్ప ధనుస్సును ధరించిన కాశీరాజు, మహారథికుఁడగు శిఖండియు, ధృష్టద్యుమ్నుడు, విరాటుఁడు, శత్రువులచే జయింపనలవిగానట్టి సాత్యకియు, ద్రుపదమహారాజు, ఉపపాండవులును, మహాబాహువైన అభిమన్యుఁడును వేరువేరుగా అంతట ప్రతిధ్వనించునట్లు శంఖములను పూరించిరి.

శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం-హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ-తుములో వ్యనునాదయన్ ॥ 19

అట్టి పాండవులయొక్కయు పాండవ సైనికప్రముఖులయొక్కయు శంఖముల ధ్వని ఆకాశమును భూమిని నిండి ప్రతిధ్వనించినదై నీ కుమారుల హృదయములను నొప్పించెను. అనఁగా ? పాండవ శంఖధ్వనుల నాలకించి కౌరవులు భయపడినారని భావము.

ఇట్టి సమయమున అర్జునుఁడు వాసుదేవుని గురించి దిగువవిధము నాలుగు శ్లోకములచే విన్నవించుచున్నవాడు.

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా-ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్రసంపాతే-ధను రుద్యమ్య పాండవః ॥ 20
హృషీకేశం తదా వాక్య-మిద మాహ మహీపతే !

(అర్జున ఉవాచ)

సేనయో రుభయో ర్మధ్యే-రథం స్థాపయ మేఽచ్యుత ॥ 21

శంఖపూరణానంతరము ఆంజనేయుఁడు ధ్వజమందు గల అర్జునుఁడు యుద్ధమునకు సిద్ధమైన కౌరవులను గాంచి శస్త్రాస్త్రములను వీరలు ఒండొరులపై ప్రయోగింపనుండగా తనగాండీవమును లేవనెత్తి- రెండు సైన్యముల నడుమ నా రథమును నిలుపుము- అని శ్రీకృష్ణునకు విన్నవించి

శ్లో॥ యావదేతా న్నిరీక్షేఽహం-యోద్ధుకామా నవస్థితాన్ ॥
యుద్ధము నపేక్షించి యేతెంచినట్టి వీరిని పరిశీలింపగలననియు

శ్లో॥ కై ర్మయా సహ యోద్ధవ్య-మస్మిన్ రణసముద్యమే ॥

ఈ యుద్ధముఁ దగు సమారంభమున ఎవరితో ముందు పోరాడవలెనో యోచించుకొనెదననియు,

శ్లో॥ యోత్స్యమానా నవేక్షేఽహం-య ఏతేఽత్ర సమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే-ర్యుద్ధే ప్రియచికీర్షవః ॥ 23

ఎవరెవరు ఈ యుద్ధమున పాలుగొని దుర్బుద్ధియగు ధృతరాష్ట్ర కుమారునకు ప్రియముఁజేయనుండిరో, అవ్వారి నందరిని పరీక్షించి చూచెదననియు వాక్రుచ్చెను.

వివరణ

ఆంజనేయుఁడు నీ రథముపై ధ్వజరూపమున నుండునని అర్జును ననుగ్రహించుట విజయసూచకమగునది. కౌంతేయుఁడు భయపడనివాడగుటచే యుద్ధమునకై గాండీవమును లేవనెత్తెనని స్ఫురించును. యుద్ధకాములను పరిశీలించుటకై ఉభయసేనల మధ్య రథమును నెలుకొలుపు మను అర్జునవాక్యము ఉపపన్నమగుచున్నయది. యుద్ధరంగ ప్రవిష్టులందరిని పరీక్షించెదనని అర్జునుఁడు చెప్పుటలో సంధికాములను, భయపడి పారిపోవువారిని కనిపెట్ట గలను అనునర్థము ఇమిడియున్నది. దుర్యోధన ప్రియకారకులై యుద్ధము నొనర్చువారందరిని పరిశీలించువరకు నా రథమును రెండు దండుల నడుమ నిలుపుమని యర్జునుని ఆశయమైనట్లు ఇందు ద్యోతకమగును.

## సంజయ ఉవాచ

సంజయుఁడు పలికెను.

శ్లో॥ ఏవ ముక్తో హృషీకేశో-గుడాకేశేన భారత !
సేనయో రుభయో ర్మధ్యే-స్థాపయిత్వా రథోత్తమమ్ ॥ 24

భీష్మద్రోణప్రముఖతః-సర్వేషాం చ మహీభృతాం।
ఉవాచ పార్థ పశ్యైతాన్-సమవేతాన్ కురూ నితి ॥ 25

ఇట్లు అర్జునుఁడు చెప్పగానే శ్రీకృష్ణభగవానుఁడు అర్జునుని రథమును రెండుసేనలమధ్య భీష్మద్రోణాదులగు రాజులందరి సమక్షమున నునిచి పార్థా! ఇచ్చోట సమావేశమైన నీ కౌరవులను పరిశీలించి చూడుమని వక్కాణించెను.

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః-పితౄ నథ పితామహాన్ ।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్-పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా॥
శ్వశురాన్ సుహృదశ్చైవ-సేనయో రుభయో రపి ।

అంత పార్థుఁడు కురుక్షేత్రమున రెండు సైన్యములయందు ఉన్నవారందరిని తేటిపాఱఁజూచెను. వారిలో భూరిశ్రవస్సు మొదలగువారైన పినతండ్రులు, భీష్మసోమదత్తాదులగు తాతలును, ద్రోణ కృపాద్యాచార్యులును, శల్య శకుని ప్రభృతులగు మేనమామలును, సుయోధనుఁడు మున్నగు అన్నదమ్ములును, లక్ష్మణుఁడు మొదలగు కుమారులును, మనుమలును, అశ్వత్థామాది స్నేహితులును, మామలును. సహృదయులును, అర్జునునకు కనుపడుచుండిరి.

వివరణ-

"యుద్ధమున ప్రాణులను హింసించుట అధర్మము" అను అశాస్త్రీయమగు మోహబుద్ధితోడను, మమకారమువలన కలుగు శోకముతోడను యుద్ధము క్షాత్రీయ స్వధర్మమైనను అద్దానిని చాలించవలెనను అనర్థకమైన తలంపు అర్జునునకు కలిగినదని దిగువవిధము సంజయుఁడు వక్కాణించెను.

శ్లో॥ తాన్ సమీక్ష్య స కౌంతేయః-సర్వాన్ బంధూ నవస్థితాన్ ॥ 27
కృపయా పరయాఽవిష్టో-విషీద న్నిద మబ్రవీత్ ।

యుద్ధరంగమున గుమిగూడినట్టి బంధువులందరి నవలోకించిన కౌంతేయుఁడు మితిమీరిన దయ గలవాడై పరితపించుచు ఇవ్విధము వచించెను.

ఏమి చెప్పెననఁగా?

అర్జున ఉవాచ

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ-యుయుత్సుం సముపస్థితమ్ ॥ 28
సీదంతి మమ గాత్రాణి-ముఖం చ పరిశుష్యతి ।
వేపథుశ్చ శరీరే మే-రోమహర్షశ్చ జాయతే ॥ 29
గాండీవం స్రంసతే హస్తాత్-త్వక్చైవ పరిదహ్యతే ।

కృష్ణా! పోరాడుటకు సిద్ధముగ నున్నట్టి ఈ ఆత్మీయబంధువర్గమును చూచుచుండగా నా శరీరముయొక్క అంగములు సడలుచున్నవి. నోరు ఎండుచున్నది. వణకు పుట్టుచున్నది. గగుర్పాటు కలుగుచున్నది. చేతినుండి గాండీవ ధనుస్సు జాఱుచున్నది. తోలంతయు కాలినట్లగుచున్నది.

శ్లో॥ న చ శక్నోమ్యవస్థాతుం-భ్రమతీవ చ మే మనః ॥ 30
నిమిత్తాని చ పశ్యామి-విపరీతాని కేశవ ।
న చ శ్రేయో ఽను పశ్యామి-హత్వా స్వజన మాహవే ॥ 31

నా మనస్సు తిరుగుచున్నట్లు తోచుచున్నందున శరీరమును నిలుపుకొనుటకు గూడ వలవిగాకున్నది. విపరీతములైన శకునములు పొడగట్టుచున్నవి. కేశవా! యుద్ధమున స్వజనమును సంహరించినచో పురుషార్థమగు పుణ్యమును మూట కట్టుకొందునని భావించుటలేదు.

అదృష్ట ఫలమగు స్వర్గాదిసుఖప్రాప్తిని ఆశింపకున్నను దృష్టఫలములగు రాజ్యసుఖములు—నీవు శత్రువులను జయించినచో—లభించునుగదా! అను ఆశంకకు సమాధానమును దిగువ చెప్పుచున్నవాడు.

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ-న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవింద!-కిం భోగై ర్జీవితేన వా ॥ 32

యేషా మర్థే కాంక్షితం నో-రాజ్యం భోగాః సుఖాని చ ।
త ఇమేఽవస్థితా యుద్ధే-ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ ॥ 33

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రా- స్తథైవ చ పితామహాః ।
మాతులాః శ్వశురాః పౌత్రాః-శ్యాలాః సంబంధిన స్తథా ॥ 34

కృష్ణా! శత్రుజయమునుగాని రాజ్యమునుగాని రాజభోగములనుగాని నేను కోరుటలేదు. ఎందుకనఁగా? గోవిందా! రాజ్యముతో రాజభోగములతోడను మా జీవితముతోడ నేమి ప్రయోజనము ? ఎవరికొరకు రాజ్యము, భోగములు, సుఖములును కావలెనో, అట్టి ఆత్మీయులైన వీరు ప్రాణములపై ధనములపై ప్రీతి లేని వారై యుద్ధరంగమున పోరాడుటకు సిద్ధముగ నున్నవారు.

ఆత్మీయులెట్లనఁగా ? ఆచార్యులు, తండ్రులు, కుమారులు, తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావమఱఁదులు, సన్నిహిత బంధువులును వీరిలో నుండుటచే వీరితో పోరాడుటకు మనస్సు ఒప్పకున్నది.

వివరణ-

రాజభోగములను జనులందరు కోరుచుండగా నీకీ వైరాగ్యమెందుకు? అను ఆశంకకు అర్జునుఁడు పైవిధము సమాధానము నొసఁగె నని భావము.

శ్లో॥ ఏతా న్న హంతు మిచ్ఛామి-ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్య రాజ్యస్య- హేతోః కింను మహీకృతే ? ॥ 35

మధుసూదనా! వీరు నన్ను ఆయుధములతో వేధించినను ఈ ఆత్మీయులను నేను సంహరింపఁదలచుటలేదు. ఎందుకనఁగా ? వగవారి నణఁచినచో లభించు లోకత్రయాధిపత్యము నాశింపను_ ఒక భూమికొరకు పోరాడనని వేరు చెప్పనేల ?

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రా న్నః-కా ప్రీతిః స్యా జ్జనార్దన ! ।
పాప మేవాశ్రయే దస్మాన్-హత్వైతా నాతతాయినః ॥ 36

భీష్మద్రోణాది ప్రియతములేగాక శత్రువులగు దాయాదులైన కౌరవులు ఉన్నారు గదా! వారిని సంహరింపవలెను గదా! అనినచో ధృతరాష్ట్ర పుత్రులను గూడ చంపినయెడల మాకు ఎట్టి మేలు కలుగును ? ఆతతాయులగు వీరిని సంహరించినచో "హింస" యనెడు పాపము మమ్ము పట్టుకొనును.

వివరణ -

"అగ్నిదో గరద శ్చైవ-శస్త్రపాణి ర్ధనాపహః, క్షేత్రదారాపహారీచ-షడేతే చాతతాయినః"

"నిప్పుచే నపకరించువాడు, విషముఁబెట్టువాడు, ఆయుధమును పట్టుకొనిన వాడు, ధనము నపహరించువాడు, భూమిని కాజేయువాడు, భార్యను కైవసముఁ జేసికొనువాడు నను ఆరుగురు - ఆతతాయులనఁబడుదురు. "వీరిని సంహ రించుట పాపము కాదను సూక్తిని నిరాకరించి పార్థుఁడు-ఆతతాయి సంహా రము-హింసాపాపహేతువగునని భావించెను.

శ్లో॥ తస్మాన్నార్హా వయం హంతుం-ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్ ।
స్వజనం హి కథం హత్వా-సుఖినః స్యామ మాధవ ? ॥ 37

ఇహ పరలోక సుఖములు లభించునను ఆశలేదు గాన మా సహోదర తుల్యబంధువులైన కౌరవులను సంహరించుటకు మేము తగుదుమని చెప్పరాదు. మాధవా! నీవే చెప్పుము! లోకమున తమవారిని సంహరించినవాడు సుఖపడలేడు గాన మేమును మావారిని దునుమాడి ఎట్లు సుఖపడుదుము ?

శ్లో॥ యద్యప్యేతే న పశ్యంతి-లోభోపహతచేతసః ।
కులక్షయకృతం దోషం-మిత్రద్రోహేచ పాతకమ్ ॥ 38

ఒకవేళ వీరు (కౌరవులు) రాజ్యముపైని మమకారముచే వివేకము లేని వారై - వంశమును నశింపఁజేయుటయు, మిత్రులను ద్వేషించుటయు పాపములని భావింపకున్నను.

శ్లో॥ కథం న జ్ఞేయ మస్మాభిః-పాపా దస్మా న్నివర్తితుం ? ।
కులక్షయకృతం దోషం-ప్రపశ్యద్భి ర్జనార్దన ॥ 39

జనార్దనా! కులమును క్షీణింపఁజేయుట-దోషమని భావించు మేము-ఇట్టి పాపమునుండి తొలగవలెనని ఎందుకు గుర్తింపకూడదు ?

వివరణ - కులక్షయ మిత్రద్రోహములు పాతకములని దృఢముగా విశ్వ సించు మేము యుద్ధమును విరమించుటయే శ్రేయస్కరమనియు, కౌరవులు రాజ్యకాంక్షులై పాపమును ఒడిగట్టుకొందురనియు, "కులక్షయాదులు దోష భూయిష్ఠములు" అను జ్ఞానము కౌరవులకు లేదనియు వివేకము.

శ్లో॥ కులక్షయే ప్రణశ్యంతి-కులధర్మాః సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్న-మధర్మో౽భిభవత్యుత ॥ 40

అధర్మాభిభవాత్ కృష్ణ-ప్రదుష్యంతి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ-జాయతే వర్ణసంకరః ॥ 41

సంకరో నరకాయైవ-కులఘ్నానాం కులస్య చ ।
పతంతి పితరో హ్యేషాం-లుప్తపిండోదకక్రియాః ॥ 42

యాదవ కులశేఖరా!

కులక్షయమున-పరంపరాగతములైన కులధర్మములు లోపించును. కుల ధర్మములు క్షీణించినచో అధర్మము-కులమునంతటి నావరించును. అధర్మము ధర్మమును తిరస్కరించినయెడల - కులవనితలు - దుష్టమార్గగాములగుదురు. స్త్రీలు దుర్మార్గరాంద్రైనచో-బ్రాహ్మణాది వర్ణములు క్షీణించును. వర్ణసంకరము కులమును, కులమును నశింపఁజేయువారిని నరకములో ప్రవేశింపఁజేయునదై అవ్వారి పితరులను-శ్రాద్ధ తర్పణాదులఁజెందనీయక-పితృలోకభ్రష్టుల నొనర్చునట్టిది.

వివరణ:-

కులక్షయాదులవలన కలుగు అనర్థమేమనఁగా ? యుద్ధమున పురుషులు మరణించుటచే నవ్వారి యువతులు కామోద్రేకముచే పరపురుషులతో వ్యభిచరింపగా-మహానర్థకరమగు వర్ణసంకరము సంభవించునని భావము.

శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం-వర్ణసంకరకారకైః ।
ఉత్సాద్యంతే జాతిధర్మాః-కులధర్మాశ్చ శాశ్వతాః ॥ 43

ఉత్సన్నకులధర్మాణాం-మనుష్యాణాం జనార్దన !
నరకే నియతం వాసో-భవతీ త్యనుశుశ్రుమ ॥ 44

అహో! బత మహత్పాపం-కర్తుం వ్యవసితా వయం ।
యద్రాజ్యసుఖలోభేన-హంతుం స్వజన ముద్యతాః ॥ 45

జనార్దనా!

కులఘ్నులు ఒడిగట్టుకొనునట్టి వర్ణసంకరకారకములైన దోషములవలన శాశ్వత వర్ణ ధర్మములు, వంశానుగతములైన సదాచారములున్ను ఎత్తివేయఁబడును. కులధర్మాదులు లోపించిన మానవులకు-నరకమున చిరకాలము

నివాసము సంఘటించునని వినుచున్నాము. రాజ్యసుఖాపేక్షచే సన్నిహిత బంధువులనుగూడ సంహరింప నుద్యుక్తులమగు మేము గొప్ప పాపము నొనర్చుటకు కృతనిశ్చయులమైతిమి; అహో-ఆశ్చర్యము; బత-అయ్యో అని తపింపవలసినవారమగుచున్నాము.

వివరణ -

వర్ణ సంకరమైనచో బ్రాహ్మణాది వర్ణములను విభజింపరామిఁజేసి బ్రాహ్మణాది వర్ణములవారి ప్రత్యేక ధర్మములు, బ్రహ్మచారి గృహస్థాదుల ఆశ్రమధర్మములున్ను నశించుటచే-మానవులకు నరకపతనము తప్పదని సారాంశము.

శ్లో॥ యది మా మప్రతీకార-మశస్త్రం శస్త్ర పాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యు-స్తన్మే క్షేమతరం భవేత్ ॥ 46

ఆయుధములను పట్టుకొనక-ప్రతియుద్ధము నొనర్పకుండు నన్ను కౌరవులు-సంగ్రామరంగమున సంహరించునెడల - అట్టి సంహారము నాకు మేలు కలుగఁజేయును.

వివరణ-

ఇవ్విధము అర్జునుఁడు తపించిన హృదయము గలవాడై పగతుఅవలన తన మరణమును కోరెను గాని శత్రువులను సంహరించి హింసాపాపము నొడిగట్టుకొననని వక్కాణించెనని గుర్తింపవలెను.

ఆ పిదప ఏమి జరిగినదను ధృతరాష్ట్రుని తత్తఅపాటును గమనించి సంజయుఁడు దిగువవిధము వాక్రుచ్చెను.

## సంజయ ఉవాచ -

శ్లో॥ ఏవ ముక్త్వాఽర్జునః సంఖ్యే-రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం-శోకసంవిగ్న మానసః ॥ 47

యుద్ధ స్థలమునందు కౌంతేయుఁడు పైవిధము వచించి-బాణములను ధనుస్సును విసర్జించియు మానసిక దుఃఖముచే రథమునడుమ కూర్చుండెను.

ఇతి శ్రీ మహాభారతే, శతసాహస్ర్యాం సంహితాయాం,
వైయాసిక్యాం భీష్మపర్వణి, శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు,
బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
అర్జున విషాదయోగో నామ ప్రథమోఽధ్యాయః

ఇయ్యది - శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీ మద్భగవత్
గీతా భాష్యమునకు, శ్రీ నాగలింగ శాస్త్రి కృతమగు
సంస్కృత వ్యాఖ్యానమునకును "మనోరంజనం" బను
శాంకరీయ ఆంధ్రానువాదమున
ప్రథమాధ్యాయము.



---

## శ్రీ శివాద్వైత సిద్ధాంత విశదీకరణము

శ్లో॥ శివాద్వైతం న సహతే-ద్వైతం చిదచితోః పృథక్ ।
శివోఽహంభావనాద్వైతం-శివజీవాత్మనో ర్మతమ్ ॥ 1

ముక్తావానంద భోగార్థం-మనో దివ్య మపేక్ష్యతే ।
స్వాత్మారామ మితి శ్రుత్యా-బ్రహ్మణోఽపి మనో భవేత్ ॥ 2

కేవలాద్వైత సిద్ధాంతే-శాంకరే శివజీవయో ।
రైక్యం నిరూపితం కింతు-శివకేశవయో ర్నహి ॥ 3

తత్సూతసంహితాయాంతు-నిషిద్ధం మునినా ఖలు ।
జీవస్థానే హరిః స్యాచ్చేత్-శివస్థానే హరో మతః ॥ 4

తథాప్యైక్యం నఘటతే-జగత్సత్యత్వవాదినాం ।
హరేః పరః శివ శ్చేతి-శివసంకల్పనిశ్చితమ్ ॥ 5

శ్రీ మహా గణాధిపతయే నమః

# భగవద్గీత

## ద్వితీయాధ్యాయము

### "మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాద సహితము

సంజయ ఉవాచ -

శ్లో॥ తం తథా కృపయాఽఽవిష్ట-మశ్రుపూర్ణాకులేక్షణం ।
విషీదంత మిదం వాక్య-మువాచ మధుసూదనః ॥ 1

దయాళువై కన్నీళ్ళు నిండిన నేత్రములతో కటకటపడుచున్నట్టి పూర్వోక్తరీతిని యుద్ధవిముఖుఁడైన అర్జునుని గూర్చి - శ్రీకృష్ణభగవానుఁడు - ఈ చెప్పఁబోవు రీతిని సంభాషణము నొనర్చెనని సంజయుఁడు పలికెను.

వివరణ -

అర్జునుఁడు యుక్తాయుక్త వివేకము లేనివాడై ధనుస్సు నమ్ములతో గూడ దూరమొనర్చి రథమధ్యమున నుదాసీనతఁజెందెనని ధృతరాష్ట్రుఁడు విని "తన కుమారులకు విజయమే లభించు" నని భావించును గాన నాతని సంతోష మూలమగు "తరువాత ఏమి జరిగిన"దను ఆశంకను నివారించుటకై సంజయుఁడు సమాధానము నొసఁగెనని వైశంపాయనుఁడు జనమేజయునకు వక్కాణించె నని సారాంశము.

శ్రీ భగవానువాచ -

శ్లో॥ కుతస్త్వా కశ్మల మిదం-విషమే సముపస్థితం ।
అనార్యజుష్ట మస్వర్గ్య-మకీర్తికర మర్జున ! ॥ 2

అర్జునా ! ఈ స్వధర్మమగు యుద్ధమును విరమించు భావము-సమయము

2)

గాని సమయమున నిన్నెందుకు ఆవహించినది ? క్షత్రియుఁడు యుద్ధమునకు వెనుకంజ వేయుట-మలినము అనఁగా-పాపహేతువగుటయే గాక సత్పూజ్యులచే ఆచరింపఁదగినదై పరమున స్వర్గాది పుణ్యలోక సుఖముల నొసఁగూర్పనిది. ఇహమున అపకీర్తిని కలిగించునదియు నగును.

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ-నైతత్త్వయ్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం-త్యక్త్వోత్తిష్ఠ ! పరంతప ॥ 3

కౌంతేయా ? అధైర్యము నొందకుందువు గాక ! నీ పరాక్రమము జగమున ప్రసిద్ధమైనది గాన నీ స్వధర్మ వైముఖ్యము నీకు తగనిది;

పరంతపా !

తుచ్ఛమైన హృదయచాంచల్యమును విడనాడి శత్రువులను జయింప నుద్యుక్తుఁడవు కమ్ము !

అర్జునఉవాచ-

శ్లో॥ కథం భీష్మ మహం సంఖ్యే-ద్రోణం చ మధుసూదన !
ఇషుభిః ప్రతియోత్స్యామి-పూజార్హౌ వరిసూదన॥ 4

మధుసూదనా ! యుద్ధమున-పితామహుఁడైన భీష్ముని, ఆచార్యుఁడైన ద్రోణు నెట్లు బాణములతో వేధింపవలెను ? పగతుఅ పరిమార్చు మాధవా ! వారిద్దరు-వందనీయులు గదా !

వివరణ-అర్జునుఁడు-స్నేహము, కరుణ, ధర్మానాచరణము, అధర్మాచరణము, అనువానివలన భయపడినవాడై "కథం ఇత్యాదినా" "ఎట్లు పోరాడవలెను?" మున్నగు మాటలతో మధుసూదనుని ప్రశ్నించెనని భావము. మరియు భీష్మద్రోణాచార్యులు-మాటలతోనైన బాధింపఁదగనివారగుటచే వారినెట్లు బాణములతో కొట్టవలెనని పార్థుని ప్రశ్నలోని సారాంశము.

శ్లో॥ గురూ నహత్వా హి మహానుభావాన్-శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే। హత్వాఽర్థకామాంస్తు గురూ నిహైవ-భుంజీయ
భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥ 5

గొప్ప ఆశయము గల ద్రోణాచార్యాది గురుపులను సంహరింపక-నీ మానవలోకమున భిక్షాన్న భోగమైన నుచితమని తోచెడిని. కాని అర్థమునపేక్షించు ద్రోణాదులను సంహరించినచో-ఈ లోకమునందే రక్తసిక్తములగు రాజ్యభోగములను మాత్రము అనుభవింపఁగలుగుదుము.

వివరణ-భిక్షాజీవనము క్షత్రియులకు విహితము కాకున్నను భిక్షాన్న స్వీకారము ప్రశస్తమైనదనియు, గురువులను వధించుట-పరలోకసుఖమును లేకుండఁజేయుననియు, రక్తసిక్తభోగానుభవమువలన పరలోకసుఖము లోపించుననియు, అర్జునుని ఆశయముఁదగు స్వరూపమని భావము.

శ్లో॥ న చైత ద్విద్మః కతర న్నో గరీయో-యద్వా జయేమ యది వా నో జయేయుః। యానేవ హత్వా న జిజీవిషామ-స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ 6

ఈ భిక్షాటన యుద్ధములలో ఎద్ది శ్రేయస్కరమో, అద్దానిని తెలియకున్నాము. మేము గెలుతుమో, వారు మమ్ము ఓడించెదరో, ఇదియు తెలియకున్నది. ఏ బంధువులనైతే సంహరించి జీవింపఁజాలమో, అట్టి కౌరవులు యుద్ధసన్నద్ధులై రణరంగమునందు ఎదురుపడియున్నవారు.

వివరణ-పరలోక సుఖమును లెక్కింపక నీలోకసుఖము ననుభవింపగలమని భావింతు మనినను-జయము ఎవరిని వరించునో అపజయము ఎవరికి తారసిల్లునో నిర్ధారించి చెప్పలేమనియు, ఒకవేళ మాకే విజయము లభించునని నిశ్చయించుకొని సంతోషింతు మనినను-సన్నిహితబంధుసంహారము-మాకు చిరకాల నిశ్చింత జీవనము నొసఁగూర్పదనియు; సంగ్రామము స్వధర్మమైనను నాకు రుచింపదనియు-కౌంతేయుని అభిప్రాయము.

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః-పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢ చేతాః। యచ్ఛ్రేయః స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే-శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥ 7

"కౌరవాదులను చంపి ఎట్లు బ్రతుకగలము?" అను కృపణత్వముతో, "స్వకులమును నశింపజేయుట" అను దోషముచేతను క్షత్రియ సహజ లక్షణమైన

శౌర్యాదికమును పోగొట్టుకొని-"యుద్ధము ధర్మమా ? భిక్షాజీవనము ధర్మమా ?" అను సంశయము గలవాడనై నిన్ను అడుగుచున్నాను. యుద్ధభైక్ష్యములలో ఎద్ది-నా దుఃఖమును తీసివేయునో అద్దానిని నిర్దేశించుము ! నీకు శిష్యుఁడను, నిన్ను శరణుబొందినట్టి నన్ను శాసించుము!

వివరణ-శోక మోహావిష్టుఁడైన శిష్యుఁడు-సద్గురువు నాశ్రయించు విధానము ఇందు తెలుపఁబడినది. అయోగ్యమైన కరుణతో పరితపించి-పాలివారిని చంపినచో మాకు జీవనమెట్లు కొనసాగునని అర్జునుఁడు ధర్మాధర్మ వివేకము లేనివాడై-ఎద్ది క్షత్రియునకు శ్రేయస్కరమో దాని నుపదేశింపుమని శ్రీకృష్ణ భగవానుని ప్రార్థించెను.

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యా-ద్యచ్ఛోక ముచ్ఛోషణమింద్రి-
యాణాం। అవాప్యభూమా వసపత్న మృద్ధం-రాజ్యం సురాణా
మపి చాధిపత్యమ్ ॥ 8

యుద్ధ భైక్ష్యములలో ఎద్ది-ఇంద్రియములను తపింపఁజేయుశోకమును పోగొట్టునో, అద్దానిని నిశ్చయించుకొనలేకున్నాను. నేలపై శత్రువులులేనట్టి సమృద్ధమైనట్టియు రాజ్యమును సంపాదించినను, స్వర్గమున దేవతాస్వరూపమును పొందినను, దుఃఖనివృత్తి కాజాలదు.

వివరణ-"మా భగవాన్ శోకస్య పారం తారయతు" శ్రుతి. "పూజ్యుడా! నన్ను దుఃఖసముద్రమును దాటించుము" అను శ్రుత్యర్థము ఇందు చూపఁబడినది. నీవే విచారించుకొని శ్రేయస్కర విధానము నవలంబింపరాదా? అని శ్రీకృష్ణుఁడు వచించినట్లు ఆశంకించుకొని-అర్జునుఁడు సమాధానము నిడినట్లు ఇందు పొడగట్టును.

యుద్ధమున విజయము లభించినచో రాజ్యసుఖము చేకూరును. మరణము సంభవించునెడ-స్వర్గసుఖము అనుభవింపఁబడును. అట్టితఱి నీ దుఃఖము తొలగును గదా! అను ప్రశ్నకు-నహిప్రపశ్యామి-ఇత్యాది సమాధానము చెప్పఁబడినది.

"యథేహ కర్మచితో లోకః క్షీయతే" ఇత్యాది శ్రుతిని చూపఁబడిన స్వర్గాదుల అనిత్యత్వము; "న స పునరావర్తతే" ఇత్యాదిశ్రుతిని ప్రతిపాదింపఁబడిన

ఉపాసనాఫలమగు మోక్షముఁదగు నిత్యత్వము; నిత్యాసిత్య వివేకముచే కలుగు వైరాగ్యము; ముముక్షులక్షణములుగా నిట ప్రదర్శింపఁబడినవి.

శ్లో॥ ఏవ ముక్త్వా హృషీకేశం-గుడాకేశః పరంతపః।
న యోత్స్య ఇతి గోవింద-ముక్త్వా తూష్ణీం బభూవ హ॥ 9

అలసుఁడు కానట్టి పగతుఱఁబరిమార్చునట్టి అర్జునుడు-గోవిందునిఁగూర్చి యుద్ధవిరామమును యుద్ధకాంక్షారాహిత్యమును వక్కాణించి-పోరాడనని యూఱకుండెను.

శ్లో॥ తమువాచ హృషీకేశః-ప్రహసన్నివ భారత!
సేనయో రుభయో ర్మధ్యే-విషీదంత మిదం వచః॥ 10

భరతవంశోద్భవా !

శ్రీకృష్ణుఁడు-పరిహాసమును నటించుచు-రెండు సైన్యములనడుమ దుఃఖించు చున్నట్టి అర్జునునుద్దేశించి దిగువ విధము వక్కాణించెను.

వివరణ-సైన్యముల రెంటి నడుమ పరితపించు కౌంతేయుని గురించి-మాధవుఁడు మాటలాడవలసిన అవసరము ఏర్పడినది. ఎందుకనఁగా? యుద్ధ ప్రయత్నారంభమునకు మున్ను "యుద్ధము వలదని" అర్జునుడు కోరినచో బాగుండెడిది. ప్రస్తుతము ఉభయులు (కౌరవ పాండవులు) యుద్ధసన్నద్ధులై రణరంగ ప్రవిష్టులైరి గాన నిప్పుడు యుద్ధము నుపేక్షించుట - పాడి గాదని సారాంశము.

పార్థుఁడు యుద్ధము వలదనినను వాసుదేవుఁడాతనిని యుద్ధమునకై ప్రోత్సహించెనని-సంజయుఁడు-ధృతరాష్ట్రుని "తన కుమారులకే రాజ్యము దక్కు"నను దురాశను తొలగించుటకై-భారతా! అని సంబోధించి-చెప్పవలసివచ్చెను.

శ్రీ భగవానువాచ-

శ్లో॥ అశోచ్యా నన్వశోచ స్త్వం-ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూ నగతాసూంశ్చ-నానుశోచంతి పండితాః॥ 11

దుఃఖింపఁదగనట్టి బంధువుల నుద్దేశించి నీవు పరితపించుచు "భీష్మాదుల

నెట్లు సంహరింతును? పితరులు శ్రాద్ధకర్మరహితులై నరకమునఁబడుదురు" ఇత్యాది భాషణమును ప్రాజ్ఞునివలె నొనర్చుచున్నావు; పండితులు—అనఁగా? ఆత్మనాత్మ వివేకముగలవారు-ప్రాణములు లేని శరీరములఁ గూర్చియు, ప్రాణ సంబంధము లేని ఆత్మలఁగూర్చియు దుఃఖపడువారు-కారు.

వివరణ—శోకమోహవశుఁడై స్వధర్మమగు యుద్ధమును చాలించు అర్జు నునకు సాంఖ్యజ్ఞానము నుపదేశించి దేహముయొక్కయు ఆత్మయొక్కయు వివేక మును కలిగించియు పార్థుని శోకమోహములను తొలగించి స్వధర్మమునందు ప్రవర్తింపఁజేయఁదలచినవాఁడై శ్రీకృష్ణభగవానుఁడు—నీ వాదము పిచ్చివాని కూత వలెనున్నదని—శరీరము ఎట్టిదో, ఆత్మ ఎట్టిదో అవ్వాని లక్షణములను చెప్ప నారం భించెననియు; తెలియవలెను.

శ్లో॥ న త్వేవాహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామః-సర్వే వయ మతః పరమ్ ॥ 12

నేను ఒకప్పుడు లేనని కాదు. నీవు లేకుంటివని కాదు. ఈ రాజులు గూడ ఒకప్పుడు లేరని కాదు. మరల నికముందు మనమందరము ఉండమని కాదు.

వివరణ—అనఁగా? నీవు నేను రాజులు మనమందరము-ఆత్మలుగ నెల్లకాల ముందువారమనియు; తాను జీవాత్మలలో ఒకఁడననియు; "తాను పరమాత్మ కానని" యీ శ్లోకమందలి "తు" శబ్దము నిరూపించుచున్నదని వివేకము.

ప్రస్తుతము మనమందరము మరణించినను మరల జన్మింపమని చెప్ప రాదని శ్రీకృష్ణుఁడీ శ్లోకమున సూచించెను. "ప్రాణములు విడిపోయినను ఆత్మ మరణింపదు" ఇత్యాది వచస్సులచే జననజరామరణాదులు దేహమునకే కలవని చెప్పుచు "అహం" "త్వం" "ఇమే" "వయం" అను శబ్దముల నిట శరీరవిశిష్టులగు జీవాత్మల నుద్దేశించియే వాసుదేవుఁడు ప్రయోగించెను.

"వీరిని నేను చంపుదునని దుఃఖించుట—వివేకములేనివాని కర్తవ్యము గా—దేహమునకన్న వేరైన ఆత్మను గురించి — తెలిసికొనినవానివలె — "ఇది ర్మము, ఇది అధర్మము, అని భాషించుట కూడదనియు; దేహలక్షణమును, శరీరభిన్నమగు ఆత్మను, దేహజీవాత్మవ్యతిరిక్తమగు పరమాత్మను, పరమాత్మను

పొందుటకు సాధనమగు యుద్ధరూపమైన స్వధర్మమును గుర్తింపకున్నావు. ఆత్మకు జననమరణములు లేవు గాన ఆత్మను గురించి శోకింప నవసరము లేదు. శరీరమైతే ఏనాటికైనను నశించునదేను; శరీరమునకు జననమరణసంబంధము అనివార్యమగుటచే దేహమును గురించియు దుఃఖింపకూడదు ఇత్యాది ప్రబోధ మును వాసుదేవుఁడు పై శ్లోకమున నిమిడ్చెను.

తాను ఈశ్వరుఁడుకాననుట—చెప్పఁబోవు "బహూని మే వ్యతీతాని-జన్మాని తవ చార్జున"ఇత్యాది ప్రసంగమువలన—పొసఁగుచున్నయది. ఎవరైతే వాసుదేవుఁడే భగవంతుఁడని భావింతురో, వారు—కృష్ణుడు—చెప్పబోవుమాటలను గమనింపవలసి యుండును. మూలమున "సర్వేవయం'' అనుటలో జీవాత్మనిర్దేశము, జీవాత్మ లలో పరస్పర భేదంబు నిమిడియున్నవి, శరీర ఉపాధి సంబంధమువలన—ఆత్మ భేదము అనునెడ—ఆత్మలు భిన్నములు అని తత్త్వోపదేశసమయమున చెప్పుట— యథార్థ (నిజ)ము కాదని పొసగట్టును.

"శరీరములు వేరువేరగుటచే-ఆత్మలు వేరువేరనిచెప్పుట-సమంజసముకాదు. "నిత్యో నిత్యానాం-చేతన శ్చేతనానాం,ఏకో బహూనాం విదధాతికామాన్" "నిత్యు లలో నిత్యుఁడు, చేతనులలో చేతనుఁడు నగు ఒకే పరమాత్మ-పెక్కు జీవాత్మల కోరికల నొసఁగుచున్నవాడు" అనుశ్రుతికి పై మాట ప్రతికూలమగును. ఇట్లు చెప్పుటచే-జీవాత్మ పరమాత్మలలో, జీవాత్మలలోను పరస్పర భేదము-యథార్థ మైనదని విదితమైనది.

శ్లో॥ దేహినోఽస్మిన్ యథా దేహే-కౌమారం యౌవనం జరా ।
తథా దేహాంతరప్రాప్తి-ర్ధీర స్తత్ర న ముహ్యతి ॥ 13

శరీరమునందు నివసించు జీవాత్మకు-చిన్నతనము, తరుణత్వము, ముసలి తనము-ఎట్లు వినాశహేతువులుకావో, అట్లు రెండవ శరీరముఁదగు ప్రవేశంబును వినాశహేతువు కాదు. బుద్ధివికాసము గల మహానుభావుఁడు శరీరము ఆత్మ విడి పోవు విషయమై మోహ (అవివేకమూలకమగు దుఃఖ) మును పొందఁజాలడు.

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ-శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యా-స్తాంస్తితిక్షస్వ భారత ! ॥ 14

భరత వంశోద్భవా! ఆకాశాది పంచమహాభూతముల గుణములైన శబ్దస్పర్శ రూపాదులు మాత్రలనంబడును. అట్టి మాత్రలు-చెవులు మొదలగు ఇంద్రియములతో సంబంధించునెడ-శీతోష్ణములను సుఖదుఃఖములను కలుగఁజేయుచు వచ్చుచు పోవుచుండునవగుటచే నిత్యములు కాకుండును. అవ్వానిని స్వధర్మమగు యుద్ధాదికము ముగియువరకు ఓర్చుకొనుము!

వివరణ-కౌమారము మున్నగు దశలు-శరీర వినాశమునకు కారణములు గావు గాన "బాలుఁడనైయున్న నేను యువకుఁడనైతి" నను ప్రత్యభిజ్ఞానముచే - ఆత్మ-స్థిరమైనదనియు, శరీరావస్థలు అనిత్యములనియు గుర్తించునట్లు-రెండవ దేహమును పొందినపుఁడు నదే జీవాత్మయుండుటఁజేసియు, ధీరుఁడు జనన మరణముల విషయమై మోహముఁజెందఁజాలడు. ఆత్మ-నిత్యుఁడు కావుననే జన్మించుట తోడనే తల్లిపాలుఁద్రాగుటకు నుద్యుక్తుఁడగుచున్నవాడు. అనఁగా-పునర్జన్మ నొందియు పూర్వజన్మాభ్యస్తములగు స్తన్యపానాదులను విస్మరింపనందున నిత్యుఁడైన జీవాత్మ-అనిత్యములైన అనేక శరీరములయందు ప్రవేశించి యవ్వానిని విడనాడుచుండుననియు; శరీరము నశించినను జీవాత్మనిత్యత్వము భంగపడదనియు; ఆత్మకు జననమరణములు లేవనియు తెలియవలెను.

ఆకాశమునకు శబ్దము; వాయువునకు స్పర్శ; అగ్నికి రూపము; జలమునకు రసము; పృథివికి గంధము-గుణములై-ఇంద్రియములఁగూడుకొని శరీరధారియగు జీవాత్మకు సుఖదుఃఖాదులఁగలుగఁజేయునని సారాంశము.

శ్లో॥ యం హి న వ్యథయంత్యేతే-పురుషం పురుషర్షభ ।
సమదుఃఖసుఖం ధీరం-సోఽమృతత్వాయ కల్పతే ॥ 15

పురుషులలో శ్రేష్ఠుఁడా! శస్త్రపాతాదులవలన కలుగు మృదుక్రూరస్పర్శలు-సుఖదుఃఖములను సమానములుగ భావించు ధైర్యము గలిగియున్నట్టి ఏ పురుషుని బాధింపవో-అట్టివాడు-మోక్షమును సాధింప నర్హుఁడగును.

వివరణ-ఫలము నపేక్షింపక-తన వర్ణముఁదగు ధర్మమైన యుద్ధాదికమును ...యు పురుషుఁడు యుద్ధాదికమందలి శస్త్రపాతాదులవలన కలుగు దుఃఖమును, యుద్ధమరణానంతరము సంభవించు స్వర్గాదిసుఖమును, లేక-యుద్ధ విజయానంతరము ఏర్పడు రాజ్యసుఖమును సమానములుగా భావించునెడు-ప్రారబ్ధ

భోగానంతరము ముక్తిసౌధసోపానముల నధిరోహించుననియు, ఆత్మలు నిత్యములగుటచే శరీరదుఃఖము సహింపదగినదనియు తెలియవలెను.

దుఃఖసహనము మోక్ష హేతువగునని సారాంశము.

శ్లో॥ నాసతో విద్యతే భావో-నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽంత-స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥ 16

దేహమునకు నిత్యత్వము లేదు. ఆత్మకు వినాశము లేదు. తత్త్వవేత్తలు—ఈ దేహాత్మల రెంటియొక్క లక్షణము నీవిధముగా నిర్ణయించియున్నవారు.

ఇcట సత్తు బ్రహ్మమనియు, అసత్తు జగత్తనియు నిర్వచించి కారణము నిత్యము కాగా కార్యము అనిత్యంబగునని అసత్కార్యవాదమును కొందరు ప్రతిపాదించిరి. అది సరికాదు. ఎట్లనcగా? దేహముయొక్కయు ఆత్మయొక్కయు వివేకములేనట్టి అర్జునునకు — అట్టి అవివేకమును తొలగించుటకు మాత్రము భగవానుcడు–దేహము అనిత్యమనియు, ఆత్మ నిత్యమనియు ప్రబోధించెను కాని జగన్మిథ్యావాదమును నిరూపింపలేదని విదితమైనది.

శ్లో॥ అవినాశి తు తద్విద్ధి-యేన సర్వమిదం తతం।
వినాశ మవ్యయస్యాస్య-న కశ్చిత్ కర్తు మర్హతి॥ 17

అచేతనమగు దేవమానవాది శరీరజాతమును పంచమహాభూతమయమైన ప్రపంచమునంతయు వ్యాపించు జీవాత్మ — వినాశము లేనిదని గుర్తించుము! ఏ అచేతనవస్తువుగూడ ఈ ఆత్మను నశింపcజేయcజాలదు.

వివరణ–ఆత్మ–సమస్తమును వ్యాపించుటచే నిత్యమైనదనియు, ఆత్మ–అన్నిటికన్న చిన్నదగుటcజేసి అచేతమునందంతటను ప్రవేశింపc గలుగుననియు, అతిసూక్ష్మమైన ఆత్మకంటె నచేతనమంతయు స్థూలమగుననియు, "ఆత్మ–అచేతనమును వ్యాపించు" ననుటcబట్టి జీవాత్మ–విభువని చెప్పరాదు. ఎందుకనcగా? "ఉత్క్రాంతిగత్యాగతీనాం" ఇత్యాది బ్రహ్మసూత్రమున శ్రీ నీలకంఠాచార్యులు–జీవాత్మ–శరీరమునుండి లేచుట, పరలోకమునకు గతించుట, మరల నీలోకమునకే తెంచుట యను ధర్మములచే-అణువగునని నిర్ణయించిరి. శస్త్ర జలాగ్ని వాయ్వాదికము–తదితరమును వ్యాపించి నశింపcజేయునట్లు ఆత్మ–సూక్ష్మాతిసూక్ష్మమగుట వలన వ్యాపకమై-వ్యాప్యముచే నశింపcజేయcబడదనియు తెలియవలెను.

శ్లో॥ అంతవంత ఇమే దేహా-నిత్యస్యోక్తాః శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య-తస్మాద్యుద్ధ్యస్వ భారత॥ 18

నిత్యము వికారరహితము అతిసూక్ష్మంబు నగు జీవాత్మకు—జన్మపరంపర లోని శరీరములు - వినాశము గలవియేను; అందువలన నో భరతవంశోద్భవా! యుద్ధము నొనర్పుము!

వివరణ—నిత్యమైన జీవాత్మకు—కర్మఫలభోగార్థము నానావిధ శరీరములు ఏర్పడును. కర్మఫలానుభవము ముగియుటతోడనే నశించును. నీవు యుద్ధముఁ జేయకున్నను ఈ దేహములు ఉండునవి కావు. యుద్ధము నొనర్చినను ఆత్మ—మరణించునది కాదు. కావున స్వధర్మమగు యుద్ధమే—లోకకల్యాణార్థము కర్తవ్యమగును. ఒకానొకవ్యక్తి—మరణించినాడను వ్యవహారము—దేహముఁబట్టియే సంభవించునని సారాంశము

శ్లో॥ య ఏనం వేత్తి హంతారం-యశ్చైనం మన్యతే హతం।
ఉభౌ తౌ న విజానీతో-నాయం హంతి న హన్యతే॥ 19

చెప్పఁబడిన నిత్యత్వాది లక్షణము గల ఆత్మ—చంపునదనియు,మరియు నీ ఆత్మ—చంపఁబడునదనియ భావించువారు—వివేకము లేనివారనియే చెప్పనగును. వస్తుతః—ఆత్మ చంపునది కాదు. చంపఁబడునదియు కాదు.

వివరణ—లోకమున "ఒకానొకఁడు మరియొకని హింసించుచున్నవాడు, మరియొకనిచే ఒకానొకఁడు హింసింపఁబడుచున్నవాడు" అనుట—అవివేకులు చెప్పునదగుటచే ''ఆత్మ—నిత్యము" అను విషయమును కఠవచనముతో శ్రీకృష్ణ భగవానుఁడు—పై శ్లోకమున సమర్థించెను.

"న హింస్యాత్సర్వా భూతాని" "ప్రాణులందరిని హింసింపఁగూడదు'' ఇత్యాది శాస్త్రము—ఆత్మకు శరీరమునకు వియోగమును కలుగనీయకూడదు—అను నర్థమునందే తాత్పర్యము కలదగుటఁజేసి—హింసయనఁగా—శరీరాత్మవియోగమే కాని ఆత్మహననము కాదు. హింసించువాడు శరీరముతోడనే మరియొక శరీరమునే హింసించును అని విదితమైనది.

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి-న్నాయం భూత్వా భవితా వా
న భూయః। అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో-న హన్యతే
హన్యమానే శరీరే॥ 20

ఈ ఆత్మ—పుట్టునది కాదు. చచ్చునదియు కాదు. పూర్వకల్పమునందు ఉండి—మరల ప్రళయమున నుండనిది కాదు. అందువలన ఆత్మ-జన్మలేనిదగుటచే అజమనియు, మృతిలేనిదగుటచే నిత్యమనియు, మార్పులేనిదగుటచే శాశ్వతమనియు; ఏకరూపము గలదగుటచే పురాణంబనియు, శరీరము హింసింపఁబడినను మరణింపదనియు, తెలియవలెను.

వివరణ—ఈ శ్లోకముఁగూడ—కఠోపనిషత్తునకు చెందిన మంత్రవాక్యమేను; ఆత్మ—హింసకు కర్త, కర్మ, యెట్లు కాదో—ఇందు చూపఁబడినది. జననమరణములు అందరికి అనుభవసిద్ధములైనను ఆయ్యవి ఆత్మకు సంభవించునవి కావు. అని గుర్తింపవలెను.

శ్లో॥ వేదావినాశినం నిత్యం-య ఏన మజ మవ్యయం।
కథం స పురుషః పార్థ!-కం ఘాతయతి హంతి కమ్?॥ 21

ఈ ఆత్మ — జననమరణములు లేనిదనియు; మహాప్రళయమునందును వినాశము లేనిదై నిత్యముగ నుండుననియు; గుర్తించు పురుషుఁడు—ఎవనిని చంపును? ఎవనిని చంపించును?

వివరణ—ఆత్మ నిత్యమగుటచే ఆత్మను సంహరించుచున్నాననియు, సంహరింపఁజేయుచున్నాననియు విలపించుట — ఆత్మజ్ఞానములేనికారణమున — సంభవించును. "ఇట్లు చెప్పుటచే ఆత్మకు కర్తృత్వము కారయితృత్వంబు లేవని" వాదించుట—యుక్తము కాదు.

"యజేత" "జుహుయాత్" ఇత్యాది శ్రుతులచే, "కర్తా శాస్త్రార్థవత్త్వాత్" అను బ్రహ్మసూత్రము చేతను "తస్మా ద్యుధ్యస్వ భారత" ఇత్యాది గీతా సూక్తుల చేతను ఆత్మకు కర్తృత్వము నిర్ణయింపఁబడుటఁజేసి—ఆత్మ కర్తయే నని విదితమగును.

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ-నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా-న్యన్యాని సంయాతి నవాని దేహీ॥22

ఎట్లు మానవుఁడు— పూరాతన వస్త్రములను విడిచి—మరియొక నూతన వస్త్రములను స్వీకరించునో, అట్లు జీవాత్మ—వయస్సుచే తపస్సుచేతను జీర్ణములైన శరీరములను పరిహరించి-తద్భిన్నములగు నూతన దేహములను పరిగ్రహించును.

వివరణ—యుద్ధము హింసాత్మకమై పరులకు శరీరములను విడిపించున దైనను ప్రస్తుత శరీరమునకన్న మిన్నయగు దేవాది శరీరము నిప్పించునదగుటచే—కొంగ్రొత్త పట్టుబట్టలు దొరికినచో చినిగిన పాతబట్టలను విడనాడుట—దుఃఖహేతువు గానట్లు పూర్వదేహత్యాగమును గురించి శోకించుట—సమంజసము కాదని భావము.

నిత్యములైన ఆత్మలకు శరీర వియోగమును మాత్రము ఆయుధములు కలుగఁజేయునని తెలిసినను—భోగసాధనములగు శరీరములు విడిపోవుతటి—దుఃఖము అనివార్యముగదా! అను ప్రశ్నకు పై శ్లోకము — సమాధానమని తెలియవలెను.

"అన్య న్నవతరం కల్యాణతరం రూపం కురుతే, పిత్ర్యంవా గాంధర్వం వా దైవం ప్రాజాపత్యం వా" ఇత్యాది శ్రుతి వాక్యము—శ్రేష్ఠశరీర ప్రాప్తిని సమర్థించుచున్నయది.

శ్లో॥ నైనం ఛిందంతి శస్త్రాణి-నైనం దహతి పావకః ।
నచైనం క్లేదయంత్యాపో-న శోషయతి మారుతః॥ 23

ఈ ఆత్మను ఖడ్గము మున్నగు ఆయుధములు ఖండింపజాలవు. అగ్ని ఈ ఆత్మను దహింపఁజాలదు. ఉదకము ఈ జీవాత్మను తడుపఁజాలదు. వాయువు శుష్కింపఁజేయఁజాలదు.

వివరణ—ఇల్లు కాలినచో ఇంటివారు దహించునట్లు శరీరము నశించినచో శరీరములోని ఆత్మ నశింపకుండుట ఎట్లు? అను ఆశంకకు పై శ్లోకము—సమాధానమగును.

ఆత్మ—నిత్యము నిర్వికారంబు నని భావము.

శ్లో॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ-మక్లేద్యోఽశోష్య ఏవ చ।
నిత్యః సర్వగతః స్థాణు-రచలోఽయం సనాతనః ॥ 24

ఈ ఆత్మ—నిత్యము, అతి సూక్ష్మమగుటచే దేవమానవాది సమస్త శరీరములను వ్యాపించునదియు, ఒకచో కదలక నుండునదియునై సర్వకాల సర్వావస్థలయందు శాశ్వతము నగుటఁజేసి యీ ఆత్మను నరుకరాదనియు, కాల్చరాదనియు, తడుపరాదనియు, ఎండింపఁజేయరాదనియు తెలియవలెను.

వివరణ—ఆత్మ శస్త్రాదులచే నశింపదనుటకు కారణములైన నిత్యత్వాది లక్షణములు ఇందు పొందుపరుపఁబడినవి.

శ్లో॥ అవ్యక్తో౽య మచింత్యో౽య-మవికార్యో౽య ముచ్యతే।
తస్మా దేవం విదిత్వైనం-నానుశోచితు మర్హసి॥ 25

ఈ ఆత్మ—ప్రత్యక్షముగ కనుపడునది కాదు. ఇద్ది అనుమానము(ఊహ)తో సాధింపఁబడునదియు కాదు. ఆయుధాదులచే వికారమును పొందునదియు కాదీ ఆత్మయని నిర్వచింపఁబడుచున్నది. అందువలన ఆత్మ ఇట్టిదని గుర్తించి యద్దాని నుద్దేశించి దుఃఖింప నవసరము లేదు.

వివరణ—పూర్వ శ్లోకములలో చెప్పఁబడిన యంశము ఇందు విశదీకరింపఁబడినది.

శ్లో॥ అథ చైనం నిత్యజాతం-నిత్యం వా మన్యసే మృతం।
తథా౽పి త్వం మహాబాహో!-నైనం శోచితు మర్హసి॥ 26

ఆత్మ-అనిత్యము అను పక్షమందును ఎల్లకాలము పుట్టుచు గిట్టునది ఆత్మయని భావించునెడ—మహాబాహువగు అర్జునా! అట్టి ఆత్మనుగురించి శోకింప నవసరము లేదు.

వివరణ-ఆత్మీయులను సంహరింపఁ దలపెట్టితిమని దుఃఖింపకుము! ఆత్మాధిష్ఠానమగు దేహము దినదినము పరిణామముతో జీర్ణించు స్వభావము గలదగుటచే శరీరమునకు జననమరణములు అనివార్యములగునని భావము.

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యు-ర్ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మా దపరిహార్యే౽ర్థే-న త్వం శోచితు మర్హసి ॥ 27

జన్మించినవానికి మరణము తప్పదు. మరణించినవానికి జననము అనివార్య

మైనది. నివారింప నలవిఁగానట్టి జననమరణముల విషయమై నీవు చింతింపఁ గూడదు.

వివరణ—దేహమే ఆత్మయనునది-క్షణిక బౌద్ధవాదము కాగా చార్వాకాది కుత్సితమతములవారికి గూడ నీ శరీర నిమిత్తక దుఃఖము-అపహాస్యాస్పదమగును. ఉత్పత్తియనఁగా? పూర్వకృతములగు పుణ్యపాపముల వలన నేర్పడు శరీరముఁ దగు సంబంధమనియు; వినాశమనఁగా? ప్రారబ్ధకర్మక్షయమూలకమగు శరీరము నెడబాయుట యనియు; శరీరమునకు జనన మరణములు అనివార్యములనియు తెలియవలెను.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని-వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్త నిధనాన్యేవ-తత్ర కా పరివేదనా ॥ 28

భరత వంశోద్భవా !

ప్రాణులు—ప్రకృతినుండి ఆవిర్భవించి—శరీరసంబంధముగ గుర్తింపఁబడు జనన మరణ రూపమైన మధ్యావస్థయందు ఉన్నవై అవ్యక్త (ప్రధాన)మునందే లీనమగుచుండును. అట్టి ప్రాణులకై దుఃఖించుట—ఉచితము కాదు.

వివరణ—ఆత్మనుగురించి దుఃఖింపఁగూడదనియు, శరీర పరిస్థితిఁగూర్చి విచారించుకొని గూడ బాధపడగూడదనియు భావము.

శ్లో॥ ఆశ్చర్యవత్ పశ్యతి కశ్చిదేన-మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవచ్చైనమన్యఃశృణోతి-శ్రుత్వాఽప్యేనంవేదనచైవకశ్చిత్ ॥

పూర్వము చెప్పఁబడిన నిత్యత్వాదిలక్షణములు గల ఈ ఆత్మను—ఒకానొక పుణ్యాత్ముడు — అద్భుతమైదానిగా చూచును. అట్టి సుకృతియగు మరియొకఁడు ఆత్మను అద్భుతమైనదానిగా వక్కాణించును. ఎవడో నొక మహనీయుఁడు ఆత్మను అద్భుతమైనదానిగా భావించును. అట్లు భావించియు ఎవఁడును ఆత్మను పూర్తిగా గుర్తింపఁజాలడు.

వివరణ—అనంతములైన ప్రాణులలో—పాపములు క్షీణించినవాడుమాత్రము ఆత్మను అన్నిటికన్న విలక్షణమైనదానిగా గుర్తించియు అద్భుతమైనదానిగా నిరూపించుచున్నను ఆత్మ అద్భుతమైనదను భావనతోమాత్రము ఆత్మను యథా-

ర్థముగ గుర్తింపలేదనియు, చూచువాడు చెప్పువాడు వినువాడును ఆత్మజ్ఞాన పరిపూర్ణులు కారనియు తెలియవలెను.

శ్లో॥ దేహీ నిత్య మవధ్యోఽయం-దేహే సర్వస్య భారత।
తస్మాత్సర్వాణి భూతాని-న త్వం శోచితు మర్హసి ॥ 30

భరతవంశోద్భవా! ప్రాణిమాత్రుల శరీరము వధింపఁబడినను ఈ ఆత్మ—నిత్యమగుటచే వదింపనలవిగానిది. ఆత్మ నశింపనిదగుటచే శరీరము నశించునదగుటచేతను ప్రాణులందరి నుద్దేశించి నీవు దుఃఖింపరాదు.

వివరణ—భీష్మద్రోణాదులను గురించియే కాదు-ప్రపంచమున గల దేవ మానవాది ప్రాణులఁగురించియు శోకింపరాదని భావము.

శ్లో॥ స్వధర్మ మపి చావేక్ష్య-న వికంపితు మర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్-క్షత్రియస్య న విద్యతే॥ 31

క్షత్రియధర్మమును పాటించియైనను యుద్ధమును విరమింపరాదు. ఎందుకనగా? క్షత్రియునకు స్వధర్మమగు యుద్ధమునకంటె మరియొక శ్రేయస్కరమైన ధర్మము లేదు.

వివరణ—"నా శరీరమునందు వణకు పుట్టుచున్నది" "మేమీ యుద్ధమున గొప్ప పాపము నొడిగట్టుకొందుము" "స్వకీయులను సంహరించినచో శ్రేయస్సు కలుగునని నమ్మఁజాలను" ఇవ్విధముగ బయలుపడిన అర్జునుని మాటలు విహితములు కావనియు, యుద్ధమున వెనుదీయకుండుటయే క్షత్రియధర్మమనియు, వివేకము.

ఇందుకు ప్రమాణములు "క్షత్రియోహి ప్రజా రక్షన్-శస్త్రపాణిః ప్రదండవాన్,
నిర్జిత్య పరసైన్యాని—క్షితిం ధర్మేణ పాలయేత్."

"క్షత్రియుఁడు-శస్త్రపాణియై దుష్టులను శిక్షించుచు శిష్టులను కాపాడుటయేగాక-శత్రుసైన్యముల నోడించి, ధర్మముతో భూమిని రక్షింపవలెను" అని పరాశరమహర్షి—వచించెను.

"సంగ్రామేష్వనివర్తిత్వం-ప్రజానాం చైవ పాలనం,
శుశ్రూషా బ్రాహ్మణానాం చ-రాజ్ఞః శ్రేయస్కరం పరమ్"

"రణరంగములయందు మఱలి రాకుండుటయు, ప్రజలను రక్షించుటయు, వైదిక శ్రోత్రియ నైష్ఠిక బ్రాహ్మణులను సేవించుటయు-రాజునకు శ్రేయస్కరము లగువానిలో శ్రేష్ఠమైనవి" అని మనువు వక్కాణించెను.

యుద్ధము ప్రారంభింపఁబడినది గాన నీవేళ వెనుదీయుట పాడి కాదని భావము.

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం-స్వర్గద్వార మపావృతం ।
సుఖినః క్షత్రియాః పార్థ-లభంతే యుద్ధ మీదృశమ్ ॥ 32

పార్థా! ప్రయత్నము లేకుండ తారసిల్లినదై-గెలుపునందు-కీర్తిని రాజ్యమును కలుగఁజేయునదియు; ఓటమిని-తెఱచియున్న స్వర్గద్వారమువంటిదియు నగు యుద్ధమును పుణ్యాత్ములైన క్షత్రియులుమాత్రము అచరింతురు.

వివరణ -

గొప్ప శ్రేయస్సు నీ ముందు రానుండగా ఎందుకు భయపడెదవని శ్రీకృష్ణభగవానుఁడు అర్జునుని పై విధముగ ప్రోత్సహించెను. క్షత్రియునకు యుద్ధము-జయమునందును అపజయమునందును శ్రేయస్సు నొదవఁజేయునని భావము. ఇందుకు మనువాక్యమును గమనింపుఁడు!

"ఆహవేషు మిథోఽన్యోన్యం జిఘాంసంతో మహీక్షితః,
యుధ్యమానాః పరం శక్త్యా-స్వర్గం యాంత్యపరాఙ్ముఖాః"

"రాజులు-యుద్ధములలో పరస్పరము వేధించుకొనుచు శక్తిలోపము లేకుండ-ధార్మికమైన పోరాటముఁగావించుచు మరలిపోనివారై మరణించునెడ-స్వర్గమును పొందుదురు."

శ్లో॥ అథ చేత్త్వ మిమం ధర్మ్యం-సంగ్రామం న కరిష్యసి ।
తతః స్వధర్మం కీర్తిం చ-హిత్వా పాప మవాప్స్యసి ॥ 33

ఒకవేళ నీవు క్షత్రియకర్తవ్య ధర్మమగు ఈ యుద్ధమును చేయకుందువేని-స్వ ధర్మమును కీర్తిని విడనాడి అపకీర్తిపాలగుదువు.

వివరణ -

స్వర్గసుఖమందపేక్ష లేకున్నను "అపకీర్తిని స్వధర్మపరిత్యాగదోషమును

పొందుదు" నను భయముతోనైన శత్రువులతో పోరాడుమనియు, వాంఛనీయము లగు కీర్తి ధర్మములను పరిత్యజింపక-అవాంఛనీయమగు అపకీర్తి రూపమైన పాపమునకు గురి కావలదనియు అర్జునుఁడు గుర్తింపవలెనని శ్రీకృష్ణుఁడు ఇందు ప్రబోధించెను.

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని-కథయిష్యంతి తేఽవ్యయాం ।
సంభావితస్య చాకీర్తి-ర్మరణా దతిరిచ్యతే ॥ 34

"నీవు యుద్ధభీతిచే మరలినావు" అను శాశ్వతమైన అపకీర్తి-దేవముని మానవాదులవలన సంభవించును. శౌర్యవీర్యాదులచే ప్రసిద్ధిని పొందిన నీవంటి పురుష శిఖామణికి-అపకీర్తి-మరణమునకన్న నధికమైన బాధను కలుగఁజేయును.

వివరణ –

"పోరాడువాడు రణరంగమున-నేలపై నున్నవానిని, నపుంసకుని, దోసి లొగ్గినవానిని, వెంట్రుకలు విరబోసికొనినవానిని, హాయిగా కూర్చున్నవానిని, "నీవాఁడ"ననిన వానిని, నిద్రించినవానిని, బాధపడువానిని, దిసమొలవానిని, ఆయుధములను పట్టనివానిని, యుద్ధమున పాలుగొననివానిని, ప్రేక్షకుని, ఇతరునితో సంప్రదించువానిని, ఆయుధములు తాకినందున వ్యధపడువానిని, జ్వరాదులచే ఆర్తిఁజెందువానిని, ఆయుధప్రహారములచే మితిమీరిన కలతఁజెందువానిని, భయపడువానిని, యుద్ధమునుండి మరలిపోవువానిని, తీక్ష్ణములు సామాన్యములు నగు బాణఖడ్గాదులతో హింసింపఁగూడదు. ఇద్ది-యుద్ధనీతియై ధార్మిక సజ్జనుల ధర్మంబు"నని మనువు వక్కాణించెను గాన క్షత్రియుఁడు యుద్ధనీతి ధర్మముల నతిక్రమింపక-పోరాడినచో కీర్తిని రాజ్యమును లేక స్వర్గమును పొందఁగలుగును.

"నాకు రాజ్యకాంక్ష లేదు" ఇత్యాది అర్జునవాక్యములకు 34వ శ్లోకమున సమాధానము చెప్పఁబడినది. పలుకుబడి గలవాడు – అపకీర్తిపాలగుటకన్న మరణించుట మేలని యిట భగవానుని నిర్వచనము.

శ్లో॥ భయా ద్రణా దుపరతం-మన్యంతే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో-భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ 35

కర్ణుఁడు మొదలగు శూరులకు భయపడి నీవు రణరంగమునుండి మరలి

నావని మహారథికులు భావింతురు. భీష్మద్రోణాది మహావీరులచే సత్కరింపఁబడిన నీవు అనాదరమును పొందుదువు.

వివరణ – బంధువులపై గల స్నేహము వలనను కరుణచేతను యుద్ధమును విరమించుట-నా శూరత్వమునకు భంగము కాదు గాన నాకు అపకీర్తి రాదు-అని అర్జునుఁడు ప్రశ్నించునని తర్కించి శ్రీ కృష్ణుడు పై విధము నుడివెను. మహారథికులనఁగా ? పదివేల యోధులతో పోరాడువారు మహారథికులనఁబడుదురు.

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూన్-వదిష్యంతి తవాహితాః ।
నిందంత స్తవ సామర్థ్యం-తతో దుఃఖతరం ను కిమ్ ? ॥ 36

దుర్యోధనుఁడు మొదలగు నీ శత్రువులు-శూరులమైన మనతో పార్థుఁడు పోరాడఁజాలడు-ఇత్యాది కటువచనముల-నమితముగఁ బలుకుదురు. మరియు నీ యుద్ధనైపుణ్యమును కించబఱచుదురు. ఇంతకంటె నధికమగు దుఃఖమెద్ది ?

వివరణ – "మహారథికులు నన్ను తిరస్కరింతురుగాక ! నేను యుద్ధమును చాలించుటచే రాజ్యము తమకు లభించునని శత్రువులు సంతోషింతురు" అను అర్జునుని ఆశంకకు పై శ్లోకము సమాధానమగుచున్నయది.

శ్లో॥ హతో వా ప్రాప్స్యసి స్వర్గం–జిత్వా వా భోక్ష్యసే మహీం ।
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ!–యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37

శత్రువులు నిన్ను సంహరించినచో మోక్షము నొందుదువు; పగతుఱఁ గెలిచినయెడల రాజ్యసుఖము ననుభవింతువు, అందువలన కౌంతేయా ! పోరాడుదునని నిశ్చయించుకొని సన్నద్ధుఁడవు కమ్ము !

వివరణ – యుద్ధమున గురువులు మున్నగు పెద్దలను చంపుటచే నన్ను ప్రజాప్రముఖులు నిందింతురు. యుద్ధము నొనర్పనిచో పగతుఱ–తూలనాడుదురు గాన కర్తవ్యమెద్దియో తోచుటలేదు" అను అర్జునుని ఆశంక నూహించి భగవానుఁడు పై విధము ప్రత్యుత్తరించెను. యుద్ధము ధార్మికమైనచో అందు జయమున అపజయముననను శ్రేయస్సే కలదనియు; యుద్ధము క్షత్రియ ధర్మమగుటచే మోక్షహేతువగుననియు; "యశో నా మృత్యుర్వా" అని యుద్ధమును

నిశ్చయించుకొనుమనియు; ప్రారంభముననే విరమించు నుద్దేశము హాస్యాస్పద మగుననియు, "మాలో ఎవరు గెలుతురో'' అను అర్జునుని మాటకు ఇందు సమాధానము చెప్పఁబడినది.

శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా-లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ-నైవం పాప మవాప్స్యసి ॥ 35

సుఖదుఃఖములను లాభనష్టములను జయాపజయములను సమానములుగ భావించి చిత్తశుద్ధితో యుద్ధమునకు కడంగుము! ఇట్లు చేసినచో జనన మరణ జరాది సంపన్నమగు సంసారబంధము నొందఁజాలవు.

వివరణ - రాగ ద్వేషాది ద్వంద్వవికారములకు నిలయమగు యుద్ధమును ముముక్షు వెట్లాచరించవలెనని పార్థుఁడు ఆశంకించినట్లు భగవానుఁడు తర్కించి పైవిధము సమాధానము నొసఁగెను. పరమేశ్వరారాధనబుద్ధిని స్వధర్మము నాచరించుచు యుద్ధమున కలుగు రాగద్వేషాదులయెడ సమభావనతో పోరాడినచో శివానుగ్రహమువలన మోక్షమునే పొందుదువని భావము.

ఇట్లు ఆత్మ స్వరూపమును ఆత్మగల దేహముఁదగు లక్షణమును ఉపదేశించి-మోక్షమునకు సన్నిహిత సాధనమగు నిష్కామకర్మయోగమును భగవానుఁడు నిర్వచింపఁ బ్రారంభించుచున్నవాడు.

శ్లో॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే-బుద్ధి ర్యోగే త్విమాం శృణు !
బుద్ధ్యా యుక్తో యయా పార్థ-కర్మబంధం ప్రహాస్యసి ॥ 36

సంఖ్యయనఁగా-తత్త్వములను పరిగణించు బుద్ధి; అట్టి బుద్ధితో గుర్తింపఁదగిన ఆత్మతత్త్వము సాంఖ్యమనఁబడును. ఇట్టి ఆత్మవిషయమై బోధించితిని. ఇప్పుఁడు కర్మయోగమును గూర్చిన పరిజ్ఞానము నాలకింపుము! కర్మయోగాచరణమువలన కర్మబంధమును సడలించుకొనఁజాలుదువు!

వివరణ - ''న త్వేవాహం" మొదలుకొని ''తస్మా త్సర్వాణి భూతాని-న త్వం శోచితు మర్హసి" వరకు ఆత్మజ్ఞానము-బోధింపఁబడినది గాన నిట కర్మయోగమును గురించి చెప్పవలసివచ్చినది. ఇఁట యోగమనఁగా ? ఆత్మజ్ఞానముతో కూడిన నిష్కామకర్మ నాచరించుట యని తెలియవలెను. సకామ

కర్మాచరణము-మిక్కిలి నికృష్టమైనదని ఇదే అధ్యాయమున 49వ శ్లోకమున చెప్పఁబడుట-గమనార్హ మగుచున్నయది.

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి-ప్రత్యవాయో న విద్యతే।
స్వల్ప మప్యస్య ధర్మస్య-త్రాయతే మహతో భయాత్ ॥ 40

ఈ నిష్కామకర్మయోగము-సమాప్తము కానిదై భంగపడినచో దోషము లేదు. మరియు నిద్దానిని-కొద్దిగ ఆచరించినను సఫలమగును. ఈ కర్మయోగ రూపమైన ధర్మముఁదగు స్వల్పాంశమైనను-గొప్ప భయము నొదవఁజేయు సంసారదుఃఖము సంభవింపకుండునట్లు రక్షించును.

వివరణ-ముందు చెప్పఁబోవు కర్మయోగము యొక్క మహిమ-ఇందు ప్రారంభింపఁబడినది. "పార్థ నైవేహ నాముత్ర-వినాశ స్తస్య విద్యతే" అనుచో ఈ అర్థము విశదీకరింపఁబడును. తదితరములైన కామ్యకర్మలు, లౌకికకర్మలును భంగపడినచో నిష్ఫలములగును ఈ జ్ఞానపూర్వక (నిష్కామ) కర్మయోగము అట్టిది కాదని భావము.

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధి-రేకేహ కురునందన !
బహుశాఖా హ్యనంతాశ్చ- బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥ 41

కురునందనా ?

వ్యవసాయమనఁగా – నిశ్చయము. "పరమేశ్వరు నారాధించుటతోడనే సంసారసాగరమును తరింతు" నను నిశ్చయము గల బుద్ధి-ఒకే పరమాత్మ నిష్ఠ గలదగును ఈ నిష్కామకర్మ విషయమై ఇట్టి నిర్ణయము లేనివారి బుద్ధులు— అనేక మనోరథముల నపేక్షించునవై అవధిలేని వగునట్టివి.

వివరణ-పరమేశ్వరారాధనబుద్ధి నాచరింపఁబడు నిష్కామకర్మయే సంసారభయమును పోఁగొట్టును. కామ్యకర్మలైతేనో-ఆస్తికత్వమును దృఢపఱచునవైనను సంసారభయమును పునః పునః కలుగఁజేయునని సారాంశము-

శ్లో॥ యా మిమాం పుష్పితాం వాచం-ప్రవదంత్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ!-నాన్య దస్తీతి వాదినః ॥ 43

కామాత్మానః స్వర్గపరాః-జన్మకర్మఫలప్రదాం ।
క్రియావిశేష బహుళాం-భోగైశ్వర్యగతిం ప్రతి ॥ 43

భోగైశ్వర్య ప్రసక్తానాం-తయాఽపహృత చేతసాం ।
వ్యవసాయాత్మికా బుద్ధిః-సమాధౌ న విధీయతే ॥ 44

పార్థా! వేదములలో చెప్పఁబడిన అర్థవాదములయందు ఆసక్తి కలిగి—స్వర్గసుఖభోగమున కన్న నితరమైన మోక్షము లేదని చెప్పునట్టివారు—మనస్సు నిండ కోరికలు గలవారై స్వర్గసుఖభోగముల నాశించి జననమరణాదులను కర్మ ఫలరూపములైన సుఖదుఃఖముల నొసఁగునట్టి, అగ్నిహోత్రాది క్రియా విశేష ములతో కూడినట్టియు,స్వర్గమున అమృతము నాస్వాదించు భోగము గలయట్టియు, సమున్నత పదవి నపేక్షించినవారై ఈ వేదవిహితమైన "జ్యోతిష్టోమేన స్వర్గ కామో యజేత" ఇత్యాది వాక్యమును ఆపాతరమణీయమై శ్రేష్ఠమైనదానిగాను చెప్పుచుందురు.

ఇట్టి వీరు—విద్వాంసులు (జ్ఞానులు) కారని భావింపవచ్చును. భోగముపై అధికారముపైన నాసక్తి గలిగి భోగవాంఛచే నిశ్చయాత్మకమైన బుద్ధిని పోగొట్టు కొనినవారికి నిష్కామకర్మానుష్ఠానవిషయమై మనస్సు ఏకాగ్రము కాజాలదు.

వివరణ—"అక్షయ్యగ్ం హవై చాతుర్మాస్యయాజినః సుకృతం భవతి" "చాతుర్మాస్యము అను యాగము నొనర్చువాని పుణ్యము క్షయము లేనిదగును." "హిరణ్యదా అమృతత్వం లభంతే" "బంగారము దానముఁజేయువారు మోక్షము నొందుదురు" అనునవి-వేదములో అర్థవాదములనఁబడును. సకామకర్మాచరణమున పునర్జన్మ నొందుటయు, పునఃజన్మించి కర్మఁ జేయుటయు అనివార్యములు గాన వేదార్థవాదములను విశ్వసించి ఫలాభిసంధితో కర్మ నాచరించువారికి మోక్షము చేకూరదని తెలియుచున్నది. పుష్పితమనఁగా? దూరమునుండి చూచినచో ఎంతో ఇంపుగా కనఁబడునది కామ్యకర్మ నాచరించువారికి చిత్తశుద్ధి కలుగదు. అందు వలన వారికి నిష్కామకర్మ రుచింపదు. మోక్షకాములు భోగైశ్వర్యప్రదమగు కామ్యకర్మను విడనాడవలెనని భావము.

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా-నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో-నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ 45

అర్జునా! సత్త్వరజస్తమోగుణములలో వేరువేరుగా నొక్కొక గుణము ముఖ్యముగా గల పురుషులకొరకు వేదములు ప్రవర్తించినవి. గాన నీవు రజో గుణమును తమోగుణమును విడనాడి సత్త్వగుణమును మాత్రము అవలంబింపుము! సత్త్వగుణమునందే నిలచియుండుట నిస్త్రైగుణ్యమనఁబడును. మరియు సుఖ దుఃఖాది ద్వంద్వదోషసంబంధము లేనివాడవై కేవలము సత్త్వగుణమునే ఆశ్ర యించి యోగక్షేమభారమును పరమేశ్వరునిపై నునిచి చిత్తమును వశపఱచు కొనుము!

వివరణ-అగ్నిహోత్రాది కర్మలయొక్క ఫలితమగు స్వర్గ సుఖాదిభోగము మోక్షప్రదము కానిచో ప్రమాణములన్నిటిలో శ్రేష్ఠమగు వేదము కర్మలనెందుకు విధించుచున్నదను ప్రశ్నకు పై శ్లోకము సమాధానమగును. యోగమనఁగా? ఒకా నొక వస్తువు లభించుట; లభించినదానిని కాపాడుట క్షేమ మనఃబడును. దొరకని ధానికై ఆరాటపడక దొరికినదానిని రక్షించుబాధ్యతను వహింపకను యోగ క్షేమభారమును పరమేశ్వరునిపై పెట్టుమనియు, నీ చిత్తమును గూడ పరమేశ్వ రునకు సమర్పించుమనియు: "త్రైగుణ్య"మనఁగా? మిశ్రములైన మూడుగుణము లనియు; త్రైగుణ్యము లేనివాడవై అనఁగా? రజస్తమోగుణములు రజస్తమోమిశ్రిత సత్త్వగుణంబు లేనివాడనై అనియు; "నిత్యసత్త్వస్థః" అనఁగా? రజస్తమః సంబంధము లేని సత్త్వ గుణ నిష్ఠుడవై అనియు; సత్త్వగుణప్రధానుఁడు సుఖ దుఃఖాది ద్వంద్వములకు లోను గాడనియు తెలియవలెను.

శ్లో॥ యావా నర్థ ఉదపానే-సర్వతః సంప్లుతోదకే।
తావాన్ సర్వేషు వేదేషు-బ్రాహ్మణస్య విజానతః॥ 46

అంతట నీటితో నిండియుండు బావి చెరువు మొదలగు వానియందు-దప్పి గొనినవానికి నీటితో ఎంత యవసరమో, వైదికుఁడైన ముముక్షువునకు వేదము లన్నిటిలో మోక్షసాధనమగు నిష్కామకర్మ-తనకు సాధ్యమైనంతనే పరిగ్రాహ్య మగుచున్నయది.

వివరణ-ఇందు ఉదకమును త్రాగుదురు గాన ఉదపానమనఁబడును, చెరువు బావి కొలను ఏరు మున్నగునవి ఉదపానములనఁబడుఁగునవి. వేదముల నభ్యసించి వేదార్థమును గుర్తించు బ్రాహ్మణుఃడు-చిత్తశుద్ధి గలవాడై మోక్షము నపేక్షించి ఫలముఁగోరక నిత్యనైమిత్తిక కర్మల నాచరించుచు శివారాధనము నొనర్చుట

మాత్రము పర్యాప్తము కాగలదని భావించి కామ్యకర్మలను విడనాడవలెనని భావము.

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే-మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతు ర్భూః-ర్మా తే సంగోఽ స్త్వకర్మణి॥ 47

నీకు నిత్యనైమిత్తిక రూపమగు కర్మయందే ఆసక్తి యుండవలెను. కాని కర్మఫలానుభవరూపములగు స్వర్గాదులపై ఎప్పుడును అపేక్ష యుండ కూడదు. ఫలము నాశించి యాచరింపఁబడు కామ్యకర్మలకు నీవు కర్తవు కాగూడదు. నిత్యనైమిత్తిక కర్మలను గూడ విడనాడుట యందు నీకు మనస్సు కలుగకుండుగాక!

వివరణ- మోక్షాపేక్ష గలవాఁడు ఆచరింపవలసినవి- శ్రీపరమేశ్వరారాధన ములో చేరునట్టి స్వవర్ణాశ్రమోచితములైనట్టియు నిత్యనైమిత్తిక కర్మలగును. ముముక్షువు కర్మఫలములను కోరరాదు. కర్మఫలము సంసారబంధహేతువగు ననియు, ఫలాపేక్ష లేనట్టి కర్మాచరణము పరమేశ్వరారాధనరూప మగుననియు వివేకము. ఫలములేని కర్మనాచరించుట ఎందుకని భావించి స్వధర్మమగు యుద్ధము నొనర్పకుండుటయు కూడదు. అకర్మయనఁగా? సర్వకర్మసన్న్యాస మగును. భస్మరుద్రాక్షధారణ సంధ్యావందన శివమంత్రజప శివారాధనాదులు నిత్యములనియు, తీర్థయాత్ర, పితృశ్రాద్ధము, వేదశాస్త్రాభ్యాసము, యుద్ధము, వేదాంతశ్రవణము మొదలగునవి నైమిత్తికములనియు తెలియవలెను. ఏతావతా స్వధర్మమగు యుద్ధమును తత్ఫలములగు రాజ్య స్వర్గముల నాశింపక నవశ్యమాచరింపుమని భగవత్ప్రబోధసారాంశము.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి-సంగం త్యక్త్వా ధనంజయ! ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా-సమత్వం యోగ ఉచ్యతే॥ 48

ధనంజయా !

యోగమనఁగా? ఇట ఎట్టి వికారము లేకుండుట యని యర్థము. బంధువులపై అనురాగమును రాజ్యకాంక్షను విడనాడినవాడవై యుద్ధాది శాస్త్రవిహిత సుకృతముల నాచరింపుము! యుద్ధమున విజయము లభించినచో సంతోషింపకుము!

అపజయము తారసిల్లినచో దుఃఖింపకుము! జయాపజయములను సమానములుగ భావింపుమని యర్థము.

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ-బుద్ధియోగా ద్ధనంజయ! ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ-కృపణాః ఫలహేతవః॥ 49

ధనంజయా !

ఫలత్యాగరూపమైన జ్ఞానము నవలంబించి చేయఁబడు నిష్కామకర్మ కన్న కామ్యకర్మ మిక్కిలి నికృష్టమైనది. అందువలన నిష్కామకర్మ నిష్ఠ నంగీకరింపుము! ఫలమునుకోరి కర్మనాచరించువారు దీనులగుదురు.

వివరణ-దూరేణ అనఁగా? మిక్కిలియనియు, బుద్ధియోగ మనఁగా? జ్ఞాన సహిత కర్మాచరణమనియు, ఫలహేతవః అనఁగా? ఫలమునాశించి కర్మనొనర్చు వారనియు అర్థము.

"యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మిన్‌లోకే జుహోతి, యజతి, తప స్తప్యతే బహూని వర్షసహస్రాణి, తదేవాస్య తద్భవతి, యదిహ అనేవంవిత్ మహత్‌పుణ్యం కరోతి తదా స్యాంతేఽక్షీయతే, ఏవ మాత్మానమేవ లోక ముపాసీత, స య ఆత్మానమేవ లోక ముపాస్తే, నాస్య కర్మ క్షీయతే"

శ్రుతి

"గార్గి! శాశ్వతమగు బ్రహ్మము నుపాసింపక నీ లోకమున హవనమును పూజనమును,వేలకొలది వత్సరములు తపస్సు నాచరించువానికి అంతంతమాత్రము అనిత్యమైన ఫలము లభించును. ఇట్లుగాక బ్రహ్మోపాసనాంగముగ గొప్ప సుకృతముఁగావించువాని పరిశ్రమ క్షీణించునది కాదు. గాన పరమేశ్వరునే నిత్య నైమిత్తిక కర్మాదులతో నుపాసింపుము! ఎవఁడిట్లు పరమేశ్వరారాధనము నిష్కామకర్మకు పర్యవసానమని భావించునో అట్టివాని సుకృతము అక్షయం బగును."

పై శ్లోకమునకీ శ్రుతి వాక్యము ప్రోద్బలకమని తెలియునది.

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ-ఉభే సుకృత దుష్కృతే॥
తస్మా ద్యోగాయ యుజ్యస్వ-యోగః కర్మసు కౌశలమ్॥ 50

జ్ఞానపూర్వకమగు నిష్కామకర్మయందు నిష్ఠగలవాడు ఈ లోకమున పుణ్యపాపములను విడనాడును. గాన నిష్కామకర్మయోగమునకై సంసిద్ధుఁడవు కమ్ము! ఎందుకనఁగా? కర్తవ్య కర్మలయందు నిర్వికారభావము సమర్థులకే అబ్బునది.

వివరణ-"పుణ్యపాపే విధూయ, నిరంజనః పరమం సామ్య ముపైతి" శ్రుతి."నిష్కామకర్మ నాచరించు ముముక్షువు పూర్వకృతములగు పుణ్యపాపములను పోగొట్టుకొని ఫలాసక్తిని బొత్తుగా విసర్జించియు పరమేశ్వరునితో అత్యంతమైన సమత్వమును అనగా? శివసాయుజ్యము నొందును." పరమేశ్వరారాధన భావనతో ఆచరింపఁబడు నిష్కామకర్మ మోక్షహేతు వగుటయే గాక శోకమోహములను తీసివేయునని భావము.

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తా హి-ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబంధ వినిర్ముక్తాః-పదం గచ్ఛంత్యనామయమ్ ॥ 51

నిష్కామకర్మనాచరించు బుద్ధి గల విద్వాంసులు-కర్మఫలమగు స్వర్గాది సుఖభోగము నాశింపనివారగుటచే జననమరణాది సంసార బంధమును సడలించుకొని-సర్వాతీతమగు ఆనందము నొదవఁజేయు బ్రహ్మమును (శివుని) పొందుచున్నవారు.

వివరణ-ఇహ పరలోక సుఖవాంఛను విడనాడి స్వకర్తవ్యములగు సుకృతముల నీశ్వరార్పణబుద్ధి నాచరించువారు-శివానుగ్రహపాత్రులై ముక్తులగుదురు. ఇఁట పదశబ్దమునకు "తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి" అను శ్రుతి ననుసరించి బ్రహ్మము అను నర్థము విహితమచున్నయది.

శ్లో॥ యదా తే మోహకలిలం-బుద్ధి ర్వ్యతితరిష్యతి।
తదా గంతాఽసి నిర్వేదం-శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ 52

నీ బుద్ధి "అనిత్యములైన కర్మఫలములు నిత్యములగు" నను వ్యామోహమును పూర్తిగా విడనాడినవేళ వినినదియు వినఁదగినదియు నగు కర్మఫలము విషయమై విరక్తిని పొందఁగలుఁగుదువు.

వివరణ-"పరమేశ్వరు నారాధించు బుద్ధితో నిష్కామకర్మఁజేయువానికి మోక్షము శాశ్వత మహాఫలమని చెప్పితిరి గదా! కామ్య కర్మయందు విరక్తి కలు

గనిచో నిష్కామకర్మ నాచరించుట సాధ్యముకాదు. గాన విరక్తి సంభవించున దెప్పుడు? అని అర్జునుఁడు అడిగినట్లు ఆశంకించుకొని భగవానుఁడు పైవిధము సమాధానము నిడెను. కర్మఫలము నిత్యము కాదని దృఢనిశ్చయము కలిగిన యెడల అజ్ఞానియందు వైరాగ్యము సమకూరునని భావము.

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే-యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధా వచలా బుద్ధి-స్తదా యోగ మవాప్స్యసి ॥ 53

నీ బుద్ధి-శ్రవణముచే పరతత్త్వముఁదగు నిర్ణయము గలదై పరమేశ్వరు నందు స్థిరముగ నిలచియుండుతఱి-ధ్యానయోగమును పొందఁగలుఁగుదువు.

వివరణ-శ్రవణమనఁగా? "వేద వేదాంతవాక్యముల తాత్పర్యము పరమేశ్వరు నందే కలదు" అను దృఢ నిశ్చయము; "పరమేశ్వర (పర) తత్త్వము తదితర వస్తువులకన్న విలక్షణమైనది" అను బుద్ధి శ్రవణముచేతనే స్థిరపడును. ఈతని చిత్తము విశ్రాంతిఁజెందుచున్నదిగాన సమాధియనఁగా-పరమేశ్వరుఁడగును. పరమేశ్వరసాక్షాత్కారమునకు ధ్యానయోగము సన్నిహిత సాధనమగును. కర్మ ఫలము నపేక్షింపని జ్ఞాననిష్ఠ-శ్రవణమువలన సంభవించును. ధ్యానము నభ్య సించుటచే-బుద్ధి-పరమేశ్వరునే అంతట సమీక్షించును.

ఈవరకు యోగశబ్దమునకు 48వ శ్లోకమునందు సమత్వము అను నర్థముఁ జెప్పి 50వ శ్లోకమున అదే యర్థము సమర్థింపఁబడినది. ఇఁట యోగమనఁగా— ధ్యానాభ్యాసమని చెప్పవలసివచ్చినది. జయాపజయములలో లాభనష్టములయందును. హర్ష విషాదములను విడనాడుట-యను సమత్వము శ్రవణముచే బలపడగా ధ్యాన యోగము సిద్ధించునని భావము.

జ్ఞాననిష్ఠగల స్థితప్రజ్ఞుని లక్షణమును ప్రశ్నించుచున్నవాడు.

అర్జున ఉవాచ

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా-సమాధిస్థస్య కేశవ! ।
స్థితధీః కిం ప్రభాషేత-కిమాసీత వ్రజేత కిమ్?॥ 54

కృష్ణా! పరమేశ్వరనిష్ఠ గల స్థితప్రజ్ఞుని లక్షణము ఎట్టిది? స్థితప్రజ్ఞుఁడు

ఏ విధముగ సంభాషించును? ఎట్లు ఒకచో నిలుకడ కలిగియుండును? ఏవిధముగ ప్రవర్తించును?

వివరణ—పరమేశ్వరుఁడు నాలో ఉన్నాడను తెలివి స్థిరముగ గలవాడు స్థితప్రజ్ఞుఁడనఁబడును. స్థితప్రజ్ఞునకే జ్ఞాననిష్ఠ యలవడును. ఇఁట భాషయనఁగా— లక్షణము (గుర్తింపు) అని యర్థము. స్థితప్రజ్ఞుని లక్షణము, ఆసనము, (ఒకచో స్థిరముగనుండుట) గమనము, (ప్రవర్తనము) ఎట్టివని కౌంతేయుఁడు శ్రీకాంతుని ప్రశ్నించెనని భావము.

శ్రీ భగవానువాచ

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్-సర్వాన్ పార్థ మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్టః-స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥ 55

పార్థా! మనోగతములైన కోరికలను విసర్జించి పరమాత్మయందే తనంతటఁ తాను సంతుష్టిఁజెందు లక్షణముచే స్థితప్రజ్ఞుఁడు గుర్తింపఁబడును.

వివరణ – శబ్దాదిప్రమాణముల చేతను శాస్త్రీయ నిషేధములఁబట్టియు మనస్సునందు పొడుకొనియున్న అపేక్షలను బొత్తుగా తొలగించుటకు—పరమేశ్వరునందు స్వయముగా తృప్తిపడుచు ఆత్మారాముఁడై యుండుట—సాధనమగును. నిష్కామస్థితియే స్థితప్రజ్ఞలక్షణ మగునని భావము.

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనాః-సుఖేషు విగతస్పృహః।
వీతరాగభయక్రోధః-స్థితధీ ర్మని రుచ్యతే ॥ 56

దుఃఖములు సంభవించినపుడు మనస్సును వ్యాకులము గానీయక సుఖములు తారసిల్లుతఱి ఇంకను కావలెనను వాంఛలేనివాడై మనస్సులోని ఆసక్తిని, క్రోధరూపమైన ద్వేషమును, భయమును విడనాడి పరాభక్తిచే పరమేశ్వరుని చింతించు మహాపురుషుఁడు స్థితప్రజ్ఞుఁడనఁబడును.

వివరణ—ఆధ్యాత్మికములు (మనస్సునందు కలుగునవి) ఆధిదైవికములు (ప్రారబ్ధకర్మ ననుసరించి వచ్చునవి) ఆధిభౌతికములు (వయస్సునుబట్టి సంభవించునవి) నగు త్రివిధ దుఃఖములను సహించుచు శరీర సుఖభోగములపై ఆత్మా

శను విడనాడి-శరీరపోషణ పర్యాప్తములగు ఆహార పానీయములను మాత్రము పరిగ్రహించుచు పరమేశ్వరుని పూజా జపస్తోత్రధ్యానాదులతో ఆరాధించు పురుషోత్తముని స్థితప్రజ్ఞునిగా గుర్తింపవలెనని భావము.

ఈ రెండు శ్లోకములయందు స్థితప్రజ్ఞుని లక్షణము ఎట్టిదో మొదటి ప్రశ్నకు సమాధానము చెప్పఁబడినది.

శ్లో॥ యః సర్వత్రానభిస్నేహ- స్తత్తత్ప్రాప్య శుభాశుభం ।
నాభినందతి న ద్వేష్టి-తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 57

పుత్ర కళత్ర మిత్రాదులయందు మిక్కిలి యభినివేశములేనట్టి ముని (మననశీలుఁడు) ప్రారబ్ధకర్మ ననుసరించి తారసిల్లునట్టి శుభహేతువైన విషయమును, అశుభహేతువైన అనుభవమును పొంది యెవఁడు సంతసింపడో, ద్వేషింపడో, అట్టి మహాపురుషుని పరమేశ్వరునిఁజెందిన ప్రజ్ఞ (నిష్ఠ) సుస్థిరమై యుండును.

వివరణ — కళత్ర పుత్ర మిత్రాదులయందు స్నేహమును విడిచినను పరమేశ్వరునిపై మాత్రము భక్తియనఁదగు అత్యంతప్రేమ గలవాడు మాత్రము కావలెనని భావము.

శ్లో॥ యదా సంహరతే చాయం-కూర్మోఽంగానీవ సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య- స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 58

ఈ శివధ్యానయోగరతుఁడు-తాబేలు తన అవయవములనన్నిటిని లోనికి లాగికొనునట్లు-ఇంద్రియములను విషయములనుండి మఱల్పఁగలిగినతఱి—అట్టి యోగియొక్క బుద్ధి-పరమేశ్వరునియందు నిలచియుండును.

వివరణ—మాటలాడుట, చూచుట, వినుట, నడచుట మున్నగునవి-విషయములనఁబడును. వాక్కు, చేతులు, కాళ్ళు మొదలగునవి ఇంద్రియములనఁబఱఁగును. ఇంద్రియములనుండి విషయములను మఱల్చుటయనఁగా ? సంభాషణాదులను పరిమితములఁజేయుట యగును. విషయవినివర్తనమువలన జితేంద్రియుఁడై స్థితప్రజ్ఞుఁడు కాగలుగునని భావము.

శ్లో॥ విషయా వినివర్తంతే-నిరాహారస్య దేహినః ।
రసవర్జం, రసోఽప్యస్య-పరం దృష్ట్వా నివర్తతే॥ 59

ఇంద్రియములకు విషయములను దూరమొనర్చుటచే శబ్దాది విషయములు దుర్బలములగును కాని శబ్దాది విషయములందలి ఆసక్తిమాత్రము తగ్గదు. అట్టి అనురాగము పరమేశ్వరుని సాక్షాత్కరించుకొనినపిదప పూర్తిగా తొలగిపోవును.

వివరణ—ఇంద్రియములకు విషయములు ఆహారమగును. విషయములు తగ్గినచో ఇంద్రియములు పరమేశ్వరాభిముఖములగును. ఐనను అనుభవాసక్తి పరమేశ్వర దర్శనానంతరమే సమసిపోవును. చిత్తము ఇంద్రియ విషయములచే ఆకర్షింపఁబడుచున్నను నిగ్రహముతో ఇంద్రియములను వశపఱచుకొనవలసి యుండును. అయైనను ఆసక్తి (రసము) తగ్గుటకు పరమేశ్వరదర్శనము అవసరమగుచున్నయది.

"భిద్యతే హృదయగ్రంధి-శ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి-తస్మిన్ దృష్టే పరావరే"

"పరమాత్మ సాక్షాత్కరించినతఱి-హృదయమునగల సంస్కారములః సంపుటి పటాపంచలగును. శాస్త్రీయ లౌకిక సంశయములన్నియు దూరములగును. ఈ శివధ్యానయోగి యొక్క సుకృత దుష్కృతములన్నియు క్షీణించును" అను శ్రుతిప్రమాణము ఇందుకు తార్కాణము.

శ్లో॥ యతతో హ్యపి కౌంతేయ-పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని-హరంతి ప్రసభం మనః ॥ 60

కౌంతేయా! ఇంద్రియములను వశపఱచుకొనుటకు విజ్ఞానము గల పురుషుఁడు యత్నించుచున్నను అట్టివానినిగూడ ఇంద్రియములు కలవరపెట్టుచు బలాత్కారముగ మనస్సును తమవైపు మఱల్చుకొనును.

వివరణ—స్థితప్రజ్ఞునకు వలయు జ్ఞాననిష్ఠ స్థిరపడుటకు ఇంద్రియనిగ్రహము ముఖ్యకారణమగుననియు, ఇంద్రియముల నరికట్టనిచో ప్రమాదము. అనఁగా? జ్ఞాననిష్ఠాభంగము సంభవించుననియు పై శ్లోకముఁదగు సారాంశము.

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య-యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేంద్రియాణి-తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 61

అందువలన అట్టి ఇంద్రియముల నన్నిటిని నిగ్రహించి మనస్సునుగూడ స్థిరపఱచినవాడై సర్వజీవాంతర్యామియగు పరమేశ్వరుని ధ్యానించుటలో నిష్ఠ గలిగి యుండవలెను. ఇంద్రియములు ఎవనికి స్వాధీనములగునో అట్టివాని జ్ఞాననిష్ఠ బలపడును.

వివరణ—"కిమాసీత?" అను ప్రశ్నకు సమాధానము ఇందు గలదు. ఈ శ్లోకమున "యుక్త ఆసీత మత్పరః" అనుటచే ధ్యానముచే సంభవించు శివానుగ్రహము వలననే దుష్టములైన ఇంద్రియములను నిగ్రహింపఁజాలునని వ్యక్తమగుచున్నది.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః-సంగ స్తేషూపజాయతే ।
సంగా త్సంజాయతే కామః-కామాత్ క్రోధోఽభిజాయతే॥ 62

క్రోధా ద్భవతి సమ్మోహః-సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో-బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ 63

శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయములను పదేపదే తలచుకొను పురుషునకు విషయములయందు ఆసక్తి-కలుగును-ఆసక్తి వలన కోరిక-ఉద్భవించును. కోరిక ఫలింపనిచో కోపము వచ్చును. కోపము వలన సమ్మోహము (ఇది చేయఁదగినది, ఇది చేయఁదగనిది అను వివేకము లేకుండుట) సంభవించును. అవివేక (సమ్మోహ)ము వలన-శాస్త్రము ఆచార్యుఁడు ఉపదేశించిన ప్రబోధమును విస్మరిం(మఱ)చుట యగును. స్మృతి భ్రంశముచే పరమేశ్వరునారాధించుటకై వలయు జ్ఞాననిష్ఠానిశ్చయము-లోపించును. అట్టి బుద్ధి లేనివాడు – జీవించినను–మృతప్రాయుడగును.

వివరణ–ఇంద్రియములను నిగ్రహింపలేకుండుట–ప్రమాదకరమని నిరూపించి ఇంద్రియనిగ్రహమునకు వలయు మనోనిగ్రహము లేనిచో జితేంద్రియత్వము సంభవింపదని పై శ్లోకములందలి సారాంశము.

మృతప్రాయుఁడనఁగా? జనన మరణక్లేశభూయిష్ఠమగు సంసారబంధము సడలనివాడగును.

శ్లో॥ రాగద్వేషవియుక్తై స్తు-విషయా నింద్రియై శ్చరన్ ।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా-ప్రసాద మధిగచ్ఛతి॥ 64

రాగద్వేషములు లేనట్టి మనస్సుచే ప్రేరేపింపఁబడు ఇంద్రియముల వలన శాస్త్రనిషిద్ధములు కానట్టి విషయముల ననుభవించుచున్నను-అట్టి ఇంద్రియములు స్వాధీనములుగ నున్నచో చిత్తశుద్ధిని పొందఁగలుఁగును.

వివరణ-"కథంవ్రజేత" అను ప్రశ్నకు ఇందు సమాధానము కలదు-రాగ ద్వేషములు నిండియుండు మనస్సుతో విషయముల ననుభవించునెడ-చిత్తశుద్ధి లేనివాడై పరమార్థమునుండి భ్రష్టుఁడగును. రాగద్వేషములు లేకుండుటయే చిత్త శుద్ధికి నిదానమగును. జితేంద్రియుఁడై చిత్తశుద్ధి కలిగియుండువాడే స్థితప్రజ్ఞుఁడు కాగలుగునని చెప్పఁబడినందున-ప్రతి ఇంద్రియమునకు రాగద్వేషములు లేకుండఁ జేసి విషయముల ననుభవించుచున్నచో ఇంద్రియములు స్వాధీనములై చిత్తశుద్ధి నొదవఁజేయునని భావము.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం-హాని రస్యోపజాయతే ।
ప్రసన్న చేతసో హ్యాశు-బుద్ధిః పర్యవతిష్ఠతే॥ 65

ప్రసాదమనఁగా? చిత్తశుద్ధి యగును. చిత్తశుద్ధి కలిగినచో-ప్రకృతి సంబంధములగు దుఃఖములన్నియు ఈ శివధ్యానయోగికి-దూరమగును. నిర్మల మైన అంతఃకరణము గల మహాపురుషుని బుద్ధి-చిదచిద్విశిష్టుఁడైన పరమేశ్వరునిఁ జెందినదై సుస్థిరంబగును.

వివరణ-ప్రాకృత దుఃఖవినాశమును కలిగించు చిత్తశుద్ధి గలవానికే శివ ధ్యానము సిద్ధించునని భావము.

శ్లో॥ నాస్తి బుద్ధి రయుక్తస్య-నచాయుక్తస్య భావనా ।
న చాభావయతః శాంతి-రశాంతస్య కుతః సుఖమ్॥ 66

ఇఁట యుక్త శబ్దమునకు-మనోనిగ్రహముగలవాడు, శివజ్ఞానసంపన్నుఁడు అను నర్థములు; భావయన్ అనుదానికి-ధ్యానయోగి యను అర్థము, శాంతి శబ్ద మునకు-సంసారనివృత్తి యను నర్థము చెప్పఁబడుచున్నవి.

చిత్తము (మనస్సు)ను వశపఱచుకొననివానికి పరమేశ్వరు (శివు)నియందు

నిష్ఠ-కలుగదు. శివభక్తి లేనివానికి-నిరంతర శివధ్యానము సిద్ధింపదు. శివధ్యానము లేనివానికి-జననమరణాత్మకమగు సంసార బంధము విడిపోదు. (శాంతి చేకూరదు.) సంసారబంధనివృత్తి లేనివానికి-మోక్షసుఖము ఎక్కడిది ?

వివరణ-మనస్సు నణికట్టి-శివు నారాధించుచు ధ్యానించువానికే జన్మ రాహిత్యము ఒనఁగూరు నని భావము.

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం-యన్మనోఽను విధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం-వాయు ర్నావ మివాంభసి ॥ 67

ఇంద్రియములు-విషయములయందు విచ్చలవిడిగా సంచరించుచుండ నవ్వానిలో ఏ ఇంద్రియమును మనస్సు అనుసరించునో ఆ ఇంద్రియ మొక్కటే మానవుని తెలివిని-పెనుగాలి-నీటిలో నావను ముంచునట్లు-అపహరించును.

వివరణ-ఇంద్రియములకు మనస్సు లొంగినయెడల-పూర్వజన్మార్జితము, ఈ జన్మలో సంపాదించినదియు నగు తెలివి-క్షీణించును. ఒక ఇంద్రియమే మితి మీరి ప్రవర్తించినచో అనర్థము నొదవఁజేయుచుండగా ఇంద్రియములన్నియు మానవుని ఇహపరభ్రష్టుఁజేయునని వేరుగా చెప్పనవసరము లేదు.

శ్లో॥ తస్మా ద్యస్య మహాబాహో-నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య-స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68

పగతుల నోడించు భుజబలము గలవాడా! దుష్టేంద్రియములు ప్రజ్ఞను హరించునవగుటఁజేసి ఏ మానవుడు సమస్త ఇంద్రియములను విషయముల నుండి మఱల్చునో అట్టి మహనీయుని-పరమేశ్వరసంబంధము గల బుద్ధి-సుస్థిరంబగును.

వివరణ-"మహాబాహో" అనుటవలన-భుజబలమే గాక మనోబలము గూడ కలవాడు అర్జునుండని తేటపడుచున్నయది. ముఖ్యముగ చెప్పునదేమనఁగా ? ఇంద్రియమనోనిగ్రహము లేనివాడు-స్థితప్రజ్ఞుఁడు కాజాలడని సారాంశము. ఇందు స్థితప్రజ్ఞుని లక్షణము-బాగుగా నిరూపింపఁబడినది.

శ్లో॥ యా నిశా సర్వభూతానాం-తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని-సా నిశా పశ్యతో మునేః ॥ 69

పరమేశ్వరుఁజెందిన ఏ బుద్ధి- అజ్ఞానులైన ప్రాణులందరికి రాత్రివలె ప్రకాశింపదో, అట్టి బుద్ధియందు స్థితప్రజ్ఞుఁడైన శివధ్యానయోగి-మేలుకొని యుండును. ఇంద్రియ విషయములయందు ఆసక్తి గల ఏ బుద్ధి యందు ప్రాణు లందరు మేలుకొనియుందురో, అట్టి బుద్ధి-జ్ఞానియగు యోగికి రాత్రివలె ప్రకాశము లేనిదగును.

వివరణ-అజ్ఞులైన ప్రాణులు శివధ్యానరహితులగుటచే జ్ఞానాంధులనియు, స్థితప్రజ్ఞుఁడు శివధ్యానరతుఁడగుటచే ఇంద్రియసుఖాంధుఁడనియు వివేకము.

రాత్రి గ్రుడ్డిదగు కాకికి-పగలు ప్రకాశించునట్లు, పగలుగ్రుడ్డిదగు ఉలూక మునకు రాత్రి-వెలుతురుగలదగునట్లును జ్ఞానికి అజ్ఞానికిని తారతమ్యముండునని భావము.

శ్లో॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం-సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్।
తద్వత్ కామా యం ప్రవిశంతి సర్వే-సశాంతి
మాప్నోతి న కామకామీ ॥70

నదీజలముచే నిండునట్టి, వృద్ధిక్షయములు లేనట్టియు నగు సముద్రమున వర్షోదకములు ఏ విధముగ చొఱఁబడునో, అదే విధముగ ఇంద్రియ సుఖభోగ ములు ఏ యోగిలో ప్రవేశించి వికారముఁజెందింపవో అట్టి యోగి-కైవల్య (మోక్ష)ము నొందును. శబ్దాదివిషయభోగలాలసుఁడు మాత్రము ముక్తిని పొందఁ జాలడు.

వివరణ-పూర్వశ్లోకములయందు చెప్పఁబడిన లక్షణములు గల స్థితప్రజ్ఞునకు మోక్షము కరతలామలక మగునని ఇందు విశదీకరింపఁబడినది. విహిత కామ్యముల ననుభవించుచున్నను మనోనిగ్రహము - భోగాసక్తిని తగ్గించి చిత్తశుద్ధిని కలిగించి శివధ్యానయోగస్థిరత నాపాదించియు మోక్షము నొదవఁజేయుననియు; సముద్రమునందు ఉదకములెన్ని కలిసినను హెచ్చు తగ్గులు కానట్లు-కోరికలు లోలోన అణగుచున్నచో కామాసక్తి తగ్గుననియు, శబ్దాదివిషయములయందు గూడ పరమేశ్వరు నవలోకించుట తోడనే శివయోగి-సంతుష్టుఁడగుననియు విదిత మైనది.

శ్లో॥ విహాయ కామాన్ యః సర్వాన్-పుమాం శ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకారః-స శాంతి మధిగచ్ఛతి ॥ 71

ఏ పురుషుఁడు-ప్రాప్తములగు కామ భోగములయందు అత్యాసక్తి లేనివాడై జీవనమును కొనసాగించుచు మమకారము అహంకారము లేకుండునో, అట్టి మహా పురుషుడు మోక్షసామ్రాజ్యమున పట్టభద్రుఁడగును.

వివరణ-"పుత్ర కళత్రక్షేత్రాదులు దేహేంద్రియాదులును నావి" అనునది-మమకారము, పుత్రకళత్రదేహేంద్రియాదులపై అభిమానము ఆహంకారము, ఇట్టి మమకార అహంకారములను దినక్రమముగ తగ్గించుకొనవలసియుండును. మమకార అహంకారములు లేనివాడై జీవించువానికి-సర్వవిధసంసార దుఃఖములు దూరమై నిరతిశయానందప్రాప్తి రూపమైన శివసాయుజ్యము లభించునని భావము

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ-నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి-బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి॥ 72

ఇయ్యది-ఫలాసక్తి లేని కర్మాచరణముతో కూడినట్టి స్థితప్రజ్ఞత్వమనఁబడు శివధ్యాననిష్ఠ యనఁబడును. పార్థా! ఈ స్థితిని పొందినవాడు-మరల సంసారములోనికి-రాజాలడు. ఈ స్థితియందు అంత్యకాలమునందైనను ఉండఁ గలుగువాడు-శివసాయుజ్యరూపమైన నిత్యనిరతిసయ సుఖము ననుభవించును.

వివరణ-మరణించుతఱియైనను పరమేశ్వరునందు చిత్తమును నిలుపు వానికి-మోక్షము-అవశ్యము చేకూరును. ఇట్లీ అధ్యాయమున-ఆత్మ-నిత్యము, నిర్వికారముననియు, స్వధర్మము-పరమేశ్వరుని పొందించుననియు గుర్తింపని అర్జునుని శోకమోహములను స్వధర్మనివృత్తిని గమనించి యవ్వానిని పోగొట్టుటకు-భగవానుఁడు-ఆత్మ-నిత్యత్వ నిర్వికారత్వములు గలిగియుండు యథార్థమును తెలుపునట్టి కర్మయోగసముచ్చితంబునైన స్థితప్రజ్ఞత యనఁబడు జ్ఞాననిష్ఠను ప్రబోధించినవాడు.

ఇతి శ్రీ మహాభారతే, శతసాహస్ర్యాం సంహితాయాం,
వైయాసిక్యాం భీష్మపర్వణి, శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు,

బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
సాంఖ్యయోగో నామ ద్వితీయోఽధ్యాయః

ఇయ్యది – శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీ మద్భగవద్గీతా భాష్యమున "మనో రంజనం"బను శాంకరీయ ఆంధ్రానువాదమున ద్వితీయాధ్యాయము.

* * *

---

శ్రీ శివాద్వైత సిద్ధాంత విశదీకరణము. 2

16వ పేజీ తరువాయి.

శ్లో॥ చతుర్థపురుషం శంభుం–త్రిమూర్తిపర మవ్యయం ।
శివశక్త్యంశసంభూతం-విష్ణుం విద్యా దనామయమ్ ॥

త్రయోదశం హరేరర్ధ–మర్ధనారీ చతుర్దశం ।
వాతూలాగమ సంప్రోక్త-మిత్యాచక్షు ర్వేదాంవరాః ॥ 7

నిర్గుణబ్రహ్మవాదో హి-భక్తిదూరశ్చ దృశ్యతే ।
ముక్తిశ్చాపి పరే లోకే-న స్యాదితి పురావిదః ॥ 8

స్మార్తో వైష్ణవ శైవాదీన్ నిందన్ యమవశంగతః ।
పశ్చాత్తప్తఃక్షమస్వేతి-శమనం ప్రార్థయే ధ్రువమ్ ॥ 9

శివకేశవయో రైక్యం-హరిభక్త్యా ప్రకట్యతే ।
శైవైః సగుణ సాకార-శివతత్త్వం హరేః వరమ్ ॥ 10

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ భగవద్గీత

## తృతీయాధ్యాయము

### "మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాదసహితము

మోక్షముఁగోరువారందరిచే పొందఁదగినవాఁడని వేదాంతములయందు ప్రతిపాదింపఁబడినవాఁడు. సమస్తదోషముల సంబంధము బొత్తుగా లేనివాఁడు, మాంగళ్యగుణములన్నిటికి సముద్రమువంటివాఁడు, నీలకంఠుఁడు నగు పరమేశ్వరుని నాశ్రయించుటకు–ముఖ్య ఉపాయము; ధ్యానశబ్దముచేతను ఉపాసనాశబ్దముచేతను వేదమునందు నిరూపింపఁబడినదియు నగు పరాభక్తిని నిర్వచించుటకై–మొదటి సాధనమైన, జీవాత్మయొక్క యథార్థ రూపముఁదగు దర్శనమును ద్వితీయాధ్యాయమునందు నిరూపించి అద్దాని వెనువెంటనే స్థితప్రజ్ఞత్వమనఁబఁగునట్టి శివధ్యాననిష్ఠకు ఉపయోగించు చిత్తశుద్ధిని కలిగించు అసంగకర్మానుష్ఠానమును విశదీకరింపనైనది.

ఇంతియే గాక ద్వితీయాధ్యాయమునందు "ఏషాతేఽభిహితా సాంఖ్యే–బుద్ధిర్యోగే త్విమాం శ్రుణు । బుద్ధ్యా యుక్తో యయా పార్థ–కర్మబంధం ప్రహాస్యసి" అని భగవానుఁడు–కర్మజ్ఞానముల సముచ్చయము ననుష్ఠింపవలసినదిగా నుపదేశించెను. అట్టి భగవదభిప్రాయమును తెలిసికొనలేక "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిః" అని జ్ఞానయోగమును మొదట నుపదేశించి "ఏషా బ్రాహ్మీ స్థితిః" అని జ్ఞానయోగమును విరమించినందున–కర్మయోగమునకంటె జ్ఞానయోగము శ్రేష్ఠమనుటయే–భగవానుని యభిమతము కావచ్చునని భావించి యర్జునుఁడు–శ్రేష్ఠమైన జ్ఞానయోగము ననుష్ఠింపుమని–చెప్పక–"యోగస్థః కురు కర్మాణి" అని–కనిష్ఠమైన కర్మయోగము నాచరింప నుద్యుక్తునెందుకు చేయుచున్నాఁడని మనన్సు వ్యాకులపడుటచే దిగువవిధము ప్రశ్నించుచున్నవాఁడు.

అర్జున ఉవాచ—

శ్లో॥ జ్యాయసీ చేత్ కర్మణ స్తే-మతా బుద్ధి ర్జనార్దన ।
తత్ కిం కర్మణి ఘోరే మాం-నియోజయసి కేశవ ! ॥ 1

వ్యామిశ్రేణైవ వాక్యేన-బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య—యేన శ్రేయోఽహ మాప్నుయామ్॥ 2

లక్ష్మీపతి వగుటఁజేసి భోగములఁగోరు భక్తులచే ప్రార్థింపఁబడు జనార్దనా! కర్మయోగముకన్న జ్ఞానయోగము శ్రేష్ఠమని నీ యభిమతమైనచో—భయంకరము హింసాత్మకము నగు యుద్ధకర్మ నాచరించుమని నన్నేందుకు నియమించు చున్నావు? స్పష్టార్థములేనిదానిఁ బోలిన మాటతో నా బుద్ధికి భ్రాంతిని కల్పించు చున్నట్లు తోచెడిని. ఏద్దానితో శ్రేయస్సు నొందుదునో అట్టి కర్మయోగమును గాని జ్ఞానయోగమును గాని నిశ్చయించి తెలుపుము!

వివరణ—

ప్ర. ద్వితీయాధ్యాయమున-కర్మను జ్ఞానమును నీవే యవలంబింపుమని భగవానుఁడు చెప్పినయెడల—ఏదే నొక దానిని వక్కాణింపుమని అర్జునుఁడు ప్రశ్నించుట పొసగదు గదా!

ఉత్త. భగవానుని యభిప్రాయమును గుర్తింపకయే అర్జునుఁడు ప్రశ్నింప వలసి వచ్చెను.

ప్ర. అర్జునుఁడు-ఆవివేకముతో ప్రశ్నించుతటి—భగవానుఁడు-జ్ఞానకర్మలు-వేరువేరు పురుషులచే అనుష్ఠింపఁదగినవి అని సమాధానము నొసఁగుట-సమంజస మగునా?

ఉత్త. జ్ఞానము కర్మ—భిన్న పురుషులు ఆచరింపఁదగినవని భగవానుఁడు ఎచ్చోటను నిర్దేశింపలేదు.

ప్ర. జ్ఞాన కర్మల రెంటి నొకే పురుషుఁడు ఆచరింపవలె నని భగవదభిమత మైనచో "కురుకర్మైవ తస్మాత్త్వం" అని అర్జునునకు జ్ఞాననిష్ఠ సిద్ధింపదను ప్రవచనము-ఉపయుక్తము కాదు గదా?

ఉత్తరము "కురు కర్మైవ" అనుచో గల ఏవకారముతో—కర్మసన్న్యాసము నివారింపఁదగినదని భగవానుఁడు కంఠోక్తిగ సుడుపుటఁజేసి—అర్జునునకు జ్ఞాననిష్ఠ కుదురదని—చెప్పలేదని-విదితమగుచున్నయది.

ప్ర. జ్ఞాననిష్ఠార్హత—కౌంతేయునకు కలదని భగవానుఁడు భావించినచో "కర్మణ్యేవాధికారస్తే" పార్థుని గురించి జ్ఞాననిష్ఠ— సంభవింపదని చెప్పుట—పొసఁగదు గదా!

ఉ. ఇఁటగల ఏవకారముతో-మా ఫలేషు కదాచన" అని కర్మఫలాపేక్షను భగవానుఁడు—కంఠరవమున నిరాకరించుటఁజేసి – "అర్జునునకు జ్ఞాననిష్ఠార్హత లేద"ను పరుల వివరణము—మూలవిరుద్ధమగుటయే గాక తమ సిద్ధాంతమును పోషించునదగుటచే-విమర్శదృక్పథము లేనట్టి తమ శిష్యులను మాత్రము సంతోషింపఁజేయునదగుచున్నయది.

ఒకవేళ-పార్థునకు జ్ఞాననిష్ఠయందు అధికారములేదని భగవానుఁడు భావించినాడని పరులు చెప్పునది యథార్థమైనచో—సప్తమాధ్యాయమున "జ్ఞానం తేఽహం స విజ్ఞాన-మిదం వక్ష్యామ్యశేషతః" "చిదచిద్విజ్ఞానముతో కూడిన పరమేశ్వరజ్ఞానమును సంపూర్ణముగ నుపదేశించెదను" అనుచో పార్థునకు జ్ఞానోపదేశము నొనర్చుట—సార్థకము కాకుండును.

ప్ర. గృహస్థులు—శ్రౌతస్మార్తకర్మను విడనాడి కేవలము జ్ఞానము నవలంబించుట నిట గీతాచార్యుఁడు నిషేధించెననుట సమంజసము కాదా!

ఉత్త. "విద్యాంచావిద్యాం" "యజ్ఞేన దానేన" ఇత్యాది శ్రుతివాక్యముల. చేతను, "సర్వాపేక్షా చ యజ్ఞాది శ్రుతే రశ్వవత్" "విహితత్వాచ్చాశ్రమకర్మాపి" ఇత్యాది సూత్రములచేతను అన్ని ఆశ్రమముల వారికి—స్వస్వకర్మలు జ్ఞాన సముచ్చితములుగ ఆచరింపఁదగినవని వేదాచార్యుఁడు నిర్ధారించుటఁజేసి—కర్మ నిషేధము శ్రుతి సూత్ర విరుద్ధంబగుచున్నయది.

ప్ర. "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకేన" ఇత్యాది శ్రుతిని కర్మత్యాగ రూపమైన సన్న్యాసము నిరూపింపఁబడినది గదా! దీనికేమందురు?

ఉత్త. "సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః, అనుచో—త్యాగము కర్మఫలత్యాగ రూపమైనదని నిశ్చయించి కర్మత్యాగమును భగవానుఁడు నిరాకరించెను.

అందువలన భగవదభిమతమును పార్థుఁడు గుర్తింపనివాడై "జ్యాయసీచేత్" ఇత్యాదిని ప్రశ్నింపవలసివచ్చెను. ఇంతియే గాక "నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే, మోహాత్తస్య పరిత్యాగ-స్తామసః పరికీర్తితః" అనుచో భగవానుఁడు-కర్మ త్యాగమును కంఠోక్తిగా నిరాకరించి ఫలత్యాగమునే సిద్ధాంతీకరించెను.

శ్రీ భగవా నువాచ —

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా-పురా ప్రోక్తా మయాఽనఘ ! ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం-కర్మయోగేన యోగినామ్॥ 3

అనఘా !

నానా విధములైన మార్గములచే నిండియుండు నీ వాఙ్మయ ప్రపంచమున నేను సృష్ట్యాదిని-రెండు విధములు గల నిష్ఠను వక్కాణించితిని. కేవల జ్ఞాననిష్ఠ గలవారికి నభిమతమగు జ్ఞాన (ఉపాసన) విధానమును, కేవలము కర్మయందే నిష్ఠ గలవారికి నభీష్టమగు కర్మయోగమును నిరూపించితిని.

వివరణ—నేను చెప్పినదానిని బాగుగా గ్రహింపకుంటివి గాన మరల విశదీకరించుచున్నానని శ్రీ కృష్ణుఁడు—పై శ్లోకమునుండి-కర్మజ్ఞానములచే రెండు విధములగునట్టి ఒకే నిష్ఠ నుపదేశించెను.

సాంఖ్యులనఁగా? కేవల జ్ఞాననిష్ఠ గలవారు.

యోగులనఁగా ? కేవల కర్మనిష్ఠ గలవారు.

కేవలము జ్ఞాననిష్ఠచే గాని, కేవలము కర్మనిష్ఠచే గాని మోక్షములభింపదు గాన కర్మసముచ్చితమైన జ్ఞాననిష్ఠచే ముక్తులు కావలె ననుట-భగవదభిమతమై యున్నది.

పరమేశ్వరారాధన రూపమగు కర్మయోగము వలన జ్ఞాననిష్ఠను భంగపఱచునట్టి దురితములను పోగొట్టుకొని శివధ్యాననిష్ఠామహిమచే అమృతుఁడవు కమ్మని భగవత్త్వబోధమందలి సారాంశము.

ప్రశ్న : కర్మజ్ఞాన యోగముల నొకే వ్యక్తి-ఆచరింప వలనుపడదు గాన

"వేరు వేరు పురుషులచే ఆచరింపదగినవి కర్మజ్ఞాన యోగములు" అని చెప్పుట సమంజసము కాదా!

ఉత్తరము : అట్లైనచో భగవానుఁడు రెండు నిష్ఠలఁజెప్పితినని వ్రాక్కుచ్చుచుండెను. అట్లు గాక – రెండువిధములగు ఒకే నిష్ఠ అని వక్కాణించెను గాన కర్మజ్ఞానములు–ఒకే వ్యక్తిచేత ఆచరింపఁదగినవని తేటపడుచున్నయది. ఒకవేళ అతికష్టముగా నిఁట రెండు నిష్ఠలు–భిన్నపురుషానుష్ఠేయములని సమర్థించునెడ–పూర్వోక్తరీతిని శ్రుతి సూత్రవిరోధము అనివార్యంబగును. అట్టి విరోధ దోషమును భగవానుని శిరస్సుపై పెట్టినవారమగుదుము.

కర్మయోగము–పరమేశ్వరారాధనరూపమగునది యెట్లనఁగా ?

"యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర–లోకోఽయం కర్మబంధనః, తదర్థం కర్మ కౌంతేయ–ముక్తసంగః సమాచర!" "పరమేశ్వరుని కొఱకైన కర్మకంటె–వేరైన కర్మ-సంసారమున బంధించును. అందువలన కౌంతేయా ? ఫలాసక్తిని విడనాడి పరమేశ్వరప్రీత్యర్థము కర్మనాచరింపుము!" అని భగవానుఁడు బోధించుటచే అసంగకర్మయోగము–పరమేశ్వరుని అనుగ్రహమును సాధించుననియు; జ్ఞాననిష్ఠ నడ్డగించు పాపములు లేనిచో జ్ఞానము (ధ్యానము) సిద్ధించుననియు; విదితమైనది.

"అవిద్యయా మృత్యుం తీర్త్వా–విద్యయాఽమృత మశ్నుతే" అను శ్రుతి వాక్యము ఇందుకు తార్కాణము.

వ్యాససూత్రములు జైమిని సూత్రములు నొకే శాస్త్రమని శ్రీ నీలకంఠ భగవత్పాదులు నిరూపించిన యంశము ఇఁట గమనార్హమగుచున్నయది.

"ధర్మేణ పాప మపనుదతి" "నిష్కామకర్మచే పాపము నశించును" అను శ్రుతివాక్యంబు ప్రోద్బలక మగునది.

శ్లో॥ న కర్మణా మనారంభా-న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ-సిద్ధిం సమధిగచ్ఛతి ॥ 4

శాస్త్రమునందు చెప్పఁబడిన నిత్యనైమిత్తిక కర్మలను ఆచరింపనంత

మాత్రమున-పురుషుఁడు-జ్ఞాననిష్ఠను పొందఁజాలడు. జీవితమున ప్రారంభించిన కర్మను విడిచినచో ముక్తి నొందలేడు.

వివరణ – "ధర్మం చర! సత్యం వద!" ఇత్యాది సూక్తులతో విధింపఁబడిన సంధ్యావందనాది నిత్యకర్మలను శ్రాద్ధాది నైమిత్తిక కర్మలను చేయనని భీష్మించినచో జ్ఞాన (ధ్యాన) నిష్ఠ-సంభవింపదు. లేదా! కొంతవరకు కర్మల నాచరించి పరిత్యజించినను మోక్షప్రాప్తి కాజాలదు. నిష్కామ కర్మాచరణముతో పాపపంకిలమంతయు దూరమగుటచే చిత్తశుద్ధి గలవారికే శివధ్యానయోగము సిద్ధించును గాని-కర్మల నాచరింపనివారికి, ఆచరించి పరిత్యజించువారికిని చిత్తశుద్ధిద్వారా శివజ్ఞాననిష్ఠ సంభవింపదనియు, ముముక్షువులందరిచే నిష్కామకర్మ-ఆచరింపఁ దగినదనియు, ఆట్టివారికే ఈశ్వర సాక్షాత్కార మగుననియు భగవదాకూతము.

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి-జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ-సర్వః ప్రకృతిజై ర్గుణైః ॥ 5

ఎవఁడైనను ఎప్పుడును కర్మలఁజేయక నుండలేడు. ప్రతివాడును మూలప్రకృతి సంభవములగు సత్త్వరజస్తమో గుణములకు అధీనుఁడై ఏదే నొక కర్మను చేయుచునే యుండును.

వివరణ – ప్రతివ్యక్తియు తన వర్ణాశ్రమములకు సరిపడు కర్మను చేయవలసి వచ్చును. సత్త్వగుణ సంబంధముగా కొందరు, రజోగుణ సంబంధముగా మరికొందరు, తమోగుణ సంబంధముగా తదితరులు-కర్మలఁజేయుట-అనివార్యంబగును. ఒకవేళ మొండితనముతో విహితకర్మలఁజేయనిచో-అంతఃకరణము-నిర్మలము కాదు. చిత్తమున రాగద్వేషాది మాలిన్యము నెలకొనినయెడల-జ్ఞానయోగము సిద్ధింపమి-కర్మయోగపరిత్యాగము వలన ఉభయ భ్రష్టత్వము దాపురించును. జ్ఞానపరిపూర్ణత లేనిది శివధ్యానము సిద్ధింపదు గాన నీశ్వర సాక్షాత్కారంబు సంభవింపదని సారాంశము.

ఒకవేళ వైదికకర్మలను విడనాడినను శరీరపోషణాది లౌకిక కర్మలను పరిత్యజించుట-సాధ్యపడదు గాన సర్వకర్మ సన్న్యాసము సంభవింపదని-పై శ్లోకముఁదగు తాత్పర్యము.

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య-య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా-మిథ్యాచారః స ఉచ్యతే ॥ 6

ఎవఁడు-వాక్కు మొదలగు ఇంద్రియముల నరికట్టి-ఇంద్రియవిషయములను మనస్సులో చింతించునో, అట్టివాడు-కర్మసన్న్యాసముఁదగు పరిజ్ఞానము లేనివాడగుటచే-కపటప్రవర్తముఁడని గుర్తింపఁబడును

వివరణ - దురితములు నశింపమి - చిత్తశుద్ధి లేనివాడై పరమేశ్వరుని ధ్యానింప సర్థుఁడు కానందున-జ్ఞానయోగమునందు అధికారము లేనివాడగుననియు ఇంద్రియములను నిగ్రహించినను విషయముల నతికట్టలేనిచో చిత్తశుద్ధి కలుగదనియు, నిష్కామకర్మయోగమున పాపనివృత్తి ద్వారా చిత్తము శుద్ధమై శివ ధ్యానాత్మకమగు జ్ఞానయోగము సిద్ధించును గాన భవ బంధ వినిర్ముక్తుండగుననియు సారాంశము.

కేవలకర్మసన్న్యాసి-మిథ్యాచారుఁడనఁబడును గదా!

శ్లో॥ యస్త్వింద్రియాణి మనసా-నియమ్యారభతేఽర్జున!
కర్మేంద్రియైః కర్మయోగ-మసక్తః స విశిష్యతే ॥ 7

అర్జునా! ఏ పురుషుఁడు-కర్మఫలములయందు ఆసక్తిని విడిచి-ఇంద్రియములు-నిషిద్ధవిషయములవైపునకు పోకుండునట్లు-మనస్సుచే నియమించి-విహిత కర్మలకు అభిముఖములగు వాగాది ఇంద్రియములతో-పరమేశ్వరారాధన బుద్ధిని కర్మయోగము నాచరించునో-అట్టివాడు-గొప్పవాడగును.

వివరణ - పరస్త్రీవాంఛ, దుష్టాహారపానీయ సేవనము, కఠిన సంభాషణము మొదలగు నిషిద్ధ విషయములనుండి ఇంద్రియములను మనోనిగ్రహముతో మఱల్చి-యజ్ఞదాన తపఃపూజాది సత్కర్మల నాచరించువానికి చిత్తశుద్ధి కలుగుననియు, నిర్మలాంతఃకరణుఁడే జ్ఞానయోగాధికారి యగుననియు భావము.

శ్లో॥ నియతం కురు కర్మ త్వం-కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తే-న ప్రసిద్ధ్యే దకర్మణః ॥ 8

నీవు-సంధ్యావందనాది నిత్యకర్మ నవశ్య మనుష్ఠింపుము! ఆకర్మ కేవల

జ్ఞాననిష్ఠ) కంటె-కర్మయోగము శ్రేయస్కరమైనది. కర్మత్యాగ పూర్వకముగ కేవలము జ్ఞాననిష్ఠ నవలంబించిన నీకు శరీరపోషణము గూడ నెరవేరదు.

వివరణ – "కర్మనంతటిని విసర్జించి జ్ఞానయోగమునే అవలంబింపగలను. కర్మయోగము నాకెందుకు ?" అని అర్జునుఁడు ప్రశ్నించినట్లు భావించి భగవానుఁడు–పై శ్లోకముఁదగు ఉత్తరార్ధమున సమాధానముఁజెప్పెను. "నకర్మణా మనారంభాత్–నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే" అనుచో-నైష్కర్మ్య శబ్దమునకు జ్ఞానయోగమను నర్థము చెప్పఁబడినందున నిట–అకర్మశబ్దమునకు గూడ- సర్వ కర్మ సన్న్యాస పూర్వకమగు జ్ఞానయోగమను నర్థమునే చెప్పవలెను.

కేవలజ్ఞానికి గూడ శరీరస్థితి – ఆవశ్యకమగుటచే – శరీరపోషణమునకు వలయు లౌకికకర్మ నాచరించుచు శ్రౌతస్మార్తకర్మను మాత్రము పరిత్యజించుట విహితము కానందున-కర్మత్యాగ పూర్వకమగు జ్ఞానయోగమునకంటె నిష్కామ్య నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానము శ్రేష్ఠమైనదని భావము. శరీరపోషణముగూడ– న్యాయార్జిత ధనముతో పంచమహాయజ్ఞముల నొనర్చుచు-యజ్ఞశేషమగు ఆహారము వలన–నెరవేర్పఁదగినదగుటఁజేసి యుద్ధరూపమైన స్వధర్మమును విడనాడినచో రాజ్యము లభింపమి శరీరధారణము గూడ సంభవింపదు గాన నిష్కామ కర్మయోగమునందు జ్ఞానయోగము చేరుటచే కేవల జ్ఞానయోగమునకన్న–జ్ఞాన సహిత కర్మయోగము ప్రశస్తతరమైనదని సారాంశము.

శ్లో॥ యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర-లోకోఽయం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ !-ముక్తసంగః సమాచర ॥ 9

"ఆ వో రాజాన మధ్వరస్య రుద్రమ్" అను శ్రుతి ననుసరించి- పరమేశ్వరుఁడు – యజ్ఞమున కధిపతియనియు, యజ్ఞము శివారాధన రూపమైనదనియు తెలియుచుండుటచే- యజ్ఞార్థాత్ అనగా ? పరమేశ్వరుని ఆరాధనమునకై ఉపయోగించునట్టి కర్మను విడిచి ఇతర కామ్యకర్మల నాచరించునెడల–ఈ వైదికమానవ లోకము– కర్మచే బంధింపఁబడును. అందువలన కౌంతేయా ! నిష్కాముఁడవై పరమేశ్వర ప్రీత్యర్థము కర్మను బాగుగా ఆచరింపుము !

వివరణ –"కర్మణా బధ్యతే జంతుః" "ప్రాణిమాత్రుఁడు కర్మచే సంసారమున బంధింపఁబడును." "ఇత్యాది ప్రమాణములఁబట్టి - కర్మ బంధహేతువని"

విదితమగుచున్నందున— ముముక్షువునకు కర్మ యవసరము లేదు" అను ఆశంకకు పై శ్లోకము సమాధానమగుచున్నయది. కర్మ—ఈశ్వరారాధనరూపమైనచో బంధమోచకంబగునని భావము.

శ్లో॥ సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా-పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ-మేష వోఽ స్త్విష్టకామధుక్ ॥ 10

"పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివం" ఇత్యాదిశ్రుతి ననుసరించి ప్రజాపతి యనఁబఱఁగు పరమేశ్వరుడు— ప్రజలను జీవింపఁజేయునట్టి యజ్ఞముతో గూడ ప్రజలను పుట్టించి— సృష్ట్యాదిని "ఈ యజ్ఞముతో అభ్యుదయమును సాధించుడు ! ఈ యజ్ఞము — మీకు మోక్షమును భోగమునుగూడ నొసఁగును" అని వచించెను.

వివరణ :— ప్రజలనఁగా ? సంసారపాశబద్ధులైన జీవాత్మలు—పశువులనఁబడుదురు. అట్టి ప్రజలకు ప్రభువైన పరమేశ్వరుఁడు- పశుపతి యనఁబఱఁగును. సృష్టియనఁగా ? నామరూపములను విభజింపరాని స్థితినుండి—నామరూప విభాగమునకు అనువైన స్థితిలోనికి జీవాత్మల నాకర్షించుట యగును. "మా కర్మఫలహేతుర్భూః" అని గీతాశాస్త్రము కామ్యకర్మలను నిషేధించుటచే- స్వధర్మమగు నిత్యనైమిత్తిక కర్మయజ్ఞము కామ్యభోగముల నిచ్చునని చెప్పుట యెట్లు పొసఁగుననఁగా ?

"తద్యథాంమ్రే ఫలార్థే నిహితే ఛాయాగంధా వనూత్పద్యేతే, ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యంతే, న ధర్మహానిర్భవతి"

"ఫలమునకై ఆమ్రవృక్షమును పెంచినచో — చెట్టునీడ పరిమళము ఎట్లు అనుకోకుండ లభించునో, అదేవిధము నిష్కామనయా స్వధర్మము నాచరించుచున్నయెడల- శరీరకుటుంబ పోషణమునకు వలయు కామ్యములు సహజములుగ సిద్ధించును" అని ఆపస్తంబమహర్షి— నిత్యకర్మలు— మోక్షప్రదములగుటయే గాక భోగప్రదములగునని నిర్వచించుటచే కర్మఫలము సమకూరినను అద్దాని నపేక్షింపనిచో నిత్యకర్మమగుననియు, అపేక్షించినచో కామ్యకర్మ మగుననియు, కామ్య నిత్యకర్మలకు ఇంతటి భేదము కలదనియు; నిత్యకర్మవలన అనుషంగికఫలము లభించినను నిత్యకర్మ— శాశ్వతమై హాని లేనిదగుననియు, స్వధర్మము— పరమే

శ్వరాజ్ఞారూప మగుటచే, భుక్తి ముక్తి సాధకమగుటఁజేసియు పరిత్యజింపఁదగి నది కాదనియు సారాంశము.

శ్లో॥ దేవాన్ భావయతానేన - తే దేవా భావయంతు వః।
పరస్పరం భావయంతః - శ్రేయః పర మవాప్స్యథ ॥ 11

స్వధర్మరూపమైన కర్మయజ్ఞముతో ఇంద్రాదిదేవతల నారాధింపుడు ! ఆ దేవతలు మిమ్ము అన్నపానాదులచే పోషింతురు గాక ! ఇవ్విధము ఒండొరులను పోషించుచున్నవారై భుక్తి ముక్తులను పొందుఁడు !

వివరణ :— ఇంద్రాదిదేవతలు - పరమేశ్వరుని భృత్యులగుటచే - నిత్య నైమిత్తిక కర్మయజ్ఞమున నవ్వారి నారాధించుట— విహిత మగుచున్నయది. శివుని కంటె నితరులైన దేవతల నారాధించుట-శివానన్యభక్తికి భంగము గదా యనినచో- రాజుగారి అనతికి లోబడి రాజకుమారులను మంత్రివర్యాదులను సేవించుట— రాజ సేవను భంగపరుపనట్లు — శివాజ్ఞారూపములగు వేదములచే విధింపఁబడిన ఇంద్ర చంద్రాద్యమరుల నారాధించుట— శివాపచారమును కలుగఁజేయునది కాదు.

"శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వ మన్యత్ పరిత్యజ్య"

"శివునికంటె నితరమైన దేవమానవాదికమును పరిత్యజించి— శివునొకనినే ధ్యానింపవలెను" అను శ్రుతియందు చెప్పఁబడిన అనన్య శివభక్తి— శివపరివార దేవతలను నిష్కామకర్మయోగమున కొలిచినంతమాత్రమున - భంగపడదని సారాంశము.

శ్లో॥ ఇష్టాన్ భోగాన్ హి వో దేవా-దాస్యంతే యజ్ఞభావితాః।
తైర్దత్తా నప్రదాయైభ్యో - యో భుంక్తే స్తేన ఏవ సః ॥ 12

కర్మయజ్ఞముచే ఆరాధింపఁబడు దేవతలు—మీకు కావలసిన పశు అన్నాది భోగముల నొసఁగుదురు. అట్టి దేవతలచే నీయఁబడిన పశుధాన్యధనాదుల నవ్వారికి సమర్పింపక- భుజించువాడు- చోరుఁడనియే (దొంగగా) గుర్తింపఁబడును.

వివరణ :— తా ననుభవించు ఆహారమును గాని యజ్ఞములలో హవ్యాదులను గాని ఆ యా అధిష్ఠాతృదేవతలకు సమర్పింపనివాడు — దేవస్వము నపహరించిన వాడగునని సారాంశము.

దేవతా ఋణమును తీర్పక- స్వాత్మపోషణార్థము ధన ధాన్యాదికము నుపయోగించుట- నరకహేతువగునని గూడా గుర్తింపవలెను.

శ్లో॥ యజ్ఞశిష్టాశినః సంతో-ముచ్యంతే సర్వకిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపా-యే పచంత్యాత్మకారణాత్ ॥ 13

వైశ్వదేవాది యజ్ఞములలో శివనివేదనపూర్వకముగ మిగిలిన ఆహారము నమృతముగా భుజించువారై - పరమేశ్వర భక్తికి ఆటంకములైన పూరాకృతపాపముల నన్నిటినుండి విడిబడఁగలుఁగుదురు ఎవరైతే కేవలము తమ పొట్టనింపుకొనుటకు వండుకొనెదరో, అట్టి పాపాత్ములు పాపమునే భక్షించువారగుదురు.

వివరణ— శివభక్తి పెంపొందుటకు ప్రతిదినము స్నానసంధ్యాజపపూజనాదులనే గాక వైశ్వదేవము నాచరించి శివనివేదితమును మహాప్రసాదముగా అమృతతుల్యముగా ననుభవించువారు- చిత్తశుద్ధి గలవారై శివానుగ్రహపాత్రులగుదురని భావము.

శ్లో॥ అన్నాద్భవంతి భూతాని-పర్జన్యా దన్నసంభవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో-యజ్ఞః కర్మసముద్భవః ॥ 14

రేతోరూపముగ పరిణమించు ఆహారమువలన ప్రాణులు పుట్టుచుండునవి. మేఘము వర్షించుటచే ధాన్యములుదయించును. వైశ్వదేవాది యజ్ఞము వలన మేఘము వర్షించును. స్వధర్మాచరణరూపమైన యజ్ఞము కర్మమూలమగునది.

వివరణ— పరమేశ్వరుని ఆనతియే గాక జగచ్చక్రమును ప్రవర్తింపఁజేయునది- స్వధర్మానుష్ఠానమని తెలియవలెను.

అగ్నియందు విధివిధానముగ సమర్పింపఁబడిన ఆహుతి - సూర్యుని చెందును. సూర్యునివలన వర్షము, వర్షమువలన అన్నము, అన్నమువలన ప్రజలు ఉద్భవింతురని మనువు చెప్పిన యంశము- ఇఁట ప్రోద్బలకమగుచున్నయది.

శ్లో॥ కర్మ బహ్మోద్భవం విద్ధి-బ్రహ్మాక్షర సముద్భవం ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ-నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ 15

"యజ్ఞాది రూపమగు పుణ్యకర్మము—వేదమునందు ప్రతిపాదింపఁబడునది,

వేదము-పరమేశ్వరునివలన నావిర్భవించునది. వేదము ఈశ్వరకృతి యగుటఁజేసి-జీవాత్మలందరి యంతరాత్మ యగు పరమేశ్వరుఁడు-యజ్ఞాది రూపమైన కర్మ యందు ఎల్లకాలము నెలకొనియుండును.

వివరణ-అక్షరమనఁగా-'తదక్షరం" "శివఏవ కేవలః" "తత్సవితుర్వరేణ్యం" ఇత్యాది శ్రుతి వాక్యముల ననుసరించి-పరమేశ్వరుఁడేనని చెప్పనగును.

"అస్య మహతో భూతస్య నిఃశ్వసితం, యదృగ్వేదో, యజుర్వేదః" ఇత్యాతి శ్రుతివలన-వేదము-పరమేశ్వరుని నిట్టూర్పునుండి బయటపడినదై ఈశ్వరకృతంబగునని విశదమగుచున్నయది. యజ్ఞాది కర్మకాండ యంతయు వేదమునందు ప్రతిపాదింపఁబడుటచే యజ్ఞాది పుణ్యకర్మయందు పరమేశ్వరుఁడు నిలచియుండునని తెలియవలెను.

జీవాత్మలలో వేదాంతశ్రవణాధికారము గలవారికి-పరమేశ్వరుఁడు సన్నిహితుఁడై యుండువాడు. "ఆ వో రాజాన మధ్వరస్య రుద్రం" అను శ్రుతి వాక్యము- పరమేశ్వరుఁడు యజ్ఞాధిపతియై యజ్ఞాది పుణ్య కర్మ ఫలితము నొసఁగుటకై-యజ్ఞము నధిష్ఠించియుండు నని తెలుపుచున్నయది. "సర్వవ్యాపీ చ భగవాన్-తస్మా త్సర్వగతః శివః" అను శ్రుతియు పై యంశమును బలపఱచునది.

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం-నానువర్తయతీహ యః।
అఘాయు రింద్రియారామో-మోఘం పార్థ! స జీవతి॥ 16

పార్థా!

పై చెప్పిన విధముగా "పరమేశ్వరు నుండి వేదావిర్భావము, వేదము నుండి కర్మ విజ్ఞానము, కర్మానుష్ఠానమువలన మేఘములు కురిపించు జలధారలు; ఉదకము వలన నేలపై సస్యములు ఫలించుట; అన్నము వలన ప్రాణులు ఉదయించుట'' అను పరమేశ్వర ప్రవర్తితంబైన చక్రమువలె నుండు జగద్విధానమును ఎవఁడు అనుసరింపడో-అట్టివాడు-పాపఫలానుభవనిదానము ప్రయోజన రహితంబు నగు జీవనము గలవాడగును.

వివరణ-యజ్ఞాది పుణ్యకర్మల నాచరించువాడు-సృష్టిక్రమమునకు ఉపకరించువాడు కాగా-యథాశక్తి గూడా సుకృతములఁజేయనివాడు-వ్యర్థజీవియగు

చున్నవాడు. ఇంద్రియసుఖములయందే రమించుచు పరమేశ్వరుని శాసనము నుల్లంఘించి-తన బ్రతుకు-బరువు నొనర్చుకొనును. చక్రములోని అవయవములు ఒకదానికి మరియొకటి-కారణమైనట్లు వేదము, కర్మ, వర్షము, అన్నము, సృష్టి యనునవి-కారణములు కార్యములు నగును గాన-సృష్టిసాధన సమూహము-చక్రముఁబోలియుండునని భావము.

శ్లో॥ యస్త్వాత్మరతి రేవ స్యా-దాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్ట-స్తస్య కార్యం న విద్యతే ॥ 17

పూర్వజన్మయందు చేయఁబడిన నిష్కామకర్మచే చిత్తశుద్ధి గలవాడై పరమేశ్వరునియందు ఆసక్తి గలిగి-పరమేశ్వరునికంటె వేరైన జీవప్రకృతుల రెంటి యందు మమకారమును విడనాడి-పరమేశ్వరు నుపాసించుటయందే సంతృప్తిఁ జెందుచు-పరమేశ్వరుని సాక్షాత్కరింపఁజేసికొని ఆనందము ననుభవించు శివ యోగికి-సంధ్యావందనాది నిత్యకర్మలు దక్క-ఇతరములైన యజ్ఞాదులతో నవసరము లేదు.

వివరణ - శివధ్యానామృతముఁగ్రోలు శివయోగిపుంగవునకు-శివదర్శనా నందానుభవము సిద్ధించుటచే-యజ్ఞాదికర్మలఁ జేయుటకు అవకాశములేమి-ఆత నికి కర్మ-కర్తవ్యమను వేదవిధి- వర్తింపదు. షట్కాలములయందు శివు నారా ధించు మహానుభావునకు- చిత్తశుద్ధి- ఈ వరకే సంభవించినది గాన- చిత్తశుద్ధిని సంపాదించు కర్మ- ఆవశ్యకము కాదని భావము.

ఇఁట కర్మజ్ఞానసముచ్చయము- భంగపడలేదు. కర్మాచరణము, చిత్తశుద్ధి, శివజ్ఞానము అనునవి జీవగతములు, సూక్ష్మశరీరగతంబులు నగుటచే పూర్వాపర జన్మల ననుసరించి- జ్ఞానమునకు కర్మసాహిత్యము సిద్ధించునని తెలియవలెను.

శ్లో॥ నైవ తస్యకృతేనార్థో-నాకృతేనేహ కశ్చన ।
నచాస్య సర్వభూతేషు-కశ్చి దర్థవ్యపాశ్రయః ॥ 17

శివనిష్ఠా గరిష్ఠునకు-కర్మానుష్ఠానముతో-మోక్షప్రాప్తి రూపమైన ప్రయో జనముండదు. కర్మను ఆచరింపనియెడల-బ్రహ్మ మొదలుకొని గడ్డిపఱకవరకు గల ప్రాణులందరిచే నిందింపఁబడుట లేక ప్రాయశ్చిత్తరూపమైన అనర్థంబు నుండదు.

వివరణ-పూర్వజన్మ సుకృత జన్యమగు చిత్తశుద్ధిని శివనిష్ఠాగరిష్ఠుడు కలిగియుండుటచేసి-కర్మప్రయుక్త విధినిషేధములు ఆతనికి వర్తింపవని భావము.

ఇట ఉపాసనాత్మక జ్ఞానమునకు -కర్మసాహిత్యమవసరము లేదని శ్రీకృష్ణభగవానుడు-కంఠరవేణ చెప్పినాదని ఇతరులు కేవలజ్ఞానము మోక్ష సాధనమని తమ వ్యాఖ్యానములందు నిరూపించిరి కాని- "విద్యాంచావిద్యాంచ యస్తద్వేదోఽభయగ్ం సహ" అను శ్రుతి ననుసరించి కర్మజ్ఞానముల రెంటి నొకే కాలమున నొకే వ్యక్తి ఆచరింపవలెనని తెలియుటచే-జన్మాంతరార్జిత సుకృతము-జ్ఞానాంగమగునని నిర్ధారింపవలసి వచ్చినది.

శ్లో॥ తస్మా దసక్తః సతతం-కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ-పర మాప్నోతి పూరుషః ॥ 19

నీవు చిత్తశుద్ధిలేనివాడ వగుటచే-ఫలాపేక్ష లేనివాడవై-విహితమైన సంధ్యా వందనాది నిత్యకర్మను శ్రాద్ధాది నైమిత్తిక కర్మ నాచరింపుము! ఫలాపేక్ష లేని వాడై వర్ణాశ్రమోచితంబైన స్వధర్మము నాచరించు మహాపురుషుడు-పరమేశ్వ రుని పొందును.

వివరణ-ఫలము నాశింపక-స్వధర్మమగు శివారాధనాదికమును త్రికరణ శుద్ధి నాచరించు శివయోగిపుంగవునకు - శివధ్యానయోగమును భంగపఱచునట్టి దురితములన్నియు ఈ జన్మయందే నశించును గాన-శివానుగ్రహము వలన "తస్య తావదేవ చిరం, యావ న్నవిమోక్ష్యే, అథ సంపత్స్యే" "ఎంతవరకు ఈ శరీరము నుండి జీవాత్మ—విడుదల కాడో, అంతియే అవధి-శివప్రాప్తికై సంభవించును" అన్నట్లు—ఈ శరీరపాతానంతరమే శివసాయుజ్యము చేకూరునని సారాంశము.

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి-మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహ మేవాపి-సంపశ్యన్ కర్తు మర్హసి ॥ 20

జనకుడు అజాతశత్రువు మొదలగు జ్ఞాననిష్ఠులు-కర్మయోగము చేతనే. శివధ్యానయోగ సిద్ధిని బడసినవారు. ప్రజలు స్వధర్మప్రవర్తనులు కావలెనను లోకసంగ్రహమునైనను గమనించువాడవై కర్మనాచరింపుము!

వివరణ—పరమేశ్వరుని ధ్యానించుట మొదలగు ఉపాసనఁదగు రూపమైన జ్ఞాననిష్ఠ గలవారు గూడ-నిత్యనైమిత్తిక కర్మల నాచరించి చిత్తశుద్ధిఁబడసినవారై ధ్యానయోగపరిపూర్ణులైనట్టి యంశము నవధరించి-సామాన్యలోక శ్రేయస్సు నాకాంక్షించియైనను కర్మ నవశ్య మాచరింపవలె ననియు, జ్ఞానయోగము-కర్మ యోగ సముచ్చితమైనచో సిద్ధించుననియు సారాంశము.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠః-తత్తదేవేతరో జనః।
స యత్ ప్రమాణం కురుతే-లోక స్తదనువర్తతే ॥ 21

శాస్త్రలోకమర్యాదలను యథాతథము గుర్తించి ప్రవర్తించు అభిజ్ఞుఁడని ప్రసిద్ధిఁజెందిన శ్రేష్ఠుఁడు—వైదికము లౌకికంబునగు ఏ యే కర్మనాచరించునో, అనభిజ్ఞులైన సామాన్యులు ఆ యా కర్మనే ఆచరింతురు.

అట్టి శ్రేష్ఠుఁడు ప్రమాణముగా అంగీకరించు శ్రుతి స్మృత్యాది శాస్త్రమునే లోకము అనుసరించును.

వివరణ-శ్రేష్ఠుఁడనఁగా? వేదశాస్త్రాగమాది మర్మమును గుర్తించి-సదాచార సంపన్నుఁడైన శిష్టుఁడగును. సామాన్యప్రజలకు శాస్త్రార్థమును విశదీకరించు శిష్టుఁడు-స్వధర్మము నీశ్వరార్పణ బుద్ధి నాచరించుచున్నందున లోకమంతయు శిష్టాచారము నాదర్శముగా భావించునని భావము.

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం-త్రిషు లోకేషు కించన।
నానవాప్త మవాప్తవ్యం-వర్త ఏవ చ కర్మణి ॥ 22

పార్థా! వస్తుతః నాకు చేయఁదగినది లేదు. ఎందుకనఁగా? స్వర్గ మర్త్య పాతాళలోకములలో పొందఁబడనిది, పొందతగినదేదియు లేదు. ఐనను విహితమైన కర్మను చేయుచునే యుందును.

వివరణ-పరమేశ్వర జ్ఞానయోగ సిద్ధుఁడ నగుటచే-కర్మ చేయవలసిన అవసరము నాకు లేకున్నను, ముల్లోకములయందు ఫలానా కావలెనని గాని, ఫలానా లభించలేదని గాని నాకు ఆరాటము లేకున్నను కర్మను లోకకల్యాణార్థము ఆచరించుచునేయుందును. శివోఽహంభావనచే శివతాదాత్మ్యమును భావించు నేను అవాప్త సచలకాముఁడనని భావము.

శ్లో॥ యది హ్యాహం న వర్తేయం-జాతు కర్మణ్యతంద్రితః ।
మమ వర్త్మానువర్తంతే-మనుష్యాః పార్థ! సర్వశః ॥ 23

పార్థా! పరమేశ్వర ధ్యానసిద్ధుఁడనైన నేను ఒకప్పుఁడైనను అలసుఁడనై కర్మను చేయనియెడల—మానవులు-అన్నివిధముల నా పద్ధతి ననుసరింతురు.

వివరణ—వేదవిహితకర్మ నాచరించుటకు సోమరితనము కూడదు గాన అలసుఁడను గాక కర్మఁజేయుచుందును. ఒకవేళ నేను ఏమరిపాటున కర్మ నాచరింపనిచో-మానవులందరు కర్మశూన్యులగుదురని భావము.

శ్లో॥ ఉత్సీదేయ రిమే లోకా-న కుర్యాం కర్మ చే దహం ।
సంకరస్య చ కర్తా స్యా-ముపహన్యా మిమాః ప్రజాః ॥ 24

నేను శివయోగ సిద్ధుఁడనైనను స్వధర్మము ననుష్ఠింపనిచో—ఈ ప్రజలు-కర్మను పరిత్యజించి—అకాలమున నశింతురు. బ్రాహ్మణాదివర్ణ విభాగమునకు మూలమైన ధర్మము నశించును గాన వర్ణసంకరము నొనగూర్చినవాఁడ నగుదును. వర్ణసంకరమువలన అధర్మము పెంపొందును గాన ప్రజలు-అభివృద్ధి నొందఁజాలరు!

వివరణ—సర్వశ్రేష్ఠుఁడైన శ్రీకృష్ణభగవానుఁడు-ఎట్టి అలసట లేనివాఁడై-ప్రజాక్షేమమునకై-సంధ్యావందనాది వైదికకర్మ నాచరించుచు లోకమును గూడ కర్మయందు ప్రవర్తింపఁజేయునని సారాంశము.

ఇందుకు గయోపాఖ్యానము నిదర్శనము.

యమునానదిలో శ్రీకృష్ణుఁడు స్నాతుఁడై ప్రాతఃకాలమున సూర్యాంతర్వర్తి యగు శివుని ప్రీతికై సూర్యునకు వేదగాయత్రీమంత్రము నుచ్చరించుచు- గంధపుష్పాక్షతోదకము నిండియుండు దోసిలితో సమర్పించు అర్ఘ్యమున గయుఁడు పైనుండి ఉమ్మివేసిన ఉచ్ఛిష్టము పడినందున గయుని సంహరింతునని శ్రీకృష్ణుఁడు ప్రతినఁబూనుటయు, నారదమహర్షి ప్రేరణచే గయుఁడు అర్జును నాశ్రయించుటయు, అందుకు శ్రీకృష్ణార్జునులు పోరాడగా పరమేశ్వరుఁడు వారిరువురిని మెప్పించి గయుని రక్షించుటయు ఇందు గమనార్హములగునవి.

శ్లో॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో-యథా కుర్వంతి భారత!
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త-శ్చికీర్షు ర్లోక సంగ్రహమ్॥ 25

భరతవంశోద్భవా! పరమేశ్వరభక్తి జ్ఞానహీనులగు (అవిద్వాంసులు) కర్మఫలము నపేక్షించి చేయు విధమున విద్వాంసుఁడు (అనన్య శివభక్తిచే శివ జ్ఞానముగల మహాపురుషుఁడు) గూడ-కర్మఫలవాంఛ లేనివాడై-సామాన్యలోకము నను గ్రహించు నుద్దేశముతో-విహితకర్మ నాచరింపవలెను.

వివరణ — పామరులు కర్మఫలము నాశింతురు. కర్మాధిష్ఠాతయైన సదాశివుఁడు కర్మాచరణ సమాప్తి సమనంతరము—లేక—కాలాంతరమున కర్మఫలము నొసఁగును గాన సామాన్యజనము — ఆరోగ్యభాగ్యసత్పంతానాదులను తప్పక పొందుదుమని శాస్త్రమునందు పరలోకములయందును దృఢవిశ్వాసము గలదై ఆస్తికమగును. పామరులైన ఆస్తికులకు ఆదర్శముగ శ్రీకృష్ణుఁడు గూడ—జాంబవతికి—శివాంశసంభూతుఁడగు పుత్రుఁడు కావలెనని-కైలాసప్రాంగణమున తపించి నట్లు హరివంశమున గలదు.

శ్రీ మహా విష్ణువు—లక్ష్మీసమేతుఁడై మానస సరోవర గత సరోజ సహస్ర మున శివు నర్చించి—దుష్టసంహార పూర్వక శిష్టరక్షణమునకై—శివానుగ్రహమున శివ పాదాంగుష్ఠ సంజనితమగు సుదర్శన చక్రముఁ బడసినట్లు—పురాణములందు—వ్యాసుఁడే గాక పుష్పదంతుఁడు—స్వవిరచిత శివమహిమ్నఃస్తోత్రమున నిరూపించెను.

భగవద్గీతకు ఆకరమగు మహాభారతమున-శ్రీకృష్ణుఁడు—ఉపమన్యు మహర్షి గారిచే భస్మరుద్రాక్షధారణపూర్వక శివమంత్రదీక్షితుఁడై తపించి పార్వతీ పరమేశ్వరుల వలన వరములను పొందినాడని వేదవ్యాసప్రోక్తమును గమనించినచో లోకకల్యాణాపేక్షయందు స్వార్థము నిమిడించి కామ్యకర్మ నాచరించిన శ్రీకృష్ణుఁడు—గీతలో తఱచుగా నిష్కామకర్మను ప్రబోధించినను "దేవాన్ భావయతానేన" ఇత్యాదిని కామ్యకర్మను పూర్తిగా నిషేధింపక నవశముగా కర్మఫలాపేక్షకై మానవులను పురికొలుపవలసివచ్చెను.

"హతో వా ప్రాప్స్యసే స్వర్గం-జిత్వా వా భోక్ష్యసే మహీం" అనుచో—అర్జునునకు స్వర్గసుఖమునందు లేక రాజ్యవైభవమునందు అభిరుచిని కలిగించి పార్థుని యుద్ధోన్ముఖు నొనర్పలేదా? విబుధులు ఆలోచింతురు గాక!

శ్లో॥ న బుద్ధిభేదం జనయే-దజ్ఞానాం కర్మసంగినాం ।
జోషయే త్సర్వకర్మాణి-విద్వాన్ యుక్తః సమాచరన్ ॥ 26

పరమేశ్వరునియందు అనన్య భక్తిపూర్వక ఏకాగ్ర ధ్యానసిద్ధి (జ్ఞానము) లేనట్టి కర్మాసక్తి మాత్రము గల యట్టి వారికి—"శివధ్యానము నాచరించుడు ! కర్మతో ప్రయోజనములేదు"—అని యుపదేశించుచు కర్మనిష్ఠను భంగపరుపఁ గూడదు. గాన విద్వాంసుఁడు శ్రద్ధతో కర్మ నాచరించుచు నిత్యనైమిత్తికాది కర్మల నన్నిటిని—కర్మిష్ఠులతో చేయించవలసియుండును.

వివరణ — ప్రజలందరికిని జ్ఞానయోగము నుపదేశింపక-నెందుకు కర్మయోగమునందు అభిరుచిని కలిగింతువు ? అను ప్రశ్నకు సమాధానము-పై శ్లోకమని తెలియవలెను.

కర్మనిష్ఠ గలవారిని ధ్యానమునకై ప్రేరేపించినచో-నవ్వారు-ధ్యానసిద్ధులు గానివారై కర్మయందు నిష్ఠ లేనివారైనయెడల-నుభయ భ్రష్టులై వెతలఁజెందుదురని భావము.

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని-గుణైః కర్మాణి సర్వశః ।
అహంకారవిమూఢాత్మా-కర్తాఽహ మితి మన్యతే ॥ 27

ప్రకృతియొక్క సత్త్వరజస్తమో గుణములచే చేయఁబడు కర్మల నన్నిటికిని—నేనే స్వతంత్రకర్త—నను అహంకారముతో తెలివిలేని బుద్ధి గలవాడై-జీవాత్మ-నేను కర్తనని భావించును.

వివరణ — విద్వాంసులు అవిద్వాంసులు చేయుకర్మ-సమానమైన నా ఇరువురిలో గల భేదము—ఇఁట నిరూపింపఁబడుచున్నయది "పరాత్తు తచ్ఛ్రుతేః" అను బ్రహ్మసూత్రమున-వేదవ్యాసుఁడు—జీవుని కర్తృత్వము పరమేశ్వరుని యధీనమైనదని నిర్వచించుటఁజేసి-"నేను కర్త-నను భావన-భ్రాంతిమూలకమగు వ్యావహారిక కర్తృత్వమును చెందినదని" పరులు చెప్పెడు వాదము-(పై బ్రహ్మసూత్రముచే) నిరాకరింపఁబడినది. "కర్తా శాస్త్రార్థ వత్త్వాత్" "ఇది చేయుము! ఇది చేయవలదు" అను శాస్త్రోపదేశమునకు పాత్రుఁడగుటచే జీవాత్మ—పరాధీనకర్తృత్వము గలవాడనియు జీవాత్మకు వ్యావహారిక కర్తృత్వము కూడదనియు తేటపడుచున్నయది.

పరమేశ్వరునిచే ప్రేరేపింపఁబడినదై ప్రకృతి—తన గుణములను కర్మలకై పురికొలుపును గాని ప్రకృతి—జడ మగుటచే సత్త్వాది గుణములను స్వతంత్రించి ప్రేరేపింపఁజాలదు.

"పరమేశ్వరుఁడు స్వతంత్ర కర్త" యను జ్ఞానములేనివాడు—విమూఢాత్ముఁడై నేను కర్తనని అహంకరించును. ఇట్టి అజ్ఞానము—అనాది కాలము నుండి అంటుకొనియుండుటచే అహంకారము అనుస్యూత మగునది. "నేను పరమేశ్వరునకు లోబడినవాడనై -పరమేశ్వరునిచే ప్రేరేపింపఁబడిన విధముగ కర్మలఁజేయుచున్నా" నను భావన - దృఢపడినచో-నేను స్వతంత్రకర్త-నను అహంకారము అంతరించునని సారాంశము.

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో!.గుణకర్మ విభాగయోః ।
గుణా గుణేషు వర్తంత-ఇతి మత్వా న సజ్జతే ॥ 28

మహాబాహో! అర్జునా! సత్త్వాది గుణముల విభజించుటను గుణకార్యముల వేరువేరు స్వరూపములను యథార్థముగ గుర్తించు విద్వాంసుఁడు—సత్త్వాది గుణములు-ఈశ్వరప్రేరితములై-తమ తమ పనులయందు ప్రవర్తించునని భావించుచు గుణములయందు అవ్వాని కర్మలయందును ఆసక్తుఁడు కాజాలడు.

వివరణ — పూర్వజన్మ సంస్కారము ననుసరించి మానవుని స్వభావము సాత్త్వికము, లేక రాజసము, లేక తామసంబుగ నేర్పడును గాన విజ్ఞానము గలవాడు-గుణములను గుణకార్యములను గమనించుచు తాను నిర్లిప్తుఁడుగ నుండునని భావము.

శ్లో॥ ప్రకృతే ర్గుణసమ్మూఢాః-సజ్జంతే గుణకర్మసు ।
తా నకృత్స్నవిదో మందాన్-కృత్స్నవి న్నవిచాలయేత్ 29

ప్రకృతిఁజెందు గుణములచే—పరమాత్మస్వరూపమును గుర్తింపనివారై గుణములయొక్క కర్మలయందు ఆసక్తులగుచుందురు.

పరమేశ్వరు నుపాసించుటయందు మాత్రము-అవ్వారికి ఆసక్తి జనింపదు-అట్టి కర్మయోగపరులైన అజ్ఞులను-పరమేశ్వరజ్ఞాన యోగనిష్ఠుఁడు-కర్మయోగము నుండి దిగజార్చగూడదు.

వివరణ — శివధ్యానసిద్ధుఁడు-చిత్తశుద్ధి లేనట్టి కర్మిష్ఠులను-ధ్యానయోగము నుపదేశించి-కర్మభ్రష్టులను చేయరాదని భావము.

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి-సన్న్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీ ర్నిర్మమో భూత్వా-యుధ్యస్వ విగతజ్వరః ॥ 30

నా యంతరాత్మయగు పరమేశ్వరునందు-వైదికములు లౌకికములు నగు సమస్త కర్మలను సద్బుద్ధిచే సమర్పించి-కర్మఫలము నపేక్షింపక-"కర్మ నాది" యను మమకారము లేనివాడవై-శోకమోహములను విడనాడియు స్వధర్మమైన యుద్ధము నొనర్పుము!

వివరణ — విద్వాంసుడు-కర్మల నాచరించు విధానము-ఇందు పొందు పరుపఁబడినది. సర్వాంతర్యామియగు పరమేశ్వరునకు లోబడినవాడ నను బుద్ధియే-ఆధ్యాత్మ చేతస్సనఁబడును.

"యస్యాత్మా శరీరం, య ఆత్మాన మంతరో యమయతి" ఇత్యాది శ్రుతి వాక్యములు-ఇందుకు నిదర్శనములగునవి.

పరమేశ్వరుఁడే సర్వనియంత యను నిశ్చయముతో సుకృతముల నీశ్వరార్పితములఁజేయవలెను. కర్మలన్నియు ఈశ్వరారాధనరూపములైనవని నిశ్చయము కలిగియుండవలెను. శోకమోహములు-ఐహిక ఆముష్మిక సుఖ దుఃఖములను కలిగించును.

"జీవాత్మ-పరమాత్మకు శరీర మగువాడు-పరమాత్మ-జీవాత్మలో నున్నవాడై జీవాత్మను సుకృత దుష్కృతముల నొనర్పఁబ్రేరేపించునని భావము.

శ్లో॥ యే మే మత మిదం నిత్య-మనుతిష్ఠంతి మానవాః ।
శ్రద్ధావంతోఽ నసూయంతో-ముచ్యంతే తేఽపి కర్మభిః ॥ 31

నా (నా అంతరాత్మయగు పరమేశ్వరుఁడు వేదతాత్పర్య సిద్ధముగ వక్కాణించిన) ఈ (ఫలాభిసంధిలేనిదై పరమేశ్వరారాధన బుద్ధి గలిగినట్టి కర్మాచరణరూపమైన ) మతమును (శాస్త్రము మనుష్యాధికారక మగుటచే-కర్మాచరణ కర్తలుగ చెప్పబడు) ఏ మానవులు-శ్రద్ధ గలవారై అసూయలేనివారునై అవలంబింతురో, అట్టి మానవులు-బంధహేతువులైన కర్మలచే విడిబడుదురు.

వివరణ—ఇఁట గల అపి శబ్దము-నిశ్చయము అను నర్థము గలదని గుర్తింపవలెను. పరమేశ్వర కృతములు నిత్యములునగు వేదవేదాంతముల సారమైన నిష్కామ కర్మయోగము-పరమేశ్వరాభిమతమగుటచే నిష్కామ కర్మయోగులు-ఈశ్వర ప్రీత్యర్థము కర్మల నాచరించుచు శుద్ధ చిత్తులై శివజ్ఞానులునై శివానుగ్రహమున బంధవిముక్తిఁ బడయుదురు.

పరమేశ్వరారాధన బుద్ధిని కర్మల నాచరించుట—వైదికమత పరమసిద్ధాంతమగును. పరమేశ్వరప్రోక్తము యథార్థమే నను విశ్వాసమే—శ్రద్ధ యనబఁడును. "కష్టసాధ్యమగు కర్మయందు మమ్మెందుకు బడద్రోయచున్నాడని" పరమేశ్వరుని యందు దోషదృష్టియే—అసూయ కాగా అట్టి అసూయ లేనివారు—అనసూయులగుదురు.

శ్లో॥ యే త్వేత దభ్యసూయంతో-నానుతిష్ఠంతి మే మతం!
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్- విద్ధి! నష్టా నచేతసః ॥ 32

ఎవరు-శ్రద్ధ లేనివారై నా (పరమేశ్వరుని) మతమును ద్వేషించుచు అవలంబింపరో, అట్టివారు—కర్మయోగము యొక్కయు జ్ఞానయోగము యొక్కయు పరిజ్ఞానము లేనివారగుటచే విపరీతార్థగ్రహణ పరులనియు, బుద్ధిబలము లేనివారనియు, కర్మజ్ఞానముల రెంటిని పొందలేని ఉభయ భ్రష్టులనియు గుర్తింపుము!

వివరణ—ఇఁట "తు" శబ్దము శ్రద్ధ లేమిని సూచించును.

నాస్తికులై వైదికమత సిద్ధాంతము నంగీకరింపని విమూఢులు – కర్మభ్రష్టులై జ్ఞానయోగదూరులునై శివానుగ్రహ పాత్రులు కాజాలరని సారాంశము.

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః-ప్రకృతే ర్జ్ఞానవా నపి।
ప్రకృతిం యాంతి భూతాని-నిగ్రహః కిం కరిష్యతి?॥ 33

వేదశాస్త్రజ్ఞానము గల బుద్ధిమంతుఁడు గూడ-తన పూర్వజన్మ సంస్కారమునకు అనుకూలముగ ప్రవర్తించును. ప్రాణులందరు పూర్వజన్మ సంస్కారము (ప్రకృతి) నవలంబింతురు. ఇంద్రియముల నరికట్టుట (నిగ్రహము) ప్రకృతిని జవదాటఁజాలదు.

వివరణ—పూర్వజన్మయందలి అభ్యాసమే సంస్కారముగ పరిణమించును. అట్టి సంస్కారమే ప్రకృతి యనఁబడును. పరమేశ్వరావలంబనము లేనిది-ప్రకృతి ననుసరించు ఇంద్రియముల నరికట్టుట—సాధ్యముకాదు. నిష్కామకర్మఁజేయుటకు ప్రకృతి-అటంకములను కల్పించును. మహేశ్వరుని అందదండలు లేనివారు-మాయను (ప్రకృతిని) తృణీకరింపఁజాలరు. దురభ్యాసములను మనో నిగ్రహము చేతనే దూరము చేయఁజాలరు. సర్వాధారుఁడైన పరమేశ్వరు నుపాసించునెడల-ప్రకృతి-వశవర్తి యగునని భావము.

శ్లో॥ ఇంద్రియస్యేంద్రియస్యార్థే -రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయో ర్న వశ మాగచ్ఛే-త్తౌ హ్యస్య పరిపంథినౌ ॥ 34

శ్రోత్రము (చెవి) మొదలగు ప్రతి జ్ఞానేంద్రియమును, వాక్కు మున్నగు ప్రతి కర్మేంద్రియమును రాగద్వేషములు-విడువకుండును. అందువలన పురుషుఁడు-అట్టి రాగద్వేషములకు లొంగకూడదు. ఎందుకనఁగా? శ్రేయస్సు నభిలషించువానికి-రాగద్వేషములు పరమశత్రువులని తెలియవలెను.

వివరణ-రాగమనఁగా ? ఇంద్రియసుఖము నపేక్షించు ఆసక్తి;

ద్వేషమనఁగా? ఇంద్రియసుఖానుభవమునకు ఆటంకము కలిగినచో ఏర్పడు క్రోధము;

ఇహపర శ్రేయస్సునకై పాటుబడు పురుషుని - రాగద్వేషములు - శ్రేయఃసాధన నడ్డగించునవి. కావున బుద్ధిబలమున రాగద్వేషముల నణచి వేయవలెను. ప్రాణుల పూర్వసంస్కారరూపమైన ప్రకృతి-రాగద్వేషముల దెసకు పురుషు నాకర్షించునదైనను "అవ్వానికి లొంగకు" మని శాస్త్రము నియమించు చున్నదని భావము.

ఇంద్రియ విషయములను తలచుకొనుట వలన కలుగు అనురాగమును విషయసుఖభంగమువలన ఏర్పడు ద్వేషమును ప్రకృతి కల్పించి పురుషుని మనస్సును కలవరపఱచుచు గంభీరజలప్రవాహమునందువలె అనర్థమునందు పడఁద్రోయును. శబ్దము మున్నగు విషయములఁ జెందియుండు రాగద్వేషముల నణచి వేయుచు పరమేశ్వరునారాధించుట మొదలగు వానియందు-నావయందు వలె—ప్రవేశింపఁజేయునది శాస్త్రమనియు; నావనెక్కినవాడు నీటిపొరుదల నుండి విడి

బడినట్లు పరమేశ్వర భక్తుఁడు విషయసుఖాసక్తిని తగ్గించుచు అనర్థమును పొంద దనియు; సహజమగు పశ్వాది ప్రవృత్తిని జయించి స్వధర్మము నాచరింపవలె ననియు వివేకము.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః-పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః-పరధర్మో భయావహః॥ 35

కొన్ని అంగములు లేనిదైనను స్వవర్ణాశ్రమోచితమగు యుద్ధాది ధర్మము-సర్వాంగ సంపూర్ణముగ బాగుగను ఆచరింపఁబడు పరధర్మమునకంటె శ్రేయస్కరమగునని-తెలియవలెను. ఎందుకనఁగా? స్వధర్మమగు యుద్ధాదికమునందు మరణము సంభవించినను స్వర్గసుఖప్రాప్తిని కీర్తిని కలుగఁజేయును. పరధర్మమగు అహింసాదికము క్షత్రియునకు శాస్త్రనిషిద్ధమగుటచే నరకహేతువై భయప్రదమగును.

వివరణ – స్వధర్మమగు యుద్ధాదికమును శాస్త్రోక్తరీతి ననుష్ఠింప వలను పడదు గాన పరధర్మమైన అహింసాదికము సుకరము ధర్మంబు నగుటచే నద్దాని నెందుకు ఆచరింపఁగూడదని అర్జునుఁడు ఆశంకించునని భగవానుఁడు పై విధముగ వక్కాణించెను.

యుద్ధము క్షత్రియుఁడైన గృహస్థునకు స్వధర్మము కాగా అహింస మున్నగునది యతియగు బ్రాహ్మణుని ధర్మముగుచున్నయది. "ధర్మంచర" ఇత్యాది వేదవాక్యమున "తన వర్ణమునకు ఆశ్రమమునకును ఉచితమైన ధర్మము నీశ్వరార్పణబుద్ధి నాచరింపు" మను నర్థము ఇమిడియున్నది.

## అర్జున ఉవాచ—

అర్జునుఁడు ప్రశ్నరూప వచనమును పలికెను.

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం-పాపం చరతి పూరుషః?।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ-బలాదివ నియోజితః॥ 39

వృష్ణి వంశమునందవతరించిన పురుషోత్తమా! అనర్థరూపమైన పాపమును చేయఁదలపకున్నను పురుషుఁడు బలాత్కారముగ నెద్దానితో ప్రేరేపింపఁబడి గావించును?

వివరణ- ప్రభువుఁదగు శాసనము వలె. ఏదే నొకటి యీ మానవుని పాప పంకిలమునందు పడద్రోయను గాన అట్టిది ఏదై యుండునని కౌంతేయుఁడు వార్ష్ణేయుని ప్రశ్నించెనని భావము.

శ్రీ భగవానువాచ

శ్రీ భగవానుఁడు ప్రతివచనమును పలికెను.

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష-రజోగుణ సముద్భవః ।
మహాశనో మహాపాప్మా-విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥ 37

నీవు అడిగిన ఈ కామము, మరియు ఏదే నొక ఆటంకముచే సిద్ధింపని కామముయొక్క పరిణామముగ సంభవించు ఈ క్రోధము – రజోగుణమునుండి ఉద్భవించునదై గొప్ప ఆహారము గలదియునై మహాపాపమువలె అతిభయంకర ముగ నుండును.

గాన నీ కామమును, కామరూపాంతరమగు క్రోధమును సంసారమునందు శత్రువుగా భావింపుము!

వివరణ – దుఃఖమును కలుగఁజేయునదియు, ప్రకృతిధర్మంబు నగు రజోగుణము గలవారికి–కామము (కోరిక) సంభవించును. అట్టి కామము నెర వేరనిచో కామమే క్రోధరూపముగ పరిణమించును.

క్రోధము మారురూపముగ గల కామము-జీవాత్మను సంసారమున బంధించి కష్టపెట్టును.

కామమునకు ఎంత ఆహారము నొసఁగినను కామముయొక్క ఆకలి ఎక్కు వగుచుండునని దిగువ ప్రమాణము దాటుచున్నయది.

"యత్ పృథివ్యాం వ్రీహియవం - హిరణ్యం పశవః స్త్రియః,
నాల మేకస్య తత్సర్వం-ఇతి మత్వా శమం వ్రజేత్"

"నేలపై గల ధాన్యము బంగారము పశువులు స్త్రీలు మొదలగు సమస్తము గూడ కాముకునకు చాలదని గుర్తించి కామమును నిగ్రహింపవలెను."

"ఈ కామమే అనర్థమువైపు నన్ను లాగుచున్న" దని తెలిసియు పురు షుఁడు పాపము నొనర్చును గాన కామము భయంకరమగుచున్నయది.

పూర్వజన్మ వాసనవలన సంభవించునది—కామము;

ఈ ప్రపంచమున నెవఁడు గూడా—అపేక్షలేనిది—ఎట్టి పనిని చేయఁజాలఁడు గాన—ప్రాణిమాత్రుఁడు చేయు ప్రతికార్యము-కామము వలననే నెరవేరుచున్నదని సారాంశము.

ఈ కామమే అధర్మ కార్యములయందు ప్రవర్తింపఁజేయుననియు, మరియు నిదియే క్రోధముగ పరిణమించి హింస నొదవించుచు సర్వవిధములగు అనర్థములకు మూలమగుననియు భగవానుఁడు—నిర్వచించెను.

శ్లో॥ ధూమేనావ్రియతే వహ్ని-ర్యథాఽఽదర్శో మలేన చ ।
యథోల్బేనావృతో గర్భ-స్తథా తేనేద మావృతమ్ ॥ 38

పొగ నిప్పును కప్పివేయునట్లు, అద్దము—మురికిచే మూయఁబడునట్లును. గర్భ (కడుపులోని పిండ) మును మావి మఱుగుపఱచునట్లును, కామముచేత—నిగ్రహరూపమైన వివేకము—అణఁగియుండును.

వివరణ - నిప్పునకు పొగ—పగదైనట్లు, అద్దమునకు మురికి—అడ్డైనట్లు, గర్భమునకు మావి—కప్పు ఐనట్లును—కామము-ఇంద్రియనిగ్రహమును సడలించునని భావము

“బలవా నింద్రియగ్రామో—విద్వాంసమపి కర్షతి” అను నానుడి పై విషయమును బలపఱచునట్టిది;

శ్లో॥ ఆవృతం జ్ఞాన మేతేన-జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌంతేయ!- దుష్పూరేణానలేన చ ॥ 39

అనాది కాలమునుండి శివాపచార జన్యమైన అల్పజ్ఞానము గల జీవాత్మను నిత్యము బాధించు కామస్వరూపముగల—ఈ శత్రువు—అవధిలేనిదై అగ్నివంటిదియునై—జీవాత్మయొక్క సహజమగు శివోపాసనాత్మక జ్ఞానమును ఆవరించియున్నది.

వివరణ — ఇంద్రియ విషయములయందు వ్యామోహమును కల్పించి—ఎడతెగని సంసార బంధరూపమైన అనర్థమునకు దారి తీయునట్టి కామము—అనంతమైనదని దిగువ ప్రమాణమున గాననగును.

"న జాతు కామః కామానా-ముపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేవ-భూయ ఏవాభివర్ధతే"

"హవిస్సుచే అగ్ని-పెంపొందునట్లు, కామము—కోరికల ననుభవించుటతో ఒకప్పుడు గూడ-శమింపదు".

అనఁగా? కోరిక తీరినను తిరిగి కామవాంఛ కలుగుచునేయుండును. అగ్ని యందు ఆహుతులు వేయుకొలది, అగ్ని-మండుచునేయుండును కాని మంట తగ్గదు గదా! అటులే కామమని—అగ్నిసాదృశ్య మీయఁబడినది.

శ్లో॥ ఇంద్రియాణి మనోబుద్ధి-రస్యాధిష్ఠాన ముచ్యతే ।
ఏతై ర్విమోహయత్యేష-జ్ఞాన మావృత్య దేహినమ్ ॥ 40

ఈ కామము—ఇంద్రియములయందు, సంకల్పరూపమైన మనస్సునందు, అనిశ్చితమగు బుద్ధియందును నెలకొని— ఇవ్వాని మూతగా గొని (ఇద్ది) శరీరధారి యగు ప్రాణిమాత్రుని జ్ఞానము నావరించి-మోహింపఁజేయును.

వివరణ - శ్రోత్రము (చెవి) వాక్కు మొదలగు ఇంద్రియములను, కోరికల ఇల్లగు మనస్సును, ఇది ఇంతేయని నిశ్చయింప లేనట్టి బుద్ధిని కామము అంటుకొని సహజ జ్ఞానమును గోలుపోయిన జీవాత్మను మోహింపఁజేయును. కామమునకు ఆశ్రయములైన ఇంద్రియాదులను గుర్తింపనిది—కామమును అదుపు లోనికి తేరాదని భావము.

శ్లో॥ తస్మా త్త్వ మింద్రియాణ్యాదౌ-నియమ్య భరతర్షభ!
పాప్మానం ప్రజహి హ్యేనం-జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ 41

భరతవంశీయులలో శ్రేష్ఠుడా! (భరతర్షభ) కామము—ఇంద్రియముల ద్వారా ప్రాణిని మోహింపఁజేయునదగుటఁజేసి (తస్మాత్) మోహనమునకు ముందు (ఆదౌ) నీవు ఇంద్రియముల నరికట్టి — శాస్త్ర పరిచయముచే—లేక-శ్రవణముచే కలిగిన—పరమేశ్వరనిష్ఠారూపమగు జ్ఞానమును మరియు పరాభక్తిచే శివు నుపాసించు విజ్ఞానమును పోగొట్టునట్టి, నీచమైనట్టియు కామము నణఁగఁద్రొక్కుము!

వివరణ - జీవాత్మ-పూర్వజన్మార్జితమగు వివేకముఁదగు బలమున-కామ

మును జయింపఁదలచి-కామము మోహమును కలిగించుటకు ముందే జాగరూకుడై జ్ఞాన కర్మేంద్రియములను అదుపులోనికి తెచ్చుటకు మనస్సును నిగ్రహింపవలెననియు, మనోనిగ్రహమునకు వలయు వివేకము- శాస్త్రాచార్యోపదేశమువలన, స్వసంప్రదాయాభిజ్ఞుల సహవాసము వలనను కలుగు జ్ఞానవిజ్ఞానముల మూలముగా సంభవించుననియు విదితమైనది.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహు-రింద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధి-ర్యో బుద్ధేః పరతస్తు సః ॥ 42

నిగ్రహింపఁదగిన ఇంద్రియములు—విషయములకంటె గొప్పవి. ఇంద్రియములకన్న మనస్సు శ్రేష్ఠమైనది. బుద్ధి-మనస్సును మించినదగును. జీవాత్మ బుద్ధికంటె పై స్థితి గలవాడని తెలియవలెను.

వివరణ - జిహ్వా ఘ్రాణాది ఇంద్రియములను వశపరచుకొనుటకు మనోనిగ్రహము కావలెను. రస గంధాది విషయములు-చేరువలేకున్నను, మనస్సుతో విషయములను స్మరించునెడ — మనస్సుయొక్క ప్రభావము ఇంద్రియములపై ప్రసరించును. మనస్సును నిగ్రహించుటకు—బుద్ధిబలము అవసరము. నిశ్చయము గల బుద్ధియే-మనస్సునరికట్టును. అదుపులోని మనస్సు- ఇంద్రియములను విషయములవైపు పోనీయదు. బుద్ధి నిశ్చయమునకు ఆత్మబలము ఆవశ్యకము. జీవాత్మ-బలపడుటకు పరమాత్మయొక్క--ప్రేరణ-కావలెను.

ఈవిషయమును "ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః- అర్థేభ్యశ్చ పరం మనః, మనసస్తు పరాబుద్ధిః—బుద్ధే రాత్మా మహాన్ పరః ॥ మహతః పర మవ్యక్త-మవ్యక్తాత్ పురుషః పరః । పురుషా న్న పరం కించిత్-సా కాష్ఠా సా పరా గతిః" అను కఠవల్లీ మంత్రము సమర్థించుచున్నయది.

ఎట్లనఁగా ? శబ్దాది విషయములు—ఇంద్రియములకన్న బలిష్ఠములైనవి. శబ్దాది విషయములకంటె మనస్సు అధిక బలము కలది కాగా—మనస్సునకంటె నిశ్చయాత్మికయగు బుద్ధి—గొప్పదగును. బుద్ధికన్న—ప్రత్యగాత్మ (జీవాత్మ) బలిష్ఠుఁడై యుండును. జీవాత్మను మించునది శరీరము, (అవ్యక్తము) పురుషుని ప్రవృత్తియంతయు సూక్ష్మము స్థూలంబు నగు శరీరముపై ఆధారపడియుండును.

శరీరమునకంటె-సర్వాంతర్యామి, సర్వప్రేరకుఁడు, పరిపూర్ణుఁడగుటచే పురుష శబ్దవాచ్యుఁడు నగు శివుఁడు-శ్రేష్ఠుఁడగుచున్నవాఁడు.

ఒకదానికంటె మరియొకటి బలవత్తరమైనదని గుర్తించి శ్రేష్ఠమైనదానితో కనిష్ఠమగుదానిని వశపఱచుకొనవలెనని భావము.

అట్టి పురుష నాశ్రయించుటయే పరమావధి, పరాగతియు నని తెలియవలెను. కఠమున-ఆత్మశబ్దమునకు "మహాన్" అను విశేషణము-ఇంద్రియములను విషయములను మనస్సును బుద్ధిని నిగ్రహించు సామర్థ్యమును సూచించుటకు ప్రయుక్తమైనది. కాని ఆత్మ విభువని "మహత్" అను పదము తెలుపునని భావింపరాదు. జీవాత్మ-అణువు కావుననే గమనాగమనములను చేయుచుండును. విభువగునెడ—పరలోకగమనాదులు సంభవింపవు.

ఈ "మహాన్" అను విశేషణమును "జ్ఞాన మాత్మని మహతి" ఇత్యాది శ్రుతివాక్యమునందు గాననగును.

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా-సంస్తభ్యాత్మాన మాత్మనా।
జహి శత్రుం మహాబాహో!-కామరూపం దురాసదమ్॥ 43

హే మహాబాహో!

చెప్పఁబడిన విధముగా- ప్రత్యగాత్మ—బుద్ధికంటె పరుఁడని గుర్తించి నిశ్చయాత్మికయగు బుద్ధితో మనస్సు నరికట్టి (పరమేశ్వరనిష్ఠతో శివారాధనమునందు నెలకొలిపి) బుద్ధిబలము పరమేశ్వరనిష్ఠయు లేనివారికి జయింపనలవి గానట్టి కామస్వరూపుడైన శత్రువును జయించుము!

వివరణ-

పరమేశ్వరనిష్ఠతో విషయాసక్తి తగ్గుచుండునని "రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే" "రసమనఁగా? విషయాసక్తి; పరం=శివు నుపాసించి దర్శించిన యెడల-దినక్రమముగ తగ్గినదై మనోనిగ్రహమునకు తోడుపడునని సారాంశము.

పై శ్లోకమున ఆత్మనా = బుద్ధితో. ఆత్మానం = మనస్సును అను నర్థము పరిగ్రాహ్యము.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు,
బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః

ఇయ్యది - శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీ మద్భగవద్గీతా
భాష్యమున "మనో రంజనం"బను శాంకరీయ ఆంధ్రానువాదమున
తృతీయాధ్యాయము.



---

## శ్రీ శివాద్వైత సిద్ధాంత విశదీకరణము-3

51వ పేజీ తరువాయి.

శ్లో॥ నిరూప్యతే, మహావాక్య-శ్రవణాత్ జ్ఞానపూర్ణతా ।
భవేదితి బ్రువంత్యన్యే శివాద్వైతం న తద్వదేత్ ॥ 11

శ్రుతిస్మృత్యాగమప్రోక్తః-కర్మజ్ఞానసముచ్చయః ।
ముక్తికారణ మిత్యేతత్-మంతవ్యం శైవశాస్త్రతః ॥ 12

మిథ్యాజీవస్య భావశ్చ-శశశృంగాయతే ఖలు ।
ముక్తౌ వభావో జీవస్య-శివాద్వైతే న సంగతః ॥ 13

భక్త్యా ముక్తో భవేజ్జీవః-పరాత్మానుగ్రహాదితి ।
శంకరాచార్యభణితం-నీలకంఠోఽనుమోదతే ॥ 14

శ్రవణంనామ చైకార్థ్య-నిశ్చయేన శివే రతిః ।
భవేదితి తతఃశంభో-ర్ధ్యానం తస్మా చ్ఛివో భవేత్ ॥ 15

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ భగవద్గీత

## చతుర్థాధ్యాయము

"మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాదసహితము

శ్రీ భగవానువాచ—

శ్లో॥ ఇమం వివస్వతే యోగం-ప్రోక్తవానహమవ్యయం।
వివస్వాన్ మనవే ప్రాహ-మను రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ 1

ఏవం పరంపరాప్రాప్త-మిమం రాజర్షయో విదుః।
స కాలేనేహ మహతా-యోగో నష్టః పరంతప ॥ 2

స ఏవాయం మయా తేఽద్య-యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోఽసి మే సఖా చేతి-రహస్యం హ్యేతదుత్తమమ్॥ 3

పరంతపా! (శత్రువులను తపింపఁజేయువాడా!) నేను (పూర్వరూపమున నారాయణుఁడను) ఈ అవ్యయమగు కర్మయోగమును సూర్యునకు చెప్పితిని. సూర్యుడు తన కుమారుఁడైన వైవస్వతమనువునకు వక్కాణించెను. మనువు-స్వపుత్రుఁడైన ఇక్ష్వాకు మహారాజునకు వాక్రుచ్చెను.

ఇవ్విధము-సూర్యుడు మొదలుకొని గురుపరంపరతో సంఘటించిన నీకర్మ యోగమును రాజర్షులు—గుర్తింతురు.

అట్టి యోగము—దీర్ఘకాలమునుండి లోపించినందున పురాతనమగు ఆ ఈ కర్మయోగమును నీకు ప్రబోధించితిని. భక్తుఁడవు చెలికాడవునని-రహస్యమైన నీ ఉత్తమ (కర్మయోగ) జ్ఞానమును విశదపఱచితిని.

6)

వివరణ—

కేవలము అర్జునునకు యుద్ధమును గూర్చి ప్రోత్సహించుటకు గాదీ ప్రబోధము. లోకకల్యాణహేతువు, పరమపురుషార్థ (మోక్ష) సాధనంబు నని నేను నా మూలరూపమున క్షత్రియకులమూలకందమగు సూర్యునకు ఈ కర్మయోగము నుపదేశించితి నని భగవదుక్తిలో గల సారాంశము.

మనువు ఇక్ష్వాకునకు కర్మయోగము నుపదేశించెనని "జ్యేష్ఠపుత్రాయప్రాహ" అను శ్రుతివాక్యమున గాననగును.

రాజర్షులనఁగా- అధికారము గలిగి సూక్ష్మార్థములను గ్రహించువారు. "రాజర్షి" అను పదము-ముముక్షువులను తెలుపునది గాన రాజర్షులేగాక ముముక్షువు లందరు నని తెలియవలెను.

కర్మయోగము—అనాదియగు వేదము మూలముగ గలది, అనంతఫల ప్రదంబు, అనాదికాలమునుండి గురుపరంపరాప్రాప్తంబునై యున్నయది.

నారాయణ సూర్య మను ఇక్ష్వాకు ప్రభృతి గురుపరంపరలో-నారాయణుని మూలరూపమగు సదాశివునిచే ఈశ్వరగీతలో ప్రవర్తింపఁజేయఁబడిన నీ కర్మ యోగమునకు "సదాశివసమారంభాం—వాసుదేవసుమధ్యమాం, అస్మదాచార్యపర్యంతాం—వందే గురుపరంపరామ్" అను విధమున గురుపరంపరను స్మరింపవలెనని వివేకము.

ధర్మహానిఁజేయుకాలము—ఈ యోగ సంప్రదాయమును భంగపఱచుటచే పూర్వజన్మప్రతిపాదితమగు కర్మయోగమును—నాయందు భక్తిస్నేహములు గల నీకు నుపదేశించితిని కాని సామాన్యులకు వక్కాణింపరానిదీ యోగమని శ్రీ భగవాదుఁడు (నారాయణుడు) నరు (అర్జుని)ని యందుగల అనురాగమును ప్రకటించుట-గమనార్హము.

అర్జున ఉవాచ—

శ్లో॥ అపరం భవతో జన్మ-పరం జన్మ వివస్వతః।
కథమేత ద్విజానీయాం-త్వమాదౌ ప్రోక్తవా నితి॥ 4

కృష్ణా! నీ జన్మ- ఇప్పటిదగుటచే కొద్దికాలముండునది గదా! సూర్యుని ఉదయము—సృష్ట్యాదినుండి నీ కంటె ముందుండెను. నీవు మనుష్యమాత్రుఁడవై పూర్వము సూర్యునకీ యోగమును చెప్పితివని యెట్లు నమ్ముదును?

వివరణ_

"సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్" అను శ్రుతి ననుస రించి సృష్ట్యాదిని సూర్యుడు జన్మించెనని తెలియుచున్నందున-కృష్ణునికన్న పూర్వీకుఁడని నిర్ధారింపవచ్చును. శ్రీకృష్ణుడు-మానవశరీరుఁడై సర్వజ్ఞుఁడు కానందున-సూర్యునకు గీతాజ్ఞానము నుపదేశించుట పొసగదని భావించి అర్జునుఁడు పై విధము ప్రశ్నించెను. సూర్యుఁడు-పురాతనుఁడు దేవదేవుఁడు, సర్వజ్ఞుడు నగు టచే నంతటివానికి శ్రీకృష్ణుఁడు కర్మయోగమును వివరించుట ఎట్లు అని పార్థుని సందేహము.

శ్రీ భగవానువాచ -

శ్లో॥ బహూని మే వ్యతీతాని-జన్మాని తవ చార్జున
తా న్యహం వేద సర్వాణి-న త్వం వేత్థ పరంతప॥ 4

శ్రీ భగవానుఁడు పలికెను.

అర్జునా! నాకు నీకును అనేకములైన జన్మలు గడచినవి. అవ్వానిని నేను గుర్తింతును. పరంతపా! నీవా జన్మలను తెలియకున్నావు.

వివరణ-

పూర్వజన్మ జ్ఞానము గలవాడ నగుటచే పూర్వజన్మమునందు సూర్యునకు కర్మయోగము నుపదేశించితి నని శ్రీకృష్ణభగవానుఁడు "ఇమం వివస్వతే" ఇత్యా దిని వక్కాణించుట_సమంజసం బగుచున్నయది.

శ్లో॥ అజోఽపి స న్నవ్యయాత్మా-భూతానా మీశ్వరోఽపి సన్।
ప్రకృతిం స్వా మవష్టభ్య-సంభవామ్యాత్మమాయయా॥ 6

పరమేశ్వరుని చిచ్ఛక్తియొక్క అంశము నగుటచే జన్మలేనివాడనైనను పరమేశ్వరచిచ్ఛక్త్యంశ భూమికతో తాదాత్మ్యము నొందినతఱి- ప్రాణులకు ప్రభువునైనను నా మూలాధారమగు ప్రకృతి (పరమేశ్వరచిచ్ఛక్తి) నాశ్రయించి నా సామర్థ్యమును మేళవించియు మానవమృగజంత్వాది శరీరములను లోక కళ్యాణార్థము ధరించుచుందును. అనఁగా? జన్మింతునని భావము.

వివరణ-

"యా ఉమా సా మహావిష్ణుః" అను ప్రమాణము-వాసుదేవుని మూలరూపమగు మహావిష్ణువు: ఉమయొక్క రెండవరూపమని- తేటపరచుచున్నయది. హరివంశమునందు పారిజాతానయన సందర్భమున- స్వర్గమునుండి పారిజాతవృక్షమును తీసికొనుటకు శ్రీకృష్ణుడు దూతగా పంపిన నారదమహర్షి-అనేక విధముల యాచింపగా నిరాకరించిన దేవేంద్రుని గురించి"య ఏకో విశ్వమధ్యాస్తే-ప్రధానం జగతో హరః, ప్రకృత్యాఽయం, పరం సర్వే-క్షేత్రజ్ఞం వై విదుర్బుధాః । తస్యావ్యక్తస్య యో వ్యక్తో-భాగ స్సచ భవోద్భవః, తస్యాత్మా ప్రథమోదేవో-విష్ణుః-సర్వత్ర ధీమతః। ప్రకృత్యాః ప్రథమో భాగః- ఉమాదేవీ హ శాశ్వతీ, వ్యక్తః సర్వమయో విష్ణుః- స్త్రీసంజ్ఞో లోకభావనః॥" అని వక్కాణించెను.

శ్లోకార్థము- విశ్వం = కార్యమగు జగత్తును; ప్రధానం = కారణమగు, ప్రకృతిని; య ఏకో అధ్యాస్తే = ఏ ఒక్కడు అధిష్ఠించియుండునో; అయం = అట్టి వాడు; హరః = పరమేశ్వరుఁడగును. ప్రకృత్యా = శక్తితో అవినాభావముగ కూడియుండు; పరం = పరమేశ్వరుని; సర్వేబుధాః = జ్ఞానులందరు; క్షేత్రజ్ఞం= విశ్వక్షేత్రగతవిశేషములను గుర్తించువానిగా; విదుః = తెలిసికొనుచున్నవారు.

అవ్యక్తస్య = ఇంద్రియగోచరుఁడు కానట్టి; తస్య = ఆ పరమేశ్వరుని యొక్క; వ్యక్తః = స్పష్టమైన, భాగః=ప్రథమభాగము; భవోద్భవః=మహేశ్వరుఁడగును. ధీమతః = విజ్ఞానపరిపూర్ణుఁడైన; తస్య = మహేశ్వరునియొక్క; ప్రథమః ఆత్మా = మొదటి శుద్ధాత్మ; విష్ణుర్దేవః = విష్ణుమూర్తి కాగా; ప్రకృత్యాః = ఆదిశక్తియొక్క, ప్రథమోభాగః = మొదటి భాగము; ఇహ = ఈ ప్రపంచమున; శాశ్వతీ = శాశ్వతరూపము గలిగినట్టి; ఉమాదేవీ = పార్వతీదేవియగును. సర్వమయః = సర్వాత్మకుఁడైన పరమాత్మ శక్తిద్వారా; స్త్రీసంజ్ఞః = పార్వతీ రూపాంతరముగలవాడై; విష్ణుః=నారాయణుఁడుగా; వ్యక్తః=లోకముచే గుర్తింపఁబడినవాడు.

ఆ హరివంశమునందే-శ్రీకృష్ణుని తపశ్చర్యానంతరము శివునితో గూడ సాక్షాత్కరించిన పార్వతీదేవి-కృష్ణు నుద్దేశించి "వత్స! జానే తవానంతాం- నిశ్చలాం సర్వదాఽచ్యుత! అనన్యా మీశ్వరే భక్తి-మాత్మన్యపిచ కేశవ! త్వం హి నారాయణః సాక్షా-త్పరాత్మా పురుషోత్తమః, ప్రార్థితో దైవతైః పూర్వం- సంజాతో

దేవకీసుతః। పశ్య త్వ మాత్మనాఽఽత్మాన-మమలం పరమం పదం, నావయో ర్వి ద్యతే భేద-మైక్యం పశ్యంతి సూరయః" అని వచించెను.

శ్లోకార్థము-నాయనా! అచ్యుతా! కేశవా! పరమేశ్వరునియందు నీకు గల భక్తి-అవధిలేనిది, ఎల్లకాలము చలింపనిది, అనన్యమైనదియు నని గుర్తించితిని. అట్టి పరాభక్తి నాయందును నీకు గలదని భావించుచున్నాను. నీవు మూలరూప మున సాక్షాత్ నారాయణుఁడవు; సర్వజీవాత్మల నధిష్ఠించి పురుషులలో ఉత్తముఁ డనఁబఱఁగుదువు; పూర్వము అమరులు ప్రార్థించుటచే దేవకీనందనుఁడుగ జన్మించితివి. నీవు నీ హృదయమున నిర్మలము పరాత్పరంబునగు ప్రకాశమాన మైన చిదంబరము నవలోకింపుము. ఆ చిదాకాశమే నేనగుటచే చిదంబరముతో నీవు తాదాత్మ్యము నొందుటచేతను మన ఇరువురికి-సూక్ష్మబేదమును పాటింపక ఏకీభావమును విద్వాంసులు భావించుచున్నవారు.

ఇట్టి పరిశీలనమున-నారాయణుని సర్వవిధమైన పారమ్యము-శివశక్తిఁదగు అంశమగుటవలననే నని విదితమైనది.

శ్లో॥ యదా యదా హి ధర్మస్య-గ్లాని ర్భవతి భారత! ।
అభ్యుత్థాన మధర్మస్య-తదాఽఽత్మానం సృజామ్యహమ్ ॥ 7

భరతవంశోద్భవా! ఎప్పుడెప్పుడు ధర్మము సన్నగిలునో, అధర్మము పెంపొందునో, అప్పుడు నేను శరీరమును ధరింతును.

వివరణ-

వేదశాస్త్రములయందు చెప్పఁబడినది, లోకకల్యాణము నొసగునది, బ్రాహ్మణాదివర్ణవ్యవస్థను బ్రహ్మచర్యాద్యాశ్రమలక్షణమును నిలుపునదియు ధర్మ మనంబడును. వర్ణాశ్రమవ్యవస్థను కూలద్రోయునది, లోకక్షయమునకు కారణ మైనది, వేదశాస్త్రములచే నిషేధింపఁబడినదియు అధర్మమగును. అధర్మవృద్ధి ధర్మలోపము సంభవించిన ప్రతిసమయమందును భగవదవతారము సంఘటిల్లు నని భావము.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం-వినాశాయ చ దుష్కృతాం ।
ధర్మసంస్థాపనార్థాయ-సంభవామి యుగే యుగే ॥ 8

స్వధర్మము నీశ్వరప్రీత్యర్థము ఆచరించు సజ్జనులను కాపాడుటకు, దుర్మార్గులను సంహరించుటకు, ధర్మమును నిలుపుటకొరకున్ను ప్రతియుగమున సంభవించుచుందును.

వివరణ-

ధర్మము సజ్జనుల నాశ్రయించుటఁజేసి, అధర్మము దుర్జనుల కృత్యమగుటను, సజ్జనులను రక్షించుట, దుర్జనులను శిక్షించుటయు అనివార్యములగుచున్నవి. ధర్మము స్థిరపడినచో లోకకల్యాణము సిద్ధించును. ఇట్టి కర్తవ్యత్రయము-పరమేశ్వరుని చిచ్ఛక్తియొక్క అంశమగు వాసుదేవునకు సువిహితము కాగా- జగద్రక్షణభారమును పరమేశ్వరుఁడు మహావిష్ణువుపై నెలకొలిపినందున-భగవానుడు వైకుంఠమున శివానందామృతాస్వాదాభిరుచిని తగ్గించుకొని మానవలోకమునకు రావలసివచ్చునని వివేకము.

శ్లో॥ జన్మ కర్మ చ మే దివ్య-మేవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ-నైతి మామేతి సోఽర్జున ॥ 9

అర్జునా! స్వర్గమునుండి నేనవతరించుట యను జన్మను, ధర్మపరిపాలన మను కర్మను ఎవఁడు యథార్థముగ గ్రహీతరుగునో, అట్టి మహాపురుషుడు ఈ శరీరమును విడచుటతోడనే-పునర్జన్మ నొందనివాడై నన్ను అనఁగా? నా అంతరాత్మయైన పరమేశ్వరుని పొందును.

వివరణ-

భగవానుని అవతారము- సుకృతదుష్కృతకర్మమూలమైనది కాదనియు జగద్రక్షణార్థమై సంభవించుననియు దృఢముగా విశ్వసించి నిరంతరము భావించు మహాశయునకు జన్మరాహిత్యమొదవుటయే గాక భగవదంతరాత్మయగు శివునితో సాయుజ్యము సంభవించునని సారాంశము.

"మాం" అన్నపుడు- మదంతరాత్మయగు పరమేశ్వరుని యను నర్థము నంగీకరింపక- వాసుదేవునే- అను నర్థమును నిరూపించువారు- "ఈశ్వరః సర్వభూతానాం-హృద్దేశేఽర్జున తిష్ఠతి" "ఉత్తమః పురుష స్త్వన్యః-పరమాత్మేత్యుదాహృతః" "తమేవ చాద్యం పురుషం ప్రపద్యే" ఇత్యాది సందర్భమును శ్రీకృష్ణ పరముగ నన్వయింపలేరు గాన నిఁట గల అస్మచ్ఛబ్దమునకు అంతర్యామి పరత్వము అనివార్యమగుచున్నయది.

వాసుదేవుని జన్మకర్మలను తెలిసికొనినచో పరమేశ్వర ప్రాప్తి కలుగు నెట్లనఁగా? వాసుదేవుఁడు పరమేశ్వరచిచ్ఛక్త్యంశసంభూతుఁడైన మహావిష్ణువుఁ దగు నవతారమగుటచే- అవతారప్రయోజనజ్ఞానమునకు పరమేశ్వరనిష్ఠ-మూల మగుటఁజేసియు అట్టి భావన గలవానికి శివసాయుజ్యమే సంప్రాప్తమగు నని భావము.

శ్లో॥ వీతరాగభయక్రోధా-మన్మయా మా ముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా-పూతా మద్భావ మాగతాః ॥ 10

అనురాగము, భయము. క్రోధము అనువానిని పోగొట్టుకొనినవారై అనన్య భావనతో నా అంతరాత్మయగు పరమేశ్వరుని ధ్యానించుచు పరమేశ్వరుని భక్తి యోగమున సేవించునట్టి పెక్కురు మహానుభావులు జ్ఞాన (ఉపాసనా) రూపమగు తపస్సుచే పునీతులై శివసాయుజ్యము నొందినవారు గాన వాసుదేవుని జన్మకర్మ లను- వాసుదేవాంతరాత్మయగు పరమేశ్వరు నుపాసించుచు యథార్థము అనఁగా? లోకకల్యాణార్థము సంభవించునవిగా- గుర్తించుట, భావించుటయు మోక్షప్రదము లగునని సారాంశము.

వివరణ-

రాగద్వేషాదులు లేనివారి అంతఃకరణము ప్రశాంతముగ నుండుటఁజేసి అట్టి అంతఃకరణ (హృదయ) మున పరమేశ్వరుని ధ్యానించి ముక్తులు కావచ్చు నని విదితమైనది.

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే-తాం స్తథైవ భజామ్యహం ।
మమ వర్త్మానువర్తంతే-మనుష్యాః పార్థ! సర్వశః ॥ 11

పార్థా! ఎవరు ఏ విధముగా నన్ను అనఁగా? నా యంతరాత్మయగు పర మేశ్వరు నారాధింతురో, వారి నావిధముగానే నేను (నా యంతరాత్మ పరమేశ్వ రుఁడు) అనుగ్రహిం (చును)తును. ఇంద్రాదిదేవతలను పూజించు మానవులంద రును నా (నాలోని పరమేశ్వరుని) సంబంధమైన భజనమార్గము ననుసరించు చున్నవారు.

వివరణ-

నిష్కామముగా తన నుపాసించువారిని- మోక్షప్రదానముచేతను, సకామ

ముగా తనను లేక ఇంద్రాది సురల నారాధించువారిని-భోగవితరణము చేతను పరమేశ్వరుఁ డనుగ్రహించువాడు-

జ్ఞానతపస్సుచే పునీతులగువారికి జన్మరాహిత్యము నొసగుచు, కామ్యముల నర్థించి ప్రార్థించువారికి ప్రసన్నుఁడు కానట్టి పరమేశ్వరుఁడు-తనచే రక్షింపఁబడు మానవుల విషయమై పక్షపాతము గలవాడగు నను ఆశంకకు పై శ్లోకము సమాధానమగుచున్నయది.

పరమేశ్వరుఁడు- భక్తుల ఆరాధన ననుసరించి ఫలము నొసఁగువాడవి తెలియవలెను. ఇంద్రాది దేవతల నర్చించువారికి-ఇంద్రాదిరూపముననే సాక్షాత్కరించి ఫలము నొసఁగు పరమేశ్వరుఁడే భక్తులచే ఇంద్రాది రూపములలో సేవింపబడుచున్నవాడని పరమార్థము.

శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం-యజంత ఇహ దేవతాః।
క్షిప్రం హి మానుషే లోకే-సిద్ధి ర్భవతి కర్మజా॥ 12

అగ్నిష్టోమాది యజ్ఞరూపములగు కర్మలయొక్క స్వర్గసుఖభోగాది ఫలముల నపేక్షించు జనులు-ఇంద్రాది దేవతల నారాధించినయెడల- మానవలోకమున కర్మఫలభూతమైన స్వర్గాదిప్రాప్తి-ఈజన్మ గడువగానే శీఘ్రము సిద్ధించును.

వివరణ-

"ఇంద్రాదిదేవతల నారాధింతురు గాని మోక్షమునకై పరమేశ్వరు నందరెందుకు ఉపాసింపరు?" అను ప్రశ్నకు-పై శ్లోకము సమాధానమగునది. అగ్నిష్టోమాదికర్మలు కామ్యములగుటచే నవ్వానినాచరించినవారికి శివసాయుజ్య(మోక్ష)ము లభింపదు. నిష్కామ భక్తియోగముచేతనే మోక్షము సిద్ధించును. అట్టి భక్తియోగము సామాన్యులకు దుర్లభము కాగా "కోటి జన్మార్జితైః పుణ్యైః-శివే భక్తిః ప్రజాయతే" "కోటి పూర్వజన్మలయందు చేయఁబడిన పుణ్యముల పంటగా శివుని యందు అనన్యమైన ఏకాగ్రభక్తి-కలుగును" అన్నట్లు పుణ్యాత్ముల హృదయముననే శివభక్తి-యంకురించి పుష్పించి ఫలించునని శ్రీకృష్ణహృదయము ఇందు తేటతెల్లమగుచున్నయది.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం-గుణకర్మ విభాగశః।
తస్య కర్తార మపి మాం-విద్ధ్యకర్తార మవ్యయమ్॥ 13

బ్రాహ్మణులు మొదలగువారి సత్వాదిగుణముల యొక్కయు శమదమాది కర్మ (ఆచరణము)ల యొక్కయు విభాగముల ననుసరించి-నాలుగు వర్ణములను నా అంతరాత్మయగు పరమేశ్వరుఁడు పుట్టించెను. అట్టి వర్ణవిభాగమునకు నేను (నా యంతరాత్మ) కర్తనగుదుననియు, బ్రాహ్మణాదులను వ్యత్యాసముతో సృష్టించుటకు ప్రాణుల సుకృతదుష్కృతములు కారణములగుటఁజేసి- నేను (పరమేశ్వరుఁడు) కర్తను కాననియు గుర్తించుము!

వివరణ-

బ్రాహ్మణాది వర్ణములలో గల హెచ్చుతగ్గులు-ప్రాణుల పుణ్యపాపములఁబట్టి యేర్పడినవి- గాన అట్టి వ్యత్యాసము-వారి వారి గుణకర్మలపై ఆధారపడినదై జన్మతః సంభవించుననియు, అందుకు పరమేశ్వరుఁడు- పక్షపాతి యని ఆరోపించుట కూడదనియు వివేకము.

"వైషమ్య నైర్ఘృణ్యే న, సాపేక్షత్వాత్" అను వ్యాసప్రోక్తమగు బ్రహ్మసూత్రమున "పరమేశ్వరునకు దేవదానవమానవాది ప్రాణులపై పక్షపాత (వైషమ్యము) గాని నిర్దయ (నైర్ఘృణ్యము)గాని లేవు. ఎందుకనఁగా? ప్రాణుల కర్మననుసరించి కనఁబడు వ్యత్యాసమునకు పరమేశ్వరకర్తృత్వము ఉండదు" అని నిర్వచింపఁబడినది.

శ్లో॥ న మాం కర్మాణి లింపంతి-న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి-కర్మభి ర్న స బధ్యతే॥ 14

చిత్రవిచిత్రములైన సృష్ట్యాదికర్మలు- నన్ను అంటుకొనవు. సృష్ట్యాదుల వలన కలుగు ఫలమునందు నాకు అపేక్ష లేదు- ఇట్లు నన్ను (పరమేశ్వరుని) గుర్తించువాడు- పునర్జన్మప్రదములగు కర్మలతో బంధింపఁబడకుండును.

వివరణ-

సృష్టి- ప్రాణుల కర్మఫలముల ననుభవింపఁజేయుటకు ఏర్పడునది గాన అట్టి కర్మఫలితములు నాకు సంబంధింపవు. కర్మఫలితములు ననుభవింపవలెనను అపేక్షయు నాకు లేదు. పరమేశ్వరుని సృష్టిలో గల వ్యత్యాసము-ప్రాణికర్మమూలమైనదని- పరమేశ్వరుని యథార్థస్థితిని గుర్తించు మహాపురుషుఁడు జన్మపరంపర నొసఁగునట్టి కర్మపాశమునుండి విముక్తుండగును. ధాన్యోత్పత్తికి

మేఘము నిమిత్తమాత్రమైనట్లు- సృష్టి విచిత్రతకు భగవానుడు- నిమిత్తకారణము కాగా- ముఖ్యకారణము జీవకృతకర్మయని విదితమైనది.

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ-సర్వై రపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మా త్త్వం-పూర్వైః పూర్వతరం కృతమ్॥ 15

వ్యత్యాసము నిర్దయ లేనివాడు పరమేశ్వరుఁడని చెప్పిన విధమును మనస్సునందు నిలుపుకొని- మనువు మొదలగు ముముక్షుపులందరిచేతను పూర్వయుగములయందు కర్మ-ఆచరింపఁబడినది. అర్జునా! అట్టికర్మనే నీవు నిర్వర్తింపుము!

వివరణ-

"యే యథా మాం ప్రపద్యంతే" ఇత్యాది శ్లోకచతుష్టయమున ప్రసంగవశాత్ తారసిల్లినట్టి పరమేశ్వరునివిషమబుద్ధిని, కాఠిన్యమును నిరాకరించి పూర్వోక్తమైన కర్మయోగమును పై శ్లోకమునుండి విశదీకరించుచున్నవారు. మన్వాదులు ముముక్షుపులైనను నిత్యనైమిత్తికాదికర్మలను నిష్కామబుద్ధి నాచరించినందున, నీవు గూడ ఆ కోవకు చెందినవాడవగుటచేతను, జ్ఞాననిష్ఠతో కర్మ నాచరింపుమని భగవానుని ప్రబోధము- కౌంతేయు నాదేశించినదని భావము.

శ్లో॥ కింకర్మ కిమకర్మేతి-మునయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి-యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥ 16

ముముక్షువు ఆచరింపఁదగిన కర్మయెట్టిది? కర్తయగు జీవాత్మయొక్క యథార్థభావము ఏలాటిది? ఇవ్విషయమై ప్రతిభ (మేధాశక్తి) గలవారు గూడ మోహమును చెందినవారు. ఏ కర్మయోగమును యథార్థముగ తెలిసికొనినచో సంసారబంధమునుండి విడుదల యగునో, అట్టి కర్మయోగమును నీకు చెప్పెదను వినుము!

వివరణ-

బుద్ధిబలము గల మహానుభావులు గూడ- నిష్కామకర్మను ఫలాభిసంధి లేని కర్తను నిరూపింపఁజాలకున్నవారు. నిష్కామకర్మను యథార్థముగ నాచరించువారు-పరమేశ్వరప్రీతిపాత్రులై జన్మరాహిత్యము నొందుదురని తెలియవలెను.

శ్లో॥ కర్మణో హ్యపి బోద్ధవ్యం-బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణ శ్చ బోద్ధవ్యం-గహనా కర్మణో గతిః॥ 17

నిత్యము నైమిత్తకంబు నగు కర్మయొక్క స్వరూపము తెలియదగినది. నిషిద్ధకర్మయొక్క యథార్థస్థితి- గుర్తింపఁదగినదియు, ఎట్టి కర్మను చేయక యూఁరక నుండుటను గురించి విచారించుకొనవలెను గాన విధినిషేధరూపమగు కర్మయొక్క తత్త్వము-సుకరముగ తెలియరానిదగుచున్నయది.

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యే-దకర్మణి చ కర్మ యః।
స బుద్ధిమాన్ మనుష్యేషు-స యుక్తః కృత్స్నకర్మకృత్॥ 18

ఎవఁడు-సంధ్యావందన శివపంచాక్షరీజపాది నిత్యకర్మను శ్రాద్ధాది నైమిత్తికమును శివారాధనముగను; విహితమైన కర్మను చేయకుండుటను ప్రత్యవాయజనకమగు కర్మగాను బంధహేతువుగాను భావించునో, అట్టి సజ్జనుఁడు మానవులలో జ్ఞానయోగవేత్తయగుటయే గాక- సమస్త పుణ్యకర్మల నాచరించువాడు, శివధ్యానయోగయుక్తుండు నగును.

వివరణ-

కర్మఫలము నపేక్షింపక-నిత్యనైమిత్తికకర్మల నాచరించువానికి- పునర్జన్మబంధము సడలిపోవును. సంధ్యావందనాదులను చేయకుండినచో శివాపచారమగునుగాన అట్టి అకర్మ-సంసారపాశమున బంధించును. పరమేశ్వరారాధనబుద్ధి నాచరింపఁబడు కర్మ- శివానుగ్రహనిదానమగుటచే- సమస్త పుణ్యకర్మఫలము అట్టివానికి లభించును. పరమేశ్వరునందు అనన్యభక్తిగల మహానుభావుఁడు కర్మఫలములగు స్వర్గసుఖాదుల నపేక్షింపడని భావము.

కర్మను గురించి అకర్మను గురించియు కావలసిన పరజ్ఞానము ఇందు పొందుపరుపఁబడినది. స్వధర్మము నాచరించుట ఈశ్వరారాధనమగునని "యతః ప్రవృత్తి ర్భూతానాం—యేన సర్వ మిదం తతం। స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః" అను గీతాశ్లోకమున గాననగును.

శ్లో॥ యస్య సర్వే సమారంభాః-కామసంకల్పవర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం-తమాహుః పండితం బుధాః॥ 19

ఎవనికి కర్మలన్నియు కోరికల ననుసరించు సంకల్పములు లేనివగునో "పరమేశ్వరారాధనరూపములగునవి కర్మలు" అను దృఢ జ్ఞానమనెడు అగ్నితో

పూర్వజన్మకృతకర్మబీజములు దహింపబడును గాన నట్టివానిని జ్ఞానిగా వేదార్థ విదులు వక్కాణించుచున్నవారు.

వివరణ — ఈ జన్మయందు పరమేశ్వరారాధనబుద్ధిని నిత్యనైమిత్తికాది కర్మల నాచరించు వానియొక్క పూర్వకృతకర్మబీజములన్నియు నశించుటంజేసి శివానుగ్రహమున బంధవిముక్తి యగునని తాత్పర్యము.

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసంగం-నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి-నైవ కించిత్ కరోతి సః ॥ 20

కర్మ నాచరించుచు కర్మఫలమునందు అపేక్షను విడనాడి పరమేశ్వరు నారాధించుటచే కలుగు ఆనందము ననుభవించుచు యోగక్షేమములకై ఎవరిని గూడ ఆశ్రయింపక నుండు మహాపురుషుఁడు-నిత్యనైమిత్తికాది కర్మల ననుష్ఠించు చున్నను కర్మను చేయనట్లే నుండును.

వివరణ—దొరుకనిది లభించుట-యోగమనఁబడును. ప్రాప్తమును రక్షించుట-క్షేమమనంబడుఁగును. ఇట్టి యోగక్షేమములకై శివేతర దేవతలను గాని శ్రీమంతులైన మానవులను గాని ఆశ్రయింపక-నిత్యనైమిత్తికాది కర్మఫలమును పొంద వలెనను ఆశను తొలగించుకొని-కర్మయను మిషతో పరమేశ్వరు నారాధించుచు తృప్తిపడు శివయోగికి-పరమేశ్వరుఁడే యోగక్షేమముల నొనఁగూర్చుచుండు ననియు, కర్మఫలాభిసంధి లేనివానికి కర్మవలన పునర్జన్మాంకురములు సంభవింప వనియు, ఉదరపోషణార్థమైన కుటుంబభరణము కొరకున్ను ఎట్టి వ్యాకులతయు ఉండదనియు విదితమైనది.

శ్లో॥ నిరాశీర్యతచిత్తాత్మా-త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ-కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21

నిష్కాముఁడై-మనస్సును శరీరమును అదుపులో నుంచుకొని, స్రక్చందన వనితాదులపై మమకారమును తగ్గించుకొని యుండువాడు - శరీరముచేతనే నిర్వర్తింపఁదగినట్టి నిత్యనైమిత్తికాదికర్మ నాచరించుచున్నను-మోక్షప్రతిబంధక మగు దురితమును పొందఁజాలడు.

వివరణ—నిష్కామునకు-మనోనిగ్రహము శరీరనియంత్రణంబు ఆవసరము

లనియు, మమకారము కూడదనియు, సంధ్యావందనాది నిత్యకర్మలు, శ్రాద్ధాది నైమిత్తికంబులు నీశ్వరారాధనబుద్ధిని గావింపబడినచో బంధకములు కావనియు వివేకము.

శ్లో॥ యదృచ్ఛాలాభసంతుష్టో-ద్వంద్వాతీతో విమత్సరః।
సమః సిద్ధా వసిద్ధౌ చ-కృత్వాఽపి న నిబధ్యతే ॥ 22

యదృచ్ఛాలాభము (ప్రయత్నము లేకుండ లభించు దాని) చేతనే తృప్తి పడువాడు, శీతోష్ణాదులను సహించువాడు, ఏ ప్రాణియందును వైరము లేనివాడు, అప్రయత్నముగ ఏదేని లభించినను లభింపకున్నను సంతోషము గాని దుఃఖము గాని లేనివాడు నగు కర్మయోగి-కర్మనాచరించినను శుభాశుభ రూపమగు కర్మఫల బంధము నొందఁజాలడు.

వివరణ-ఈశ్వరార్పణబుద్ధిని నిత్యనైమిత్తిక కర్మల నాచరించుతఱి-శీతము ఉష్ణము మొదలగు ద్వంద్వములను సహించుచుండవలెను శరీరకుటుంబ పోషణార్థము-అధికశ్రమఁజెందక-సహజముగా లభించుదాని నుపయోగించుకొన వలెను. అనాయాసముగ ఒకప్పుడు లభింపనిదానికై వగవకూడదు. లభించినది గదా! అని విఱ్ఱవీగఁగూడదు. ఐతే జ్ఞాననిష్ఠ సిద్ధింపనట్టి పై లక్షణములు గల యట్టి మహాపురుషుని గూడ కర్మ-సంసారపాశబద్ధు నానర్పఁజాలదని సారాంశము-

శ్లో॥ గతసంగస్య ముక్తస్య-జ్ఞానావస్థితచేతసః।
యజ్ఞాయాచరతః కర్మ-సమగ్రం ప్రవిలీయతే॥ 23

ఫలాసక్తి లేనివాడై పరమేశ్వరారాధనమునందే చిత్తమును నిలిపి-పర మేశ్వరుని కొఱకై కర్మ నాచరించు నిష్కాముని కర్మ యంతయు పరమేశ్వరు నందు లీనమగును. అనఁగా? పునర్జన్మాది బంధకము కాదని భావము.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మ హవి-ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం।
బ్రహ్మైవ తేన గంతవ్యం-బ్రహ్మకర్మసమాధినా ॥ 24

అర్పణం-అనఁగా-స్రుక్ స్రువాదిసాధనములు-బ్రహ్మ (పరమేశ్వరుఁడు) ఘృతము మొదలగు హవిస్సు-పరమేశ్వరుఁడేను; బ్రహ్మరూపమగు అగ్నియందు

బ్రహ్మాంతర్యామికుఁడనగుటచే కర్తయు బ్రహ్మంబేగాన హవనము పరమేశ్వరునిచే చేయఁబడును. ఇట్లు పరమేశ్వరునందే నిష్ఠ గలవాడై కర్మనాచరించునెడల నట్టి కర్మయోగి-బ్రహ్మము (పరమేశ్వరు)నే పొందును.

వివరణ-కర్త, క్రియ, అగ్నియు సమస్తంబు పరమేశ్వరుఁడే నను నిశ్చయమున కర్మ నాచరించువానికి-కర్మ-బంధకము కానిదై-శివసాయుజ్యరూపమైన పరమముక్తి నొదవఁజేయునదనియు, ప్రకృతిని మించిన పరమాత్మను భావించుచు చేయఁబడు కర్మ-పరమేశ్వర స్వరూపమనియు విదితమైనది.

శ్లో॥ దైవ మేవాపరే యజ్ఞం-యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం-యజ్ఞేనై వోపజుహ్వతి ॥ 25

దేవతనుద్దేశించి హవిస్సు నగ్నియందు సమర్పించుట గల యజ్ఞమును కొందరు కర్మయోగులు చేయుచుందురు. మఱికొందరు-అగ్నియు శివస్వరూపమని భావించుచు శివార్పణబుద్ధిని యజ్ఞము నాచరించుచుందురు.

వివరణ-"రుద్రో వా ఏష యదగ్నిః" అను శ్రుతి ననుసరించి-యజ్ఞార్థమైన అగ్ని-శివస్వరూపమగునది. అట్టి అగ్నియందు హోత గూడా "శివోఽహం" భావనతో సమర్పించు హవనము-పూర్వ (24) శ్లోకోక్తరీతిని శివస్వరూపుఁడగు జీవాచే శివార్పణబుద్ధిని గావింపఁబడునది- శివ (బ్రహ్మ) యజ్ఞమనఁబడుననియు, ఆయా దేవతల నుద్దేశించి చేయఁబడు హవిస్త్యాగము దేవతాయజ్ఞమనఁబడుఁగుననియు వివేకము.

శ్లో॥ శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే-సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్ విషయా నన్యే-ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥ 26
సర్వాణీంద్రియకర్మాణి-ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ-జుహ్వతి జ్ఞానదీపితే ॥ 27

చెవులు మొదలగు ఇంద్రియములను-నిగ్రహరూపములగు అగ్నులందు హవనముఁజేయువారు కొందరు కాగా-మరికొందరు-శబ్దము మున్నగు విషయములను ఇంద్రియ రూపములైన అగ్నులయందు సమర్పించుచుందురు. ఇంక కొందరు యోగులు-జ్ఞానేంద్రియముల యొక్క శ్రవణాది కర్మలను కర్మేంద్రియముల యొక్క వచనాది కర్మలను జ్ఞానము (భక్తి)చే ప్రజ్వలించుచున్నట్టి శివధ్యానరూపంబు నగు యోగాగ్నియందు నిలుపుచుందురు.

వివరణ—వినుట చూచుట తాకుట మొదలగు విషయములను చెవులు కన్నులు తోలు మొదలగు ఇంద్రియములయందు సమర్పించుట యనఁగా? విషయముల ననుభవించు సమయమునందు నవ్వానియందు మమకారము లేనివారై ఇంద్రియముల నగ్నిగాను, విషయములను హవిస్సుగాను భావించుచుందురు.

ఇట్టి భావన—శాంభవదీక్షితులైన లింగాంగసంగులకు మాత్రము నుప యుక్తంబగునది-ఆహారపానీయాదుల నిష్టలింగమునకు సమర్పించి—పరమేశ్వర ప్రసాదముగ ననుభవింతురు గాన-విషయానుభవమంతయు శివార్పితంబగుటచే శివయోగులు నిస్సంగులగుదురని భావము.

ఇంద్రియనిగ్రహము, ఏకాగ్రచిత్తమున శివలింగమునందు (లేక) హృదయమునందు శివుని ధ్యానించుటయు, యజ్ఞములనఁబఱఁగునని విదితమైనది.

శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా-యోగయజ్ఞా స్తథాఽపరే।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ-యతయః సంశితవ్రతాః॥ 27

ధనమును సత్పాత్రలకు, ధాన్యమును అన్నదానాదిరూపముగను గృహ భవనాదులను యోగ్యులకు శివప్రీత్యర్థము సమర్పించు వారు; కృచ్ఛ్ర చాంద్రాయణ నక్తవ్రతాది తపస్సుల నాచరించువారు; చిత్తవృత్తులను నిరోధించు వారు; రుద్రాధ్యాయాదులను పఠించుచు శివ పంచాక్షరీ మహామంత్రమును జపించు వారు; పశుపాశపతిజ్ఞానమున పరమేశ్వరు నుపాసించువారు; తీక్ష్ణవ్రతములు గల వారును యజ్ఞకర్తలనఁబడుదురు.

వివరణ - మహేశ్వరులకు అన్నవస్త్ర భూషణ ధన గృహాదులను సమర్పించువారు దానయజ్ఞులుగాను; నక్తవ్రతాదుల నాచరించువారు తపోయజ్ఞులుగాను, చిత్తవృత్తులను నిలుపువారు యోగయజ్ఞులుగాను; రుద్రాధ్యాయాదివేద భాగములను చదువువారు స్వాధ్యాయయజ్ఞులుగాను; "సంసారపాశబద్ధుఁడైన జీవాత్మ—పశువనియు, సంసారము పాశము (తనుగు) అనియు, పశువును పాశము నుండి విడిపించువాడు-పతియనియు" స్వానుభవమున గుర్తించి-శివు నారాధించు వారు—జ్ఞానయజ్ఞులనియు, కఠినవ్రతముల నాచరించువారు—వ్రతయజ్ఞులనియు పేర్కొనఁబడుచున్నందున - పై సుకృతములన్నియు యజ్ఞములే నగునని సారాంశము.

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం-ప్రాణేఽపానం తథాఽపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా-ప్రాణాయామపరాయణాః॥ 29
అపరే నియతాహారాః-ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।

మరికొందరు-ప్రాణవాయువును అపానవాయువునందు స్తంభింపఁజేయు పూరకమును; అపానవాయువును ప్రాణవాయువునందు నిలుపు రేచకమును; ప్రాణ అపానవాయువుల రెంటిని నిరోధించు కుంభకమును గావించుచు "ప్రాణాయామము" అను అభ్యాసమును కొనసాగించువారును; ఆహారనియమరూపమగు వ్రతము నవలంబించి-ఇంద్రియములయందు విషయములను సమర్పించువారును;

వివరణ-ఆహారనియమమనఁగా ? ఒకేసారి నివేదింపఁబడి స్వీకరింపఁబడు ఆహారమును భరితమనెదరు. అట్టి భరిత వ్రతమును ఆజన్మాంతము ఆచరించు వారు నియతాహారులనఁబఱఁగుదురు. జిహ్వాచాపల్యమును విడనాడి నివేదితము రోచకము కాకున్నను శివార్పిత మను భావనతో భుజింపవలసియుండును.

జిహ్వేంద్రియమున రసము అను విషయమును, అటులే ఆ యా ఇంద్రియములయందు ఆ యా విహితములైన విషయములను సమర్పించువారు అర్పణ యజ్ఞులగుదురని భావము.

శ్లో॥ సర్వే ప్యేతే యజ్ఞవిదో-యజ్ఞక్షపితకల్మషాః॥ 30
యజ్ఞశిష్టామృతభుజో-యాంతి బ్రహ్మ సనాతనమ్।
నాయం లోకోఽ స్త్యయజ్ఞస్య-కుతోఽన్యః కురుసత్తమ ?॥ 31

కురుసత్తమా ! ద్రవ్యయజ్ఞాదిపరులైన వీరందరును యజ్ఞస్వరూపమును గుర్తెరిగినవారునై ద్రవ్యయజ్ఞాదుల వలన తమ దురితమును పోగొట్టుకొని యజ్ఞముల నొనర్చిన పిదప మిగులునట్టి అమృతరూపమగు ఆహారమును స్వీకరించుచు శివసాయుజ్యమును చెందఁగలుగుచున్నవారు. చెప్పఁబడినవానిలో ఏదేనొక యజ్ఞమును చేయనివానికి స్వల్పసుఖముగల ఈ లోకముగూడ నుపయుక్తము కాదు. పైగా బహుసుఖముగల స్వర్గాది పరలోకము లభించునని యెట్లు చెప్పనగును ?

వివరణ-"పరమేశ్వరుని ఆరాధన" అను భావనతో ద్రవ్యదానము మొదలగు యజ్ఞముల నాచరించినచో పశుపాశపతివివేకము గలవారై పునరావృత్తి రహిత

మగు శాశ్వతశివసాయుజ్య (మోక్ష) మును పొందుదురనియు; ఫలాపేక్షచే కర్మ యజ్ఞముల నాచరించు పుణ్యాత్ములకు స్వర్గాదిలోకములు లభించుననియు; ఫలాభిసంధిరహితముగ పుణ్యకర్మలను మరియు శివారాధనము నాచరించువారికి శివసాయుజ్యమే గాక సుఖ జీవనము కొనసాగుననియు విశదమైనది.

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా-వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్ విద్ధి తాన్ సర్వా-నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ 32

చెప్పఁబడిన రీతిగా పెక్కు తెఱఁగులు గల యజ్ఞములు వేదముఁదగు ప్రారంభమున విస్తరించి వక్కాణింపఁబడినవి. అట్టి యజ్ఞములన్నియు మనోవాక్కాయకర్మల వలన సంభవించునవని గుర్తింపుము ! ఇట్లు భావించి పూర్వోక్త యజ్ఞములను యథాశక్తి ఆచరించునెడ సంసారబంధవిముక్తిఁ బడయఁ గలుగుదువు !

వివరణ – అష్టవిధ యజ్ఞములలో–ఆహారనియమము నవలంబించి–శివలింగ ధారులైన శైవమహాజనులు–ఇష్టలింగమునకు నివేదింపనట్టి పదార్థమును స్వీకరింపక–నివేదితమును విసర్జింపకయు, నివేదితమునంతయు శివప్రసాదముగ భుజించి–శివనివేదితము దక్క మరియొక వస్తువును పరిగ్రహింపనట్టి-అర్పణ యజ్ఞము చివరిదైనందున–ఉత్తమశ్రేణిఁజెందియుండునదని తెలియుటచే-అర్పణ యజ్ఞులు ఒకే జన్మాంతమున–శివానుగ్రహ పాత్రులై శివసాయుజ్యము నొందుటకు–మోక్షసామ్రాజ్యపథమున నడుగిడుదురని-సారాంశము.

శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్-జ్ఞానయజ్ఞః పరంతప ।
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥ 33

పరంతపా! కర్మజ్ఞానసముచ్చయ రూపమగు కర్మలో–ద్రవ్యమయ యజ్ఞ (కర్మరూపమైన అంశ) మునకన్న–జ్ఞానయజ్ఞ (జ్ఞానరూపమైన అంశ)ము–శ్రేష్టమైనట్టిది. పార్థా! ఫలాభిసంధిరహితమగు కర్మయంతయు పతిపశుపాశ స్వరూప జ్ఞానమునందు పరిసమాప్తిఁజెందును.

వివరణ - కర్మయోగమునందు జ్ఞానము చేరుటచే-కర్మ-జ్ఞాన ప్రధాన మైనదనియు; అందు జ్ఞానాంశము ముఖ్యమనియు, వైదికకర్మయంతయు శివా రాధనముగ ఉపయుక్తంబగుననియు, జ్ఞానమనఁగా ? మాటలచే కలుగు మిడిమిడి జ్ఞానము కాదనియు, పాశమునుండి విడిబడుటకు పశువు-పతినుపాసించుట యను శివారాధనమే ననియు విదితమైనది.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన-పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం-జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥ 34

"అవినాశి తు తద్విద్ధి-యేన సర్వమిదం తతం" అని ద్వితీయాధ్యాయమున 17వ శ్లోకమునుండి "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిః" ఇత్యాది శ్లోకమువరకు చెప్పఁబడినదియు, "జ్ఞానం తేఽహం" ఇత్యాదిని చెప్పఁబడఁబోవునదియు నగు జ్ఞానమును - సాష్టాంగనమస్కారముతోడను, బాగుగా ప్రశ్నించుటతోడను, సేవించుటతోడను-గుర్తింపుము!

అట్లైనచో పరమేశ్వరుని యథార్థస్థితిని గుర్తించువారు సమాధియోగమున పరమేశ్వరుని దర్శించినవారు నగు మహానుభావులు పతి పశు పాశ వివేకము గల జ్ఞానము నుపదేశింతురు.

వివరణ — నాకు సంసారబంధము తారసిల్లినది ఎందుకు ? ఎట్లు ఆ బంధము విడిపోవును ? అని వినయవిధేయతలతో గురువుగారిని అడుగుట పరి ప్రశ్న యనఁబడును. గురువుగారి నిత్యానుష్ఠానమునకు వలయు సమిధలు, పుష్పబిల్వాదులను సమర్పించుట, తదితర ఉపచారముల నొనర్చుటయు సేవ యనఁబఱఁగును.

శిష్యుఁడు విరాగియై జిజ్ఞాసతో గురువును ప్రశ్నించినచో గురువు-ప్రసన్నుఁడై-పతియనఁగా-పరమేశ్వరుఁడనియు, సంసార పాశమునుండి విడ దీయుమని పశువు (జీవుఁడు) పతిని ప్రార్థించుటయే శివారాధనమనియు, శివా రాధనమునకై శాంభవదీక్షనొసఁగి ఇష్టలింగ నిరీక్షణాది దశావధానములను వివరించి చూపుటయే" జ్ఞానోపదేశమనియు, శైవసంప్రదాయము చాటుచున్నయది.

శ్లో॥ యత్ జ్ఞాత్వా న పున ర్మోహ-మేవం యాస్యసి పాండవ!
యేన భూతా న్యశేషేణ-ద్రక్ష్యస్యాత్మ న్యథో మయి ॥ 35

పాండుతనయా! జ్ఞానులచే నుపదేశింపఁబడిన జ్ఞానము నవలంబించినచో మనుష్యాది సంబంధమైన ఆత్మాభిమానమనఁదగు మోహమును, బంధువధాది మూలమైన భ్రాంతిని పొందజాలవు;

జ్ఞానము పరిపూర్ణమైనచో సమస్తప్రాణులను నీలో చూడఁగలుగుటయే గాక పరమేశ్వరుని యందును దర్శింపఁజాలుదువు!

వివరణ – "నిరంజనః పరమం సామ్య ముపైతి" "శివోపాసకుఁడు-పుణ్య పాప లేప రహితుఁడై శివునితో అత్యంత సమానత్వము నొందును" అను శ్రుతి ననుసరించి-తాను పరమేశ్వరుఁడును సర్వప్రాణులకు ఆశ్రయములగుదుమని భావించి దర్శించు శాంభవదీక్షితుఁడు-శివసాయుజ్యమును పొందునని సారాంశము.

శ్లో॥ అపి చేదసి పాపేభ్యః-సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ–వృజినం సంతరిష్యసి ॥ 36

పాపాత్ములందరికంటెను మిక్కిలి పాపిష్ఠివైనను జ్ఞానము అను పడవతో–పాపసముద్రమునంతటిని దాటఁ గలుఁగుదువు!

వివరణ – పాపసముద్రమనఁగా ? పాప పుణ్య సముదాయము-సముద్రమువలె దాటరానిదని తెలియవలెను.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని-ర్భస్మసాత్ కురుతేఽర్జున!
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి-భస్మసాత్ కురుతే తథా ॥ 37

అర్జునా!

మండుచున్న అగ్ని-కట్టెల నెట్లు కాల్చునో–ఆ విధముగా జ్ఞానమనెడి–వీతి హోత్రుఁడు–సమస్త కర్మలను భస్మీకరించును.

వివరణ – శివారాధనము అను ఉపాసనాత్మక జ్ఞానము-ప్రారబ్ధవశమున సంభవించు రాగద్వేషములను దినక్రమముగ తగ్గించుచు చిత్తశుద్ధిని సంపాదించును. పుణ్యముగూడ జన్మనిదానముగ బంధకమగుటచే పుణ్యములు పాపములు రెండును నశించినచో శుద్ధచిత్తమున శివుఁడు – భావలింగరూపమున సాక్షాత్కరించునని భావము.

శ్లో॥ న హి జ్ఞానేన సదృశం-పవిత్ర మిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః—కాలేనాత్మని విందతి ॥ 38

జ్ఞానముతో సమానము, జ్ఞానమునకన్న పవిత్రంబు నగు మఱియొకటి—కేవల కర్మయోగాదులయందు లేదు. ఫలాభిసంధిరహితమగు కర్మయోగము వలన కలుగు శుద్ధచిత్తమునందు గావింపఁబడు శివధ్యానయోగముచే - సాధకుఁడు కాలక్రమమున తనలోనే శివుని దర్శించుటచే సాక్షాత్కారజ్ఞానమును పొందును.

వివరణ—పరమేశ్వరుని ప్రత్యక్షముగ దర్శించు జ్ఞానమును మించినది మరియొకటి ఉండదని తెలియవలెను. "తతస్తు తం పశ్యతే నిష్కళం ధ్యాయమానః, పురిశయం పురుష మీక్షతే" "కర్మయోగపూర్వకముగ సంపాదింపఁబడిన చిత్తశుద్ధిని పరమేశ్వరుని ధ్యానించుచుండినచో విభాగరహితుఁడు, హృదయపురియందు నివసించువాడు, పరిపూర్ణుఁడు నగు పరమేశ్వరుని సాధకుఁడు చూడఁ గలుఁగును" అను శ్రుతివాక్యము-ఇందుకు తార్కాణము.

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం-తత్పరః సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి-మచిరేణాధిగచ్ఛతి ॥ 39

గురూపదిష్టమార్గమునందు శాస్త్రోక్తవిధానమునందైనను ఆసక్తికలిగినవాడై, బాహ్యాభ్యంతరింద్రియములను వశపఱచుకొనియు, శివధ్యానమునందే చిత్తమును నిలిపినచో-అట్టి సాధకుఁడు-పరమేశ్వరదర్శనము అను ప్రత్యక్షజ్ఞానము గలవాడై త్వరలోనే పరమముక్తిని పొందును.

వివరణ—శాంభవదీక్షాగురువు ఉపదేశించిన-భస్మరుద్రాక్షధారణమునందు శివపంచాక్షరీ మహామంత్ర జపమునందు ఇష్టలింగార్చనయందును పట్టుదల గలవాడై శివుని ధ్యానించుచు శివాగమప్రోక్తములగు షట్స్థల వివేకాదుల నుల్లంఘింపకుండినచో ఈ జన్మయందే భావలింగసాక్షాత్కారమై జన్మాంతమున శివసాయుజ్యము లభించునని భావము.

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ-సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి నపరో-న సుఖం సంశయాత్మనః ॥ 40

శాస్త్రము ఆచార్యుఁడు ఉపదేశించిన విధానమును తెలియనివాడు, ఉపదేశ

మును విశ్వసింపనివాడు, ఉపద్రిష్టము సిద్ధించునో లేదో అని సంశయించువాడున్ను తాను సాధించు ప్రయోజనమును పోగొట్టుకొనును. సంశయాత్ముడైతే ఈ లోకము పరలోకము లేకుండుటయే గాక సుఖభోగంబు నుండఁజాలదు.

వివరణ—"ఇదం కురు! ఇదం మాకురు" ఇత్యాదిని శాస్త్రము తెలుపు ధర్మాధర్మములను గుర్తింపనివాడు, ఆచార్యుఁడు (గురువు) ఉపదేశించు విధానముపై శ్రద్ధ లేనివాడు, "ఇది అవునో కాదో" అని సంశయించువాడును ఈలోకమున ధనముగడించుట మున్నగువానిని సాధింపలేడు. పైలోకమునుగూడ పొందలేడు. అట్టివానికి—జీవితమునందును సుఖానుభవంబు నుండదని సారాంశము.

శ్లో॥ యోగసన్న్యస్తకర్మాణం-జ్ఞానసంఛిన్నసంశయం ।
ఆత్మవంతం న కర్మాణి-నిబధ్నంతి ధనంజయ ॥ 41

ధనంజయా! శివారాధనరూపమగు కర్మయోగముచే పరమేశ్వరునకు కర్మలనన్నిటిని సమర్పించి—పరమేశ్వర దర్శనముచే సంశయమును పోగొట్టుకొనియు—అప్రమత్తుడై యుండువానిని – పుణ్యపాపరూపములగు పూర్వకర్మలన్నియు బంధించునవి కావు.

వివరణ—శివారాధనము కర్మయోగమైనను ధ్యానయోగముగ పరిణమించుటచే కర్మఫలముల నాశించు మనస్సు అంతరించును గాన పూర్వకర్మలన్నియు శూన్యప్రాయములగుననియు, సంశయమును తగ్గించుకొని శివుని ధ్యానించు చుండినచో ఈశ్వరుఁడు సాక్షాత్కరించుననియు, సాక్షాత్కారముచే సంశయము లన్నియు పటాపంచలగుననియు, శివారాధనమున అపచారములు లేకున్నచో అట్టివానిని—పూర్వకృతమలు సంసారపాశమున బంధింపవనియు విదితమైనది.

శ్లో॥ తస్మా దజ్ఞానసంభూతం-హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగ-మాతిష్ఠోత్తిష్ఠ! భారత ॥ 42

అందువలన—అవివేకముచే కలుగునట్టి, మనోగతంబునగు నీ సంశయమును గురూపదేశమువలన వివేకము అను కత్తితో ఛేదించి—కర్మయోగము ననుష్ఠింపుము! స్వధర్మమగు యుద్ధమునకై సన్నద్ధుఁడవు కమ్ము!

వివరణ—ఎద్ది కర్తవ్యము? ఎద్ది కర్తవ్యము కాదు? అను విచారణ లేనిచో

వివేకము నశించును. అవివేకమువలన సంశయము మనస్సునందు పాదుకొనును. గురువు నాశ్రయించి దీక్షగైకొనినయెడల-వివేకము సంభవించును. సంశయము తొలగును. సంశయము దూరమైనచో స్వధర్మమగు కర్మయోగము సిద్ధించును. అనర్థములన్నిటికిని-ఆలవాలము సంశయమగునని సారాంశము.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మ
విద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,
యజ్ఞవిభాగయోగో నామ చతుర్థోఽధ్యాయః

ఇయ్యది - శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీ మద్భగవద్గీతా
భాష్యమున "మనో రంజనం" బను శాంకరీయ ఆంధ్రానువాదమున
నాలుగవ అధ్యాయము.

---

## శ్రీ శివాద్వైతసిద్ధాంత విశదీకరణము-4

80 వ పేజీ తరువాయి

శ్లో॥ రామం శివో ధ్యాయతీతి-రామోత్కర్ష మతిబ్రువన్ ।
కశ్చిచ్ఛివస్య పారమ్యం-వారయన్ పాప మశ్నుతే ॥ 16

శక్తి కేశవ విఘ్నేశ-కుమార రవి వర్గకం ।
పరివారః శివస్యేతి-శైవా స్తత్పూజనాదరాః ॥ 17

అతః శంభుం సమారాధ్య-సర్వదేవాన్వితం పరం ।
ప్రాప్నుయు ర్భుక్తిముక్తీచ-పరతత్త్వార్థ చింతకాః ॥ 18

శైవాదినిందకస్యైత-త్సమాధానం భవేదితి ।
మత్వా వై శైవసిద్ధాంత-విశదీకరణం కృతమ్ ॥ 19

ఏతావతాఽన్య సిద్ధాంతే-చేర్ష్యా మమ న విద్యతే ।
ఇతి జ్ఞాత్వా బుధాగ్రణ్యః-మోదంతాం శంకరేచ్ఛయా ॥ 20

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ భగవద్గీత

## పంచమాధ్యాయము

"మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాదసహితము

అర్జున ఉవాచ-

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ! పున ర్యోగం చ శంససి।
యచ్ఛ్రేయ ఏతయో రేకం-తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥ 1

కృష్ణా! కర్మసన్న్యాసము కర్మయోగము అను రెంటిని చెప్పుచున్నావు; ఈ రెంటిలో ఏద్ది శ్రేయస్కరమో అద్దాని నాకదానిని నిశ్చయించి నుడువుము!

వివరణ—"యస్య సర్వే సమారంభాః" అను పందొమ్మిదవ శ్లోకమునుండి కామసంకల్పాదులు లేనట్టి కర్మ-జ్ఞానస్వరూపమగునని నాలుగవ అధ్యాయమున చెప్పఁబడినది. ఈ ఐదవ అధ్యాయమున కర్మయోగము పరమేశ్వరుని పొందుటకు సాధనమైనను జ్ఞాననిష్ఠయే అంతరంగ సాధన మనియు, అట్టి జ్ఞాననిష్ఠ- తాను కర్త గానని అనుసంధించుచున్నచో బలపడుననియు, జ్ఞాననిష్ఠకు వలయు బుద్ధి బలమును సంపాదించవలెననియు ఉపదేశింపఁబడుచున్నయది.

"యోగసన్న్యస్త కర్మాణం" ఇత్యాదిని జ్ఞానయోగము;

"నియతం కురు కర్మత్వం" ఇత్యాదిని కర్మయోగంబు నిరూపింపఁబడుటచే భగవానుని ఆశయము విశదముగా తెలియనందున అర్జునుఁడు కర్మజ్ఞాన యోగములు వేరువేరని భావించి "ఈ రెంటిలో శ్రేయస్సు నొసఁగు యోగమును తేల్చి వక్కాణింపు" మని ప్రశ్నింపవలసివచ్చెను.

వివరణ-ఇఁట సన్న్యాస మనఁగా-జ్ఞానయోగ మని భాష్యకర్తలగు శ్రీ నీల

కంఠ భగవత్పాదులు వివరించిరి. "సన్న్యాసము కర్మత్యాగపరముగ వ్యాఖ్యానించుట— మూలము ననుసరించునని పరులు భావించుట- సరికాదు. భగవద్గీతలలో ముందు ఎచ్చోటను సన్న్యాసపదము కర్మత్యాగపరమని చెప్పఁబడలేదు.

"జ్ఞానయోగేన సాంఖ్యానాం-కర్మయోగేన యోగినాం" ఇత్యాదిని తృతీయాధ్యాయగత తృతీయ శ్లోకమున కర్మజ్ఞాన యోగములే నిర్దేశింపఁబడినవి.

"కర్మణ్యకర్మ యః పశ్యేత్" ఇత్యాదిని— "కర్మత్యాగము విధింపఁబడినది" అను పరుల వచనము—పరిగ్రాహ్యము కాదు ఎందుకనఁగా?

"యజ్ఞో దానం తపః కర్మ-న త్యాజ్యం కార్యమేవ తత్"

"కామ్యానాం కర్మణాం న్యాసం-సన్న్యాసం కవయో విదుః"

"సర్వకర్మఫల త్యాగం-ప్రాహు స్త్యాగం విచక్షణాః"

"న కర్మణా మనారంభా-న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే"

"న చ సన్న్యసనా దేవ-సిద్ధిం సమధిగచ్ఛతి"

"నియతస్య తు సన్న్యాసః-కర్మణో నోపపద్యతే"

"మోహా త్తస్య పరిత్యాగ-స్తామసః పరికీర్తితః"

ఇత్యాది నీ గీతలయందే-కర్మత్యాగము కూడదనియు; యజ్ఞము దానము తపస్సు అనువానిని విడువక చేయవలయుననియు, కామ్యకర్మలను విడనాడుట సన్న్యాసమనియు; కర్మఫలముల నపేక్షింపకుండుటను త్యాగముగ జ్ఞానులు పరిగణింతురనియు, కర్మలను చేయునిది జ్ఞానము పురుషునకు సిద్ధింపదనియు; కర్మలను విడిచినంతమాత్రమున మోక్షము లభింపదనియు;నియతమైన సంధ్యావందన శివమంత్రజప శివారాధనాది కర్మలను విసర్జించుట కూడదనియు; ఒకవేళ అవివేకమువలన నిత్యనైమిత్తికకర్మల నాచరింపనిచో అట్టి కర్మ త్యాగము తామసమగు ననియు నిరూపింపఁబడినది.

"సాంఖ్యయోగౌ పృథక్ బాలాః-ప్రవదంతి న పండితాః" అనుచో జ్ఞానకర్మ యోగములు వేరువేరని మందబుద్ధి గలవారు చెప్పుదురు గాని పండితులు అంగీకరింపరని- భగవానుఁడే కర్మసన్న్యాసమనఁగా—కర్మఫలత్యాగరూపముగ జ్ఞాన యోగమగునని- కంఠోక్తిగా నిర్ధారించినవాడు.

శ్రీ భగవానువాచ—

శ్లో॥ సన్న్యాసః కర్మయోగ శ్చ-న్నిశ్శ్రేయసకరా వుభౌ।
తయోస్తు కర్మసన్న్యాసాత్-కర్మయోగో విశిష్యతే॥ 2

జ్ఞానయోగము, కర్మయోగము అను రెండు- నిఃశ్రేయస్సు నొదవఁ జేయునవియేను. ఐనను అవ్వానిలో జ్ఞానయోగమునకంటె—కర్మయోగము విశేషించి నిఃశ్రేయస్సు నొసఁగునది.

వివరణ-జ్ఞానయోగము ననుష్ఠింపగలవానికి గూడ-కర్మయోగము శ్రేయస్కరమగును గాన యజ్ఞతపోదానాదికర్మల నీశ్వరార్పణబుద్ధి నాచరించుచు జ్ఞానయోగమును ప్రతిఘటించు దురితములను పోగొట్టుకొని-శివ ధ్యానమను జ్ఞానయోగము నభ్యసింపవలెనని సారాంశము.

శ్లో॥ జ్ఞేయః స నిత్యసన్న్యాసీ-యో న ద్వేష్టి న కాంక్షతి।
నిర్ద్వంద్వో హి మహాబాహో!-సుఖం బంధాత్ప్రముచ్యతే॥ 3

ద్వేషమును అనురాగమును విడనాడి కర్మల నాచరించువాడు నిత్యసన్న్యాసి యనఁబడును. మహాబాహో! సుఖదుఃఖాది ద్వంద్వభావమును విడనాడు వాడు-సంసారబంధమునుండి అవలీలగా విడిబడును.



వివరణ-నిత్యసన్న్యాసి యనఁగా- జ్ఞానయోగమునందు నిష్ఠ గలవాడని యర్థము. చేయఁబడు కర్మ- పరమేశ్వరుని ఆరాధనమని నిశ్చయించుకొనుటచే పరమేశ్వరుని ధ్యానించు జ్ఞానయోగము బలపడునని భావము.



శ్లో॥ సాంఖ్యయోగౌ పృథక్ బాలాః-ప్రవదంతి న పండితాః।
ఏక మప్యాస్థితః సమ్య-గుభయో ర్విందతే ఫలమ్॥ 4

జ్ఞాన, కర్మయోగములు వేరు వేరు అని అల్పజ్ఞులు వక్కాణింతురు కాని పండితులు (అభిజ్ఞులు) వచింపరు. ఈ రెంటిలో ఏ ఒకదాని నవలంబించినను- అనఁగా? యథావిధి-అనుష్ఠించినను రెండుయోగముల ననుష్ఠించిన ఫలమును పొందును.

వివరణ—కర్మయోగము జ్ఞానయోగంబు రెండును పరమేశ్వరప్రాప్తికి

నిదానములగుటచే— ఫలాపేక్షను విడనాడి చేయఁబడు కర్మయోగమున—ఈశ్వర నిష్ఠ అను జ్ఞానయోగము ఇమిడియుండుటచే—శివపూజాజపధ్యానాదులను భక్తి శ్రద్ధలతో ఆచరించు మహాపురుషుఁడు— కర్మజ్ఞాన యోగములను విడివిడిగా చేయ నవసరము లేదనియు "ఫలభేదముండుటచే కర్మజ్ఞానయోగముల రెంటి నొకే వ్యక్తి చేయరాదను" వాదము నిర్మూలమనియు విదితమైనది

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం-తద్యోగై రపి గమ్యతే।
ఏకం సాంఖ్యంచ యోగంచ-యః పశ్యతి స పశ్యతి॥ 5

జ్ఞాననిష్ఠ గలవారికి లభించు శివసాయుజ్యమను స్థానమునే కర్మయోగులు గూడ పొందుదురు. ఎవఁడు జ్ఞానకర్మయోగముల నొక్కటిగానే భావించునో, వాడే పరమేశ్వరుని యథార్థస్థితిని గుర్తించువాడగును.

వివరణ-కర్మజ్ఞానయోగములు వేరు వేరు కావని దృఢముగా విశ్వసించుచు ఏదే నొకదాని నాచరించువాడే-పరమేశ్వరుని సాక్షాత్కరించుకొని ముక్తుండగునని భావము.

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖమాప్తు మయోగతః।
యోగయుక్తో ముని ర్బ్రహ్మ-న చిరేణాధిగచ్ఛతి॥ 6

మహాబాహో! కర్మయోగమును విడనాడి-జ్ఞానయోగము నవలంబించుట-శక్యము కాదు. కర్మయోగము ననుష్ఠించుచు పరమేశ్వరుని వైభవమును చింతించు భక్తాగ్రేసరుఁడు—పరమేశ్వరుని (బ్రహ్మమును) త్వరలో పొందజాలును.

వివరణ—ఈశ్వరప్రీత్యర్థమై— స్వవర్ణాశ్రమోచితములగు నిత్యనైమిత్తిక కర్మల నాచరించుచు శివు నారాధించువాడు—కాయక్లేశాదులు లేనివాడై -ప్రారబ్ధాంత మున శివానందము ననుభవించువాడగుననియు, కేవల జ్ఞానయోగము—దుఃఖసాధ్య మగుటచే—అట్టివాడు—చాలకాలమునకు ముక్తుండగుననియు తెలియవలెను.

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా—విజితాత్మా జితేంద్రియః।
సర్వభూతాత్మభూతాత్మా-కుర్వన్నపి న లిప్యతే॥ 7

పరమేశ్వరు నారాధించుట రూపముగా గల విహితమైన కర్మయోగము ననుష్ఠించుచు చిత్తశుద్ధి గలవాడై మనస్సు నరికట్టి, ఇంద్రియములను వశపఱచు

కొనియు దేవమానవాది సర్వప్రాణులలో అంతరాత్మయగు పరమేశ్వరుఁడే నేను అను "శివోఽహం" భావన గలవాడు-కర్మఫలము అనుభవమునకు రానందున-కర్మఁజేయుచున్నను-బద్ధుఁడు కాకుండును.

వివరణ-శాస్త్రవిహితమైన సంధ్యావందనాది కర్మ-పరమేశ్వరారాధన రూపమగుటచే-అట్టి కర్మయోగము చిత్తశుద్ధిని కలిగించును. వస్తుతః తాను జీవాత్మయైనను బంధవిముక్త్యనంతరము సంభవించు శివత్వమును తనపై ఆరోపించుకొని- శివారాధనభాగముగా "శివోఽహం" భావన గలవాడు. నామదేవాదుల వలె శివతాదాత్మ్యము నొంది- కర్మఁజేయునెడల- అట్టి కర్మాచరణము బంధకము కాదు అని సారాంశము.

శ్లో॥ నైవ కించిత్ కరోమీతి-యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్జిఘ్ర-న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥
ప్రలపన్ విసృజన్ గృహ్ణ-న్నున్మిష న్నిమిష న్నపి ।
ఇంద్రియాణీంద్రియార్థేషు-వర్తంత ఇతి ధారయన్ ॥ 9

పరమేశ్వరుని యందు నిష్ఠగలిగి కర్మనాచరించువాడు-శ్రోత్రాదిజ్ఞానేంద్రియములు, వాగాది కర్మేంద్రియములు, పంచ ప్రాణములును తమతమ విషయములయందు ప్రవర్తించుచున్నవని నిశ్చయించుకొని చూచుచు, వినుచు, తాకుచు వాసనఁజూచుచు, తినుచు, నడచుచు, నిద్రించుచు, నిట్టూర్చుచు, మాటలాడుచు, విడచుచు, తీసికొనుచు, తెఱచుచు; మూయుచు నున్నను- నేనేమియు చేయలేదని భావింపవలెను.

వివరణ-కనులకు చూపు, చెవులకు వినికిడి, తోలునకు స్పర్శ, ముక్కునకు ఆఘ్రాణించుట. నోటికి భక్షణము. కాళ్ళకు నడక, బుద్ధికి నిద్ర, ప్రాణవాయువునకు శ్వాసము, వాక్కునకు మాట, పాయూపస్థములకు విడచుట, హస్తములకు స్వీకరించుట, కూర్మవాయువునకు ఉన్మేషనిమేషములు- సహజసిద్ధములగునవి భావించుచు ఇట్టి విషయములకు నేను బాధ్యుఁడను కానని- విహితకర్మల నాచరించుచు శివు నారాధించుచుండవలెనని భావము.

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి-సంగం త్యక్త్వా కరోతి యః।
లిప్యతే న స పాపేన-పద్మపత్ర మివాంభసా ॥ 10

ఎవడు- కర్మలను పరమేశ్వరునిపై భారము నునిచి ఫలము నపేక్షింపక చేయునో, వాడు- నీటితో కమలము వలె- కర్మఫలముతో బంధింపఁబడఁ జాలడు.

వివరణ—వైదికములు లౌకికములు నగు కర్మల నీశ్వరప్రీత్యర్థమై ఆచరించువానికి- కర్మఫలమునందు అపేక్ష యుండదు గాన- అట్టివాడు-తామరాకు ఉదకమునంటనట్లు- జన్మపరంపర నొసఁగు కర్మఫలముతో సంబంధము లేనివాడగునని సారాంశము.

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా-కేవలై రింద్రియై రపి।
యోగినః కర్మ కుర్వంతి-సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే ॥ 11

కర్మయోగులు- కర్మయందు అభినివేశము లేనట్టి శరీరముతో మనస్సుతో బుద్ధితో ఇంద్రియముల తోడను ఫలాపేక్షను విసర్జించి- చిత్తశుద్ధికై కర్మనుచేయుచుందురు.

వివరణ-ఈశ్వరప్రీతితో చిత్తశుద్ధిని సంపాదించుటకయ్యే సంధ్యావందన శ్రాద్ధాది నిత్యనైమిత్తిక కర్మల నాచరించుచు శివు నర్చించుచు-ఇదంతయు నా కొరకు కాదని— దృఢముగా భావింపవలసియుండును.

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా-శాంతి మాప్నోతి నైష్ఠికీం।
అయుక్తః కామకారేణ-ఫలే సక్తో నిబద్ధ్యతే ॥ 12

పరమేశ్వరప్రీతికై కర్మల నాచరించుచున్నానను భావము గల యుక్తుఁడు కర్మఫలరూపమగు సంసారబంధమును విడనాడి-శివసాయుజ్యరూపమగు మోక్షము నొందురు. ఈ లోకఫలమునకై మరియు స్వర్గాదిభోగముకొఱకు కర్మఁజేయుచున్నానను భావము గల అయుక్తుడు కోరికలకు లోబడి కర్మఫలమునందు ఆసక్తి గలవాడై సంసారబద్ధుఁడయ్యే యుండును.

వివరణ-కర్మ—సంసారబంధమునఁ బడవేసి జన్మపరంపర నొసఁగు పుణ్యపాపరూపమైనను ఫలము నపేక్షింపక ఈశ్వరప్రీత్యర్థము ఆచరించువానికి చిత్తశుద్ధిని కలిగించి జ్ఞానదార్ఢ్యమున జన్మరాహిత్యము నొదవఁజేయునని భావము.

శ్లో॥ సర్మకర్మాణి మనసా-సన్న్యస్యాస్తే సుఖం వశీ।
నవద్వారే పురే దేహే-నైవ కుర్వ న్న కారయన్ ॥ 13

తనకు భాసించు కర్తృత్వము—పూర్వకర్మఫలముగ నేర్పడిన శరీరముఁ జెందినది గాని సహజసిద్ధము కాదని మనస్సుచే కర్మలనన్నిటిని నవద్వారపురమగు దేహమునందు నునిచి—జీవాత్మ—దేహేంద్రియాదిపరవశుఁడు గాక—కర్తృత్వము గాని కారయిత్వత్వము గాని దేహమునకే గాని తనకులేదని భావించి సుఖముగ నుండును.

వివరణ-శరీరాది రూపముగ పరిణమించిన ప్రకృతియందే కర్తృత్వమును భావింపవలెననియు తనయందు ఆరోపించుకొనఁగూడదనియు అట్టివాడే శరీరమునందు నిశ్చింతగ నుండుననియు సారాంశము.

నేత్రములు, ముక్కులు, చెవులు, ముఖము, పాయూపస్థములు అను ద్వారములు తొమ్మిది-శరీరమునకు గలవని తెలియవలెను.

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి-లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం-స్వభావస్తు ప్రవర్తతే ॥ 14

కర్మవశ్యుఁడు కానట్టి పరమాత్మయగు ప్రభువు—దేవమానవాది లోకమునకు-కర్తృత్వమును గాని కర్మలమ గాని కల్పించుట లేదు. అటులే కర్మఫల సంబంధమును గూడ అంటగట్టుట లేదు. ఐతే ప్రకృతివలన నేర్పడు వాసన యనఁదగిన స్వభావమే ప్రవర్తించుచున్నది.

వివరణ—దేవమానవ స్థావరాది రూపముగ నుండు లోకము— పూర్వకర్మ వాసన ననుసరించియే కర్తయగుటయు, పుణ్యాపాపకర్మలఁజేయుటయు సంభవించుచున్నవి. దేవతల కర్తృత్వము అసాధారణము కాగా మానవుల కర్తృత్వము నొకప్పుడు అసాధారణమగుచుండును.

అటులే కొన్ని కర్మలు దేవతలకు సాధ్యములు కాగా— కొన్ని కర్మలు మానవులచే ఆచరింపఁదగినవిగ నుండును. ఐతే వీరు కష్టపడవలెనని, వారు సుఖపడవలెనని, పరమాత్మ-భావించువాడు కాడు. పూర్వాపూర్వ కృతములగు కర్మలవలన కలుగు వాసనల ననుసరించి—జీవాత్మలు దేవమానవ పశుపక్ష్యాది

జన్మల నొందుచు-సుకృత దుష్కృతముల నాచరించుచు సుఖదుఃఖముల నను భవించుచుందురని భావము.

శ్లో॥ నాదత్తే కస్యచిత్ పాపం-న చైవ సుకృతం విభుః।
అజ్ఞానేనావృతం జ్ఞానం-తేన ముహ్యంతి జంతవః ॥ 15

పరమాత్మ-ఒకానొకని పాపమును గాని పుణ్యమును గాని స్వీకరించు వాడు కాడు. జీవాత్మ-సహజమైన జ్ఞానమును- అనాదినాలము నుండి ఏర్పడిన అపచారమువలన-పోగొట్టుకొనుచున్నవాడు. అందుచేత ప్రాణులు-మోహముఁ జెందుచున్నవారు.

వివరణ-పరమాత్మ ఎక్కడినుండియో తటస్థించువాడు గాక- ఒకనికి అనుకూలుఁడు, మరియొకనికి ప్రతికూలుఁడును కాడు. అందువలననే శుభాశుభము లను పరిగ్రహించుట లేదు. జీవాత్మ-తనవారైన భార్యాపుత్రాదుల దుఃఖమును నివారింపలేడు. సుఖమును ఆపఁజాలడు.

మహాసృష్ట్యాదిని తనకు గల తెలివిని- పరమేశ్వరు నారాధింపకుండుట యను అపచారముతో లోపింపఁజేసికొని-జన్మపరంపరా ప్రవాహమున కొట్టు మిట్టాడువాడు జీవాత్మయని శ్రుతిసూత్రములు నిరూపించుటచే- అవిద్య లేక ప్రకృతి- సంసారకారణమగునని చెప్పుట-అప్రామాణికమగుచున్నయది.

"పరాభిధ్యానాత్తు తిరోహితం, తతోహ్యస్య బంధవిపర్యయౌ" "ఈ జీవాత్మ యొక్క విజ్ఞానము-పరమేశ్వరుని సంకల్పముచే-మరుగుపడినది గాన బంధ మోక్షములు రెండు నీశ్వరునివలన సంభవించుచున్నవి" అను వ్యాససూత్రము; "సంసారమోక్షస్థితి బంధహేతుః""బంధము మోక్షము జీవనము ఇత్యాదులకు ఆది కారణము పరమేశ్వరుఁడగు" నను శ్రుతియు ఇందు తార్కాణములగుచున్నవి.

శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం-యేషాం నాశిత మాత్మనః।
తేషా మాదిత్యవత్ జ్ఞానం-ప్రకాశయతి తత్పరమ్ ॥ 16

ఎవరు - పరమేశ్వరోపాసన (జ్ఞాన) ముచే - స్వరూపమును మఱుగుపరచు అజ్ఞాన (అల్పజ్ఞాన) మును నశింపఁజేసికొనెదరో, అట్టివారి ఏకాగ్ర శివధ్యానాత్మక మగు జ్ఞానము-సూర్యుఁడు చీకటిని పారద్రోలి సమస్తమును దర్శింపఁజేయునట్లు- పరమేశ్వర స్వరూపమును ప్రకాశింపఁజేయును.

వివరణ- శాంభవదీక్షఁ బరిగ్రహించి నిత్యశివారాధనమున ఏకాగ్రముగ ఇష్టలింగమునందు భావలింగమును ధ్యానించు శివయోగులు-అంత్యకాలమున భావ లింగ సాక్షాత్కారము గలవారై-సంచిత ఆగామి కర్మల నన్నిటిని పటాపంచలుఁ జేసికొని-శాశ్వత శివసాయుజ్యము నొందుదురని సారాంశము.

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన- స్తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛంత్యపునరావృత్తిం-జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ 17

శివోపాసనతో పరమేశ్వరుని ప్రకాశము కాగా"పరమేశ్వరుఁడే పరతత్త్వము" అను దృఢనిశ్చయబుద్ధి గలవారు, "పరమేశ్వరుఁడే నేను"అను భావన గలవారు, పరమేశ్వరునే నిరంతరము ధ్యానించు నిష్ఠ గలవారు,దారాపుత్ర ధన ఏషణత్రయ మును విసర్జించి పరమేశ్వరునందు తమ చిత్తమును నిలువువారు నగు మహా పురుషులు-"నిత్యం త్రిసంధ్యం శివలింగ మభ్యర్చ్యేమ్" ఇత్యాది శ్రుతుల నను సరించి-ప్రతిదినము ముప్పేళల శివలింగమును పూజించుచు శివజ్ఞానముచే తమ పునర్జన్మహేతువులగు పుణ్యపాపకర్మల సముదాయమనఁదగు కల్మషమును పోగొట్టుకొని-ముక్తులగుదురు.

వివరణ-పుణ్యమును ఫలాపేక్షచే చేసినచో అదియు పునర్జన్మ నొసఁగును. పునర్జన్మయందు పునః పుణ్యమును ఫలాకాంక్షచే గావించునెడ-జన్మ పరంపర-తప్పకుండును. ఫలము నపేక్షింపక శివార్పణబుద్ధి నాచరింపఁబడు-పుణ్యము శివానుగ్రహమునకు నిదానమగును గాన శివదర్శనమునొంది శివానందము ననుభ వింప-శాశ్వత శివలోక నివాసము గలవారగుదురని భావము.

శ్లో॥ విద్యావినయసంపన్నే-బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ-పండితాః సమదర్శినః॥ 18

విద్యావినయములు గల బ్రాహ్మణునియందు గోవునందు గజమునందు శునకమునందు అంత్యజునియందును పండితులు సమభావన గలవారగుదురు.

వివరణ-వేదశాస్త్ర పరిజ్ఞానము వినయంబు గల సత్త్వగుణ ప్రధానుఁడైన బ్రాహ్మణుఁడు సర్వోత్తముఁడగుటచే అతనియందును విద్యావినయన్యూనతగలిగి యున్నను అగ్రవర్ణ సంజాతుఁడగుటచే అట్టి బ్రాహ్మణునియందును పరమేశ్వరుఁడు

పరమాత్మరూపమున నున్నాడని భావించునట్లు-రజోగుణ తమోగుణ ప్రధానములైన గోహస్త్యాదులందును పరమాత్మను పండితులు భావింపవలెనని సారాంశము.

శ్లో॥ ఇహైవ తైర్జితః సర్గో-యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ-తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥ 19

ఎవరు చేతనాచేతనములయందు సమానముగ నుండు బ్రహ్మమునందు ఏకాగ్రముగ మనస్సు నిలిపెదరో, వారు సంసారమును జయింపఁగలుఁగుదురు. ఎందుకనఁగా ? బ్రహ్మము సమస్తదోషములు లేనిదై ఏకరూపమున నుండునది. అందువలన క్రియలో గాక మనస్సులో సమభావన గలవారు బ్రహ్మనిష్ఠను దృఢపఱచుకొను వారగుదురు.

వివరణ—తక్కువవారియందు ఎక్కువ భావనను గౌతమాదులు నిషేధించుటచే—దేవమానవ పశుపక్ష్యాదులయందు సమభావన కూడదని తెలియుచున్నదను ప్రశ్నకు సమాధానమును దిగువవిధము గాననగును.

పరమేశ్వరుఁడు సర్వాంతర్యామియగుటచే ప్రతిప్రాణియందును పరమాత్మ ఉన్నాడని భావించుటవరకే పైయంశము చెప్పఁబడినది. అవివేకముతో అందరిని సమానముగ సత్కరింపవలె ననుటకు ఇఁట-అస్కారము లేదు. సూర్యుఁడు-చెరువు కల్లు మూత్రము మున్నగువానిలో సమానముగ ప్రతిబింబించినను సురామూత్రాదులు ఆచమనయోగ్యములు కావు గాన బ్రాహ్మణాదివిశేషకనిష్ఠత్వము కల్పితము కాదని గుర్తింపవలెను.

శ్లో॥ న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య-నోద్విజేత్ ప్రాప్య చాప్రియం।
స్థిరబుద్ధి రసమ్మూఢో-బ్రహ్మవిత్ బ్రహ్మణి స్థితః ॥ 20

పూర్వజన్మవాసనతో ప్రియమగుదాని నొంది సంతోషింపక—నప్రియము తారసిల్లుచెడ నుద్రేకముఁజెందక—తత్త్వవిదులచే నుపదేశింపఁబడి-బ్రహ్మతత్త్వము ఇది మిత్థమని గుర్తించి - బ్రహ్మభావనఁగలవాడై శివధ్యానమునుండి చలింపని బుద్ధితో సర్వవిధ అజ్ఞానములను తొలగించుకొని యుండవలెను.

వివరణ—తనకు ఇష్టమైనది లభించినచో సంతోషింపఁగూడదు. ఇష్టము

కానిది సంఘటించినయెడల బాధపడవలదు. శివధ్యానప్రవాహమున సంతోష దుఃఖములు అడ్డు కారాదు. అట్లగుచో శివధ్యానము స్థిరపడదని భావము.

శ్లో॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా-విందత్యాత్మని యత్సుఖం ।
స బ్రహ్మయోగయుక్తాత్మా-సుఖ మక్షయ మశ్నుతే ॥ 21

బాహ్యములైన శబ్దాదివిషయములపై ఆసక్తిలేని మనస్సుతో పరమేశ్వరుని యందే చిత్తమును నిలిపి ఎట్టి సుఖము ననుభవించునో, పరమేశ్వరుని ధ్యానించు నిష్ఠ గల-అట్టి మహాపురుషుఁడు-శాశ్వతమైన శివానందము ననుభవించువాడగును.

వివరణ — శబ్ద స్పర్శ రూప రస గంధాది ఇంద్రియ విషయములనుండి మనస్సును మఱల్చి-శివధ్యానాసక్తచిత్తముతో శివు నారాధించువాడు-ప్రారబ్ధాంత మున-శివానందామృతాస్వాదరూపమగు మోక్షము నొందునని భావము.

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా-దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యంతవంతః కౌంతేయ-న తేషు రమతే బుధః ॥ 22

కౌంతేయా! ఇంద్రియ సుఖభోగములన్నియు-దుఃఖమును కలిగించునవై కొద్దికాలము మాత్రముండునవి గాన నవ్వానియందు-ఇంద్రియ సుఖభోగముల యథార్థస్థితిని గుర్తెరుగువాడు-ఆసక్తి కలవాడు గాడు.

వివరణ- శివయోగము నభ్యసించువాడు-ఇంద్రియసుఖములయందు విరక్తి గలవాడై-శరీరమును మాత్రము పోషించుచు-నిషిద్ధ కర్మలను దురభ్యాసములను విడనాడినచో-శివారాధనము-భంగపడక-ఆ జన్మాంతము కొనసాగును గాన నట్టి శైవమహాజనుఁడు-పరిపూర్ణత గలవాడగునని సారాంశము.

శ్లో॥ శక్నోతీహైవ యః సోఢుం-ప్రాక్శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం-స యుక్తః స సుఖీ నరః ॥ 23

శరీరమును విడచుటకు ముందు-శివు నుపాసించు కాలముననే కామమువలన క్రోధమువలనను సంభవించు వేగమును అపువాడెవడో, వాడే పరమేశ్వరుని ధ్యానింపఁగలుగువాడై-నిత్యమోక్ష సుఖమును పొందఁగలుగును.

వివరణ-ప్రాణముపోయినవాని వలె ప్రాణము ఉన్నవాడు గూడ-సుఖదుఃఖ

ములను పాటింపనిచో-శాశ్వతమైన శివసాయుజ్యము నొందువాడగునని ఇందు విదితమైనది.

శ్లో॥ యోఽంతస్సుఖోఽంతరారామ-స్తథాంతర్జ్యోతిరేవ యః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం-బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ 24

ఎవఁడు—బాహ్యేంద్రియ భోగములను విరమించి తనలోని పరమాత్మను ధ్యానించుటతో తృప్తిఁజెందుచు-పరమేశ్వరుని లీలావిలాసములను చింతించుచు-లోని జ్యోతి (భావలింగము)నవలోకించునో, అట్టివాడు-బ్రహ్మసదృశుఁడై శివ సాయుజ్యము నొందును.

వివరణ—ఇంద్రియ భోగములన్నియు తగ్గుటకు-ఇష్ట లింగమును శివాగమోక్తరీతి నారాధింపవలెను-ఆత్మ తృప్తికై శివ పంచాక్షరీ మహామంత్రజపముగ ప్రాణలింగానుసంధానము- అవసరము. ఈ శరీరమునందే జీవన్ముక్తుఁడగుటకు భావలింగసాక్షాత్కారము కావలెను. భావలింగ (హార్దబ్రహ్మ)ముఁదగు అనుగ్రహమున మూర్ధన్యనాడీద్వారా నిష్క్రమించి-పరంజ్యోతి నవలోకించియు శివ సముఁడగును. ఇందుకు—దశావధానములే ప్రబల సాధనములగునని వివేకము.

శ్లో॥ లభంతే బ్రహ్మనిర్వాణ—మృషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మానః—సర్వభూతహితే రతాః ॥ 25

శాస్త్రమునందు సంశయము లేనివారై, మనస్సు నటికట్టి భూతదయ గలవారై శివజ్ఞానమును నిరోధించు కల్మషమును పోగొట్టుకొనియు పరమేశ్వరుని సచ్చిదానందమయ స్వరూపమును గుర్తించు మహానుభావులు—శివసాయుజ్యము నొందుదురు.

వివరణ—శాంభవదీక్షితునకు శైవశాస్త్ర విశ్వాసము బలపడును. మనోనిగ్రహము భూతదయ అనునవి-శివజ్ఞాన ప్రతిబంధక దురితములను నశింపఁజేయును. శివధ్యాననిష్ఠచే-శరీరపాతసమనంతరమే-శివానందానుభవము సంఘటించునని—పై శ్లోకములో రహస్యార్థము ఇమిడి యున్నది.

శ్లో॥ కామక్రోధ వియుక్తానాం-యతీనాం యతచేతసాం।
అభితో బ్రహ్మనిర్వాణం-వర్తతే విదితాత్మనామ్ ॥ 26

కామమును క్రోధమును అదుపులో ఉంచుకొని-పరమేశ్వరుని పూజించుట, శివపంచాక్షరీ మహామంత్రమును జపించుట, శివుని ప్రార్థించుట యను ప్రయత్నమును విరమింపక - మనోనిగ్రహము కలిగియుండు శైవమహాజనులకు-మోక్ష సామ్రాజ్యము-చేరువగును.

వివరణ — శివుని పూజాజపాదులతో నుపాసించుచు శుద్ధచిత్తమున ధ్యానించుచు పరమేశ్వరుని సచ్చిదానందమయత్వమును ఇష్టలింగమునందు భావించు మాహేశ్వరులకు శివసాయుజ్యము-కరతలామలకంబగునని సారాంశము.

శ్లో॥ స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాం-శ్చక్షు శ్చైవాంతరే భ్రువోః।
ప్రాణాపానౌ సమౌ కృత్వా-నాసాభ్యంతరచారిణౌ ॥ 27

యతేంద్రియ మనోబుద్ధి-ర్మని ర్మోక్షపరాయణః।
విగతేచ్ఛాభయక్రోధో-యః సదా ముక్త ఏవ సః ॥ 28

శివయోగి—శరీరమునందగు వెలుపల సంభవించు శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయములను మనస్సులో నుండి నెట్టివేసినవాడై—చూపును కనుబొమల నడుమ ముక్కు కొనయందు నిలిపి-నాసికలో నడచునట్టి ప్రాణ అపానవాయువుల నొకచో ఆపినవాడై ఇంద్రియములను మనస్సును బుద్ధిని నియమించియు కోరికలు వెఱపు అలుక లేనివాడై పరమేశ్వరుని లీలావిలాసములను చింతించుచు "మోక్షమే కావలెను భోగము అవసరము లేదు" అను భావన గలవాడగునేని-జీవితకాలమున మరణానంతరమున్ను ముక్తుడగుననియే భావింపవలెను.

వివరణ—ఇష్టలింగమునందు భావలింగమును ధ్యానించుచు ఇష్టలింగమే శివుడని విశ్వసించినవాడై రాగద్వేషములను విడనాడియు ప్రాణాయామముతో ఇంద్రియములను నిగ్రహించి—ముముక్షువైన శైవమహాజనునకు పరంజ్యోతి దర్శనానంతరము లభించు ముక్తస్థితి. జీవితకాలమునందే గోచరించునని తెలియవలెను.

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం-సర్వలోక మహేశ్వరం।
సుహృదం సర్వభూతానాం—జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి॥ 29

భక్తులు సమర్పించు యజ్ఞములను తపస్సులను స్వీకరించువాడు, లోకే

శ్వరుల నందరిని శాసించు మహేశ్వరుఁడు, ప్రాణులందరికి నుపకరించువాడు నగు పరమేశ్వరుని సాక్షాత్కరింపఁజేసికొనినచో శివానందప్రాప్తిరూపమగు శాంతి నొందును.

వివరణ–ఇఁట "మాం" అను శబ్దమునకు శ్రీకృష్ణార్థమును చెప్పనలవి గాదు. ఆదిగాక "తన (ఆత్మ)ను గుర్తించి" అనియు చెప్పరాదు. శ్రీకృష్ణుఁడు గీతలలో "నేను అనఁగా నాలోని పరమాత్మ" అనియే నిర్వచించెను. "సర్వలోకమహేశ్వరం" అనుచో "తమీశ్వరాణాం పరమం మహేశ్వరం" అను శ్రుతి ననుసరించి మహేశ్వరశబ్దము శివునియందే రూఢమైనదని తెలియవలెను. మహేశ్వరుఁడే ముముక్షుజ్ఞేయుఁడని ఈ శ్లోకమునందు అవగతమగుచున్నయది. మహేశ్వరునుపాసించువారికే శివానుగ్రహమున మోక్షము చేకూరునని భగవద్గీతల యంతరార్థము.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,
కర్మయోగో నామ పంచమోఽధ్యాయః.

శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీమత్ భగవద్గీతా భాష్యమున
"మనోరంజనం" బను శాంకరీయ ఆంధ్రానువాదమున
ఐదవ అధ్యాయము.



శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః.

# శ్రీ భగవద్గీత

## షష్ఠాధ్యాయము

"మనో రంజన" శాంకరీయ ఆంధ్రానువాద సహితము

శ్రీ భగవానువాచ

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం-కార్యం కర్మ కరోతి యః।
న సన్న్యాసీ చ యోగీ చ-న నిరగ్ని ర్నచాక్రియః॥ 1

కర్మఫలము నపేక్షింపక-నిత్యము నైమిత్తికంబు నగు కర్మ నాచరించు-నెవఁడో; వాడే జ్ఞానయోగి యనియు కర్మయోగి యనియు పేర్కొనబడును. అగ్నిసాధ్యమగు కర్మను విడచువాడు గాని, సన్న్యాసాశ్రమి గాని-నిజమైన సన్న్యాసి, కర్మయోగియు కాజాలడు.

వివరణ - కర్మఫలత్యాగము - జ్ఞానప్రదమగుటచే-ఫలము నపేక్షింపక సుకృతము నాచరించువాడు జ్ఞానయోగనిష్ఠ గలవాడనియే గుర్తింపవలెను. కర్మ నాచరింపక కేవలము జ్ఞాననిష్ఠ గలవానికన్న ఫలాకాంక్ష లేనట్టి కర్మయోగి కర్మ జ్ఞానముల రెంటియందు నిష్ఠగలవాఁడునై మిన్నయగునని "కర్మయోగో విశిష్యతే" అని పూర్వము చెప్పఁబడిన యంశము ఇఁట బాగుగా సమర్థింపఁబడినది. పంచమాధ్యాయము చివర సంగ్రహముగా చెప్పఁబడిన శివధ్యానయోగము ఈ ఆరవ అధ్యాయమున విశదీకరింపఁబడుచున్నయది.

శ్లో॥ యం సన్న్యాస మితి ప్రాహు-ర్యోగం తం విద్ధి పాండవ।
న హ్యసన్న్యస్త సంకల్పో-యోగీ భవతి కశ్చన॥ 2

జ్ఞానయోగమని ఎద్దానిని నిరూపింతురో అద్దానిని కర్మయోగముగానే అర్జునా! గుర్తింపుము! పరమాత్మభిన్నమైన ప్రకృతిఁజెందిన కర్మఫలమును విడువఁజాలనివాడు ధ్యాన (జ్ఞాన) యోగి కాలేడు.

వివరణ-ధ్యాన (జ్ఞాన) యోగము సిద్ధించుటకు కర్మఫలత్యాగము ప్రబల సాధనమగునని భావము.

శ్లో॥ ఆరురుక్షో ర్మునే ర్యోగం-కర్మ కారణ ముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ-శమః కారణ ముచ్యతే ॥ 3

ధ్యానయోగమును సాధింపఁదలచిన మునికి-కర్మయోగము కారణముగ పేర్కొనఁబడును. ధ్యానయోగము నవలంబించిన సాధకునకే- చిత్తశాంతి (లేక) కర్మనివృత్తి-సాధనముగ చెప్పఁబడును.

వివరణ-సమాధిలో శివధ్యానము సిద్ధించుతఱి-కర్మాచరణము-మనమ్సను కలవరపఱచును గాన సమాధియందు ధ్యానయోగమును భంగపఱచునదగును. ఇట్లు చెప్పినంతమాత్రమున-కర్మజ్ఞాన సముచ్చయమునకు విఘాతము కలదని భావింపరాదు. ధ్యానము నభ్యసించువేళ-కర్మనాచరించుట అవసరమని పై శ్లోకమున చెప్పుటచే చిత్తశాంతికి కర్మాచరణము-ప్రప్రథమ సాధనమగుటజేసి పరంపరయా కర్మజ్ఞానసముచ్చయము సిద్ధించుచున్నయది.

శ్లో॥ యదా హి చేంద్రియార్థేషు-న కర్మస్వనుషజ్జతే ।
సర్వసంకల్పసన్న్యాసీ-యోగారూఢ స్తదోచ్యతే ॥ 4

ఇంద్రియములకుఁ జెందిన విషయములయందు, శబ్దాదులను పరిగ్రహించుటకు సాధనములగు కర్మలయందును శబ్దాది ఆసక్తి లేనివాఁడై, ఇంద్రియసుఖములఁజెందినట్టి, కర్మలఁజెందినట్టియు సంకల్పములను విడనాడు నెప్పుడో అప్పుడు ధ్యానయోగసిద్ధుఁడని చెప్పఁబడును.

వివరణ-ధ్యానయోగము సిద్ధించుతఱి-కామ్యకర్మలయందు ఆసక్తి కూడదనియు, మనస్సులో నుదయించు సంకల్పములు ఎప్పటికప్పుడు-తొలగవలెననియు సారాంశము.

శ్లో॥ ఉద్ధరే దాత్మ నాఽఽత్మానం-నాత్మాన మవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధు-రాత్మైవ రిపు రాత్మనః ॥ 5

విషయాసక్తి లేనట్టి మనస్సుతో తన నుద్ధరింపవలెను. తనను క్రిందికి గొంపోగూడదు. ఎందువలన ననఁగా? ఇంద్రియసుఖముల నపేక్షింపని మనస్సే తనకు చుట్టమువలె మేలు నొనఁగూర్చును. ఇక మనస్సు విషయాసక్తి కలదగు నెడల-అట్టి మనస్సే-తనకు శత్రువగును.

వివరణ-ఇంద్రియసుఖములను మనస్సు విడనాడనిచో-పశుపక్ష్యాదిజన్మలఁ జెంది- క్రిందికి-అనగాఁ? అధోలోకములకు పోవలసివచ్చుననియు, మనస్సు స్వాధీనమగు నెడల, ఇంద్రియసుఖముల ననుభవింప నపేక్షింపనిదై బంధువు వలె హితము నొదవఁజేయుననియు, అందువలన తన మనస్సే తనకు బంధువగు ననియు, స్వాధీనము గాని మనస్సు-శత్రువువలె- కీడు నొనఁగూర్చుననియు, మనస్సును విషయములయందు విరక్తి గలదిగ నొనర్చుకొని మోక్షమునకు పరమకారణమగు శివధ్యానయోగమునందు నిలుపవలెననియు సారాంశము.

శ్లో॥ బంధు రాత్మాఽఽత్మన స్తస్య-యేనాత్మైవాత్మనా జితః।
అనాత్మన స్తు శత్రుత్వే-వర్తే తాత్మైవ శత్రువత్ ॥ 6

ఎవఁడు బుద్ధిబలముతో మనస్సును స్వాధీనపరచుకొనునో, వానికి మనస్సు బంధువగును. మనస్సునరికట్టని వానికి-తన మనస్సే శత్రువువలె మోక్షము పొంద నీయని స్థితి గలదగును.

వివరణ-తన అదుపులో ఉన్న మనస్సు-బంధువువలె-తనకు మేలు నొనఁ గూర్చును. స్వాధీనముగాని మనస్సు-శత్రువువలె-తనను అనారోగ్యఋణాదిబాధల పాలుజేసి-మోక్షప్రాప్తికి దూరమొనర్చును.

ఇందుకు "మన ఏవ మనుష్యాణాం-కారణం బంధమోక్షయోః" "బంధాయ విషయానంగి-ముక్త్యై నిర్విషయం మనః" అను ప్రమాణములు నిదర్శనములగు చున్నవి.

శ్లో॥ జితాత్మనః ప్రశాంతస్య-పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు-తథా మానావమానయోః ॥ 7

చలువ, వేడి, సుఖము, దుఃఖము అనునవి, మరియు మానావమానములు చిత్తమును క్షోభింపఁజేయునట్టివి. ఇట్టి ద్వంద్వదోషములు సంభవించినను చంచలముగాని చిత్తము, రాగద్వేషములు లేకుండుటయు గలవానికి-పరమేశ్వరుడు-ధ్యానసమాధియందు సాక్షాత్కరించును.

వివరణ-"తతస్తు తం పశ్యతే-నిష్కళం ధ్యాయమానః" "చిత్తస్థైర్యానంతరము సాధకుఁడు ధ్యానించునెడ-ఎట్టి విభాగము లేనట్టి అఖండజ్యోతిఃస్వరూపుడైన పరమాత్మ నంతరంగమున దర్శింపఁగలుఁగును" అను శ్రుతి ననుసరించి-స్థిరచిత్తము గలవారి ధ్యానసమాధియందు పరమాత్మ గోచరించునని విదితమైనది.

శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా-కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ-సమలోష్టాశ్మకాంచనః ॥ 8

జ్ఞానమనఁగా? గురూపదేశమువలన కలిగిన తెలివి; విజ్ఞానమనఁగా? ధ్యానసమాధియందు సంభవించిన పరమేశ్వరదర్శనము; ఇట్టి జ్ఞానవిజ్ఞానములతో సంతృప్తిఁజెందిన చిత్తము గలవాడు; వికారము లేనివాడు; ఇంద్రియములను గెలిచినవాడు, మట్టిబెడ్డ బంగారము అనువానిని సమానములుగ నెంచువాడు నగు సాదకుఁడు-యోగారూడుఁడని చెప్పఁబడును.

వివరణ-ప్రాకృత భోగ్యములపై ఆసక్తి లేనివాడగుటచే- సాధకుఁడు- "బంగారము స్వీకరింపదగినది, మృత్పిండము పరిహరింపఁదగినది" అను హేయోపాదేయ భావము లేనివాడై- శివుని ధ్యానించుచు ధ్యానపరాకాష్ఠయగు సమాధిలో శివుని దర్శించి-యోగారూడుఁడు కాజాలునని సారాంశము.

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన-మధ్యస్థద్వేష్యబంధుషు ।
సాధుష్వపి చ పాపేషు-సమబుద్ధి ర్విశిష్యతే ॥ 9

సహజముగ మేలుగోరు సుహృత్తు నందు, స్నేహమును పురస్కరించుకొని ఉపకరించు మిత్రునియందు, శత్రువునందు, ఉదాసీనునియందు మధ్యస్థునియందు తానొనర్చిన అపకారమునను సరించి అపకారముఁజేయు ద్వేష్యునియందు, బంధువునందు, పుణ్యాత్ములయందు పాపాత్ములయందును సమానమైన బుద్ధి గలవాడు-శ్రేష్ఠుఁడనఁబడుఁగును.

వివరణ-

సుహృత్ అనఁగా? స్వభావసిద్ధమైన హితచింతన గలవాడు;

మిత్రుఁడనఁగా? ఉభయులకు గల స్నేహమును పాటించి మేలుఁజేయువాడు;

నిర్నిమిత్తముగా బాధించువాడు శత్రువగును.

కలహించు నిరువురి నుపేక్షించువాడు- ఉదాసీనుడు;

పోరాడు నుభయులకు గూడ హితము నొనర్చువాడు మధ్యస్థుఁడు;

అపకారికి నపకారము నొనర్చువాడు ద్వేష్యుఁడనఁబడుఁగును.

శివయోగము ననుష్ఠించువారిలో పై లక్షణము గలవాడు- మిన్నయనియు యోగికి రాగద్వేషములు కూడవనియు వివేకము.

శ్లో॥ యోగీ యుంజీత సతత-మాత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా-నిరాశీ రపరిగ్రహః ॥ 10

శివయోగసాధకుఁడు- ఏకాంతస్థలమున నున్నవాడై మనస్సును నేకాగ్రముగ నొనర్పవలెను. ఎవరితోడనెట్టి సంబంధము లేనివాడై చిత్తమును శరీరమును నియమించి- పరమేశ్వరునికంటె వేరైన వస్తువునందు అపేక్షను విసర్జించియు యోగమును భంగపరచు దానములను స్వీకరింపఁగూడదు.

వివరణ-ఏకాంతస్థలము, ఏకాగ్రమనస్సు, ఇతరుల సహవాసాదులు లేకుండుట, చిత్తస్థైర్యము, శరీరనిర్బంధము, యోగభంగకరములగు వస్తువుల నపేక్షింపకుండుటయు శివయోగము నభ్యసించుటకు అంగములగునని భావము.

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య-స్థిర మాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం-చేలాజిన కుశోత్తరమ్ ॥ 11

తత్రైకాగ్రం మనః కృత్వా-యతచిత్తేంద్రియక్రియః ।
ఉపవిశ్యాసనే యంజ్యా-ద్యోగ మాత్మవిశుద్ధయే ॥ 12

నదీతీరము గృహము మొదలగు పవిత్రప్రదేశమునందు- శరీరమునకు సంబంధించినట్టి, స్థిరమైన ఆసనమును నెలకొలిపి- చిత్తమును ఇంద్రియగత విషయములను నిరోధించి-మనస్సునకు గల చాంచల్యమును పారదోలియు, మిక్కిలి ఎత్తు కానట్టి, ఎక్కువ క్రింద గానట్టి-దర్భలపై చర్మ, చర్మపై వస్త్ర

ముందునట్టి ఆసనముపై కూర్చుండి- అంతఃకరణ శుద్ధికై శివధ్యానయోగము నభ్యసింపవలెను.

వివరణ-పవిత్ర దేశము, స్థిరాసనము, చిత్తనిరోధము, ఇంద్రియనిగ్రహము స్థిరమనస్కత, ఇవియన్నియు శరీరము నొకచో నియమించి— అనగా ఆసనము నందు కదలక కూర్చుండి సాధించు శివధ్యానయోగాభ్యాసమును సిద్ధింపఁజేయునని సారాంశము.

శ్లో॥ సమం కాయశిరోగ్రీవం-ధారయ న్నచలం స్థితః।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం-దిశ శ్చానవలోకయన్॥ 13

ప్రశాంతాత్మా విగతభీ-ర్బ్రహ్మచారివ్రతే స్థితః।
మనఃసంయమ్య మచ్చిత్తో-యుక్త ఆసీత మత్పరః॥ 14

శరీరమధ్యభాగము, శిరస్సు, కంఠము అనువానిని సమానములుగ నెలకొలిపి శివయోగాభ్యాసార్థము దృఢప్రయత్నము గలవాడై— ఇటునటు దిశలఁజూడక— తన నాసికాగ్రము నవలోకించుచు— ప్రశాంతమైన చిత్తము గలవాడై-భయమును విడనాడి-బ్రహ్మచారివ్రతము నవలంబించియు మనస్సును నిగ్రహించి—పరమేశ్వరునియందు చిత్తమును నిలిపినవాడై-పరమేశ్వరుడే గతి- యను భావనతో శివయోగసమాధినిష్ఠుఁడు కావలెను.

వివరణ—శివయోగ సమాధియందు చిత్తము రాగద్వేషకలుషితము కాగూడదు. తన ముక్కుకొనను చూచుటలో-కన్నులు-సగము మూయఁబడినవగును. చాలకాలము అలవాటుపడిన పఞ్చతెఱఁగుల విషయవాసనలను పరిహరింప నెట్టి భయము లేనివాడు కావలెను. లేదా—శాస్త్రజ్ఞానమువలన కలుగు నిర్భయముఁదగు దృఢత్వమువలనను భయపడనివాడు కావలెను. ఇంద్రియసుఖములుగ నుండు సర్వవిధవృత్తులను తొలగించి పరమేశ్వరుని దివ్యజ్యోతిఃస్వరూపమునందు చిత్తవృత్తిని నిలుపుటయే సమాధినిష్ఠ యనఁబడును.

శ్లో॥ యుంజన్నేవం సదాఽఽత్మానం-యోగీ నియతమానసః।
శాంతిం నిర్వాణపరమాం-మత్సంస్థా మధిగచ్ఛతి॥ 15

ఏకాంతనివాసము మొదలగు నియమములతో—శివధ్యానయోగి—మనోవికార

ముల నన్నిటి నణచి-ప్రతిదినము మనస్సును పరమేశ్వరునియందు నిష్ఠ గలదిగా నొనర్చుచున్నచో-మోక్షముఁదగు నంపూర్ణస్థితి గల శివసాయుజ్యము నొందఁ గలుఁగును.

వివరణ-మనస్సు—పరమేశ్వరనిష్ఠమగుటకు-ప్రతిదినము నియమితసమయమున ఎడతెగక శివధ్యానము నభ్యసించుట, సంసారగత కాంతాకనకాదులయందు వైరాగ్యంబు—సాధనములగును. మనస్సునందు సంభవించు రాగద్వేషాది వికారములు-సమసి పోవలెను. "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా" ఇత్యాది శ్రుతులయందు నిరూపింపఁబడిన—శివునితో నేకకాలముననే సమస్త కామభోగరూపమగునదియే- శివసాయుజ్యమనియు, అదియే పరమనిర్వాణము గల కైవల్యమనియు తేటపడుచున్నయది.

శ్లో॥ నాత్యశ్నత స్తు యోగోఽస్తి-న చైకాంత మనశ్నతః।
న చాతిస్వప్నశీలస్య-జాగ్రతో నైవ చార్జున! ॥ 16
యుక్తాహారవిహారస్య-యుక్త చేష్టస్య కర్మసు।
యుక్తస్వప్నావబోధస్య-యోగో భవతి దుఃఖహా ॥ 17

ఎక్కువ ఆహారమును భుజించువానికి, బొత్తుగా ఆహారమును విడచువానికి, అతిగా నిద్రించువానికి, అసలే నిద్రలేనివానికిని— శివధ్యానయోగము సిద్ధింపదు.

మితముగా భుజించువానికి, మితముగ పరిశ్రమఁజేయువానికి, శ్రీ శివపంచాక్షరీ జపాదుల విషయమై శివారాధనాది సత్కర్మల విషయమై- దేశకాలాదులఁ గమనించుచు ప్రవర్తించువానికి, నియమితసమయములలో నిద్రించుచు మేలుకొనువానికిని-శివధ్యానయోగము— దురంతసంసారదుఃఖమును నివారించి—సిద్ధించును.

వివరణ—ఎంతవరకు జీర్ణించునో అంతే ఆహారమును భుజించుట-యుక్తాహారమగును. శరీర ఆయాసము అధికము గాకుండ—తన శక్తి కొలది పనిఁజేయుట యుక్త విహారమగును. కాలాదినియమములను పాటింపక—జపపూజాదుల నొనర్చుట యుక్తము కాదు. రాత్రిళ్లు మేలుకొనుట, పగలు నిద్రించుటయు అయుక్తములగును. ఎల్లకాలము నిద్రలేమియు యుక్తము కాదు. "పూరయే దశనేనార్ధం—తృతీయ ముదకేన తు,వాయోః సంచరణార్థంతు చ తుర్థ మవశేషయేత్" "ఆహారముతో కడుపులో సగము నింపవలెను.

నీటితో మూడవభాగము నిండవలెను. లోన వాయువు సంచరించుటకై నాలుగవ భాగము-ఖాళీ ఉంచవలెను" అను ఆయుర్వేదీయసూక్తి- ఇందుకు నిదానమగును.

ఇట్టివానికే శివధ్యానయోగము సిద్ధించు నని భావము.

శ్లో॥ యదా వినియతం చిత్త-మాత్మన్యేవావతిష్ఠతే।
నిస్పృహః సర్వకామేభ్యో-యుక్త ఇత్యుచ్యతే తదా॥ 18

విశేషించి నిరోధింపఁబడిన చిత్తము- ఎప్పుడు పరమేశ్వరునియందే స్థిరముగ నుండునో, ఇహపరలోకసంబధములగు సుఖభోగములయందు ఆసక్తిలేనిదగునో, అప్పుడు-యోగసిద్ధుఁడని చెప్పఁబడును.

వివరణ-మనస్సునకు అధిష్ఠానము జీదాత్మసన్నిహితము నగు చిత్తమును శివునియందు స్థిరపరచువాడు, ఐహిక అముష్మిక భోగముల నపేక్షింపనివాడు నగు సాధకుఁడు-శివయోగసిద్ధుఁడని గుర్తింపవలెను.

శ్లో॥ యథా దీపో నివాతస్థో-నేఙ్గతే సోపమా స్మృతా।
యోగినో యతచిత్తస్య-యుంజతో యోగ మాత్మనః। 19

గాలి లేనిచోట దీపము చలింపని స్థితి-చిత్తమును నియమించి పరమేశ్వరునకు సంబంధించిన ధ్యానయోగమును సాధించు యోగికి-నిదర్శనముగ చెప్పఁబడినది.

వివరణ-కదలిక లేకుండ-వెలుతురు నిడు దీపమువలె- శివయోగియొక్క-చిత్తము నిశ్చలము కావలెనని భావము.

శ్లో॥ యత్రోపరమతే చిత్తం-నిరుద్ధం యోగసేవయా।
యత్ర చైవాత్మనాత్మానం-పశ్యన్నాత్మని తుష్యతి॥ 20
సుఖ మాత్యంతికం యత్తద్-బుద్ధిగ్రాహ్య మతీంద్రియం।
వేత్తి యత్ర నచైవాయం-స్థిత శ్చలతి తత్త్వతః॥ 21
యం లబ్ధ్వా చాపరం లాభం-మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన-గురుణాఽపి విచాల్యతే॥ 22

తం విద్యా ద్దుఃఖసంయోగ-వియోగం యోగసంజ్ఞితం।
స నిశ్చయేన యోక్తవ్యో-యోగోఽనిర్విణ్ణచేతసా ॥ 23

చిత్తము—యోగాభ్యాసముతో స్థిరమై ఎప్పుడు శాంతించునో; శుద్ధమైన అంతఃకరణముచేత పరమేశ్వరుని దర్శించుచు తనలో పరమానందము నొందు నెప్పుడో; ఏ దశయందు—బుద్ధిచేతనే గ్రహింపఁబడునట్టి ఇంద్రియములకు గోచరము కానట్టి కేవల సుఖము ననుభవించునో, శివానందానుభవస్థితియందు—పరమేశ్వరుని (సోఽహం) భావము ననుసంధించుటనుండి చలింపడో; ఏ ఆనందమయస్థితిని పొంది—మరియొకటి అధికఫలము గలదని భావింపడో, ఏ దశయందు ఉన్నవాడై గుణవత్పుత్రవియోగాదిజన్యమైన గొప్ప దుఃఖమువలనను చలింపడో, అట్టి అవస్థావిశేషమును సమస్త దుఃఖములను తొలగించు యోగముగ గుర్తింపవలెను. అట్టి శ్రేష్ఠమైన శివధ్యానయోగము గొప్ప ఫలము గలదగుటచే—సాధింపనలవిఁ గానిదైనను అతి కష్టముగనైన సాధింతునను దృఢ నిశ్చయముతో నిర్వేదము లేని చిత్తమున సాధింపవలెను.

వివరణ—నిర్వేదమనఁగా? ఇంతకాలము అభ్యసించినను యోగము-సిద్ధింపలేదు. కావున "నియ్యది దుఃసాధ్యము" అను అనుతాపమగును. "ఇట్టి అనుతాపమును విసర్జించి— ఈ జన్మయందు-లేక—జన్మాంతరమందు సిద్ధించును. తొందరయెందుకు? అను ధైర్యము నవలంబించి యోగము నభ్యసింపవలసియుండును.

"ఉత్సేక ఉదధే ర్యద్వత్—కుశాగ్రేణైకబిందునా।
మనసో నిగ్రహ స్తద్వత్-భవే దపరిఖేదతః॥

సముద్రమునందలి ఉదకాతిశయము—కుశాగ్రముతో నొక బిందువు వెడతెగకుండ తీయుచున్నచో తగ్గినట్లు—నిర్వేదముఁజెందక దృఢముగ ప్రయత్నించినయెడల—మనోనిగ్రహము సాధ్యమగును" అను ప్రమాణమిట తార్కాణమగునది.

మరియు "పూర్వము ఒకానొక పక్షియొక్క గ్రుడ్లను సముద్రము—తరంగములతో నపహరించినందున—సముద్రము నెండగొట్టుదునని నిర్ణయించుకొని తన నోటితో నొక్కొక నీటిచుక్కను నేలపై వేయుచుండెను. పెక్కురు వలదన్నా పక్షి—తన ప్రయత్నమును మానలేదు. దైవికముగా నారదమహర్షి యేతెంచి

నివారించుచుండగా—ఈ జన్మయందైనను రెండవ జన్మయందైనను ఏదేనొక నుపాయము నవలంబించి సముద్రమును శుష్కింపఁజేయుదునని ప్రతిజ్ఞఁజేసెను. అంత నారదుడు దయగలవాడై "సముద్రుఁడు నీ జాతిలోని పక్షికి ద్రోహముఁ జేయుచు నిన్నవమానించుచున్నవాడు" అని గరుత్మంతుని ప్రోత్సహించెను. అంత గరుత్మంతుని రెక్కల గాలితో ఎండుచున్న సముద్రుఁడు భయపడి ఆ పక్షి యండములను తెచ్చియిచ్చెను" అను ఆఖ్యాయిక—ఇట నుపయుక్తమగుచున్న యది.

ఇట్లు నిర్వేద రహితుఁడై మనస్సును నిరోధించి శివయోగాభ్యాసమును గావించు సత్పురుషు నీశ్వరుఁడనుగ్రహించుననియు, పక్షియభీష్టము వలె వాని యభిమతము సిద్ధించుననియు విదితమైనది.

శ్లో॥ సంకల్పప్రభవాన్ కామాం-స్త్యక్త్వా సర్వాణ్యశేషతః।
మనసై వేంద్రియగ్రామం-వినియమ్య సమంతతః॥ 24
శనైః శనై రుపరమేత్-బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా-న కించిదపి చింతయేత్॥ 15

సంకల్పమునుండి ఆవిర్భవించునట్టి కోరికల నన్నిటిని బొత్తుగా విడనాడి ఇంద్రియవిషయములలో దోషము గలదని గుర్తించిన మనస్సుతోడనే ఇంద్రియ సమూదాయము నంతటి నతిశయముగ నిగ్రహించియు, ధైర్యముచే స్థిరపరుపఁ బడిన బుద్ధితో మెల్లమెల్లగా మనస్సును ఇంద్రియభోగాపేక్షనుండి మఱల్చుచు పరమేశ్వరునియందు నిలిపినవాడై— వేరు వస్తువును గురించి కొద్దిగనైన నాలోచింపగూడదు.

వివరణ—కామములు–సంకల్పమువలనఁ బుట్టునవి, స్పర్శవలన జనించునవి యని రెండు తెఱఁగులుండును. స్పర్శజన్యములు—శీతోష్ణాదులు కాగా— సంకల్పజన్యములు— కళత్రపుత్రక్షేత్రాదులగును. ఇట్టి కామములను మనస్సులోనికి బొత్తుగా రానీయక—మనస్సును ధైర్యముతో స్థిరపరచిన తరువాత—శివయోగము నభ్యసింప నారంభింపవలెనని—సారాంశము.

శ్లో॥ యతో యతో నిశ్చరతి-మన శ్చంచల మస్థిరం।
తత స్తతో నియమ్యైత-దాత్మన్యేవ వశం నయేత్॥ 26

చంచలమగుటచే పరమేశ్వరునియందు నిష్ఠలేనట్టి మనస్సు ఏయే ఇంద్రియ విషయమువైపు పరుగిడునో- ఆ యా విషయమునుండి మనస్సును మఱల్చుచు పరమేశ్వరునియందే నిలుపుచుండవలెను.

వివరణ-మనస్సు ప్రకృతిని చెందినదై ఇంద్రియసుఖముల వైపు పురుష నాకర్షించును. ఐతే హఠాత్తు మనోనిగ్రహము-సాధ్యము కానట్టిది. మనస్సు ఇంద్రియములవైపు కదలినను వెంటనే దానిని మఱల్చుచు-శివధ్యానమునందు నుపయోగించుచుండవలెనని భావము.

శ్లో॥ ప్రశాంతమనసం హ్యేనం-యోగినం సుఖ మత్తుమం।
ఉపైతి శాంతరజసం-బ్రహ్మభూత మకల్మషమ్ ॥ 27

మిక్కిలి శాంతమైన మనస్సుతో పాపకళంకమును పోగొట్టుకొని రజో గుణమును పారదోలియు నిరంతరపరమేశ్వరభావనతో శివత్వమును పొందినట్టి శివధ్యానయోగిని-ఉత్తమమైన సుఖము పొందును.

వివరణ—సంసారబంధమును కల్పించు ధర్మము నధర్మమును లేకుండఁ జేసికొనిన ప్రశాంతమైన మనస్సును పరమేశ్వరునియందు నిలిపినట్టి శైవునకు పరమసుఖము (శివానందము) స్వయముగనే తారసిల్లునని భావము.

శ్లో॥ యుంజన్నేవం సదాఽఽత్మానం-యోగీ విగతకల్మషః।
సుఖేన బ్రహ్మసంస్పర్శ-మత్యంతం సుఖ మశ్నుతే॥ 27

ఇవ్విధము—ఎల్లకాలము చిత్తమును స్థిరపఱచుకొని-రాగద్వేషములు లేనట్టి శివధ్యానయోగి-అనాయాసముగ-పరమేశ్వరుని దర్శించి అపరిమితమైన శివా నందము ననుభవించును.

వివరణ—అమృతకుండమునందు నిమగ్నుఁడై ఆహ్లాదము (తత్కాలముననే సంతృప్తిని)ను పొందునట్లు—అన్నిటికన్న నతిశయము గల శివా (బ్రహ్మ) నంద రసమును శివధ్యానపరుఁడు-ఆస్వాదించునని భావము.

శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం-సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా-సర్వత్ర సమదర్శనః ॥ 28

శివధ్యానయోగనిష్ఠ గలవాడు- ప్రకృతిని విడదీసి ఆత్మదృష్టితో చేతను లందరు ఒకేకోవకు చెందినవారని గుర్తించి-ప్రపంచమునందు సమదృష్టిగలవాడై-తాను ప్రాణులందరిలో ఉన్నాననియు, ప్రాణులందరును తనలో ఉన్నారని భావించును.

లేక-పరమేశ్వరుఁడు ప్రాణులందరి నంతర్యామిగ నున్నాడని, పర మాత్మలో చేతనులందరు ఉన్నారని భావించుచు-సమస్త ప్రపంచమున సమాన మైన దృక్పథము గలవాడు- (శివయోగి) కావలెను.

వివరణ-శివధ్యాన సమాధిలో శివుఁడు-చేతనాచేతనములయందు ఉన్నాడను భావన దృఢపడగా-శివునిలో జీవాత్మలందరు ఉన్నారను భావనయు స్థిరపడును. అందువలన సమభావము గోచరించును.

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర-సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి-స చ మే న ప్రణశ్యతి ॥ 30

ఎవఁడు-ధ్యానసమాధిలో అంతట పరమేశ్వరుని గాంచునో. మరియు చేతనాచేతనము నంతటిని పరమేశ్వరునిలో దర్శించునో, అట్టి యోగికి - పర మేశ్వరుఁడు సాక్షాత్కరించును. పరమేశ్వరునకు అట్టి శివధ్యానయోగి అనుగ్రహ పాత్రుఁడగును.

వివరణ-పరమేశ్వరుని సర్వవ్యాపకత్వమును సర్వాధారత్వమును భావించు శివధ్యానయోగి - శివానుగ్రహముచే ముక్తుఁడగునని భావము.

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం-భజత్యేకత్వ మాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి- స యోగీ మయి వర్తతే ॥ 31

ఎవఁడు ధ్యానసమాధియందు పరమేశ్వరుని దర్శించి - పరమేశ్వరుని సర్వవ్యాపకునిగ-పరమేశ్వరునితో ఏకీభవించితి నను భావనను దృఢపఱచుకొని - పరమేశ్వరుని ధ్యానంచునో, అట్టి యోగసిద్ధుఁడు - జాగ్రదవస్థయందు యథే చ్ఛగా ప్రవర్తించినను పరమేశ్వరనిష్ఠకు భంగము లేనివాడగును.

వివరణ - యోగసమాధియందు - పరమేశ్వరుని దర్శించి - అంతటితో

కృతార్థుఁడనైతినని భావింపక – నిత్యము ఈశ్వరుని ధ్యానించువానికి – విధినిషేధములు లేవనియు. ఆతడు సంపూర్ణ శివధ్యాననిష్ఠ గలవాడనియు సారాంశము

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర-సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యది వా దుఃఖం-స యోగీ పరమో మతః॥ 32

అర్జునా! ఎవఁడు తన సామ్యముతో సుఖమును గాని దుఃఖమును గాని – అందరివిషయమై సమానముగ భావించునో, అట్టి యోగి – సర్వోత్తముఁడుగ పేర్కొనఁబడును.

వివరణ – "తనకు పంచప్రాణములెట్లు ప్రియములో, అట్లే – ప్రాణులందరికిని ప్రియములనియు. సుఖము ప్రియ మనియు, దుఃఖము అప్రియమనియు భావించుచు ఏరికిని దుఃఖము కూడదు, సుఖమే వలయునని" కోరు శివధ్యానయోగి – యోగులలో శ్రేష్ఠుఁడగునని భావము.

అర్జున ఉవాచ—

శ్లో॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తః-సామ్యేన మధుసూదన!
ఏతస్యాహం న పశ్యామి-చంచలత్వాత్ స్థితిం స్థిరామ్॥ 33

మధుసూదనా! ప్రాణులందరిలో సమానత్వమును గాంచునట్టి ఏ యీ యోగమును నీవు చెప్పితివో, ఇట్టి యోగమువకు స్థిరమైన ఉనికి-మనస్సు చంచలమగుటచే – ఉండునని తోచుటలేదు.

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవ ద్దృఢం।
తస్యాహం నిగ్రహం మన్యే-వాయో రివ సుదుష్కరమ్॥ 34

కృష్ణా! మనస్సు చంచల మగుటయే గాక – బలాత్కారమున పురుషుని బాధించి విషయములవైపు గట్టిగా ఆకర్షించునది గదా! అట్టి మనస్సును-గాలిని వలె-అదుపులోనికి తీసికొనుట సాధ్యపడదని తోచెడిని.

వివరణ—ఆకసమున గాలిని ముడివేయఁజాలనట్లు–సర్వకాల సర్వావస్థలయందు విషయవాంఛను కలుగఁజేయునట్టి చంచలమైన మనస్సు నరికట్టరాదు గాన శివధ్యానయోగి–ఆత్మదృష్టి నందరు సమానులను భావనను నిలుపుకొనఁ

జాలఁడు. అందువలన నీ యోగము సాధింపనలవిఁగానిదని స్ఫురించుచున్నది. అని అర్జునుఁడు భావించి కృష్ణుని ప్రశ్నించెనని సారాంశము.

శ్రీ భగవానువాచ- శ్రీ కృష్ణభగవానుఁడు చెప్పఁదొడఁగెను.

శ్లో॥ అసంశయం మహాబాహో-మనో దుర్నిగ్రహం చలం।
అభ్యాసేన తు కౌంతేయ-వైరాగ్యేణ చ గృహ్యతే॥ 34

శ్లో॥ అసంయతాత్మనా యోగో-దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా-శక్యోఽవాప్తు ముపాయతః॥ 36

మహాబాహో! "మనస్సు చపల మగుటచే నద్దానిని నిగ్రహించుట - కష్టతరము" అనునది-సత్యమేను, పరమేశ్వరుని మనోహర దివ్య విగ్రహమును నిరంతరము భావించు నభ్యాసముతో, చిరకాలము నుండి అనుభవింపఁబడునట్టి శబ్దాదివిషయములు మంచివి కావను తెలివితో. విషయములయందు ఆసక్తిని తగ్గించు వైరాగ్యము తోడను మనస్సును నిగ్రహింపవచ్చును. అందువలన మనోనిగ్రహము లేనివానికి ధ్యానయోగము సిద్ధింపదని నా యభిమతము గూడా; కాని ఎవడైతే మనస్సును నిగ్రహింపఁజాలునో అట్టి మహాపురుషుడు-ఉపాయముతో యోగమును సాధించుటకు ప్రయత్నించినచో కృతార్థుఁడు కాజాలును.

వివరణ—శివధ్యానయోగికి - మొదట మనోనిగ్రహము అవసరము కాగా ఆత్మసమాన దర్శనముతో-భక్తుల మనస్సును రంజిలఁజేయునట్టి పరమేశ్వరుని దివ్య విగ్రహమును - లేదా పరంజ్యోతిః స్వరూపమగు శివలింగమును సదవకాశము గల సమయములలో తలపోయుచు - నిత్యనియమముగా శివధ్యానము నభ్యసించుటతో, విషయాసక్తి రాహిత్యముతోడను శివధ్యానయోగము సిద్ధించునని భావము.

అర్జున ఉవాచ- అర్జునుఁడు పలికెను.

శ్లో॥ కచ్చిన్నోభయవిభ్రష్ట-శ్ఛిన్నాభ్రమివ నశ్యతి?
అప్రతిష్ఠో మహాబాహో-విమూఢో బ్రహ్మణః పథి॥ 37

శ్లో॥ అయతిః శ్రద్ధయో పేతో-యోగా చ్చలితమానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం-కాం గతిం కృష్ణ! గచ్ఛతి ? ॥ 38
ఏతం మే సంశయం కృష్ణ-ఛేత్తు మర్హస్యశేషతః।
త్వదన్యః సంశయస్యాస్య-ఛేత్తా నహ్యుపపద్యతే ॥ 39

మహాబాహో! ఒకానొకఁడు - పట్టుదలగలవాడై యోగము నభ్యసించుచు ప్రయత్నమున లోపమును చేయునెడ-యోగాభ్యాసమునుండి మనస్సు కదలును. అట్టితటి యోగసిద్ధి యనఁదగు పరమేశ్వరసాక్షాత్కారము సంభవింపనందున ఎట్టి గతి నొందును ?

కృష్ణా! కర్మమార్గమునుండి యోగమార్గము నుండియు భ్రష్టుఁడై తెగిన మబ్బువలె నశింపఁడు గదా !

కృష్ణా! ఈ సంశయమును పూర్తిగా తీసివేయుము! నీవు గాక ఇతరుఁడు ఈ సంశయమును తొలగించువాడు నా దృష్టిలో కనఁబడుట లేదు.

వివరణ- ప్రయత్నలోపమనఁగా-నిత్యనియమముగా యోగమునభ్యసింపక-విషయాసక్తిని తగ్గించుకొనకుండుట యగును. ఇంతియే గాక యోగాభ్యాసము పరిపూర్ణము గాక మున్నే మరణాదులు సంభవించుటయు ప్రయత్నలోపమునకు కారణ మగును.

ఛిన్నాభ్రమనఁగా. ఒకానొక మేఘమునుండి విడిబడిన చిన్నమేఘము మరియొక మహామేఘముఁ జేరుటకు ముందే ఆకసమున కలిసిపోవునది

శ్రీ భగవానువాచ-భగవానుఁడు చెప్పఁదొడఁగెను.

శ్లో॥ పార్థ! నైవేహ నాముత్ర-వినాశస్తస్య విద్యతే।
న హి కల్యాణకృత్ కశ్చిత్-దుర్గతిం తాత! గచ్ఛతి ॥ 40

పార్థా! యోగాభ్యాసము నారంభించి యోగసిద్ధిని పొందకయే మరణించిన వానికి- ఈ లోకమున పరలోకమందును వినాశము ఉండదు. ఎందుకనఁగా ? నాయనా! సుకృతము నాచరించు నెవఁడైనను దుర్గతి నొందఁజాలడు.

వివరణ_కర్మయోగమార్గముల రెంటినుండి భ్రష్టుఁడై పతితుఁడగుట- ఈ

లోకమున వినాశమనఁబడుఁగును. మరణానంతరము నరకప్రాప్తి-పరలోకమున వినాశమగును. ఇట్టి (రెండు తెఱఁగులు గల) వినాశము-యోగికి నుండదు.

కుత్సితగతి యనఁగా? ఈలోకమున అపకీర్తి, పరమున కీటాదిజన్మయని అర్థము.

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా-నుషిత్వా శాశ్వతీః సమాః ।
శుచీనాం శ్రీమతాం గేహే-యోగభ్రష్టోఽభిజాయతే ॥ 41

యోగభ్రష్టుఁడు-అశ్వమేధాదియాగముల నొనర్చినవారి పుణ్యలోకములను పొంది- పెక్కు వత్సరములు నివసించి సుఖము ననుభవించియు, సదాచారము గల సంపన్నుల ఇంటియందు జన్మించును.

వివరణ-అశ్వమేధాది యాగకర్తలకు యోగాభ్యాస భ్రష్టులకును పుణ్యలోకసుఖభోగము, భోగానంతరము ఉత్తమమానవజన్మ సమానము లగునని భావము. స్వల్పకాలము యోగము నభ్యసించి-భంగపడినవారికి పై చెప్పిన రీతిని జననము ఏర్పడునని విదితమైనది.

శ్లో॥ అథవా యోగినా మేవ-కులే భవతి ధీమతాం।
ఏతద్ధి దుర్లభతరం-లోకే జన్మ యదీదృశమ్ ॥ 42

యోగభ్రష్టుని జననము-శివధ్యానయోగనిష్ఠ శివజ్ఞానము గల బ్రాహ్మణుల కులమునందు సంభవించును. ఇట్టిది ఎద్ది గలదో అట్టి బ్రాహ్మణకులజననము సాధారణముగ లభించునది గాదు.

వివరణ-చాలకాలము యోగము నభ్యసించి-అద్ది సిద్ధింపక మున్నే గతించినవాడు-సదాచారులు సంపన్నులు శాస్త్రవిజ్ఞానులు నగు శైవబ్రాహ్మణుల వంశమునందు జన్మించునని భావము.

శ్లో॥ తత్ర తం బుద్ధిసంయోగం-లభతే పౌర్వదైహికం ।
యతతే చ తతో భూయః-సంసిద్ధౌ కురునందన ॥ 43

పూర్వాభ్యాసేన తేనైవ-హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసు రపి యోగస్య-శబ్దబ్రహ్మాతివర్తతే ॥ 44

కురునందనా! పై జెప్పఁబడిన జన్మలు రెంటియందును-పూర్వజన్మయందు అభ్యసింపఁబడిన యోగాభ్యాసమును-పూర్వవాసనావశమున నాచరించును. పూర్వ ప్రయత్నమును మించిన ప్రయత్నమును మోక్షముకొఱకై చేయును. పూర్వాభ్యాసబలము తన ఇష్టము లేకున్నను-విషయములనుండి మనస్సును మఱల్చి యోగనిష్ఠునిఁజేయును.

యోగస్వరూపమును తెలిసికొనఁగోరువాడైనను యోగసిద్ధుఁడై— శబ్దబ్రహ్మమగు వేదమునందు చెప్పఁబడిన పుణ్యకర్మలన్నిటి ఫలితమును పొందును.

వివరణ—ఇంటియందు పెక్కురచే కాపాడఁబడు బంగారుసొమ్ములు మొదలగువానిని-దొంగ-తన చాతుర్యముతో అపహరించునట్లు-యోగమునకు బహువిఘ్నములు సంభవించినను-యోగభ్రష్టుఁడు ఇష్టపడకున్నను-పూర్వకృతయోగవాసనతో విఘ్నముల నన్నిటిని తృణీకరించినవాడై-యోగసిద్ధిని పొందునని సారాంశము.

శ్లో॥ ప్రయత్నా ద్యతమానస్తు-యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధ-స్తతో యాతి పరాం గతిమ్ ॥ 45

అధికయత్నము (మిక్కిలి పట్టుదల)తో యోగము నభ్యసించు యోగపురుషుఁడైతేనో- ప్రతిబంధకములైన పాపములను పోగొట్టుకొనినవాడై యోగసిద్ధికి పూర్వము మరణించినచో- రెండవజన్మయందు యోగసిద్ధిని పొంది-శ్రేష్ఠమైన శివసాయుజ్యరూపమగు ముక్తినొందును.

వివరణ—యోగాభ్యాసమును స్వల్పముగ నొనర్చినవాడైనను జన్మాంతరమున యోగమును పరిపూర్ణముగ నభ్యసించునని తేటపడుచుండగా-దృఢప్రయత్నముచే యోగిపురుషుఁడు ముక్తుఁడగునని వేరు చెప్ప నవసరము లేదని భావము.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ-జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్య శ్చాధికో యోగీ-తస్మాద్యోగీ భవార్జున ॥ 46

కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సు నొనర్చినవారికంటె, ప్రకృతి పురుషవివేకముతో పురుషుని నిజరూపమును గుర్తించు జ్ఞానులకంటెను, అశ్వమేధయాగాది సుకృతములఁ గావించు కర్మిష్ఠులకంటెను పరమాత్మధ్యానయోగి-శ్రేష్ఠుఁడనబడును. అందువలన అర్జునా! నీవు యోగివి కమ్ము!

వివరణ—అశ్వమేధాదియాగములు తటాకకూపారామాదులును సుకృతములనఁబడును. జీవాత్మ-ప్రకృతిబద్ధుఁడు కానివాడై ప్రత్యేకస్థితి కలిగియుండునని సాంఖ్యసమ్మతమైన భావన—ఇఁట జ్ఞానశబ్దిత మగుచున్నయది.

చంద్రుని పెంపు ననుసరించి ఆహారకబళము (బుక్క)లను స్వీకరించుచు చంద్రుని తఱుగునుబట్టి భోజనమును తగ్గించుట-చాంద్రాయణ మనఁబఱఁగును. కృచ్ఛ్రాదులు గూడ ప్రాయశ్చిత్తములుగ తపస్సులనఁబడును. అన్నిటికన్న ధ్యానయోగము మిన్నయని నిరూపించి "నీవు గూడ ధ్యానయోగము నభ్యసించు" మని పార్థునకు పద్మనాభుఁడు తన యభిమతముగ నుపదేశించెనని వివేకము.

శ్లో॥ యోగినా మపి సర్వేషాం-మద్గతేనాంతరాత్మనా ।
శ్రద్ధావాన్ భజతే యో మాం-స మే యుక్తతమో మతః॥ 47

యమ నియమాది అష్టాంగయోగము నభ్యసించువారిలో పరమేశ్వరుని యందు ఆసక్తి గల అంతఃకరణముతో శ్రద్ధ గలవాడై పరమేశ్వరుని ధ్యానించు మహాపురుషుఁడు- యోగిశ్రేష్ఠుఁడగునని నా యభిప్రాయము.

వివరణ-అంతర్బహిరింద్రియ నిగ్రహము యమము కాగా-స్నానాదులచే పరిశుభ్రత నియమమగును-తదితర ఆసనాదులుకూడి ఎనిమిది యోగాంగములగును. అష్టాంగయోగము నభ్యసించువారికిని లక్ష్యము లేనిచో-అద్ది శ్రేష్ఠము కాదు. లక్ష్యము శివదర్శనమని నిర్ణయించుకొని-నాసికాగ్ర వీక్షణాదులతో ఇష్టలింగము నందు భావలింగమును ధ్యానించు శైవపుంగవుడు—సర్వశ్రేష్ఠుఁడని విదితమైనది.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మ
విద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే
యజ్ఞవిభాగయోగో నామ షష్ఠోఽధ్యాయః

ఇయ్యది – శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీ మద్భగవద్గీతా భాష్యమున "మనో రంజనం" బను శాంకరీయ ఆంధ్రానువాదమున
ఆరవ అధ్యాయము.

★

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శ్రీ భగవద్గీత

## సప్తమాధ్యాయము

### "మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాదసహితము

శ్రీ భగవానువాచ -

శ్లో॥ మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుంజన్ మదాశ్రయః।
అసంశయం సమగ్రం మాం-యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥ 1

భగవద్గీత-ఆరేసి అధ్యాయములతో-ప్రథమ ద్వితీయ తృతీయ భాగములుగ విభజింపఁబడినది-మొదటి అధ్యాయషట్కమున-ముక్త పురుషులచే పొందఁదగిన పరబ్రహ్మంబగు సాంబశివు నొందుటకు వలయు నుపాసనను నిరూపించుటకు-ఉపాసనాంగమగు "ఆత్మజ్ఞానపూర్వక కర్మానుష్ఠానముచే సాధింపఁదగిన ప్రత్యగాత్మ (జీవాత్మ)యొక్క నిజస్థితిని గుర్తించు విధానము- వక్కాణింపఁబడినది.

ఇఁక నీ మధ్యమ (అధ్యాయ) షట్కమున-ప్రాప్యుండగు పరమేశ్వరుని స్వరూపము, మరియు భక్తి యనఁబడు-శివోపాసనము-చెప్పబడుచున్నయది.

ఆరవ అధ్యాయపు చివర "శ్రద్ధావాన్ భజతే యో మాం" ఇత్యాది శ్లోకోక్తమగు పరమేశ్వర సేవనమును విపులీకరింప నీ ఏడవ అధ్యాయము ప్రారంభింపఁబడినది.

శ్లోకార్థము-పార్థా! పరమేశ్వరునియందు ఏకాగ్రమైన మనస్సు గలవాడై

అనన్యభక్తితో శివధ్యానము నభ్యసించువాడే గాక నీవును పరమేశ్వరుని విభూతిని బలమును ఐశ్వర్యము నెట్లు తెలిసికొనవలెనో, ఆ విధానమును చెప్పుచున్నాను. ఆలకింపుము! అని శ్రీకృష్ణభగవానుడు-పరమేశ్వరోపాసనమును వక్కాణింప నారంభించెను.

శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞాన-మిదం వక్ష్యామ్యశేషతః ।
యద్‌జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్-జ్ఞాతవ్య మవశిష్యతే ॥ 2

జ్ఞానమనఁగా—పరమేశ్వర స్వరూపమును గుర్తించుట యగును.

విజ్ఞానమనఁగా—చిత్ (జీవాత్మ) అచిత్ (జడప్రపంచము)అనువాని యథార్థ స్థితిని కనుగొనుట యగును.

విజ్ఞానముతో కూడ జ్ఞానమును సమగ్రముగ నీకు చెప్పఁబోవుచున్నాను. ఎద్దానిని తెలిసికొనినచో-తెలిసికొనదగినది మరియొకటి మిగిలియుండదో అద్ది. సంపూర్ణజ్ఞాన మనఁబడుఁగును.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు-కశ్చి ద్యతతి సిద్ధయే ।
యతతా మపి సిద్ధానాం-కశ్చి న్మాం వేత్తి తత్త్వతః ॥ 3

వేలకొలది మానవులలో ఒకానొకడు-పరమేశ్వరుని దర్శించుటకై యత్నించును. యత్నించు సిద్ధులలో ఒకానొకఁడు-పరమేశ్వరుని యనుగ్రహమున శివ స్వరూపమును గుర్తించును.

వివరణ—మానవులు దక్క నితరప్రాణులు-శ్రేయస్సనఁబడు జ్ఞానము నకై ప్రవర్తింపవు గాన మానవులు-పరమాత్మను కనుగొనుటకు పాటుబడవలెను. ఇట్టి పరమేశ్వరజ్ఞానము-అత్యంత దుర్లభమైనను అద్దాని నర్జునునకు భగవానుడు అనుగ్రహముతో వివరించుచున్నవాడు అని విదితమైనది.

శ్లో॥ భూమి రాపోఽనలో వాయుః-ఖం మనో బుద్ధి రేవ చ ।
అహంకార ఇతీయం మే-భిన్నా ప్రకృతి రష్టధా ॥ 4

భూమి, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు మొదలగు

అంతర్బహిరింద్రియములు, బుద్ధి, అహంకారము నను ఎనిమిది విధములు గలది పరమేశ్వరుని ప్రకృతి యని తెలియవలెను.

వివరణ-భూమ్యాదులు-భోగస్థానములు కాగా-ఇంద్రియములు భోగసాధనములుగను. భోగ్యములు-శబ్దాది విషయములగును. ఇవి యన్నియు కూడిన జగము పాశమనఁబడుగును. ఇట్టి జగత్తే పరమేశ్వరుని శక్తిలో అచిద్భాగమగునని వివేకము.

శ్లో॥ అపరేయ మిత స్త్వన్యాం-ప్రకృతిం విద్ధి మే పరాం।
జీవభూతాం మహాబాహో-యయేదం ధార్యతే జగత్॥ 5

ఇదివరకు చెప్పఁబడినట్టిది-అపరా ప్రకృతి యనఁబడును. అపరా ప్రకృతి కన్న వేరైనట్టి, జీవాత్మరూపమైనట్టి పరమేశ్వర సంబంధము గలిగిన ప్రకృతి-పరాప్రకృతి యని తెలియుము! హే మహాబాహో! పరాప్రకృతి ఈ జగమును నిర్వహించుచున్నయది.

వివరణ-పరాప్రకృతి యనఁదగిన జీవాత్మ-పశువు కాగా పంచ మహాభూతాది ప్రపంచము పాశమై జీవాత్మను బంధించునట్టిది. పశువుకంటెను పాశముకంటెను వేరై పశుపాశములను నియమించువాడు పరమాత్మయని, శివోపాసనతో గుర్తించువాఁడే పాశబంధమునుండి విడిబడుననియు, ప్రపంచము జడమై జీవునకు ఉపయోగించునదై బంధరూపముగ నుండుననియు సారాంశము.

శ్లో॥ ఏతద్యోనీని భూతాని-సర్వాణీత్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః-ప్రభవః ప్రళయ స్తథాః 6

ఇదివరకు చెప్పఁబడిన చిత్తు అచిత్తు అను రూపములు గల పరమేశ్వరుని శక్తి-చేతన అచేతన రూపములు గల ప్రాణులందరు-కారణముగ గలవారనియు; అందువలన సమస్త జగము పుట్టుట గిట్టుటయు-చిదచిచ్ఛక్తి విశిష్టుఁడైన పరమేశ్వరుని వలననే ననియు నిశ్చయించుకొనుము!

వివరణ—ఈ గీతలయందు గల అస్మత్ (నేను) అను శబ్దము-శ్రీకృష్ణభగవానుని చెప్పునది గాక—శ్రీకృష్ణ-నంతర్యామిఁజెప్పునని—గీత మొత్తమును పరామర్శించినచో—తేటపడును.

ఎట్లనఁగా? పరమాత్మతత్త్వము నుపదేశించుతఱి-ప్రతర్దనునకు మహేంద్రుఁడు "మా ముపాస్వ" "నన్ను ఉపాసింపుము" అని చేసిన ఉపదేశమున-మహేంద్రు నంతర్యామి యగు పరమాత్మ నుపాసింపుము-అను అంతర్యామ్యర్థము కలదని ఆచార్యులందరంగీకరించినట్లు మరియు "అహం మను రభవం సూర్యశ్చ" "నేనే మనువును సూర్యుడను" ఇత్యాది వామదేవుని సర్వాత్మభావన గల ఉపదేశము వలెను వేదాంతములయందు శాస్త్రదృష్టితో అస్మచ్ఛబ్దము అంతర్యామిపరముగ వ్యవహరింపఁబడినదని తెలియవలెను.

ఇంతియే గాక "అహం" అనునది-శక్తివిశిష్టశివాత్మకమగు బ్రహ్మగా చెప్ప బడినది. "హృద్యకారే ద్వాదశాంతే హకార స్తదిదం విదుః, అహ మాత్మక మద్వైతం యత్ప్రకాశాత్మవిశ్రమః" "హృదయమునందు అకారముండగా-ద్వాదశాంతమునందు హకారము నిలుపగా రెంటి కూడికను బ్రహ్మగా గుర్తించుచున్నవారు గాన "అహం" అనునది-శక్తిశివైక్యమనియు, శక్తివిశిష్ట శివునియందు జీవాత్మ సుషుప్తిలో మహాప్రళయమునందును విశ్రమించుననియు నిదితమైనది.

ప్రశ్న: గీతలలో గల అస్మచ్ఛబ్దము-గీత నుపదేశించిన వాసుదేవుని యందు సరసముగా ప్రవర్తించునని చెప్పవలెను గాదా?

ఉత్తరము: అట్లైనచో "వృష్ణీనాం వాసుదేవోఽస్మి" "యాదవులలో వాసుదేవుఁడను" అని విభూతియోగమున చెప్పినవాక్యము అన్వయింపదుగదా! అచ్చోట వాసుదేవుఁడ నను మాట-శ్రీకృష్ణపరమని సమర్థింపవలనుపడదు గాన శ్రీకృష్ణుని మూలరూపమగు నారాయణుని చెప్పునని నిరూపించుటకును అవకాశము లేదు. ఎందుకనఁగా?

"ఈశ్వరః సర్వభూతానాం-హృద్దేశేఽర్జున తిష్ఠతి"

"సర్వభూత మహేశ్వరం" ఇత్యాదిని గల ఈశ్వర మహేశ్వరాదిశబ్దములతో పరమేశ్వరుఁడే జగత్కారణమగువాడు అని అభ్యసించుటఁజేసి-అట్టి ప్రతిపాదనము సమర్థింపఁబడుటకు-గీతలలో సర్వకారణత్వమును సర్వసేవ్యత్వమును తెలుపునట్టి వాక్యములు-శాస్త్రదృష్టినంతర్యామి పరములగునని-యంగీకరించుట-సమంజసమగుచున్నయది మరియు "మాయాం తు ప్రకృతిం విద్యా-న్మాయినం తు మహేశ్వరమ్" "శివఏవ కేవలః" "తదక్షరం, తత్సవితు ర్వరేణ్యం, ప్రజ్ఞా చ

తస్మాత్ ప్రసృతా పురాణీ" ఇత్యాది శ్రుతులు-జగన్మూలమగు మాయాశక్తితో కూడియుండుట-శివునియందే పొసఁగునని-వక్కాణించుచున్నందున-"మే భిన్నా ప్రకృతి రష్టధా" ఇత్యాది గీతావాక్యములలో గల అస్మచ్ఛబ్దము-పరమేశ్వరుని యందు పర్యవసానముఁ జెందునట్టిదని నిర్ధారింపఁబడినది. అందువలన శివేతర దేవతాపరముగ సమర్థించుట-వేదవిరుద్ధంబగునని విబుధులు గ్రహింతురు గాక!

శ్లో॥ మత్తః పరతరం నాన్యత్-కించిదస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం-సూత్రే మణిగణా ఇవ ॥ 7

ధనంజయా! పరమేశ్వరునికంటె-శ్రేష్ఠమైనది-మరియొకటేదియు లేదు. సూత్రమునందు మణిసముదాయమువలె- ఈ జగమంతయు పరమేశ్వరునియందు ఆధారపడియున్నది.

వివరణ-జగమంతయు సురక్షితముగ నుండుటకు పరమేశ్వరుఁడే బాధ్యుఁడగునని తెలియవలెను.

శ్లో॥ రసోఽహ మప్సు కౌంతేయ! ప్రభాఽస్మి శశిసూర్యయోః ।
ప్రణవః సర్వవేదేషు-శబ్దః ఖే పౌరుషం నృషు ॥ 8
పుణ్యో గంధః పృథివ్యాం చ-తేజ శ్చాస్మి విభావసౌ।
జీవనం సర్వభూతేషు-తపశ్చాస్మి తపస్విషు ॥ 9
బీజం మాం సర్వభూతానాం-విద్ధి! పార్థ! సనాతనం।
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి-తేజ స్తేజస్వినా మహమ్॥ 10
బలం బలవతాం చాహం-కామరాగవివర్జితం ।
ధర్మావిరుద్ధో భూతేషు-కామోఽస్మి భరతర్షభ ॥ 11

కౌంతేయా! ఉదకములలో మధురరసము; చంద్రసూర్యులయందు కాంతి; వేదములన్నిటిలో ప్రణవము; ఆకాశమున సుశబ్దము; మానవులలో మంచి ప్రయత్నము; పృథివిలో పరిమళము, అగ్నియందు వేడి; ప్రాణులలో ఆయుష్యము; తాపసులలో తపస్సు; ప్రాణులందరి జననమునకు ఆదికారణము; బుద్ధిమంతుల మేధాసంపద; (తెలివితేటలు) తేజస్వులలో బెట్టుసరి; బలవంతులలో సమయోచిత

మైన సామర్థ్యము; ప్రాణులలో స్వధర్మమునకు విరుద్ధము కానట్టి కామము; ఇవి యన్నియు పరమేశ్వరుఁడు అని-పార్థా! భరతర్షభా! గుర్తింపుము!

వివరణ-సర్వశబ్దముతో చెప్పఁబడు చిదచిత్ ప్రపంచము-కారణకార్యదశలలో సూక్ష్మస్థూల రూపములు గలదై పరమేశ్వరునందు ఆధారపడియుండును.

ప్రపంచము పరమేశ్వరుని శరీరమగుటచే పరమేశ్వరు నాశ్రయించి యుండును. "యస్య పృథివీ శరీరం" ఇత్యాది అంతర్యామిబ్రాహ్మణము అష్టమూర్తి యనఁబఱఁగు పరమేశ్వరునే ప్రతిపాదించుచున్నయది. ఐన నద్దానినే పరులు-ఇఁట నవకాశముగ నాశ్రయింపవలసివచ్చినది అని వివేకము.

తపస్సనఁగా-శీతోష్ణాది ద్వంద్వములను సహించుట; మంత్రజపమునునియు, అంతట సారముగ పరమేశ్వరుఁడు ఉండుననియు, సుగంధము మొదలగు రూపములు గల పరమేశ్వరునందు భూమి మున్నగునవి ఆధారపడియుండుననియు విదితమైనది.

శ్లో॥ యే చైవ సాత్త్వికా భావా-రాజసా స్తామసాశ్చ యే।
మత్త ఏవేతి తాన్ విద్ధి-న త్వహం తేషు తే మయి॥ 12

శమదమాది సాత్త్వికభావములు, సంతోషగర్వాది రాజసభావములు శోకమోహాది తామసభావములు-పరమేశ్వరునివలననే సంభవించునని తెలిసికొనుము! ఐనను పరమేశ్వరుఁడు వానికి కట్టుఁబడనివాడు కాగా ఆ త్రివిధభావములు పరమేశ్వరుని యధీనములగునవి.

వివరణ-పృథివ్యాదులలో సుగంధాదిరూపములతో పరమేశ్వరుఁడంతర్యామియైనట్లు-ప్రాణుల పూర్వజన్మ ననుసరించి యుద్భవించు సాత్త్వికాది భావములకు మూలకారణము-అనఁగా? ప్రాణుల కర్మననుసరించి కలుగు భావములను బలపఱచు అధికారి పరమేశ్వరుఁడేనని ఇట సిద్ధాంతీకరింపబడినది.

తథాపి-జీవాత్మవలె-పరమాత్మ-సాత్త్వికాది భావములను పరవశముగ కలిగించుకొనువాడు కాడు-పైగా ఆ భావములను తన యధీనములుగ నుంచుకొనునని సారాంశము.

శ్లో॥ త్రిభి ర్గుణమయై ర్భావై-రేభిః సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి-మామేభ్యః పర మవ్యయమ్ ॥ 13

ప్రాణిసముదాయము ఈ సత్త్వాదిగుణవికారములగు స్వభావములతో మోహముఁజెందినదై-ఈ గుణవికారముల సంబంధము లేనివానిగ, అవ్యయుని గను పరమేశ్వరుని గుర్తించుట లేదు.

వివరణ_సత్త్వరజస్తమోగుణములను పరమేశ్వరుఁడు_ కల్పించినను_ అవ్వాని వికారములఁజెందనివాడై గుణాతీతుఁడగువాడని భావము.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ-మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే-మాయా మేతాం తరంతి తే॥ 14

సత్త్వరజస్తమో గుణముల కూడిక యగు పరమేశ్వరుని మాయాశక్తి_ మిక్కలి అద్భుతంబైనది. పరమేశ్వరునే ఎవరు శరణమునొందుదురో అవ్వారు_ ఈ మాయాశక్తి నతిక్రమింపఁగలుగుదురు.

వివరణ_పరమేశ్వరుని మాయ_లోకసాధారణమైనదిగాక నేరికి_నధీనము గానిదై యుండును. ఐతే ఇట్టి మాయను దాటరాదా? అనినచో పరమేశ్వరునే సర్వాత్మనా ఆశ్రయించి అనన్యభావనతో ప్రార్థించువారిపై శివానుగ్రహము ప్రసరించుటఁజేసి_మాయాపాశబంధమునుండి విడిబడువారగుదురు. పరమేశ్వరునకు శరణాగతుఁడుగాక-తన అహముతో మాయను గెలుతు ననుకొనువాడు_ముక్తుఁడు కాజాలడు. "మాయాం తు ప్రకృతిం విద్యా-న్మాయినం తు మహేశ్వరం" అను శ్రుతిని 'మాయగలవాడు మహేశ్వరుఁడు" అనుటచే-ఇఁట గూడ_"మామేవ" అను దానికి పరమేశ్వరునే" అను నర్థముఁజెప్పుట — సమంజసంబగుచున్నందున పరులిచ్చోట శివేతరదేవతను నిరూపించుట- వేదవిరుద్ధంబగునని తెలియవలెను.

మాయ యనఁగా - పరమేశ్వరుని శక్తియేను; కాని మాయావాదుల కామధేనువు, కల్పితము, అనిర్వచనీయంబు నగు మిథ్యాభూతయైన మాయ కాదు.

విచిత్రములైన కార్యములను చేయునది_మాయ యనఁబఁడుఁగును. ఇఁట "మామేవ" అనుదానికి "నన్నే" అని వాసుదేవపరమైన అర్థముఁ జెప్పునెడ పంచదశాధ్యాయమున "తమేవ చాద్యం పురుషం ప్రపద్యే" "ఆద్యపురుముఁ

డైన ఆ పరమేశ్వరునే శరణము నొందుచున్నాను" అనుచో-పరమేశ్వరుడు తనచే పొందదగినవాడు" అని వాసుదేవుడు నిర్వచించిన యంశము-పొసగకుండును. స్వవచన విరుద్ధముగ చేయబడు శ్రీకృష్ణభగవానుని యుపదేశమును పార్థుడెట్లు అంగీకరించును? అందువలన పరుల శివేతర దేవతాపరములైన వ్యాఖ్యానములు అసంగతములగునని గుర్తింపవలెను.

శ్లో॥ న మాం దుష్కృతినో మూఢాః-ప్రపద్యంతే నరాధమాః ।
మాయయాఽపహృతజ్ఞానా-ఆసురం భావ మాశ్రితాః॥ 15

తెలివిలేని పాపాత్ములైన నరాధములు- పరమేశ్వరు నాశ్రయింపజాలరు. ఎందుకనగా ? వారు - మాయా మోహముచే తమ విజ్ఞానమును పోగొట్టుకొని- దంభము దర్పము మొదలగు దుర్గుణములు గల - రాక్షస స్వభావము గలిగి యుందురు.

వివరణ- పాపములు జేయువారి- తెలివి- విపరీతము కాగా-శాస్త్రవిహితంబగు జ్ఞానమును వారు నిరాకరించి - నరాధములై సంసార మోహజాలములు జిక్కుకొనినవారై - గర్వము దురహంకారము మున్నగు రాక్షసగుణములు గలవారునై - పరమేశ్వరు నారాధింపకుందురని భావము.

శ్లో॥ చతుర్విధా భజంతే మాం-జనాః సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ-జ్ఞానీ చ భరతర్షభ ॥ 16

అర్జునా ! (1) రోగార్తుడు; (2) పరమేశ్వర స్వరూపమును తెలియగోరువాడు; (3) అభీష్టసిద్ధి నపేక్షించువాడు, (4) శాస్త్ర ఆచార్య ఉపదేశమున పరమేశ్వర స్వరూపము నపరోక్షముగ గుర్తించి - శివసాయుజ్య ప్రాప్తిమాత్రము తన లక్ష్యముగ గల జ్ఞానియు నను నాలుగువిధములు గల పుణ్యాత్ములు — పరమేశ్వరు నాశ్రయింతురు.

వివరణ- భరతవంశమున శ్రేష్ఠుడవైన అర్జునా ! ఔషధాదులచే తగ్గని వ్యాధులతో తదితర సంకటములతో బాధపడుచు - తమ ఆర్తిని తగ్గింపుమని మార్కండేయాదులవలె - గద్గదనాదముతో మంత్ర జపాదులతోడను ఆర్తులు పరమేశ్వరుని ప్రార్థింతురు.

జిజ్ఞాసువులు- పరమేశ్వరుఁడు - సాకారుఁడా ? నిరాకారుఁడా ? దివ్య జ్యోతియా ? అను ఆకాంక్షతో "ఇదమిత్థ" మను నిశ్చితజ్ఞానముఁ గోరువారై - పరమేశ్వరా ! నీ నిజరూపలక్షణములను తేటపఱచు మని వేడుకొందురు.

అర్థార్థులు— ధనము, కళత్రము, పుత్రులు మొదలగునవి కావలెనని— పరమేశ్వరుని శాస్త్రబోధిత పుణ్యకర్మలతో నారాధింతురు.

జ్ఞానులు- శాస్త్రజ్ఞానము వలనను గురూపదేశము వలనను చిత్తశుద్ధితో పూర్వపుణ్యబలమున నీ జన్మయందు ఏకాంత భక్తిని పరమేశ్వరు నారాధింప నపరోక్షజ్ఞానము గలవారై శివసాయుజ్యమాత్రసిద్ధికై అహరహము తను దీక్షానియమముల ననుసరించి "శివోఽహం" భావనతో కరతలమున ఇష్టలింగమును, ప్రాణకోశమున ప్రాణలింగమును, హృదయాంతరాళమున భావలింగము నారాధించుచు శమదమాది సద్గుణ సంపన్నులునై గృహస్థాశ్రమ ధర్మములను నిర్వర్తించుచు బ్రహ్మచర్యాశ్రమ వానప్రస్థ సన్న్యాసాశ్రమ ధర్మముల నానుషంగికముగ నాచరించుచు ఈ జన్మాంతమునందే శివ సాక్షాత్కారము నొంది - మహాకైలాసముఁ జేరుదురు.

ఇఁట- జ్ఞానము - ఉపాసనాత్మకమనియు "అహం బ్రహ్మాస్మి" ఇత్యాది వాక్యార్థ జ్ఞానము కాదనియు ఆచార్య మహాపురుషుల నిర్వచనము-గమనార్హము.

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త-ఏకభక్తి ర్విశిష్యతే ।
ప్రియోఽహి జ్ఞానినోఽత్యర్థ-మహం స చ మమ ప్రియః ॥ 17

ఆ నలుగురిలో జ్ఞానియగువాడు, జీవిత పర్యంతము నిత్యము శివు నుపాసించుటఁజేసి, "శివ ఏవ కేవలః" ఇత్యాది శ్రుతిరీతిని శివునియందే అనన్యభక్తి గలవాడగుటవలనను - శ్రేష్ఠుఁడనఁబఱఁగును. ఇట్టి జ్ఞానికి - పరమేశ్వరుఁడు అత్యంత ప్రియుఁడు కాగా- పరమేశ్వరునకు జ్ఞాని ప్రియతముఁడగును.

వివరణ- పై శ్లోకముఁదగు వివరణకు ఆధారము ఈ శ్లోకము, ఆర్త జిజ్ఞాసు అర్థార్థుల కన్న-జ్ఞాని శ్రేష్ఠుఁడెందుకనఁగా ? ఆర్తుఁడు—తన కష్టము నివారింపగానే పరమేశ్వరారాధనమును విరమించును. జిజ్ఞాసువు - పరమేశ్వర లక్షణమును గుర్తింపఁ బ్రయత్నించుచు కదాచిత్ నిరుత్సాహపడును. అర్థార్థి- అభీష్టము సిద్ధించువరకే పరమేశ్వరు నారాధించును. జ్ఞానియైతేనో - నిత్య శివోపాసనతో

సంశయరహితమగు నిశ్చయము గలవాడై "శివుఁడే ఉపాస్యుఁడు, శివసాయుజ్యమే మోక్షము" అను సుస్థిర భక్తిభావము వలన- పంచాయతన దేవతా పూజావిధానము నవలంబింపక- శివునే యుపాసించును గాన శ్రేష్ఠుఁడగుట- భగవదభిమతమే గాక కవికులమౌళియగు కాళిదాసు మున్నగువారు - "స స్థాణుః స్థిరభక్తియోగసులభః" "లోకవేదప్రసిద్ధుఁడైన పరమేశ్వరుఁడు- సుస్థిర భక్తియోగముచే సులభుఁడగును" అని నిర్వచించిరి.

అల మధికేన

శ్లో॥ ఉదారాః సర్వ ఏవైతే - జ్ఞానీ త్వాత్మైవ మే మతం।
ఆస్థితః సహి యుక్తాత్మా - మామేవానుత్తమాం గతిమ్ ॥ 18

ఆర్తుఁడు, జిజ్ఞాసువు, అర్థార్థి, యను నీ ముగ్గురు ఉత్కృష్టులేను, కాని- జ్ఞానిమాత్రము - స్వకీయ దివ్యశరీరము వలె పరమేశ్వరునకు అత్యంత ప్రియుఁడగునని పరమేశ్వరుని. యభిమతము ఎందుకనఁగా? జ్ఞాని పురుషుఁడు పరమేశ్వరు నాశ్రయించియే ఉత్తమగతియగు శివసాయుజ్యమును పొందఁగలుఁగును.

వివరణ- జ్ఞానిని ప్రశంసించుటచే ఆర్తాదులు అవివేకులని భావింపరాదని- పై శ్లోకమున ఆర్తజిజ్ఞాసు అర్థార్థులను శ్రేష్ఠులుగా నిరూపించుటచే పరమేశ్వరుఁడు పక్షపాతరహితుఁడని తేటపడినది. జిజ్ఞాసాదులచే పరమేశ్వరు నాశ్రయించి - ఇతర దేవతలను ప్రార్థింపనిచో - ఏనాటికైన నవ్వారు జన్మాంతరములలో జ్ఞానులై నిష్కామ్యముగ శివు నుపాసించి తరింతురను భావమును శ్రీకృష్ణ భగవానుఁడు ఇందు స్ఫురింపఁజేసినవాడని గుర్తింపవలెను. నిష్కామ్యముగ- సకామ్యముగనైనను శివు నుపాసించుట - మోక్ష సామ్రాజ్యము నొదవఁజేయునని విదితమైనది.

శ్లో॥ బహూనాం జన్మనా మంతే-జ్ఞానవాన్ మాం ప్రపద్యతే।
వామ(సు) దేవః సర్వమితి-స మహాత్మా సుదుర్లభః ॥ 19

వామదేవుఁడే సమస్తము అను జ్ఞానము గలవాడై పెక్కు పుట్టుకలపిదప పరమేశ్వరుని పొందఁగలుగును. అట్టి మహాత్ముఁడు-అఱుదుగ నుండును.

వివరణ- "కోటిజన్మార్జితైః పుణ్యైః- శివే భక్తిః ప్రజాయతే" "కోటిజన్మల యందలి పుణ్యముల వలన శివునియందు- అనన్య భక్తి కలుగు" నను వాక్యము-

ఇఁట ప్రోద్బలక మగుచున్నయది. ఇఁక "వామదేవః సర్వమితి" అను పాఠము- "సర్వోహ్యేషరుద్రః" అను శ్రుతి ననుసరించుటచే-ప్రశస్తమైనది. "మ,య,ర,ల, వ,శ,ష,స"లలో మకార సకారములు చేరువనుండుటచే "మ" అనుచో "సు" అనునది ప్రమాదపతితమైయుండును. పాంచరాత్రతంత్రపరుల తంత్రైక విశ్వాసముతో "వామదేవః" అనునది—వాసుదేవః అనునదిగా మార్చబడియుండును. కథమపి-"వాసుదేవః" అను పాఠము సంగతము కాదు. ఎట్లనఁగా? వసుదేవుని కుమారుఁడనునెడ—వాసుదేవుఁడు-సర్వవ్యాపకుఁడు కాజాలడు. వాసుదేవుని మూలరూపము గల ఆదినారాయణుఁడనుచో—ఆదినారాయణుని అవతారమని గౌణవృత్తి నాశ్రయింపవలసి వచ్చును గాన వాసుదేవపదమునకు నారాయణుఁడనునర్థము—ముఖ్యము కాదు. "ఈశ్వరః సర్వభూతానాం" ఇత్యాదిని గీతలో ప్రసిద్ధుఁడైన పరమేశ్వరుని నామమగు వామదేవపదము ఇఁట సమంజసంబైనదని విబుధుఁలు గ్రహింతురు గాక!

శ్లో॥ కామైస్తైస్తైర్హృతజ్ఞానాః-ప్రపద్యంతేఽన్యదేవతాః।
తం తం నియమ మాస్థాయ-ప్రకృత్యా నియతాః స్వయా॥ 20

తమ పూర్వకర్మవాసనతో ఉపవాసాది నియమముల నవలంబించి అనేక విధములగు కోరికల వలన వివేకమును పోగొట్టుకొనినవారై ఇతర దేవతల నారాధించుచుందురు.

వివరణ—పూర్వజన్మలలో చేసిన కృషి ఫలింపనందున నీ జన్మయందు అట్టి కృషినే చేయుచు—అభీష్టములు సిద్ధించుటకు—పరమేశ్వరుఁడు దక్క నితర దేవతల నాశ్రయించుట-వివేకము గల జ్ఞానము కాదని-సారాంశము.

శ్లో॥ యో యో యాం యాం తనుం భక్తః-శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం-తామేవ విదధామ్యహమ్॥ 21

ఇతర దేవతల నారాధించువారిలో—ఏ ఏ భక్తుడు—ఆదిత్యాదిరూపము గల ఏ యే దేవతను ఆసక్తితో పూజింపఁదలచునో, ఆయా భక్తునకు-ఆ యా దేవతపై స్థిరమైన ఆసక్తిని పరమేశ్వరుఁడు- కలుగఁజేయును.

వివరణ—ఇతరదేవతల నారాధించుట-పరమేశ్వరునకు ప్రియము కాదని భావింపరాదు. శివుఁడు—సమస్తదేవతారూపములతో నుండుటఁజేసి—భక్తునకు గల

శ్రద్ధను పెంపొందించుననియు, కాలక్రమమున తన నారాధింపఁజేసికొని ముక్తి నొసగుననియు భావము.

శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్త-స్తస్యారాధన మీహతే ।
లభతే చ తతః కామాన్-మయైవ విహితాన్ హితాన్ ॥ 22

భక్తుఁడు-ఆ యా దేవతఁ జెందిన భక్తితో అభీష్టదేవత నారాధించును. పూజితదేవతవలన మనోరథములను పొందును. అట్టి హితములైన కోరికలు-పరమేశ్వరునిచేతనే విధింపఁబడియున్నవి.

వివరణ—పరమేశ్వరుఁ డొసఁగిన అధికారము వలననే సూర్యచంద్రేంద్రాదులు-భక్తులకు వరములఁ బ్రసాదింపఁగలుగుదురని—విదితమైనది.

శ్లో॥ అంతవత్తు ఫలం తేషాం-తద్భవత్యల్పమేధసాం ।
దేవాన్ దేవయజో యాంతి-మద్భక్తా యాంతి మామపి ॥ 23

స్వల్పమైన విజ్ఞానము (అవివేకము) గల శివేతరదేవతాభక్తులకు లభించు ఫలము శాశ్వతము కాదు. అన్యదేవతాభక్తులు—మరణించిన పిదప-జననమరణశాలురగు దేవతలయొక్క స్వర్గాదిలోకములఁ జేరుదురు. శివభక్తులైతేనో శివునిఁ జేరి ముక్తులగుదురు.

వివరణ—దేవతలందరును పరమేశ్వరుని రూపాంతరములగుటచే నవ్వారిని పూజించుట శివారాధనమే యనను, ఆయా దేవతారూపములతో భక్తులకు వరముల నొసఁగువాడు-పరమేశ్వరుఁడే యనను. పరమేశ్వరభక్తులకు ఇతరదేవతాభక్తులకు లభించు ఫలములో భేదము గలదని పై శ్లోకము నొక్కి వక్కాణించినది—శివేతర దేవతలు-మృత్యుంజయులు గామి నవ్వారివలన లభించు ఫలము—జన్మపరంపర నొసఁగునది కాగా-పరమేశ్వరు ననన్యభక్తితో నుపాసించుట-జన్మరాహిత్యము నొదవఁజేయునని ఇందు విశదమైనది. ఇందుకు "యదా చర్మవదాకాశం" ఇత్యాది శ్రుతి-ప్రమాణము.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తి మాపన్నం-మన్యంతే మా మబుద్ధయః।
పరం భావ మజానంతో-మమావ్యయ మనుత్తమమ్ ॥ 24

"తమాది మధ్యాంతవిహీనం" ఇత్యాది శ్రుతి ననుసరించి నిరాకారుఁడైనను

ఉమాసహాయత్వాది లక్షణములు గల, ప్రాకృతము కానట్టి, దివ్యవిగ్రహము గల వాఁడు పరమేశ్వరుఁడని అవివేకులు భావింపరు-ఎందుకనఁగా? పరమేశ్వరునియొక్క వినాశము లేనట్టి నిత్యము శ్రేష్ఠంబునైన పరత్వమును గుర్తింపఁజాలనివారై-నిరాకారము సాకారము నగు తత్త్వము ఒకటేనని భావింపఁజాలరు.

వివరణ- "పరాత్పరతరో బ్రహ్మ-తత్పరాత్ పరతో హరిః, తత్పరాత్పరతో హీశః" ఇత్యాదిశ్రుతిసిద్ధమైన శివుని (బ్రహ్మకంటె పరుఁడు-శ్రీహరి, విష్ణువునకన్న శ్రేష్ఠుఁడు శంకరుఁడు" అను పారమ్యమును భావించు ప్రజ్ఞ లేనివారై-అశాశ్వత ఫలప్రదాతలగు శివేతర దేవతల నారాధించుచు జననమరణ ప్రవాహములో కొట్టుమిట్టాడుచుందురని భావము-

శ్లో॥ నాహం ప్రకాశః సర్వస్య-యోగమాయాసమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి-లోకో మా మజ మవ్యయమ్ ॥ 25

సమస్తప్రాణులకు పరమేశ్వరుఁడు-కనఁబడువాడు కాడు ఎందుకనఁగా? సృష్టి మొదలగు సంకల్పములఁజేయునట్టి పరమేశ్వరుని యధీనురాలగు మాయాశక్తిచే కప్పఁబడినదై వివేకమును గోలుపోయిన నీ లోకము-ఆదిమధ్యాంతములు లేనట్టి పరమేశ్వరుని గుర్తింపఁజాలదు.

వివరణ-జీవాత్మ-అనాదికాలమునుండి మహేశ్వరుని మాయామోహముఁజెంది పరవశుఁడై-పరమేశ్వరు నారాధింపడు గాన నట్టి యవివేకునకు పరమేశ్వరుఁడు ఏనాటికిని గోచరుఁడు కాడని భావము.

శ్లో॥ వేదాహం సమతీతాని-వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని-మాం తు వేద న కశ్చన॥ 26

అర్జునా! పరమేశ్వరుఁడు భూత భవిష్యత్ వర్తమాన కాలముల యందలి ప్రాణులను గుర్తించును. ఇఁక నే ఒకానొకఁడును పరమేశ్వరుని గుర్తింపఁజాలడు.

వివరణ-పరమేశ్వరుఁడు ఇచ్ఛాజ్ఞానశక్తులు గలవాడై నవ్వానిని వశపఱచుకొనును గాన నట్టి పరాత్పరు నుపాసకులెవరును దర్శింపఁజాలరని విదితమైనది.

శ్లో॥ ఇచ్ఛాద్వేషసముత్థేన-ద్వంద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం-సర్గే యాంతి పరంతప ॥ 27

భారతా! పరంతపా! సృష్టి ప్రారంభమున-రాగద్వేషముల వలన నుదయించు-శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వ (రెంటి) మోహము వలన ప్రాణులందరు-వివేక శూన్యులగుదురు. అందువలన పరమేశ్వరు నారాధింపరని భావము.

శ్లో॥ యేషాం త్వంతగతం పాపం-జనానాం పుణ్యకర్మణాం ।
తే ద్వంద్వమోహనిర్ముక్తా-భజంతే మాం దృఢవ్రతాః ॥ 28

అనేక జన్మలయందు చేయఁబడిన పుణ్యవిశేషములు గల ఏ జనులకు పాపము పూర్తిగ క్షీణించునో, అట్టివారు-ద్వంద్వమోహము లేనివారై శిరోవ్రతము (శాంభవదీక్ష) నవలంభించి-పరమేశ్వరు నారాధింతురు.

వివరణ-పుణ్యాత్ములకే శాంభవ (లింగధారణ) దీక్షయందు ఆసక్తి కలుగుననియు, పాపాత్ములకు పాశుపతవ్రతాచరణము ఘటింపదనియు సారాంశము.

శ్లో॥ జరామరణమోక్షాయ-మా మాశ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న-మధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥ 29

ముదుసలితనము మరణము మొదలగు అవస్థలతో కూడిన సంసారబంధము నుండి విడిబడుటకు పరమేశ్వరు నాశ్రయించి ఏ పుణ్యాత్ములు నిరంతర శివ ధ్యాననిష్ఠులగుదురో, అట్టివారు- (తద్బ్రహ్మ) పరమేశ్వరుని; (అధ్యాత్మం కృత్స్నం) ప్రత్యగాత్మయొక్క-స్వరూపమును మరియు మరణించుతఱి చేయఁదగిన సమస్త కార్యమును జననకారణమగు కర్మఁగూడ తెలిసికొనఁగలుగుదురు.

వివరణ-పరమేశ్వరు (శివు) నాశ్రయించుట యనఁగా? శాంభవదీక్షితుఁడై నిరంతరము (జాగ్రత్ స్వప్నసుషుప్తులయందు) లింగాంగసామరస్యమునొందుట యగును. అట్టివారికి-ప్రతిదినము నియమితసమయములలో ఇష్టలింగమునందు ప్రాణలింగముద్వారా భావలింగమును ధ్యానించుట సంఘటించును. ఈ ధ్యానమే దశావధానములు కలదగుచున్నయది. శివుని ధ్యానించువారు మాత్రము-శివస్వరూపము నంత్యకాలమున దర్శించుటయే గాక "శివోఽహం" భావనతో (తమ) నిజరూపము నావిష్కరింపఁజేసికొందురు. అందువలన భవబంధము పటాపంచలగును.

శాంభవదీక్షితులై శివునారాధించుచు ధ్యానించువారికే పశుపాశపతి జ్ఞానము కలుగునని సారాంశము.

శ్లో॥ సాధిభూతాధిదైవం మాం-సాధియజ్ఞం చ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం-తే విదు ర్యుక్తచేతసః ॥ 30

అధిభూతము అధిదైవము అదియజ్ఞము ననువానితో పరమేశ్వరు నెవరు గుర్తింతురో, అట్టివారు-ప్రాణోత్క్రాంతిసమయమందును స్థిరచిత్తము గలవారై పరమేశ్వరుని మరువఁజాలరు.

వివరణ-శరీరమును జీవాత్మను పరమాత్మను గుర్తించి నిత్యము శివధ్యానము నొనర్చువారు-అవసానకాలమునఁగూడ పరమేశ్వరుని ప్రార్థించి ముక్తులగుదురని భావము.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,
జ్ఞానయోగో నామ సప్తమోఽధ్యాయః

శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీమత్ భగవద్గీతా భాష్యమున
"మనోరంజనం" బను శాంకరీయ ఆంధ్రానువాదమున
ఏడవ అధ్యాయము.



ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః.

# శ్రీ భగవద్గీత

## అష్టమాధ్యాయము

"మనో రంజన" శాంకరీయ ఆంధ్రానువాద సహితము.

అర్జున ఉవాచ-

శ్లో॥ కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం-కిం కర్మ పురుషోత్తమ ।
అధిభూతం చ కిం ప్రోక్త-మధిదైవం కి ముచ్యతే ॥ 1
అధియజ్ఞః కథం కోఽత్ర-దేహేఽస్మిన్ మధుసూదన ।
ప్రయాణకాలే చ కథం-జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ 2

అధ్యాత్మము, కర్మ, అధిభూతము, బ్రహ్మము, అధిదైవంబు ననునవి ఎట్టివో, పురుషోత్తమా! చెప్పుము!

మధుసూదనా! ఈ శరీరమునందు అధియజ్ఞుఁడెట్లుండును? చిత్తశుద్ధి గల వారు-ప్రాణము ప్రయాణించువేళ పరమేశ్వరు నెట్లు స్మరింపవలెను?

శ్రీ భగవానువాచ-

శ్లో॥ అక్షరం బ్రహ్మ పరమం-స్వభావోఽధ్యాత్మ ముచ్యతే ।
భూతభావోద్భవకరో-విసర్గః కర్మసంజ్ఞితః ॥ 3

అక్షరశబ్దవాచ్యమైన బ్రహ్మము-సర్వశ్రేష్ఠమైనది. సూక్ష్మపంచమహాభూతముల సంబంధమువలన కలుగు వాసనాదికము-స్వభావ మనఁబడుచు అధ్యాత్మ మనఁబడును. ప్రాణుల పుట్టుకకు కారణమగు రేతస్త్యాగము-కర్మశబ్దితమగునది.

వివరణ-"ఏతద్వై తదక్షరం" "శివఏవ కేవలః" "తదక్షరం" ఇత్యాది శ్రుతులు-పరబ్రహ్మము-అక్షరశబ్దితమని చెప్పుచున్నందున అక్షరమే సకలజగత్కారణమగు శివతత్త్వముగ పేర్కొనఁబడుచున్నయది. ఆత్మగానిది ఆత్మగా వ్యవహరింపఁబడుచున్నందున- ప్రకృతి (స్వభావము) అధ్యాత్మమని చెప్పఁబడును.

పరమేశ్వరుఁడు పొందఁదగినవాడని, ప్రకృతి-విడువఁదగినదని. ముముక్షువులు గుర్తింపవలెను. "పంచమ్యామాహుతా వాపః పురుషవచసో భవంతి" "స్త్రీ శరీరమనఁదగు ఐదవ ఆహుతియందు సూక్ష్మశరీరగతములైన ఉదకములు పురుషునినుండి-రేతోరూపముగ విసర్జింపఁబడును" అను శ్రుతి ననుసరించి-స్త్రీ యోనియందు పురుషుని వీర్యత్యాగమే-జననమునకు మూలకారణమై "కర్మ"అను సంజ్ఞఁజెందునని భావము.

శ్లో॥ అధిభూతం క్షరో భావః-పురుష శ్చాధిదైవతం।
ఆదియజ్ఞోఽహమేవాత్ర-దేహే దేహభృతాం వర ॥ 4

శరీరధారులలో శ్రేష్ఠుఁడవైన అర్జునా! (భూతం = ప్రాణిని, అధికృత్య = ఆశ్రయించి: భవతి = ఉండును గాన నశించు స్వభావము గల శరీరాదికము-అధిభూతమనఁబడును. భోక్తయగు పురుషుఁడు (పరమాత్మ ఆశ్రయము గలవాడఁగుటచే (దైవతమధికృత్యతిష్ఠతీతి) అధిదైవత మనఁబడును.

యజ్ఞయాగాది పుణ్యకర్మలు-దేహముచే చేయఁదగినవి గాన- (అత్ర దేహే = అని చెప్పఁబడిన) ఈ దేహమునందు (యజ్ఞమధికృత్యతిష్ఠతీతి) యజ్ఞయాగాది పుణ్యకర్మఫలప్రదాతగా నివసించును గాన పరమేశ్వరుఁడు అధియజ్ఞ శబ్దవాచ్యుఁడగుచున్నవాడు.

వివరణ-దేహాదులు క్షరములనియు, జీవాత్మ- పరమాత్మనాశ్రయించి భోక్తయగువాడనియు, పరమేశ్వరుఁడు-దేహేంద్రియాదులను ప్రవర్తింపఁజేసి యజ్ఞయాగాదిసుకృతములను జీవాత్మచే చేయించుననియు నిరంతరము భావించువాడు-అంత్యకాలమునను పరమేశ్వరుని స్మరించి ముక్తుఁడగును.

నిరంతర పరమేశ్వరభావనకు-సర్వాంగలింగసాహిత్యము గల శాంభవ

దీక్షయే ప్రబలసాధనమని "జిహ్వాంగే గురులింగం స్యాత్" ఇత్యాదిప్రమాణములు చాటుచున్నవి.

పురుషుఁడనఁగా- పరమేశ్వరుఁడని చెప్పవచ్చును. "దేవతలందరి ఆశ్రయము" అను నర్థమున మహాదేవుఁడై-అధిదైవత మనఁదగియున్నవాఁడు. అట్లు చెప్పినచో అధియజ్ఞశబ్దమునకు "యజ్ఞో వై విష్ణుః" అనుశ్రుతి ననుసరించి ఆదివిష్ణువను నర్థమును "అహం" పదమునకు చెప్పవలసివచ్చును.

అట్లైనచో హరిహరులు దేహమునందున్నారని భావింప నవకాశము కలుగుచున్నది. శక్తిలో జడము క్షరము కాగా-చేతనము విష్ణుస్థానీయమగును చిచ్ఛక్తి యొక్క అపరరూపమగు హరితో హరుఁడున్నాఁడు అనుటలో శక్తివిశిష్టశివాద్వైతము స్ఫురించుచున్నయది.

శ్లో॥ అంతకాలే చ మామేవ-స్మరన్ ముక్త్వా కళేబరం।
యః ప్రయాతి స మద్భావం-యాతి నాస్త్యత్ర సంశయః॥ 5

ఏ భక్తుఁడు-ప్రాణత్యాగ సమయమున పరమేశ్వరునే స్మరించుచు శరీరమును విడిచి-అర్చిరాదిమార్గమున వెళ్లునో, అట్టి భక్తోత్తముఁడు- పరమేశ్వరుని స్వరూపమును పొందును. ఇందు సంశయము లేదు. మరణించువేళ ఏమి చేయవలెనను అర్జునుని ప్రశ్నకు పై శ్లోకము సమాధానము.

వివరణ-"అస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య" "ఈ శరీరమునుండి జీవాత్మ-లేచి-పరంజ్యోతిఃస్వరూపుఁడగు పరమేశ్వరు నాశ్రయించి నిజరూపము నావిష్కరింపఁజేసికొనును" ఇత్యాదిశ్రుతి ననుసరించి-అవసానకాలమున శివనామరూపములను స్మరించు పుణ్యాత్ముఁడు-అర్చిరాదిమార్గమున-పరమపదమునఁ బ్రవేశించి-పరమేశ్వరుని పరమసారూప్యము గలవాడై శివానందమును నిరవధికముగ ననుభవించునని తేటపడుచున్నయది.

శ్లో॥ యం యం వాఽపి స్మరన్ భావం-త్యజత్యంతే కళేబరం।
తం తమేవైతి కౌంతేయ-సదా తద్భావభావితః॥ 6

కౌంతేయా! ఏ యే దేవతను-లేక-ఏయే భావమును స్మరించుచు- అంత్యకాలమున శరీరమును విడనాడునో, ఎల్లకాలము అట్టి భావమును హృదయము

నందు నింపుకొనియుండుటచే-ఆ యా దేవతాభక్తుడుగ, లేక-పూర్వజన్మాంత మందలి భావమును సాధించువానిగ మరల జన్మించును.

శ్లో॥ తస్మా త్సర్వేషు కాలేషు-మా మనుస్మర! యుధ్య చ ।
మయ్యర్పితమనోబుద్ధి-ర్మామేవైష్యస్యసంశయః ॥ 7

అందువలన సమయములన్నిటియందు పరమేశ్వరుని స్మరింపుము! శివారాధనబుద్ధిని స్వధర్మమగు యుద్ధము నొనర్పుము! మనస్సును బుద్ధిని పరమేశ్వనందు నెలకొలుపుము! ఇట్లు ప్రవర్తించినచో పరమేశ్వరుని పొందగలవు! ఇందు సంశయము లేదు

వివరణ-అంత్యకాలమందలి పరమేశ్వరస్మరణమే-మోక్షమునకు నిదానమైనను-ఎల్లకాలము జీవితమున నభ్యసింపఁబడు శివస్మరణము-మరణకాల శివస్మరణమునకు మూలమగును. క్షత్రియునకు యుద్ధము స్వధర్మమగుటచే దోషావహము కానిదై నిరంతర శివస్మరణమును నిరోధింపదనియు, బ్రాహ్మణాదులు స్వధర్మములగు ప్రతిగ్రహాదుల నొనర్చుచునే సదాశివు నారాధించుచు శివస్మరణము నభ్యసింపవలెననియు, అట్టివారికే అంత్యకాలశివస్మృతి-సంఘటించుననియు విదితమైనది.

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన-చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం-యాతి పార్థానుచింతయన్ ॥ 8

పార్థా! ప్రతిదినము తప్పకుండ చేయుట-అభ్యాస మనఁబడును. అట్టి అభ్యాసముచే యోగము-(అంతర్నిష్ఠ) కలుగును. దివ్యుఁడైన పరమపురుషు-నభ్యాసయోగ యుక్తము, ఇతర వస్తువును చింతింపనదియు నగు చిత్తముతో- భావించువాడు పరమపురుష సనఁగా పరమేశ్వరుని పొందఁగలుగును.

వివరణ-పరమేశ్వర ప్రాప్తికి (మోక్షసామ్రాజ్యమునకు) ఎల్లకాలము శివనామరూపలీలావిలాసములను స్మరించుటయే సాధనమగునని భావము.

శ్లో॥ కవిం పురాణ మనుశాసితార-మణో రణీయాంస-
మనుస్మరే ద్యః । సర్వస్య ధాతార మచింత్యరూప-
మాదిత్యవర్ణం తమసఃపరస్తాత్ ॥ 9

శ్లో॥ ప్రయాణకాలే మనసాఽచలేన-భక్త్యాయుక్తో
యోగబలేన చైవ । భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్-
స తం పరం పురుష ముపైతి దివ్యమ్ ॥ 10

ఆదికవి, ఆదిమధ్యాంతరహితుఁడు, జీవాత్మననుసరించి శాసించువాఁడు, అణువగు జీవాత్మకంటె నణువగువాఁడు, సమస్తమును నిర్మించువాఁడు, ఊహచే చింతింపనలవి గాని రూపము గలవాఁడు, సూర్యుని తేజస్సువలె విశ్వమునంతయు ప్రకాశింపఁజేయు కాంతి గలవాఁడు, ప్రకృతిని మించినవాఁడు నగు పరమేశ్వరుని ఎవఁడు- ప్రాణావసానకాలమున స్థిరమైన మనస్సుతో యోగశక్తిచేతను, భక్తి యుక్తుఁడై సుషుమ్నానాడీద్వారా ప్రాణవాయువును భ్రూమధ్యమున నిలిపి-ధ్యానించునో, అట్టి పరాభక్తుఁడు-లోకవేదప్రసిద్ధుఁడు బ్రహ్మాండాతీత అంతరిక్షమునందు విరాజమానుఁడు నగు పరపురుష (పరమేశ్వరు)ని పొందును.

వివరణ.ప్రాణప్రయాణ సమయమున కనుబొమల నడుమ ఊపిరి నాపి శివుని ధ్యానించుటకై-బాల్యమునందు లేక కౌమారమున గురువు చెంత ప్రాణాయామాది యోగము నభ్యసించుట యవసరమే గాక ఎల్లకాలము శివనామము నుచ్చరించుచు శివస్వరూపమును గురించి చింతించుటయు; వేద వేదాంత సూత్ర గీతా ప్రబోధముల నవగాహనఁ జేసికొనుటయు, ప్రాతఃస్నాన భస్మరుద్రాక్ష యజ్ఞోపవీత శివలింగధారణ పూజనాది సదాచారమును ప్రవర్తింపఁజేయుటయు-ఆవశ్యకములగునవి. అష్టాదశవిద్యలకు మూలమగుటచే పరమేశ్వరుఁడు-ఆదికవి యనఁబఱఁగును.

శ్లో॥ యదక్షరం వేదవిదో వదంతి-విశంతి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి-తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥

"సర్వే వేదా యత్పద మామనంతి" ఇత్యాది కఠవల్లీశ్రుతికి ఈ శ్లోకము అనువాదము;

"ఏతస్య వాఽక్షరస్య ప్రశాసనే" "ఈ అక్షరముఁదగు శాసనమున ప్రాణులందరు ప్రవర్తించుచుందురు" ఇత్యాదిని వేదజ్ఞులు-ఎద్దానిని అక్షరమని చెప్పుదురో, రాగద్వేషాదిదోషములు లేనివారై చిత్తశుద్ధి గల యోగులు-ఎద్దానిని సాక్షా

తక్కరింపఁజేసికొనెదరో, ఏద్దానిని తెలియఁగోరినవారై గురుకులమున నివసింతురో అట్టి పదశబ్దవాచ్యమైన బ్రహ్మమును గురించి సంక్షేపముగ చెప్పెదను.

వివరణ—ఇఁట పద మనఁగా? శబ్దము కాదు. "పద్యతే ముక్తై రితి పదం" అను వ్యుత్పత్తి ననుసరించి పదశబ్దమునకు-బ్రహ్మము అను నర్థముఁ జెప్పవలెను.

"వేదములన్నియు ఏ బ్రహ్మమును గురించి ఘోషించుచున్నవో" అని కఠవల్లీవాక్యమునకు అర్థము.

గురుకులమున—బ్రహ్మచారియై వేదశాస్త్ర ఆగమాది విద్యల నభ్యసించి గురుప్రబోధముచే బ్రహ్మజిజ్ఞాస గలవారికి బ్రహ్మముఁదగు అపరోక్ష జ్ఞానము కలుగును.

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య-మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ-మాస్థితో యోగధారణామ్॥ 12
ఓమిత్యేకాక్షరం బ్రహ్మ-వ్యాహరన్ మా మనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్ దేహం-స యాతి పరమాం గతిమ్ ॥ 13

శరీరద్వారములనఁదగు జ్ఞానకర్మేంద్రియముల నన్నిటిని నిగ్రహించి-మనస్సును హృదయమునందు నిలిపియు తన ప్రాణవాయువును భ్రూమధ్యస్థానమున ఆపి-యోగాభ్యాసముఁజెందిన ధారణము నవలంబించియు నిరాకార బ్రహ్మ (శివలింగ)ము నుద్దేశించి "ఓమ్" అను ఏకాక్షర (సూక్ష్మ శివపంచాక్షరీ మహామంత్ర)మును బిగ్గరగా నుచ్చరించుచు పరమేశ్వరుని సాకారదివ్యరూపమును స్మరించుచు- అంత్యకాలమున శరీరమును విడిచి పయనించువాడు-పరమగతిని పొందును.

వివరణ- మరణించుతఱి-ప్రణవోచ్చారణఁజేయుచు "చంద్రశేఖర, గంగాధర, శ్రీకంఠ, త్రిపురాంతక, త్రిణయన, మహాదేవ ఇత్యాది సాకార స్వరూపమును చింతించుచు ప్రాణమును త్యజించుట-పూర్వోక్త రీతిని నిత్యము శివధ్యానమును శివనామములలో ముఖ్యాతిముఖ్యమగు ప్రణవ పంచాక్షరి నభ్యసించుట- అత్యవసరమగును. "తస్య వాచకః ప్రణవః" "పరమేశ్వరునిఁ జెప్పునది ఓంకారము" అను పతంజలి మహర్షిగారి నిర్వచనము-ఇందుకు నిదర్శనము. విడివిడి అక్షర

ములు గలది- స్థూలపంచాక్షరియనియు; అకార ఉకార మకార బిందునాదముల సమాహారమగు ప్రణవము-సూక్ష్మపంచాక్షరియనియు వివేకము. పరమగతి యనఁగా- శివసాయుజ్యరూపము, పునరావృత్తి రహితము, నిరతిశయ శివానందానుభవ సంపన్నంబు నగు మహాకైలాసస్థితి యగును.

శ్లో॥ అనన్యచేతాః సతతం-యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ-నిత్యయుక్తస్య యోగినః॥ 14

పార్థా! పరమాత్మకంటె వేరైన ఇంద్రియ సుఖాదులయందు ఇతర దేవతలయందును చిత్తము లేనివాడై ప్రతిదినము మరియు దివారాత్రములునెవఁడు పరమేశ్వరుని స్మరించునో, పరమేశ్వరునియందే చిత్తమును నిలిపి పరమేశ్వరుని ధ్యానించునో నట్టివానికి-పరమేశ్వరుఁడు సుఖముగ పొందఁదగినవాడగును.

వివరణ "శివ ఏకో ధ్యేయః శివంకరః, సర్వమన్యత్ పరిత్యజ్య" అన్నట్లు ప్రకృతిపురుషులఁజెందిన పంచమహాభూతములయందు, జ్ఞాన కర్మేంద్రియముల యందును, ప్రకృతిబద్ధులైన ఇంద్రచంద్రాదులయందును మనస్సు లేనివాడై-నిష్కామ్యముగ- నిత్యనైమిత్తిక కర్మల నాచరించుచు-శివునొకనినే ధ్యానించు పుణ్యపురుషుఁడు-సులభముగ- ముక్తుఁడగునని భావము.

శ్లో॥ మా ముపేత్య పునర్జన్మ-దుఃఖాలయ మశాశ్వతం।
నాప్నువంతి మహాత్మానః-సంసిద్ధిం పరమాం గతాః॥ 15

శివసాయుజ్యము నొందిన ముక్తపురుషులు-పరమేశ్వరు నాశ్రయించుటచే దుఃఖనిలయము, అశాశ్వతంబు నగు పునర్జన్మను పొందఁజాలరు.

వివరణ-"న స పునరావర్తతే" "శివసాయుజ్యము నొందినవాడు-మరల జన్మింపడు" అను శ్రుతి-పై శ్లోకమునకు అధారమని తెలియవలెను.

శ్లో॥ ఆబ్రహ్మభువనా ల్లోకాః-పునరావర్తినోఽర్జున।
మా ముపేత్య తు కౌంతేయ-పునర్జన్మ న విద్యతే॥ 16

అర్జునా! బ్రహ్మలోకపర్యంతము నివసించు జనులందరును మరల జన్మించువారగుదురు. కౌంతేయా! మాం-నాలోఉన్నట్టి పరమేశ్వరు నుపాసించి పొందిన వారికి పునర్జన్మ యుండఁజాలదు.

వివరణ—"శివ ఏకో ధ్యేయః, శివంకరః సర్వమన్యత్ పరిత్యజ్య"ఇహ పర శ్రేయస్సు నొసగునట్టి పరమేశ్వరునే ధ్యానింపవలెను. శివేతరమగు చేతనాచేతనములను ధ్యానింపవలదు"అను శ్రుతి-ఇటప్రోద్బలక మగునది.

శ్లో॥ సహస్రయుగపర్యంత-మహ ర్యద్ బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం-తేఽహోరాత్రవిదో జనాః ॥ 17

వేయి మహాయుగముల కాలము - బ్రహ్మదేవునకు పగలనియు, వేయి మహాయుగముల కాలము-బ్రహ్మదేవునకు రాత్రియనియు-అహోరాత్ర పరిజ్ఞానము గల మహాజనులు గుర్తించుచున్నవారు.

వివరణ—కృత త్రేతా ద్వాపర కలియుగములు కూడి మహాయుగమనఁబఱఁగును. ఇట్టి మహాయుగములు రెండువేలు గడచినచో బ్రహ్మదేవునకు ఒక దినము కాగా 30 దినములు నెలగా, 12 నెలలు సంవత్సరముగా ఈ సంఖ్యతో 100 సంవత్సరములు గడచినచో బ్రహ్మదేవుని ఆయుష్యము పూర్తి యగును. మహాయుగ సంవత్సరములు 43,20000; ఇట్టి వివేకము గలవారే అహోరాత్ర విదులగుదురని, బ్రహ్మలోకాదులు- కాలపరిచ్ఛిన్నములగుటచే అనిత్యములనియు సారాంశము.

శ్లో॥ అవ్యక్తా ద్వ్యక్తయః సర్వాః-ప్రభవంత్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయంతే-తత్రైవావ్యక్తసంజ్ఞకే ॥ 18

అవ్యక్తమనఁగా? సూక్ష్మరూపము, గతానంతర ప్రళయమున సూక్ష్మరూపముఁజెందిన ప్రకృతినుండి చరాచరప్రాణులు-బ్రహ్మదేవునిదినము ప్రారంభించినవేళ-ప్రాదుర్భవింతురు. రాత్రి తటస్థించినతఱి-అవ్యక్తమనఁబడు సూక్ష్మప్రకృతిలో నుందురు

వివరణ—నామరూపములను గుర్తింపరానిస్థితి-అవ్యక్తము కాగా-చరాచరప్రాణులు-అవాంతరప్రళయకాలమున-అవ్యక్తమునందు దాగియున్నవై-అవాంతర సృష్టికాలమున-నామరూప విభాగార్హమైన స్థూలదశను పొందుదురు.

బ్రహ్మదేవుని దినసృష్టి-అవాంతరసృష్టియనియు-రాత్రిప్రళయము అవాంతర ప్రళయమనియు; బ్రహ్మదేవుని అంత్యకాలమున మహాప్రళయముకాగా-బ్రహ్మ

దేవుని ఉదయమున మహాసృష్టి యగుననియు, ఘటమునకు మృత్తికవలె-కార్యమునకు కారణము-సూక్ష్మమనియు-వివేకము.

శ్లో॥ భూతగ్రామః స ఏవాయం-భూత్వా భూత్వా ప్రలీయతే।
రాత్ర్యాగమేఽవశః పార్థ-ప్రభవత్యహరాగమే ॥ 19

ఈ సృష్టికి మున్ను గల ప్రాణిసముదాయమే-మరల మరల జన్మించి మరణించును. పార్థా! ప్రాణులు ఇవ్విధము కర్మపరాధీనులై-సృష్టి ప్రళయములయందు జననమరణములను పొందుచుందురు.

వివరణ—జననమరణప్రవాహము ఎడతెగనిదగుటచే-సంసారబంధ కారణమగు కర్మను నివారించుటకు-పరమేశ్వరు నారాధింపవలె ననియు సృష్టి ప్రళయ క్రమమును గుర్తించి వైరాగ్యము గలవారు కావలెననియు సారాంశము.

శ్లో॥ పరస్తస్మాత్తు భావోఽన్యో-వ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।
యస్స సర్వేషు భూతేషు- నశ్యత్సు న వినశ్యతి॥ 20

ఆ ఇంద్రియాగోచరమగు-అవ్యక్తమును మించినట్టి-అవ్యక్తమునకంటె వేరైనట్టియు అనాదికాలస్థితంబు వ్యక్తంబు నగు భావము—ప్రాణులందరు నశించినను నశింపనిదగును.

శ్లో॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్త- స్తమాహుః పరమాంగతిం ।
యం ప్రాప్య న నివర్తంతే-తద్ధామ పరమం మమ ॥ 21

ఇఁట-అవ్యక్తుఁడనగా ? అనుపాసకులకు గోచరుఁడు కానివాడు. ఇట్టి అవ్యక్తుఁడు - అక్షరుఁడని చెప్పఁబడును. అట్టి అక్షరుఁడే—ముక్తజనులకు పరమప్రాప్యుఁడని శ్రుతులు వక్కాణించినవి.

ఎద్దానిఁజేరి మరల రారో, అట్టి పరమధామము—పరమేశ్వరునిదేను;

వివరణ—నాశము లేనివాడగుటచే పరమేశ్వరుఁడు-అతీంద్రియుఁడై అక్షరుఁడనఁబఱఁగుచు—"అథాక్షరా త్సంభవతీహ విశ్వం" ఇత్యాదిశ్రుతుల ననుసరించి—తన నుండి విశ్వము నావిర్భవింపఁజేయుచున్నవాడని విదితమగును. మరియు "పురుషాన్న పరం కించిత-సా కాష్ఠా సా పరా గతిః" "పురుషశబ్దవాచ్యుడైన పరమేశ్వరుని

కంటె శ్రేష్ఠము ఎద్దియులేదు. అట్టి పురుషుఁజేరుటయే-అవధియు శ్రేష్ఠమైనగమ్యంబు నగునని భావము.

శ్లో॥ పురుషః స పరః పార్థ! భక్త్యా లభ్యస్త్వనన్యయా ।
యస్యాంతఃస్థాని భూతాని-యేన సర్వ మిదం తతమ్॥ 22

పార్థా! స పరఃపురుషః అనఁగా? పరమేశ్వరుడు-అనన్యభక్తిచేతనే లభ్యుం డగును. చరాచరప్రాణులు పరమేశ్వరునియందు ఆధారపడియున్నవి. ఈ ప్రంపచమునంతటిని పరమేశ్వరుఁడు వ్యాపించియుండువాడు.

వివరణ-అన్యథా శరణం నాస్తి-త్వమేవశరణం మమ"అను శరణాగతి-అనన్య భక్తియగును. ఏకాగ్రమనంబున చేయుప్రార్థన-అనన్యభక్తివలననే సిద్ధించును. ఇతరదేవతలనాశ్రయింపక శివునినే ఆరాధించుచున్నచో అనన్యభక్తి కాలక్రమమున స్థిరపడునని భావము.

శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తి-మావృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాంతి తం కాలం-వక్ష్యామి భరతర్షభ ॥ 23

భరతర్షభా! శివధ్యానయోగులు ఏమార్గమున వెళ్ళినచో పునరావృత్తిఁజెందరో, కర్మానుష్ఠానయోగులు ఏమార్గమున పయనించినయెడల-పునరావృత్తి గలవారగుదురో అట్టి మార్గముల రెంటిని చెప్పుచున్నాను.

వివరణ—ఇఁట-కాలశబ్దము—కాలాభిమానులగు ఆతివాహిక దేవతలు చేర్చు మార్గముఁజెప్పునది.

శ్లో॥ అగ్నిర్జ్యోతి రహః శుక్లః-షణ్మాసా ఉత్తరాయణం ।
తత్ర ప్రయాతా గచ్ఛంతి-బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ 24

అగ్నిఃజ్యోతిః అను పదములతో చెప్పఁబడు అర్చిరభిమానినియగు దేవత, అహః-దినాభిమానినీదేవత; శుక్లపక్షమునందు అభిమానముగల దేవత; ఆరు నెలలు గల ఉత్తరాయణముపై అభిమానముగల దేవత; అను ఆతివాహికులు చూపెట్టు మార్గమున పయనించు పరమేశ్వరోపాసకజనులు—పరమేశ్వరుని పొందుదురు.

వివరణ—"తేఽర్చిష మభిసంభవంతి" ఇత్యాది శ్రుతియందు చెప్పఁబడిన

సంవత్సర దేవలోకాదులయందు అభిమానము గల దేవతలు పై నిర్వచనమునందు గలరని తెలియవలెను.

శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణః-షణ్మాసా దక్షిణాయనం ।
తత్ర చాంద్రమసం జ్యోతి-ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25

ధూమము, రాత్రి, కృష్ణపక్షము, ఆరునెలలుగల దక్షిణాయనము అను వానిపై అభిమానము గల ఆతివాహిక దేవతలు చేర్చు మార్గమున పయనించు కర్మయోగి జనుఁడు-స్వర్గలోకముఁజెంది—మరల నీలోకమున కేతెంచును.

వివరణ — ఆకాశపితృలోకాదుల నిటఁజెప్పకున్నను శ్రుతి ననుసరించి యవ్వాని యందభిమానము గల దేవతలను గ్రహింపవలెను. స్వర్గమున పుణ్యక్షయ మగువరకు—యజ్ఞయాగాది కర్మలను ఫలాభిసంధితో నాచరించినవారు నివసించి భూలోకమున బ్రాహ్మణాది ఉత్తమజన్మల నొందుదురని భావము.

శ్లో॥ శుక్లకృష్ణే గతీహ్యేతే-జగతః శాశ్వతే మతే ।
ఏకయా యాత్యనావృత్తి-మన్యయాఽఽవర్తతే పునః ॥ 26

శుక్లము కృష్ణము అను ఈ రెండు మార్గములు-శ్రుతిప్రసిద్ధములై అనాది కాలము నుండి ప్రపంచమున ప్రవర్తించుచున్నవి. ఇందు అర్చిరాదిమార్గముతో అనావృత్తి గలవాడగును. ధూమాదిమార్గమున మరల జన్మించును.

వివరణ—ప్రకాశమానమగుటచే అర్చిరాది మార్గము — శుక్లమనఁబడును. అంధకారమయమగుటఁజేసి—ధూమాదిమార్గము—కృష్ణ మనఁబఱఁగును. అర్చిరాది మార్గమున వెళ్ళినవారు. పరమపదముఁజెంది శివసాయుజ్యమును పొందుదురనియు; ధూమాదిమార్గమున గతించినవారు—స్వర్గాదిలోకములఁజేరి జన్మపరంపరలోనికి రాగలరనియు; వివేకము.

శాంభవదీక్షితులై ఇష్టప్రాణభావలింగములను నిత్యము షట్కాలముల యందు దశావధానాదులతో అరాధించు మాహేశ్వరప్రవరులు అవసానకాలమున అర్చిరాది మార్గమున వెళ్లుదురని ఇందు ద్యోతకమగుచున్నది.

శ్లో॥ నైతే సృతీ పార్థ! జానన్-యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మా త్సర్వేషు కాలేషు-యోగయుక్తో భవార్జున! ॥ 27

పార్థా! ఈ రెండు మార్గములను గుర్తించినచో ఏ శివధ్యానయోగియు స్వర్గాదిసుఖముల నపేక్షించు మోహమును పొందఁజాలడు. అందువలన అర్జునా! సమయములన్నిటియందు పరమేశ్వరుని ధ్యానించు యోగమున నిష్ఠ గలవాడవు కమ్ము!

వివరణ—శుక్లకృష్ణమార్గములు జ్ఞప్తిలో ఉన్నవానికి శివధ్యాన నిష్ఠ—భంగ పడదు. ఎప్పుడైనను స్వర్గసుఖాదులయందు అపేక్ష కలుగదని భావము.

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ-దానేషు యత్ పుణ్య
ఫలం ప్రదిష్టం । అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా-
యోగీ పరం సర్వ ముపైతి చాద్యమ్ ॥ 28

వేదములను గురుముఖతః అధ్యయనముఁ జేసినచో, యజ్ఞములను తపస్సులను యథావిధి శ్రద్ధాభక్తులతో ఆచరించిన యెడల, సమస్తదానములఁ జేసినచో, ఎట్టి పుణ్యఫలము—శాస్త్రమునందు నిర్దేశింపఁబడినదో; అట్టి పుణ్యఫలమునంతను ఈ అధ్యాయమున చెప్పఁబడిన అక్షరపరబ్రహ్మయోగమును గుర్తించు శివధ్యానయోగి—అతిక్రమించి-సర్వోత్తరమైన పరమేశ్వరస్థానమును పొందును.

వివరణ—శివధ్యానయోగముతో—వేదాభ్యాసము యజ్ఞకర్తృత్వము తపోనిష్ఠ దానము ఇత్యాదులు సరిదూగఁజాలవు. పరమేశ్వరుని మహాకైలాసము—బ్రహ్మాండ సీమయగు విరజానదియొక్క తీరమున నున్నట్టి వైకుంఠమునకన్న పైనుండునది. అదియే ఆద్యము పరంబు నగు శివలోకము అని తెలియవలెను.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మ
విద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే
అక్షరపరబ్రహ్మయోగో నామ అష్టమోఽధ్యాయః

ఇయ్యది - శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీమద్భగవద్గీతా
భాష్యమున "మనో రంజనం" బను శాంకరీయ ఆంధ్రానువాదమున
ఎనిమిదవ అధ్యాయము.



ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శ్రీ భగవద్గీత

## నవమాధ్యాయము

### "మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాదసహితము

శ్రీ భగవానువాచ -

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం-ప్రవక్ష్యామ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞానసహితం-యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ 1

అర్జునా! నే చెప్పిన దానియందు అసహనము లేనట్టి నీకు-అతిరహస్యము విశేషములతో కూడినదియు నగు ఉపాసనాత్మక జ్ఞానమును వివరింపగలను. అద్దానిని గుర్తెరిగి-సంసార బంధమునుండి విముక్తుఁడవు కాగలవు!

వివరణ-శివోపాసనమునందు కర్మయోగధ్యానయోగములు-విశేషములని ప్రతిపాదింపఁబడినది. ఉపాస్యుఁడగు పరమేశ్వరుని మహిమ, మరియు శివోపాసన-శివభక్తిరూపమైనదని ఈ అధ్యాయమున నిరూపింపఁబడుచున్నయది.

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం-పవిత్ర మిద ముత్తమం ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం-సుసుఖం కర్తు మవ్యయమ్ ॥ 2

విద్యలలో శ్రేష్ఠము, రహస్యములలో గొప్పది, పవిత్రము, ఉత్తమము, పరమేశ్వరుని సాక్షాత్కారమునకు నిదానము, ధర్మము ననుసరించునది, చేయుటకు ఆయాసము లేనిది, తఱుగు లేనిది యగు నీ జ్ఞాన (ఉపాసన)మును చెప్పెదను.

వివరణ—జ్ఞానమనఁగా? చిత్తశుద్ధిని పరమేశ్వరు నారాధించుట యని నిర్వచనము. శివారాధనములో నిష్కామ్యకర్మాచరణము, ధ్యానము అను విశేషములుండును. ఉపాసనము (ఆరాధన) ఏకాగ్రభక్తిరూపమైనది. అట్టి భక్తియోగము–ఈశ్వరదర్శనమును కలిగించును. స్వధర్మ (సంప్రదాయము ననుసరించి పరమేశ్వరు నుపాసింపవలెను. శివోపాసనము-శరీరవాఙ్మనోమలములను పోగొట్టును. మరియు నిరాయాసముగ సాధింప వలనుపడును. శివభక్తి-ఏనాటికైనను శాశ్వత ఫలము నొసఁగునని సారాంశము.

శ్లో॥ అశ్రద్దధానాః పురుషా-ధర్మస్యాస్య పరంతప! ।
అప్రాప్య మాం నివర్తంతే-మృత్యుసంసారవర్త్మని ॥ 3

పరంతపా! భక్తితో కూడిన నీ యుపాసనమునందు శ్రద్ధలేని పురుషులు–పరమేశ్వరుఁ జేరఁజాలనివారై మృత్యునిలయమగు సంసారము అను మహా మార్గమునందు మిగుల పరిభ్రమించుచుందురు.

వివరణ–భక్తియోగము సులభమైనను జీవాత్మలెందుకు సంసారము అను అంధకూపమునందు పడుదురు? అను ఆశంకకు–పై శ్లోకము సమాధానము; కామ్యకర్మలయందు ఆసక్తి ఉన్నంతవరకు నిష్కామకర్మాచరణము-ఘటింపదు. నిష్కామకర్మతో చిత్తశుద్ధి కలుగును. చిత్తశుద్ధితో ఏకాగ్రభక్తి–అంకురించి పల్లవించి పుష్పించి ఫలించునని భావము.

శ్లో॥ మయా తత మిదం సర్వం-జగదవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని-న చాహం తేష్వవస్థితః ॥ 4
న చ మత్స్థాని భూతాని—పశ్య మే యోగ మైశ్వరం ।
భూతభృన్న చ భూతస్థో-మమాత్మా భూతభావనః ॥ 5

అర్జునా! అతీంద్రియ స్వరూపము గల పరమేశ్వరునిచే ఈ జగమంతయు వ్యాపింపఁబడినది. ప్రాణులందరు పరమేశ్వరు నాశ్రయించి యుండునవి కాని పరమేశ్వరుఁడు ప్రాణులందరి నంతర్యామి యైన నవ్వానికి కట్టుబడువాడు కాడు. ప్రాణులు పరమేశ్వరునియందు "జలాదులు ఘటాదులయందు వలె" లేనివై పరమేశ్వరుని మహిమ నాశ్రయించునవి. ప్రాణులను భరించు పరమేశ్వరుఁడు

నవ్వారిని కాపాడువాడై—శరీరమునందు జీవాత్మ కర్మబద్ధుఁడై యుండునట్లు చేతనాచేతనములలో నుండువాడు కాడు. పరమేశ్వరుని అసాధారణమైన ఐశ్వర్యమును అద్దాని ఉపయోగము నివ్విధము గుర్తింపుము!

వివరణ-పరమేశ్వరుఁడు ప్రాణులలో ఉన్నాడంటే—జీవాత్మను కర్మభోగమునకై ప్రేరేపించుటకు మాత్రము ఉన్నాడని అర్థము. బ్రహ్మాండములోపల బయటను పరమేశ్వరుని మహిమ-ప్రకాశించుచుండును. పంచమహాభూతములకు మూలప్రకృతికి ఆదిశేషాదులకును పరమేశ్వరుని మహిమయే ఆధారమగునది. తన మహిమయందు తానే ప్రతిష్ఠ కలిగియుండువాడు- పరమేశ్వరుఁడని భావము. "ఏష భూతపతి రేష పాలయతి" అను శ్రుతివాక్యము—ఇందుకు ప్రమాణము.

శ్లో॥ యథాఽఽకాశస్థితో నిత్యం-వాయుః సర్వత్రగో మహాన్॥
తథా సర్వాణి భూతాని-మత్స్థానీ త్యుపధారయ ॥ 6

ఆకసమునందుండు గాలి-గొప్పదై అంతట సంచరించునదైనను ఆకాశముతో కలియునట్లు ప్రాణులందరు పరమేశ్వరు నాశ్రయించి యుండువారని నిర్ణయించుకొనుము!

శ్లో॥ సర్వభూతాని కౌంతేయ—ప్రకృతిం యాంతి మామికాం।
కల్పక్షయే పున స్తాని-కల్పాదౌ విసృజామ్యహమ్॥ 7

కుంతికుమారా! ప్రాణులందరు-ప్రళయకాలమున పరమేశ్వరుని స్థితిలో సూక్ష్మరూపములతో దాగియుందురు. సృష్ట్యారంభమున పరమేశ్వరుఁడు- మరల అట్టి ప్రాణులను స్థూలరూపములతో నావిర్భవింపఁజేయును.

శ్లో॥ ప్రకృతిం స్వా మవష్టభ్య-విసృజామి పునఃపునః।
భూతగ్రామ మిమం కృత్స్న-మవశం ప్రకృతే ర్వశాత్॥ 8

పరమేశ్వరుఁడు—కర్మపరవశము ప్రకృతిబద్ధంబు నగు ఈ ప్రాణిసముదాయమునంతయు—తనదైన మాయ నధిష్ఠించి మరల మరల సృజించుచుండును.

వివరణ—పరమేశ్వరుడు స్వతంత్రుఁడగుటచే—జీవాత్మలు కర్మబంధము గలవారగుటచేతను—సృష్టి— ప్రాణుల కర్మభోగమునకై చేయఁబడుననియు, జీవాత్మలఁ జెందినట్టి కర్మ—అనాదియనియు విశదమైనది.

శ్లో॥ న చ మాం తాని కర్మాణి-నిబధ్నంతి ధనంజయ।
ఉదాసీనవదాసీన-మసక్తం తేషు కర్మసు ॥ 9

ధనంజయా! సృష్టిలో వైషమ్యమును కల్పించు కర్మలు-పరమేశ్వరు నావరింపవు. ఎందుకనఁగా? పరమేశ్వరుఁడు అట్టి కర్మలయందు ఆసక్తి లేనివాఁడై ఉదాసీనునివలె నుండువాఁడు.

వివరణ-జీవాత్మకృతములగు కర్మల ననుసరించి-ప్రపంచము ఏర్పడును గాన జగన్నిర్మాత-పరమేశ్వరుడే ఐనను-ప్రాణులలో గల వ్యత్యాసమును గాని దుష్కృతులను శిక్షించు కాఠిన్యమును గాని పొందనివాఁడగుటఁజేసి-ఉదాసీనుఁడై యుండునని భావము.

శ్లో॥ మయాఽధ్యక్షేణ ప్రకృతిః-సూయతే సచరాచరం।
హేతునానేన కౌంతేయ-జగద్విపరివర్తతే ॥ 10

కౌంతేయా! నియంతయగు పరమేశ్వరుఁడు-చరాచరప్రపంచమును బాగుగా విచారించి నిర్మించును. జీవుల కర్మల ననుసరించి-జగత్తు-పునఃపునః పుట్టుచుండును.

వివరణ-పరమేశ్వరుఁడు జగన్నిర్మాతయైనను జీవుల సుఖదుఃఖభోగమునకు బాధ్యుఁడు కాకుండుటచే-ఉదాసీనునివలె నుండునని భావము.

శ్లో॥ అవజానంతి మాం మూఢా-మానుషీం తను మాశ్రితం।
పరం భావ మజానంతో-మమ భూతమహేశ్వరమ్ ॥ 11

పరమేశ్వరుని సర్వేశ్వరత్వము అను పరత్వమును గుర్తింపని మూఢులు-మానవ ఆకారముఁబోలినట్టి త్రిలోచనము నీలకంఠంబు నగు దివ్యవిగ్రహము-మనుష్యశరీరమువలె- సుఖదుఃఖభాజనం బగునని అపభావనఁ జేయుదురు.

వివరణ—"త్రిలోచనం నీలకంఠం ప్రశాంత" ఇత్యాది శ్రుతులయందు-పరమేశ్వరుని దివ్యవిగ్రహము-భక్తుల ననుగ్రహించుటకై ఏర్పడినదని విదితమగును. ఇంతియేగాక-శ్రీకృష్ణుని మూలరూపము మహావిష్ణువు-పరమేశ్వరుని శక్త్యంశమగుటచే-శక్తిశివుల కభేదమునఁజేసియు మహావిష్ణువు పరమేశ్వరునితో తాదాత్మ్యము నొందినట్టి సర్వేశ్వరత్వమును పారమ్యమును మూఢులు గుర్తింపని

వారై. వసుదేవుని కుమారుఁడు-అను మనుష్యభావనను గావింతురు అపక్షాంతరనకు ఇఁట అవకాశమున్నను- యథార్థమును దిగువ చర్చతో ప్రతిపాదించుచున్నాము.

మూడు కన్నులు నల్లని కంఠము ఇత్యాది విశేషములు గల పరమేశ్వరుని విగ్రహము-ప్రాకృతము కాదు గాన "మానుషీం తనుం" ఇత్యాది వాక్యము సంగతము కాదను ఆశయముతో పక్షాంతరమును సూచింపవలసివచ్చినది.

ప్రశ్న : వాసుదేవునకు-పరమేశ్వరుని ఏకాగ్రభావనతో సర్వైశ్వర్యము కలదని-అభేదదృష్టితో అంగీకరించునెడ- "అహం సర్వస్య ప్రభవః" ఇత్యాదిని గల అస్మచ్ఛబ్దమునకు-శాస్త్రదృష్టన్యాయము ననుసరించి అంతర్యామిపరత్వమును గ్రహించి-వేరు గ్రంథమును ప్రారంభించుట-అనవసరము కాదా?

ఉత్తరము : అభేదదృష్టి-అవివేకమూలమనియు, న్యాయమూలమనియు, రెండువిధములు గలిగియుండునది. లోకమున వేదమునందును ప్రసిద్ధమైన వస్తు భేదము నంగీకరింపక-కేవలాద్వైతాభిమానవశమున అంగీకరింపఁబడు అభేద దృష్టి-అవివేకమూలమగును. "అంశము అంశి"అనువాని అభిన్నత్వమును పురస్కరించుకొనిన, న్యాయమువలన నేర్పడునట్టి అభేదదృష్టి-శాస్త్రసిద్ధంబగును.

ప్రశ్న : శాస్త్రసిద్ధమైన అభేదదృష్టిని అస్మచ్ఛబ్దమునకు వాసుదేవపరమైన అర్థముఁ జెప్పుట సముచితము కాగా- అంతర్యామి దృష్టితో పరమేశ్వరుని వరకు అస్మచ్ఛబ్దముఁదగు అర్థము నాకర్షించుట-సమంజసము కాదు గదా!

ఉత్తరము : "మానుషీం తను మాశ్రితం" ఇత్యాది వాక్యము ననుసరించి శాస్త్రసిద్ధన్యాయముతో సంభవించు అభేదదృష్టి వలన—అస్మచ్ఛబ్దమునకు వాసుదేవపరత్వమును ప్రతిపాదించుట-సమంజసము కాదనియే నిరూపించవలసివచ్చినది. ఎందుకనఁగా? "అహం సర్వస్య ప్రభవః" ఇత్యాదిని "అహ" మునకు వాసుదేవపరత్వము "మాయాం తు ప్రకృతిం విద్యాత్—మాయినం తు మహేశ్వరమ్" ఇత్యాది బహుశ్రుతివిరుద్ధమగుటచే అస్మచ్ఛబ్దమునకు శాస్త్రదృష్టి నంతర్యామియగు పరమేశ్వరుని పరమైన అర్థముఁ జెప్పుటయే సముచితంబగునని తెలియవలెను.

మఱియు పరమేశ్వరుని శక్తియొక్క అంశమగు నారాయణునియందు పరమేశ్వరుని సర్వైశ్వర్యము- గౌణమగుటచే ముఖ్యము కాదని తేటపడును. "ముఖ్యము సంభవించుతఱి గౌణమును పరిగ్రహింపఁగూడదు" అను న్యాయము

ననుసరించి "మత్తః పరతరం నాన్యత్" ఇత్యాది నస్మృచ్ఛబ్దమునకు అంతర్యామి పరమైన అర్థము ననివార్యముగ వక్కాణింపనైనది.

మానవాకారముఁబోలిన పరమేశ్వరుని దివ్యవిగ్రహమునందు ఆదరము లేని మూఢులు నిరాకారమునందే ఆసక్తులై 'భగవత్తత్త్వము సగుణము సాకారంబు కాదని" భావించుచు భక్తిమార్గ భ్రష్టులగుదురని సారాంశము.

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో-మోఘజ్ఞానా విచేతసః।
రాక్షసీ మాసురీం చైవ-ప్రకృతిం మోహినీం శ్రితాః॥ 12

హింస మిక్కుటముగా గల తామసీ ప్రకృతిని, కామదర్పాదులతో నుండు రాజసీప్రకృతిని, అవలంబించినవారు-ఇతరదేవత శీఘ్రప్రసన్నమగు నను వ్యర్థమైన ఆశ గలవారై నిరుపయోగమైన ప్రయత్నము గలవారునై విపరీత జ్ఞానశీలురునై మోహవశమున పరమేశ్వరుని యథార్థస్వరూపమును గుర్తింపఁజాలరు.

వివరణ—అన్యదేవతల నారాధిలచుచు కామ్యముల నపేక్షించుచు పరమేశ్వరుని ఐశ్వర్యసంపూర్ణతను గుర్తింపఁజాలనివారై జీవితమును వ్యర్థముఁ జేయుదురని భావము.

శ్లో॥ మహాత్మానస్తు మాం పార్థ-దైవీం ప్రకృతి మాశ్రితాః।
భజంతేఽనన్యమనసో-జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥ 13

పార్థా! శమదమాదిసంపత్తి గల దైవీ ప్రకృతి (స్వభావము) నాశ్రయించిన మహాత్ములైతేనో కామవాంఛ, గర్వము ఇత్యాది దుర్గుణములు లేనివారై అనన్య మనస్కులై ఆద్యంతములు లేనట్టి పరమేశ్వరుని ప్రపంచగతప్రాణులకు ఆదిగా గుర్తించి భజింతురు.

వివరణ—"శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వ మన్యత్ పరిత్యజ్య" ఇహ పరశ్రేయస్సు నొసఁగూర్చు మహేశ్వరు నొకనినే-శివభిన్నములగు చేతనాచేతనములను విడనాడి భోగమోక్షకాములు-ధ్యానించుచు ప్రార్థించుచు ఆరాధింపవలె" నను శ్రుతి-పై అనన్యభావనను సమర్థించుచున్నదని సారాంశము.

శ్లో॥ సతతం కీర్తయంతో మాం-యతంతశ్చ దృఢవ్రతాః।
నమస్యంత శ్చ మాం భక్త్యా-నిత్యయుక్తా ఉపాసతే॥ 14

స్తోత్రములు మొదలగువానితో పరమేశ్వరుని కీర్తించుచున్నవారై సోమ వారవ్రతాదుల నాచరించుటలో పట్టుదల గలవారునై "నమస్తే రుద్ర మన్యవే" ఇత్యాది రుద్రాధ్యాయాది పఠనముతో-లేక-శివపంచాక్షరీ మహామంత్రజపముతో నమస్కరించువారునై నిత్యము ధ్యానము నాచరించుచు భక్తితో నుపాసింతురు.

వివరణ—శివు నుపాసించు విధానము కీర్తన వందనములు, నిత్యధ్యానము వ్రతాచరణము మొదలగు భంగిమలతో నుండుననియు, యావజ్జీవము శివు నారా ధించుటకు ప్రయత్నము (పరిశ్రమ) అవసరమనియు వివేకము.

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే-యజంతో మా ముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన-బహుధా విశ్వతోముఖమ్ ॥ 15

కొందరు మహాత్ములు-బ్రహ్మ విష్ణు రుద్రాదిరూపములతో నుండునట్టి సద్యో జాతాదులతో నలుదిశలయందు ఊర్ధ్వమునను ముఖములు గలిగినట్టి, పరమేశ్వరుని "శివోఽహమ్" అను ఐక్యభావనతో "దాసోఽహమ్" అను పృథక్ భావనతోడను ఇష్టప్రాణభావలింగోపాసనము అను జ్ఞానయజ్ఞముచే పరమేశ్వరు నారాధించుచు ఉపాసించువారు.

వివరణ-సర్వాంగలింగ సాహిత్యము, భక్తస్థలాది షట్స్థలములయందు ఇష్టప్రాణభావలింగముల నారాధించుటయు జ్ఞానయజ్ఞ మనఁబడును.

శ్లో॥ అహం క్రతు రహం యజ్ఞః-స్వధాఽహ మహ మౌషధం।
మంత్రోఽహ మహ మేవాజ్య-మహమగ్ని రహం హుతమ్॥ 16

అగ్నిష్టోమము మొదలగు క్రతువు, బ్రహ్మయజ్ఞాదికము, పితరుల ప్రీత్య ర్థము సమర్పింపఁబడు ఆహారము, రోగ నివారకమగు ఔషధము, క్రతువులలో నుచ్చరింపఁబడు, అథవా-నిత్యము జపింపఁబడు వేదోక్త శివపంచాక్షర్యాది మంత్రము, ఘృతము మున్నగు హవిస్సు, ఆహవనీయాది అగ్నియు, హవనము అనునవన్నియు పరమేశ్వరుఁడేను.

శ్లో॥ పితాఽహ మస్య జగతో-మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్ర మోంకార-ఋక్ సామ యజు రేవ చ ॥ 17

ఈ జగత్తునకు-తండ్రి, తల్లి, పోషకుఁడు, తాత, తెలియదగినది,

పరిశుద్ధికరమగు భస్మాదికము, ప్రణవము, ఋక్ యజుః సామ అధర్వణ వేదము లును పరమేశ్వరుఁడేను.

శ్లో॥ గతి ర్భర్తా ప్రభుః సాక్షీ-నివాసః శరణం సుహృత్ ।
ప్రభవః ప్రళయః స్థానం-నిధానం బీజ మవ్యయమ్ ॥ 18

గమ్యస్థానము, బాధ్యతను వహించువాడు, నియమించువాడు, పుణ్యపాప నిరీక్షకుఁడు, ప్రపంచపరమార్ధసుఖభోగస్థాన(నివాస)ము, రక్షించువాడు, హితము నొనఁగూర్చు మిత్రుఁడు, (సుహృత్) పుట్టించువాడు, గిట్టించువాడు, ఆధారము, శంఖాదినిధి, (నిదానము) కారణ (బీజ)ము, వినాశములేనట్టి పూర్వోక్త మంతయు పరమేశ్వరుఁడేను.

వివరణ-అనన్యభావనతో పరమేశ్వరుఁడే భోగమోక్షప్రదాత యని నిశ్చయించుకొని పై చెప్పఁబడినవన్నియు పరమేశ్వరుఁడే నని త్రికరణశుద్ధిగ విశ్వసించువారికి-ఎట్టి కొఱఁత యుండదని భావము.

శ్లో॥ తపామ్యహ మహం వర్షం-నిగృహ్ణా మ్యుత్సృజామి చ ।
అమృతం చైవ మృత్యుశ్చ-సదసచ్చాహ మర్జున ॥ 19

అర్జునా! పరమేశ్వరుఁడే సూర్యరూపమున ఆకాశమున తపించుచుండును. వర్షజలము నాకర్షించి మేఘరూపమున కురిపించును. జీవనము, మరణము, సత్యము, అసత్యంబు ననునదంతయు పరమేశ్వరుఁడేను.

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా-యజ్ఞై రిష్ట్వా
స్వర్గతిం ప్రార్థయంతే । తే పుణ్య మాసాద్య సురేంద్ర
లోక - మశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్॥ 20

వేదత్రయవిదులు—అగ్నిష్టోమాదియజ్ఞములతో పరమేశ్వరుని ఇంద్రాది భావనతో నారాధించి—యజ్ఞశేషమగు సోమపానము నొనర్చియు దురితములఁ బోగొట్టుకొనినవారై స్వర్గప్రాప్తిని కోరువారై-యజ్ఞఫలంబగు స్వర్గలోకమును చేరి-స్వర్గమున దేవయోగ్యములైన దివ్యభోగముల ననుభవింతురు.

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం-క్షీణే పుణ్యే మర్త్య
లోకం విశంతి। ఏవం త్రయీధర్మమనుప్రపన్నా-గతాగతం
కామకామా లభంతే ॥ 21

స్వర్గకాములు-అభీష్టము విశాలంబు నగు స్వర్గమునందలి సుఖము ననుభవించి-పుణ్యము క్షీణింపగా-మానవలోకమునఁబ్రవేశింతురు. ఇట్లు వేదవిహితమైన కామ్యకర్మజాతము నాచరించి-స్వర్గ సుఖభోగాసక్తి గలవారై గమనాగమనముల నొందుదురు.

వివరణ-భువిని సుకృతము నాచరించి స్వర్గముఁజేరి యచ్చోట పుణ్యఫలము ననుభవించి-మరల - భూలోకమున జన్మించినవారై పుణ్యము నార్జించి మరణించిన పిదప స్వర్గముఁజెందుదురు. ఇట్లు కామ్యకర్మపరులకు గమనాగమనములు జనన మరణములును తప్పకుండునని సారాంశము.

శ్లో॥ అనన్యా శ్చింతయంతో మాం-యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం-యోగక్షేమం వహామ్యహమ్ ॥ 22

పరమేశ్వరుఁడు దక్క- నితరమైన చేతనాచేతన వర్గమును ప్రార్థింపక-పరమేశ్వరునే ఎల్లకాలము ప్రార్థించువారు అనన్యభావన గలవారనఁబఱఁగుదురు. ఇట్టి అనన్య భావనతో పరమేశ్వరుని ధ్యానించుచు ఆరాధించునట్టి, సర్వకాలము పరమేశ్వరనిష్ఠ నేమఱనట్టి భక్తులయొక్క-యోగక్షేమములను పరమేశ్వరుఁడే కలుగఁజేయుచుండును.

వివరణ-శివుఁడే భుక్తిముక్తి ప్రదాత యని దృఢముగ విశ్వసించి పరమేశ్వరుని శాంభవదీక్షితులై నిత్యము త్రికాలములయందు ఆరాధించువారికి-స్వస్వకీయపోషణమును గురించి శ్రమపడవలసిన యవసరము లేదనియు, "ప్రయత్నాంతే పరమేశ్వరః" అను నానుడి ననుసరించి "మానవుఁడు ప్రయత్నింపనిది ఫలితము లేదు గాన ప్రయత్నించిన పిమ్మట పరమేశ్వరుని ప్రార్థింపవలె" నను భావన వలన అనన్యభక్తి కలుగదనియు, పరమేశ్వరుఁడే శరణ్యుఁడని సర్వాత్మనా విశ్వసించి పరమేశ్వరునే నామస్మరణ పూజన జప ప్రార్థనాదులతో నారాధించుటయే యథార్థమైన ప్రయత్నమనియు భగవానుఁడు ఇందు వ్యక్తపఱచినాఁడు.

యోగమనఁగా-దొరుకనిదానిని లభింపఁజేయుట;

క్షేమమనఁగా-లభించినదానిని కాపాడుట;

పరమేశ్వరుఁడు జీవాత్మలందరిని రక్షించువాడు గదా! అనన్యభక్తులకే యోగక్షేమముల నేర్పరచి-ఇతరుల నుపేక్షించుట పాడి యగునా? అను ఆశంకకు-భక్తులు కానివారిచే శ్రమఁజేయించి యోగక్షేమములను కల్పించును. భక్తులకు నవలీలగ నిహపరప్రయోజనములను ప్రసాదించుననుట-సమాధానమగును.

శ్లో॥ యేఽప్యన్యదేవతాభక్తా - యజంతే శ్రద్ధయాఽన్వితాః ।
తేఽపి మామేవ కౌంతేయ-యజంత్యవిధిపూర్వకమ్ ॥ 23

కౌంతేయా! ఎవిరైతే-ఇతరదేవతాభక్తి గలవారై వారిని శ్రద్ధతో పూజింతురో అట్టివారు గూడ-అవివేకముతో పరమేశ్వరునే పూజించువారగుదురు.

వివరణ-పరమేశ్వరు నారాధించినచో భుక్తియు ముక్తియు లభించునని గురుతెఱుగనివారై దేవేంద్రాదులను పూజించువారు-స్వర్గాది పుణ్యలోకములయందు సుఖపడి-భూలోకమున జన్మించియు గతాగతము నొందుదురు గాన వారి దేవతాంతర భక్తి-అవివేకముతో కూడినదనియు, అన్యదేవతల నారాధించుట గూడ సర్వాంతర్యామి యగు పరమేశ్వరునే చెందుననియు సారాంశము.

శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం-భోక్తా చ ప్రభురేవ చ ।
న తు మా మభిజానంతి-తత్త్వేనాత శ్చ్యవంతి తే ॥ 24

సర్వవిధములైన యజ్ఞముల ననుభవించువాడు, సర్వయజ్ఞాధిపతియు పరమేశ్వరుఁడేను; ఇంద్రాది దేవతల నుద్దేశించి యజ్ఞములఁజేయువారు-పరమేశ్వరుని గుర్తింపనివారై యథార్థమగు మోక్షపథమునుండి భ్రష్టులగుదురు.

వివరణ-"ఆయం సోమః కపర్దినే" "ఈ సోమయాగము పరమేశ్వరుని కొరకు" అను శ్రుతి ననుసరించి యజ్ఞయాగములు-ఇంద్రాది దేవతాపరములైనను సర్వదేవతాంతర్యామి యగు పరమేశ్వరుఁడే ఆ యా దేవతల రూపమున యజ్ఞాహుతుల ననుభవించుననియు;'ఆ వో రాజాన మధ్వరస్య రుద్రం" ఇత్యాదిశ్రుతిని పరమెశ్వరుఁడే యజ్ఞములన్నిటి నేలికయనియు తెలియనివారు ముక్తులు కాజాలరని సారాంశము.

శ్లో॥ యాంతి దేవవ్రతా దేవాన్-పితౄన్ యాంతి పితృవ్రతాః ।
భూతాని యాంతి భూతేజ్యా-యాంతి మద్యాజినోఽపి మామ్॥ 25

ఇంద్రాది దేవతలను నియమముతో ఆరాధించువారు-ఇంద్రాదిదేవతల నాశ్రయించి స్వర్గాది పుణ్యలోకములయందు సుఖింతురు. శ్రాద్ధాదినియమములతో దివ్యపితరుల నర్చించువారు—పితృలోకాదులను పొందుదురు. భేతాళాదిభూతములను పూజించువారు, దివ్యభూతముల నాశ్రయింతురు. పరమేశ్వరు నారాధించువారైతేనో పరమేశ్వరుని పరమపదమునందు నివసించి బ్రహ్మానందము ననుభవింతురు,

వివరణ-ఇంద్రాదిదేవతల నాశ్రయించువారు దివ్య భోగములననుభవించి జన్మ పరంపరలోనికి రాగలరనియు; పరమేశ్వరుని నిష్కామ్యముగ నారాధించువారు "సహబ్రహ్మణా విపశ్చితా" ఇత్యాది శ్రుతి ననుసరించి-శివసాయుజ్యము నొంది- పునర్జన్మ లేనివారై-శివానంద రసాస్వాదలోలురై శివసమానస్థితులగుదురని భావము.

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం-యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృత-మశ్నామి ప్రయతాత్మనః॥ 26

బిల్వము మొదలగు దళములను; తుమ్మి మొదలగు పూలను, ద్రాక్షాది ఫలమును, శుద్ధోదకమును ఎవఁడు భక్తిచే పరమేశ్వరునకు సమర్పించునో; శుద్ధ చిత్తుఁడై అనురాగముచే సమర్పించునట్టిది- మిగుల కొద్దిదైన నద్దానిని పరమే శ్వరుఁడు స్వీకరించును.

వివరణ—"భక్త్యా ప్రయచ్ఛతి" "భక్త్యుపహృతం" అనియు భక్తిపదము నభ్యసించుటచే-సమర్పించువాని యొక్క సమర్పింపఁబడు దాని యొక్కయు గొప్పదనము-నిమిత్తము కాదనియు; అనన్య ఏకాగ్రభక్తియే పరమేశ్వర స్వీకార మునకు కారణమనియు. "నాన్యఃపంథా ఆయనాయ విద్యతే" అనుచో చెప్పఁబడిన జ్ఞానము. "ప్రాచీనయోగ్యోపాస్వ" ఇత్యాది నుపపాదింపఁబడిన ఉపాసనమున్ను భక్తియందే పర్యవసానముఁజెందునని-నిష్కర్షిత మైనది.

శ్లో॥ యత్ కరోషి యదశ్నాసి-యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌంతేయ-తత్కురుష్వ మదర్పణమ్॥ 27

కౌంతేయా ! శాస్త్రము ననుసరించి గాని స్వయముగా గాని ఏ మంచిపనిం జేయుదువో, ఏ విహితమైన ఆహారమును భుజింతువో, ఏ హవ్యమును హోమము నొనర్తువో ఏ సువర్ణమునుగాని అన్నమునుగాని యోగ్యులకు సమర్పింతువో శివ పంచాక్షరీజపాదికముతో ఏ తపస్సు నాచరింతువో అద్దానినంతయు పరమేశ్వరునకు సమర్పించుము!

వివరణ - శబ్ద స్పర్శ రస గంధరూపములగు జ్ఞానేంద్రియ విషయముల ననుభవించుతరి కలుగు సంతృప్తిని, సంధ్యావందన మంత్రజప శివపూజనాదుల యందు సంభవించు అనుభూతిని, తన ఇష్టముతో ఆచరింపఁబడు పుణ్యముల నన్నిటిని శివార్పణముఁజేసినచో అట్టి కర్మలన్నియు పునర్జన్మకారణములు కానివై భోజ్యమును నివేదించుటతో నగు శివప్రసాదమును స్వీకరించుటతో శివానుగ్రహప్రదములగును కావున నిట్టి నిష్కామ్యోపాసనము శివలింగధారులకే చెల్లునని భావించి శ్రీకృష్ణభగవానుఁడు "తత్కురుష్వ మదర్పణం" అని ఇఁట వాక్రుచ్చినవాడు.

ఇందుకు శివాగమప్రామాణ్యముము దిగువ గాననగును.

శ్లో॥ హృదయాంగే మహాలింగం - శ్రోత్రాంగే తు ప్రసాదకం ।
త్వగంగే చరలింగ తు-దృగంగే శివలింగకమ్ ॥
జిహ్వాంగే గురులింగం తు - నాసికాంగే తథైవ హి ।
ఆచారలింగ మశ్రాంతం-సుప్రతిష్ఠిత మేవ హి ॥

పరమేశ్వరుఁడు - శాంభవదీక్షితుని హృదయమున మహాలింగముగాను చెవులలో ప్రసాదలింగముగాను, చర్మయందు చరలింగముగాను, నేత్రములలో శివలింగముగాను, నాలుకయందు గురులింగము గాను, నాసికయందు ఆచారలింగముగాను నివసించును గాన శబ్దాదివిషయములను మరియు కర్మేంద్రియ విషయముల ననుభవించునపుడు కలుగు సంతోషమును ఆనందమును పరమేశ్వరునకు సమర్పించుచుండువానికి-ఎల్లకాలము శివభావానుసంధానము ఘటించుటం జేసి-శివానుగ్రహమువలన నీ దేహాంతమునందే శివసాయుజ్యము సిద్ధించునని సారాంశము.

శ్లో॥ శుభాశుభఫలైరేవం-మోక్ష్యసే కర్మబంధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా-విముక్తో మా ముపైష్యసి ॥ 28

పై 27వ శ్లోకమునందు చెప్పఁబడిన అర్పణ సద్భావము నాచరించు చున్నచో-సుఖదుఃఖ హేతువులగు కర్మపాశములచే విడిబడఁగలుఁగుదువు! పరమేశ్వరునకు సుకృతముల నన్నిటిని సమర్పించుట యనఁదగు సన్న్యాసము అను పేరు గల అర్పణయోగముతో శుద్ధచిత్తుడవై కర్మబంధ విముక్తుఁడవునై పరమేశ్వరుని పొందగలవు.

వివరణ - శాంభవదీక్షితుఁడై-ఇష్టలింగమునకు ఆహారాదులను సమర్పించి శివప్రసాదములుగ నింద్రియవిషయముల ననుభవించుట - అర్పణసద్భావము యొక్క స్వరూపమగును. ఇట్టి అర్పణసద్భావము నెల్లకాలము ఏమఱకుండువాని చిత్తము శుద్ధమగును. శుద్ధచిత్తమున అంతర్ముఖుఁడై శివుని ధ్యానించునెడ భవ బంధము తొలగుననని సారాంశము.

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు-న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।
యే భజంతి తు మాం భక్త్యా-మయి తే తేషు చాప్యహమ్ ॥ 29

పరమేశ్వరుఁడు-ప్రాణులందరి విషయమై సమానభావన గలవాడు గాన పరమేశ్వరునకు-శత్రువు మిత్రుఁడును లేడని చెప్పవచ్చును. ఎవరు పరమేశ్వరుని భక్తితో సేవింతురో అట్టి భక్తులు-పరమేశ్వరు నాశ్రయింతురు. అవ్వారిలో పరమేశ్వరుఁడు సహజముగనే వర్తించువాడు.

వివరణ - భక్తులకే పరమాత్మ-మోక్షము నొసఁగుచు-ఇతరులకు ముక్తి నొదవఁజేయనందున-పరమేశ్వరుఁడు. పక్షపాతము గలవాడగు నను ఆశంకకు-పైశ్లోకము-సమాధానము.

అందరిలో అనురాగముతోగాక-స్వభావసిద్ధమగు స్థితి గలవాడు పరమేశ్వరుఁడని తెలియవలెను. ఐతే అగ్ని-తనను సేవించు వారికే-చీకటివలన శీతమువలనను కలుగు బాధను నివారించునట్లును, కల్పవృక్షము-తన-నభ్యర్థించు వారికే కోరికల నీడేర్చునట్లును పరమేశ్వరుఁడు భక్తపక్షపాతి యైనను సహజమైన పక్షపాతము లేనివాడనియు భక్తికి వశుఁడగుననియు వివేకము.

శ్లో॥ అపి చే త్సుదురాచారో-భజతే మా మనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యః-సమ్యక్ వ్యవసితో హి సః ॥ 30

మిక్కిలి దుర్మార్గుఁడైనను అనన్యభావనతో పరమేశ్వరు నారాధించు నెడల-అట్టివాడు గొప్పవాడనియే భావింపవలెను. ఎందుకనఁగా ? ఆతడు ప్రశంసింపఁదగిన సదుద్యమము గలవాడని తెలియవలెను.

వివరణ - మంచిపనులలో భగవద్భజనమే శ్రేష్ఠమగుటచే - నిత్య శివారాధనము వలన దుర్మార్గస్వభావమును తగ్గించుకొని కాలక్రమమున సద్భావము గలవాడై శివానుగ్రహపాత్రుఁడగునని భావము.

ఇది యంతయు భక్తియొక్క మహిమ యని దిగువ శ్లోకమున విశదీకరింపఁబడినది.

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా-శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ! ప్రతిజానీహి-న మే భక్తః ప్రణశ్యతి ॥ 31

కౌంతేయా! దురాచారుఁడైనను భక్తిమహిమచే-త్వరలో ధర్మాత్ముఁడై స్థిరమైన పరమేశ్వరనిష్ఠను పొందును. "పరమేశ్వరుని భక్తుఁడు-ఎన్నటికిని పతితుఁడు కాడు" అను విషయమై ప్రతిజ్ఞఁజేయుము!

వివరణ - పరమేశ్వరునియందు ఏకాగ్రభక్తి గలవాడై - శాంభవదీక్షఁ బరిగ్రహించి శివు నారాధించువాడు-దురితములను పోగొట్టుకొని - సుకృతముల నీశ్వరార్పణముఁజేయుచు - ప్రారబ్ధాంతమున శివసాయుజ్యము నొందునని సారాంశము.

"శివభక్తుఁడు ముక్తుఁడగు" నను ప్రతిజ్ఞ - (దృఢభావన) ముల్లోకముల యందు నపజయము లేనిదని విదితమైనది.

శ్లో॥ మాం హి పార్థ! వ్యపాశ్రిత్య-యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా-స్తేఽపి యాంతి పరాం గతిమ్॥ 32

పార్థా! పరమేశ్వరునకు శరణాగతులైనవారు - స్త్రీలుగాని వైశ్యులుగాని శూద్రులుగాని వేదాధికారములేనట్టి అంత్యజాతీయులు గాని ఉత్తమగతి నసఁగా-మోక్షమును పొందుదురు.

వివరణ-పరమేశ్వరు ననన్యభావనతో ఆశ్రయించువారు వేదశాస్త్ర ప్రవేశము లేనివారైనను కాలక్రమేణ ముక్తులగుదురని భావము.

శ్లో॥ కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా-భక్తా రాజర్షయ స్తథా ।
అనిత్య మసుఖం లోక-మిమం ప్రాప్య భజస్వ మామ్ ॥ 33

స్త్రీ శూద్రాదులే ముక్తులగుదురని (పై శ్లోకమున) తెలియుచుండగా-సదాచారపరులైన శ్రోత్రియులు, రాజర్షులు నగు భక్తులు ముక్తులగుదురని చెప్ప వలసిన యవసరము లేదు. అందువలన నీవు స్థిరముకానట్టి, దుఃఖభూయిష్ఠము అతి దుర్లభంబు నగు నీ మానవశరీరమును పొందినాడవు గాన పరమేశ్వరుని భజింపుము!

వివరణ-మానవశరీరము మాటిమాటికి రానిదగుటచే పూర్వపుణ్యబలమున లభించిన ప్రస్తుతజన్మయందే పరమపురుషార్థమును సాధింప నవకాశమును దొరికించుకొని "పరమేశ్వరా! నీవే గతి" యని శరణాగతుఁడై శివు నాజన్మాంతము ఆరాధించుచు ఆహారాది ఇంద్రియవిషయములను శివున కర్పించువాడు-నిష్కల్మషుఁడై శివానుగ్రహపాత్రుఁ డగుననియు, పరమేశ్వరభక్తి-వ్యర్థము కానిదనియు సారాంశము.

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో-మద్యాజీ మాం నమస్కురు ।
మామే వైష్యసి యుక్త్వైవ-మాత్మానం మత్పరాయణః ॥ 34

పరమేశ్వరునియందు చిత్తము, ఏకాగ్రభక్తి గలవాడవగుము! పరమేశ్వరునే (శివుని) పూజించుచు, మనస్సును స్థిరపఱచియు-పరమేశ్వరు నుద్దేశించియే ప్రణమిల్లుచుండుము! ఇట్లు ప్రవర్తింతువేని- పరమేశ్వరునే పొందఁగలుగుదువు!

వివరణ-పరమేశ్వరుని పొందుట యనఁగా- శివసాయుజ్యరూపమగు పరమ మోక్షము. అట్టిది-శాంభవదీక్షితుఁడై శివు ననన్యభక్తితో ఆజన్మాంతము పూజించు అత్యాశ్రమునకు-పునరావృత్తి రహితముగ నవశ్యము లభించును.

ఇఁట-మత్ అను అస్మచ్ఛబ్దము "నేను" అను రూఢ్యర్థము గలదగుటచే "నేను" అనుదానికి వాసుదేవుఁడు అను అర్థము సమంజసమని చెప్పువారు- అనంతర గ్రంథముతో పరాజితులగుదురు. ఎట్లనఁగా? మహాభారతమున-ద్రోణాది పర్వములయందు- అర్జునుఁడు-శివపూజాపరుఁడుగ. చెప్పఁబడెను. వాసుదేవుఁడు

అస్మచ్ఛబ్దమునకు "తాను" అను నర్థము నుపదేశించినవాడని శఠవాదముఁజేయు నెడ – వాసుదేవోక్తమునందు అర్జునుఁడు ఆదరము లేనివాడని- పరులు అంగీకరింప వలసివచ్చును. అనఁగా- భగవద్గీతను విని కౌంతేయుడు-కృష్ణభక్తుఁడు గాక శివభక్తుఁడగుటఁజేసి–గీతలు–శివపరములని తేటపడుచున్నది. ఒకవేళ పాండవ మధ్యముఁడు-వాసుదేవునే పొందు ననునెడ- మానవ శరీరముతో మానవుని పొంద నలవిఁగాకుండుటచే వికృతార్థము ఆపాదించును. కృష్ణుఁడు అర్జునుఁడును సమ కాలికులగుటచే–పరలోకమున కృష్ణరూపము లేకుండును గాన కృష్ణుని అర్జునుఁడు పొందుట సముచితము కాదు. అందువలన పరుల వ్యాఖ్యానములు–అసంగతము లైనవని విశదమైనది.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,
రాజవిద్యా రాజగుహ్య యోగో నామ నవమోఽధ్యాయః

శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీమత్ భగవద్గీతా భాష్యమున
"మనోరంజనం" బను శాంకరీయ ఆంధ్రానువాదమున
తొమ్మిదవ అధ్యాయము.

---

## శుభచింతనము.

శ్లో॥ శివానంద సమాఖ్యోఽయం-సజ్జనో బుధసమ్మతః ।
శక్త్యావిశిష్ట మభవం-సముపాస్తే సుభక్తితః ॥ 1

శబ్దం దేవీమయం చార్థం-శివరూప మనుస్మరన్ ।
గ్రామేషు సంచరన్ స్వార్థం-పరార్థం చ సుసాధతే ॥ 2

ఏతన్ముద్రణ మాలంబ్య-చాధికార్థసమర్పణం ।
కృతవాన్, సంపదమారోగ్యం-దీర్ఘాయుష మనామయమ్ ॥ 3

ప్రాప్నోతు పుత్రపౌత్రాది-వర్ధనేన శివేచ్ఛయా ।
భీమపత్తనవాసీ చ-మోదతాం కందుకూరిజః ॥ 4

శాంతో మధురభాషీచ-శిష్యానేక పరీవృతః ।
శైవోపాధ్యక్ష పదవీ-మంగీకృత్య విరాజతే ॥ 5

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః.

# శ్రీ భగవద్గీత

## దశమాధ్యాయము

"మనో రంజన" శాంకరీయ ఆంధ్రానువాద సహితము

శ్రీ భగవానువాచ-

శ్లో॥ భూయ ఏవ మహాబాహో-శృణు మే పరమం వచః।
యత్తే ఽహం ప్రీయమాణాయ-వక్ష్యామి హితకామ్యయా॥ 1

హే మహాబాహో అర్జునా! అనుగ్రహపాత్రుఁడవైన నీ మేలుగోరి చెప్పబోవునట్టి, శ్రేష్ఠమైన నా వాక్యమును మరల నొకమారు ఆలకింపుము!

శ్లో॥ న మే విదుః సురగణా-ప్రభవం న మహర్షయః।
అహ మాది ర్హి దేవానాం-మహర్షీణాం చ సర్వశః॥ 2

దేవతాగణములు, మహర్షులును పరమేశ్వరుని ఉదయమును గుర్తింపఁజాలరు! ఎందుకనఁగా? అమరులకు మహామునులకును జనకుఁడైన పరమేశ్వరుఁడు సర్వేంద్రియప్రేరకుఁడుగ మూలమగును.

వివరణ- "ధియో యో నః ప్రచోదయాత్" ఇత్యాదిశ్రుతి ప్రమాణములు-సర్వేంద్రియములకు అధిష్ఠానమైన అంతకరణమును పరమేశ్వరుఁడు ప్రేరేపించువాడని-విశదపరచుచున్నందున-శివానుగ్రహము లేనిది పరమేశ్వరునియందు నిష్ఠగలవాడు కాడని విదితమైనది. "నహ్యలబ్ధప్రసాదస్య-భక్తి ర్భవతి శంకరే" అను ప్రమాణము ఇందుకు ప్రోద్బలకము.

శ్లో॥ యో మా మజ మనాదిం చ-వేత్తి లోకమహేశ్వరం ।
అసంమూఢ స్స మర్త్యేషు-సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3

ఎవఁడు పరమేశ్వరుని-జననమరణములు లేనివానిగాను, ఆద్యంతములు లేనివానిగాను, సర్వేశ్వరునిగాను గుర్తించునో, అట్టివాఁడు-మానవులలో మోహము లేనివాడై-జ్ఞానాజ్ఞానకృతములగు పాపములచే విడిబడును.

వివరణ—తెలిసిగాని తెలియకగాని ఇంద్రియచాపల్యమున ఘటించు దురితములు-పరమేశ్వరుఁడే సర్వాధికుఁడని భావించుచు ననన్య భక్తిశ్రద్ధలతో శివునుపాసించువానికి-దూరమగునని సారాంశము.

శ్లో॥ బుద్ధి ర్జ్ఞాన మసంమోహః-క్షమా సత్యం దమః శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో-భయం చాభయ మేవ చ ॥ 4

అహింసా సమతా తుష్టి-స్తపో దానం యశోఽయశః ।
భవంతి భావా భూతానాం-మత్త ఏవ పృథగ్విధాః ॥ 5

బుద్ధి (యుక్తాయుక్తవివేకము) పశుపాశపతిజ్ఞానము, అసమ్మోహము, (కలత నొందకుండుట) ఓర్పు, ఉన్నదున్నట్లు మాటలాడుట, (సత్యము) బాహేంద్రియనిగ్రహ (దమ)ము, అంతరింద్రియనిగ్రహ (శమ)ము, సుఖము, దుఃఖము, జననము, మరణము, భయము, నిర్భయము, ఇతరులను బాధింపకుండుట, (అహింస) రాగద్వేషాదులు లేకుండుట, (సమత) అనుభవింపఁదగినవానిని మితముగ స్వీకరించుట, (తుష్టి) జపనియమాదికము (తపస్సు) సత్పాత్రులకు అన్నవస్త్రధనాదులను సమర్పించుట, (దానము) మంచిపేరు, (యశః) అపకీర్తి, (అయశః) ఈ నానావిధభావములు—మానవాది ప్రాణులకు పరమేశ్వరుని వలననే సంభవించునట్టివి.

వివరణ-"ఏష హ్యేవ సాధు కర్మ కారయతి య మేభ్యో లోకేభ్య ఉన్నినీషతే; ఏష హ్యేవాసాధు కర్మ కారయతి, య మధో నినీషతి" "ఎవని నీ లోకములనుండి పై పుణ్యలోకములకు గొనిపోవఁదలచునో, అట్టివానిచే పరమేశ్వరుఁడు మంచి పనిఁజేయించును. ఎవనిని క్రింది నరకాదులలోనికి పంపదలచునో అవ్వానిచే చెడుపని చేయించును" అను శ్రుతి ననుసరించి ప్రాణులు-పూర్వజన్మ

యందు చేసిన కర్మల ననుసరించి-ఈ జన్మయందు వారిని ప్రేరేపించువాడు పరమేశ్వరుఁడే నని తెలియుచున్నది.

ఇట్లు చెప్పుటవలన-పరమేశ్వరుఁడు-పక్షపాతియని-భావింపరాదు. పూర్వ జన్మలయందు గాని ఈ జన్మలో గాని మంచివారి సహవాసముచే తన ప్రవృత్తిని మంచిపనులఁదెస మార్చుకొను యోగ్యత జీవాత్మకు గలదని "కర్తా శాస్త్రార్థవత్త్వాత్" ఇత్యాది బ్రహ్మసూత్రములు శ్రుతిస్మృత్యాది ప్రమాణములును నిరూపించుటచే, "సత్సంగము సత్ఫలప్రదం" అను జనశ్రుతివలనను ప్రాణులు స్వాధీన సంకల్పులనియు, సంకల్పించినవి మంచివి కానిచో మనస్సును మార్చుకొను అధికారము వారికి గలదనియు గ్రహింపవలెను.

శ్లో॥ మహర్షయః సప్త పూర్వే-చత్వారో మనవ స్తథా।
మద్భావా మానసా జాతా-యేషాం లోక ఇమాః ప్రజాః॥ 6

భృగువు మొదలగు పూర్వ సప్తర్షులు; సనకాదులైన నలుగురు; స్వాయంభువు మున్నగు మనువులును పరమేశ్వరుని మహిమలేశము గలవారై పరమేశ్వరుని సంకల్పమువలననే జన్మించినవారు. లోకమునందు గల ఈ ప్రజలు-మనువులయొక్కయు, మహర్షులయొక్క సంతతిఁజెందినవారేను.

వివరణ_ఆదిసృష్టియందు ఏడుగురు మహర్షులు, నలుగురు సిద్ధులు పదునలుగురు మనువులును ప్రజాప్రపంచమును విస్తరింపఁజేయు మహిమ (గొప్పదనము) గలవారుగ పరమేశ్వరుని సంకల్పమువలననే-గర్భవాసము లేకుండ_నావిర్భవించిరని సారాంశము.

శ్లో॥ ఏతాం విభూతిం యోగం చ-మమ యో వేత్తి తత్త్వతః।
సోఽవికంపేన యోగేన-యుజ్యతే నాత్ర సంశయః॥ 7

ఇంచు చెప్పఁబడినట్టి పరమేశ్వరుని ఐశ్వర్యమును అనంతశక్తిని యథార్థముగ గుర్తించువాడు_నిశ్చలమైన భక్తియోగముతో కూడినవాడగును. ఇందెంత మాత్రము సంశయము లేదు.

వివరణ-ప్రపంచము_పరమేశ్వరకార్యమగుటచే పరమేశ్వరుని లీలావిలాస

మని త్రికరణశుద్ధిని భావించుచున్నచో పరమేశ్వరునియందు ఏకాగ్రభక్తి గల వాడగునని సారాంశము. ఇచట యోగశబ్దము-శక్తిని భక్తిని చెప్పునది.

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో-మత్తః సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజంతే మాం-బుధా భావసమన్వితాః ॥ 8

పరమేశ్వరుఁడు జగమునకంతటికి-ఉత్పత్తిస్థానము; సమస్తము పరమేశ్వరునివలన కార్యోన్ముఖ మగునట్టిది; ఇట్లు భావించి భక్తులగు వివేకిజనులు పరమేశ్వరుని సేవించుచుందురు.

వివరణ-చేతనులు అచేతనములును ఈశ్వరుని ప్రేరణము లేనిది కదలికగూడ లేనివారగుదురని దృఢముగ విశ్వసించువారికి-భగవానుని యందు భక్తి పెంపొందునని విదితమైనది.

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా-బోధయంతః పరస్పరం ।
కథయంత శ్చ మాం నిత్యం-తుష్యంతి చ రమంతి చ ॥ 9

పరమేశ్వరునియందు చిత్తము గలవారై, పరమేశ్వరునియందు ప్రాణమును నెలకొలిపియుండు శివభక్తులు-పరమేశ్వరుని భక్తివైభవమును ఒండొరులకు బోధించుచు కీర్తించుచును సంతోషించుచుందురు. మరియు సద్యఃపరనిర్వృతి (తత్కాలముననే సంతృప్తి) గలవారగుచుందురు. ఇద్ది-భావప్రాణలింగోపాసన మనఁబడును.

వివరణ-పరమేశ్వరుని సేవించుట యనఁగా? "ఇది మాకు తప్పదు" అని విసుగుపడుచు పూజించుట గాక-సర్వాత్మనా భక్తిశ్రద్ధలు గలవారై బాహ్యమున అంతరముననను పరమేశ్వరు నారాధించుట యగును. అంతటితో ఆగక-తమలోని భక్తిని-తోటి భక్తులకు విశదపఱచువారికి-ఎప్పుడును ఎట్టి కలత-కలుగదని సారాంశము.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం-భజతాం ప్రీతిపూర్వకం ।
దదామి బుద్ధియోగం తం-యేన మా ముపయాంతి తే ॥ 10

పై విధము ఎల్లకాలము నిర్వ్యాజభక్తిని సేవించువారికి-స్వరూపసాక్షాత్కార

మును-పరమేశ్వరుఁడు-అనుగ్రహించును. అట్టి సాక్షాత్కారముతో భక్తులు శివ సాయుజ్యము నొందుదురు.

వివరణ.భక్తి-ఏకాగ్రమై ఆడంబరము లేనిది కావలెను. ఇట్టి భక్తి గల వారై ఇష్టప్రాణభావలింగముల నారాధించుచున్నయెడల- అంత్యకాలమున శివ దర్శనము సంభవించును. ఆ వెనువెంటనే శివానందానుభవరూపమైన మోక్ష సామ్రాజ్యము లభించునని సారాంశము.

శ్లో॥ తేషా మేవానుకంపార్థ-మహ మజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో-జ్ఞానదీపేన భాస్వతా ॥ 11

పరమేశ్వరుఁడు-భక్తుల హృదయమున నుండువాడగుటచే తన నారాధించు వారి ననుగ్రహించుటకు-ప్రకాశించునట్టి దీపమువంటి నిజరూపముయొక్క సాక్షాత్కారము గల యట్టి అపరోక్షజ్ఞానమును కలిగించినవాడై-తనను దర్శించుటకు ఆటంకమును కల్పించు మాయావరణము అను అజ్ఞానమువల్లనైన చీకటిని తొలగించును.

వివరణ-పరమేశ్వరుని దర్శనము కాగా ముక్తి లభించునని ఇట ద్యోతకమగుచున్నను "శరీరమునుండి బయలుదేరి పరమపదమున పరంజ్యోతిఁజేరినపిదప సత్యసంకల్పత్వాది సంపన్నమగు నిజరూపముయొక్క ఆవిర్భావము సంభవించునని, అదియే సంపూర్ణముక్తస్థితియని "అస్మా చ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభిసంపద్యతే" ఇత్యాది శ్రుతులచేతను, మహాభారతమున మోక్షధర్మపర్వమునందు "ధ్యానయోగముచే సాక్షాత్కరించు శివస్వరూపము దీపమువంటిదనియు, తద్దర్శనమాత్రమున శరీరమునందే గాక శరీరపాతానంతరము ముక్తుఁడగుననియు" చెప్పబడినందునను "హార్దబ్రహ్మసాక్షాత్కారమువలననే జీవన్ముక్తి ఏర్పడు" నను వాదము సరి కాదని విశదమైనది.

అర్జున ఉవాచ-

శ్లో॥ పరంబ్రహ్మ పరంధామ-పవిత్రం పరమం భవాన్।
పురుషం శాశ్వతం దివ్య-మాదిదేవ మజం విభుమ్ ॥ 12

ఆహు స్త్వా మృషయః సర్వే-దేవర్షి ర్నారద స్త థా।
అసితో దేవలో వ్యాసః-స్వయం చైవ బ్రవీషి మే॥ 13

పరమేశ్వరుఁడు-పరబ్రహ్మమనియు, పరంధామమనియ, పవిత్రుఁడనియు, పరముఁడనియు, పురుషుఁడనియు, శాశ్వతుఁడనియు, దివ్యుఁడనియు, ఆదిదేవుఁడనియు, అజుడనియు, విభువనియు. దేవర్షియగు నారదుఁడు అసితుఁడు దేవలుఁడు, వ్యాసుఁడు, ఋషులందరును నిరూపించుటయే గాక—నీవు గూడ నాకు ప్రబోధించుచున్నావు.

వివరణ—"అహం సర్వస్య ప్రభవః" ఇత్యాదిని గల-అస్మచ్ఛబ్దము-అంతర్యామిపరమగుటచే-ఇఁట భవచ్ఛబ్దంబును పరమేశ్వరపరంబగుచున్నయది. ఒకవేళ అట్లు కాదందురేని—"భవచ్ఛబ్దము శ్రీకృష్ణపరము" అను పక్షమున "గురుః సాక్షాత్ పరంబ్రహ్మ" అన్నట్లు ఆచార్యుఁడైన వాసుదేవుఁడు- అర్జునునిచే పరబ్రహ్మేత్యాది విశేషణములతో ప్రశంసింపఁబడినందున-గీతలు—వాసుదేవాంతర్యామి యగు పరమేశ్వరుని ప్రతిపాదించు ననుటలో విరోధ మేమియు లేదని తెలియవలెను.

శ్లో॥ సర్వ మేత దృతం మన్యే-యన్మాం వదసి కేశవ।
న హి తే భగవన్ వ్యక్తిం-విదు ర్దేవా న దానవాః॥ 14

కేశవా! దేనిని నాకు చెప్పుచున్నావో అది యంతయు యథార్థమని భావించుచున్నాను. భగవానుఁడా! పరమేశ్వరుని ఆవిర్భావమును సురలు నసురులును తెలియఁజాలరు గదా!

శ్లో॥ స్వయమేవాఽఽత్మనాఽఽత్మానం-వేత్థ త్వం పురుషోత్తమ!।
భూతభావన! భూతేశ! - దేవదేవ! జగత్పతే॥ 15

పురుషోత్తమా! నీవు స్వయముగానే నీ హృదయమున పరమాత్మను గుర్తించువాడవు. అందువలన ప్రాణులను రక్షించు భూతభావనుఁడవై దైత్యులను శిక్షించు దేవదేవుఁడవు జగత్పతియు నగుదువు.

వివరణ—శ్రీకృష్ణభగవానుని మూలరూపమగు నారాయణు నుద్దేశించి-శ్రుత పాండిత్యము గల పాండవుఁడు- ఇఁట పురుషోత్తమ భూతభావనేత్యాది విశేషణ

ముల నుపయోగించె నని హృదయము. ఒకవేళ-శ్రీకృష్ణపరములు-పురుషోత్తమాదిశబ్దములు-అనునెడ- "పురుషాణాం ఉత్తమః" "భూతాని=మానవాది ప్రాణినః, భావయతి = స్వావతారకృత్యత్వేన రక్షతి;" "భూతానాం = మానవాదిప్రాణినాం, ఈశః = యోగక్షేమకరత్వేన ప్రభుః" "దేవానాం = భూసురాణాం, దేవః = ఉపకారకత్వేన దీవ్యతి (ప్రకాశతే)" "జగతః = పరిదృశ్యమాన మానవలోకస్య; పతిః = పాలకత్వేన భర్తా" ఇదం గోవర్ధనోద్ధారణే = ఇంద్ర విరోధాత్ గోపగోపీజనరక్షకత్వేన విష్ణుభాగవతే ప్రసిద్ధమ్. భూసురోపకారః-హరివంశే సముల్లిఖితః. భూతేశత్వం-వనే పాండవానాం దూర్వాసాది వ్యతిరేకే రక్షణం మహాభారతే వనపర్వణి ద్రష్టవ్యమ్. కంసవధేన వసుదేవాది రక్షణం భూతభావనశబ్దః ప్రబోధయతి. అష్టభార్యాపతిత్వం-పురుషోత్తమత్వం ద్యోతయతీతి దిక్.

శ్రీకృష్ణుని మూలరూపమగు నారాయణుఁడు "ఏకఏవ మహావిష్ణుః-శివజ్ఞాన మహోదధిః" అను స్మృతి ననుసరించి-భూతభావనే త్యాది విశేషణవాచ్యుఁడగుచున్నవాడని చెప్పవచ్చును.

శ్లో॥ వక్తు మర్హస్యశేషేణ-దివ్యా హ్యాత్మ విభూతయః ।
యాభి ర్విభూతిభి ర్లోకా-నిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16

అత్యద్భుతములైన పరమేశ్వరుని విభూతులనన్నిటిని నిర్దేశింపుము! ఈ లోకములను-పరమేశ్వరుఁడు అంతర్యామిగ గల నీవు వ్యాపించువాడవు! అథవా నీ ద్వారా పరమేశ్వరుఁడు వ్యాపించువాడు. "ఇమాన్ స వ్యాప్య తిష్ఠతి" అని పాఠాంతరము. అన్వయము- ఆత్మనః=పరమేశ్వరస్య, విభూతయః = దివ్యాహి (ఖలు) యాభిః విభూతిభిః ఇమాన్ లోకాన్, సః = పరమేశ్వరః, వ్యాప్య తిష్ఠతి, (తాః ఇతి శేషః) తాః విభూతీః త్వం అశేషేణ వక్తు మర్హసి, అథవా త్వం= త్వద్వారా ఇమాన్ లోకాన్వ్యాప్య, తిష్ఠసీతి మధ్యమపురుషః యుష్మచ్ఛబ్దసంబంధోఽపి ప్రథమపురుషత్వేన, తిష్ఠసీతి క్రియాపదమపి ప్రథమపురుషత్వేన చ గ్రాహ్యే ఇతి శివాద్వైతినాం నిర్వచనమ్ అపిచ త్వదంతర్యామ్యభిన్న భావనాయాం త్వం ఇమాన్ లోకాన్ వ్యాప్య స్థాతుం శక్నోషీతి హృదయమ్.

శ్లో॥ కథం విద్యా మహం యోగిన్-త్వాం సదా పరిచింతయన్ ।
కేషు కేషు చ భావేషు-చింత్యోఽసి భగవ న్మయా॥ 17

హే శివయోగీశ్వరా! నేను ఏ విధముగ భావించుచు పరమేశ్వరుని ఎల్ల కాలము గుర్తింపవలెను? భగవానుఁడా! పరమేశ్వరుని ఏ యే రూపములతో నేను చింతింపవలెను.

శ్లో॥ విస్తరేణాత్మనో యోగం-విభూతిం చ జనార్దన।
భూయః కథయ తృప్తి ర్హి-శ్రుణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥ 18

జనార్ధనా! సర్వాంతర్యామియగు పరమేశ్వరుని అనంతశక్తిని ఐశ్వర్యమును విస్తారముగ వక్కాణింపుము! అమృతం అనఁగా-పరమేశ్వర తత్త్వమును గురించి వినుచున్న నాకు తృప్తి కలుగలేదు. గాన మరల వచింపుము!

వివరణ-"అమృతస్య హ వా నామధేయాని" ఇత్యాదిని-పరమేశ్వరుఁడు అమృతపదముతో చెప్పఁబడుచున్నందున ఇఁట అమృతశబ్దము పరమేశ్వరపరమగుట అనివార్యమైనది. పార్థుని ప్రశ్నయందు గల యుష్మచ్ఛబ్దము వాసుదేవపరము గానిదై వాసుదేవప్రయుక్తమగు అస్మచ్ఛబ్దము వలె అంతర్యామిపరమగునట్టిది. అట్లు కానిచో-భగవానుఁడు చెప్పిన పరమేశ్వరుని సర్వకారణత్వాదికము విరోధించును. ఇంద్రప్రతర్దనాధికరణన్యాయమును ఇఁట స్వీకరించి-"యోగిన్" అను సంబోధనమునకు "శివధ్యానయోగము గలవాడవను" నర్థము ననుసరించి-నీవు అనుదానికి గూడా నీలోని పరమేశ్వరుఁడు" అని సమర్థించుట-గీతాచార్యసమ్మతం బగుచున్నయది

శ్రీ భగవానువాచ-

శ్లో॥ హంత! తే కథయిష్యామి-దివ్యా హ్యాత్మవిభూతయః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ!-నా స్త్యంతో విస్తరస్య మే ॥ 19

పరమేశ్వరుని ముఖ్యములైన విభూతులు అద్భుతములైనవి. కురుశ్రేష్ఠా! వానిని నీకు చెప్పెదను-పరమేశ్వరుని విభూతులకు అంతము లేదు. గాన ముఖ్య విభూతులను తెలిపెదను.

శ్లో॥ అహ మాత్మా గుడాకేశ!-సర్వభూతాశయస్థితః।
అహ మాదిశ్చ మధ్యం చ-భూతానా మంత ఏవ చ ॥ 20

గుడాక అనఁగా నిద్ర యొక్క, ఈశ=ప్రభువగువాడా! (లేక) గుడా=ద్రాక్షతీగవంటి, కేశ=వెంట్రుకలు గలవాడా! ప్రాణులందరి హృదయములతో ప్రేరకుఁడుగనుండు ఆత్మ-పరమేశ్వరుఁడేను, చేతనుల యుత్పత్తికి కారణము, జగద్రక్షణమునకు హేతువు, ప్రళయమునకు నిమిత్తంబు పరమేశ్వరుఁడేను;

వివరణ-పరమేశ్వరుని సర్వైశ్వర్యము-మొదట నిట నిర్దేశింపఁబడినది. "భర్గో దేవస్య ధీమహి—ధియో యో నః ప్రచోదయాత్" అను శ్రుతి ననుసరించి దేవమానవాదిప్రాణుల బుద్ధులను ప్రేరేపించువాడు-పరమేశ్వరుఁడను నంశము ఇఁట సమర్థింపఁబడినది.

శ్లో॥ ఆదిత్యానా మహం విష్ణు-ర్జ్యోతిషాం రవి రంశుమాన్ ।
మరీచి ర్మరుతా మస్మి-నక్షత్రాణా మహం శశీ ॥ 21

ద్వాదశాదిత్యులలో విష్ణువు; జ్యోతిస్సులలో సహస్రకిరణుఁడైన సూర్యుఁడు; వాయువులలో మరుత్తు; నక్షత్రములలో చంద్రుఁడు-పరమేశ్వరుఁడేను.

శ్లో॥ వేదానాం సామవేదోఽస్మి-దేవానా మస్మి వాసవః ।
ఇంద్రియాణాం మన శ్చాస్మి-భూతానా మస్మి చేతనా ॥ 22

నాలుగు వేదములలో సామవేదము, అమరులలో ఇంద్రుడు, ఇంద్రియములలో మనస్సు, ప్రాణులలో తెలివి పరమేశ్వరుఁడేను;

వివరణ-గానమాధుర్యము గలదగుటచే సామవేదము—దేవతలందరి ప్రభువగుటఁజేసి ఇంద్రుఁడు- జ్ఞానకర్మేంద్రియములను ప్రవర్తింపఁజేయునదగుటచే మనస్సు—ప్రాణులలో ముఖ్యస్థితమగుటచే తెలివియు పరమేశ్వరవిభూతులగునని సారాంశము.

శ్లో॥ రుద్రాణాం శంకర శ్చాస్మి-విత్తేశో యక్షరక్షసాం ।
వసూనాం పావక శ్చాస్మి-మేరుః శిఖరిణా మహమ్ ॥ 23

ఏకాదశరుద్రులలో శంకరుఁడు—యక్ష రక్షస్సులలో కుబేరుఁడు—అష్టవసువులలో పావకుఁడనువాడు—పర్వతములలో మేరుపర్వతము పరమేశ్వరుఁడేను;

వివరణ—ఇందుకు కూర్మ మహాపురాణాంతర్గతమగు ఈశ్వరగీతలో సప్త

మాధ్యాయమున-శివప్రోక్తమగు విభూతియోగమునందు ఐదవ శ్లోకమున "రుద్రాణాం శంకర శ్చాహం" అను భగవద్గీతామూలనిర్వచనమును గాననగును. మరియు "మాయావినా మహం దేవః పురాణో హరి రవ్యయః" అను ఈశ్వర గీతా వచనము-ప్రోద్బలకమగును.

ఇట "నేను" అనుదానికి-వాసుదేవుఁడను నర్థముఁజేయునెడ- "యస్య పృథివీ శరీరమ్" ఇత్యాది అంతర్యామి బ్రాహ్మణ శ్రుతులందు సర్వాంతర్యామిగ పరమేశ్వరుఁడు అష్టమూర్తి యగుననియు, "ఈశ్వరః సర్వభూతానాం-హృద్దేశేఽర్జున! తిష్ఠతి" అను ఉత్తర గ్రంథమునందు "పరమేశ్వరుఁడు ప్రాణులందరి హృదయములో నంతర్యామిగ నుండు" ననియు నిర్వచించుట-వాసుదేవభక్తులను పరాజితులఁజేయును. పరమేశ్వరుఁడు-బ్రహ్మవిష్ణుమహేశ్వరులు అను మూర్తిత్రయమునకు అతీతుఁడగుటచే "రుద్రాణాం శంకర శ్చాస్మి" అను వాక్యము ఉపపన్నంబగునని విదితమైనది. యక్షాధిపతియగుటచే-కుబేరుఁడు, రత్నసానువగుటచే-మేరుపు శ్రేష్ఠములని భావము.

శ్లో॥ పురోధసాం చ ముఖ్యం మాం-విద్ధి పార్థ! బృహస్పతిం।
సేనానీనా మహం స్కందః-సరసా మస్మి సాగరః॥ 24

పార్థా! పురోహితులలో ముఖ్యుఁడైన బృహస్పతి-సేనాధిపతులలో దేవసేనాపతియగు స్కందుఁడు-దేవతలచే త్రవ్వబడిన సరస్సులలో సముద్రము-పరమేశ్వర విభూతులని గుర్తింపుము!

శ్లో॥ మహర్షీణాం భృగు రహం-గిరా మస్మ్యేక మక్షరం।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి-స్థావరాణాం హిమాలయః॥ 25

సప్తమహర్షులలో భృగుమహర్షి-అక్షరసముదాయ (పద)ములలో ప్రణవాక్షరము-ద్రవ్యదానాదియజ్ఞములలో ప్రణవ శివపంచాక్షరీ వేదగాయత్రీ మహామంత్రాది జపయజ్ఞము-స్థిరములలో హిమవత్పర్వతము పరమేశ్వరవిభూతి గలవగునట్టివి.

శ్లో॥ అశ్వత్థః సర్వవృక్షాణాం-దేవర్షీణాం చ నారదః।
గంధర్వాణాం చిత్రరథః-సిద్ధానాం కపిలో మునిః॥ 26

వృక్షములన్నిటిలో రావిచెట్టు-దేవర్షులలో నారదుఁడు-గంధర్వులలో చిత్రరథుఁడు–సిద్ధులలో కపిలముని-శివాంశసంభూతులగుదురు.

శ్లో॥ ఉచ్చైఃశ్రవస మశ్వానాం-విద్ధి! మా మమృతోద్భవం ।
ఐరావతం గజేంద్రాణాం–నరాణాం చ నరాధిపమ్ ॥ 27

సముద్రమథన సందర్భమున అమృతమువెనువెంట జన్మించిన ఉచ్చైఃశ్రవ మను అశ్వశ్రేష్ఠమును, గజేంద్రశ్రేష్ఠమగు ఐరావతమును, మానవులలో మిన్నయగు రాజును పరమేశ్వరాంశ సంభూతులుగ గుర్తింపుము!

శ్లో॥ ఆయుధానా మహం వజ్రం-ధేనూనా మస్మి కామధుక్ ।
ప్రజన శ్చాస్మి కందర్పః–సర్పాణా మస్మి వాసుకిః ॥ 28

ఆయుధములలో వజ్రాయుధము; గోవులలో కామధేనువు; సంతానోత్పత్తి హేతువగు మన్మథుఁడు; సర్పములలో వాసుకియు పరమేశ్వరుని విభూతులగుదురు.

శ్లో॥ అనంత శ్చాస్మి నాగానాం-వరుణో యాదసా మహం ।
పితౄణాం చార్యమా చాస్మి-యమః సంయమతా మహమ్ ॥ 29

నాగజాతి సర్పములలో అనంతుడు; జలప్రాణులలో వరుణ దేవుఁడు; పితరులలో అర్యమ యనువాడు, నియమించు (శిక్షించు) వారిలో యముడును పరమేశ్వరుని అపరస్వరూప మగువారు.

శ్లో॥ ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం-కాలః కలయుతా మహం ।
మృగాణాం చ మృగేంద్రోఽహం-వైనతేయశ్చ పక్షిణామ్ ॥ 30

దైత్యులలో ప్రహ్లాదుడు, వశపఱచుకొనువానిలో కాలము, మృగములలో సింహము, పక్షులలో గరుత్మంతుఁడును పరమేశ్వరుని అంశములగుదురు.

శ్లో॥ పవనః పవతా మస్మి-రామః శస్త్రభృతా మహం ।
ఝషాణాం మకర శ్చాస్మి-స్రోతసా మస్మి జాహ్నవీ॥ 31

వేగము గలవారిలో వాయువు; ధనుర్ధారులలో శ్రీరాముఁడు; చేప జాతిలో మొసలి; నదులలో గంగానదియు పరమేశ్వరుఁడేను;

శ్లో॥ సర్గాణా మాది రంత శ్చ-మధ్యం చైవాహ మర్జున ।
అధ్యాత్మవిద్యా విద్యానాం-వాదః ప్రవదతా మహమ్ ॥ 32

అర్జునా ! సృష్టులలో ఉత్పత్తి స్థితి లయములు; విద్యలలో బ్రహ్మవిద్య. వాదించు వారిలో సరియైన వాదంబు పరమేశ్వరుఁడేను;

శ్లో॥ అక్షరాణా మకారోఽస్మి—ద్వంద్వః సామాసికస్య చ ।
అహ మేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః ॥ 33

అక్షరములలో అకారము; సమాససముదాయములో ద్వంద్వ సమాసము; క్షీణింపనట్టి ప్రవాహరూపమైన కాలము; కర్మఫలదాతలలో సర్వకర్మఫలముల నొసఁగువాడును పరమేశ్వరుఁడేను;

వివరణ-"అకారో వై సర్వా వాక్ అకారమే వాక్కంతయు" నను ప్రమాణముఁబట్టి అక్షరములలో అకారము ముఖ్యమైనది.

30 వ శ్లోకమున చెప్పఁబడిన కాలము - అయుష్యమగుటచే-క్షీణించునది కాగా ఇఁట కాలము ప్రవాహరూపమగుటచే-అక్షయంబని తెలియవలెను. ద్వంద్వ సమాసము-రెండు పదముల ప్రాధాన్యము గలదగుటచే శ్రేష్ఠమైనది. ఇంద్ర చంద్రాదులు యత్కించిత్ ఫలప్రదాతలగుటచే పరమేశ్వరుఁడే సర్వకర్మ ఫలదాత యని భావము.

శ్లో॥ మృత్యుః సర్వహర శ్చాహ-ముద్భవ శ్చ భవిష్యతాం ।
కీర్తిః శ్రీ ర్వాక్చ నారీణాం—స్మృతి ర్మేధా ధృతిః క్షమా॥ 34

ప్రాణులను సంహరించువారిలో దేవదైత్యమానవాది సర్వులను సంహరించు మృత్యువు; రాబోవు శుభములలో అభ్యుదయము; (శుభపరంపర) స్త్రీలలో కీర్తి శ్రీదేవి వాక్ (సరస్వతీదేవి) స్మృతి, మేధ (ధారణాశక్తి) ధృతి(ధైర్యము) క్షమ (ఓర్పు) అనునవి; పరమేశ్వరుఁడేను;

వివరణ-కీర్తి మొదలగునవి - జనులందరిచే అపేక్షింపఁబడునవగుటచే భగవదంశములైనట్టివి. కీర్తి మొదలగునవి ధర్మములైనను స్త్రీలింగనిర్దేశముచే—స్త్రీలుగ నిట—వ్యవహరింపఁబడినవి. లేక శ్రీదేవి మొదలగువారు పరమేశ్వరుని

యనుగ్రహముచే (లక్ష్మీ సరస్వతులు) విష్ణుబ్రహ్మలకు ధర్మపత్నులైనారని శ్రీ బిల్హణకవి నిరూపించెను. ఎట్లనఁగా ?

"వాణీ పంకరుహాసనస్య గృహిణీ త్యాస్థాయి మౌనవ్రతం-
లక్ష్మీః సాగరశాయినః ప్రియతమే త్యగ్రాహి భిక్షాటనమ్।
ఇత్థం స్వామినిషిద్ధ సేవకవధూ సంభోగ బీభత్సయా-
పంచా సేవిషత త్వయా ధృతిదయాదాంతిక్షమాముక్తయః ॥

సరస్వతీదేవి బ్రహ్మదేవుని భార్య యని మౌనవ్రతము నవలంబించితివి; లక్ష్మీదేవి- విష్ణుపత్ని యని భిక్షమెత్తితివి; తన సేవకుల భార్యల ననుభవించుట- స్వామికి కూడదని భావించి-లక్ష్మీసరస్వతులు దక్క - మిగత ధృతి దయ దమము క్షమ ముక్తి అను ఐదిటిని స్వాధీనపరచుకొనిశాడవు! శంకరా! నీ మహిమ అపారమైనదని భావము.

బ్రహ్మవిష్ణువులకు శివానుగ్రహమువలననే సరస్వతీలక్ష్మలు లభించిరనుట- ఇఁట హృదయమైనది.

శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం-గాయత్రీ ఛందసా మహం।
మాసానాం మార్గశీర్షోఽహం-ఋతూనాం కుసుమాకరః॥ 35

సామవేదసూక్తములలో బృహత్సామసూక్తము- ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు; మాసాలలో మార్గశీర్షమాసము; ఋతువులలో వసంత ఋతువు; శివాంశములగునవి.

శ్లో॥ ద్యూతం ఛలయతా మస్మి-తేజ స్తేజస్వినా మహం।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి-సత్త్వం సత్త్వవతా మహమ్॥ 36

ఒకరినొకరు మోసగించువారు జూదరులు; అట్టి ద్యూతము; ప్రభావము (మహిమ) గలవారిలో ప్రభావము; జయించువారిలో విజయము; ప్రయత్నించు వారిలో ఉద్యమము; సత్త్వగుణము గల వారిలో శాంతస్వభావంబు పరమేశ్వరుఁడేను;

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి-పాండవానాం ధనంజయః।
మునీనా మప్యహం వ్యాసః-కవీనా ముశనాః కవిః॥ 37

యాదవులలో వాసుదేవుఁడు; పాండుపుత్రులలో అర్జునుఁడు (నీవు) మునులలో వేదవ్యాసుఁడు; కవులలో శుక్రాచార్యుఁడు; పరమేశ్వర విభూతులగు వారు.

వివరణ - సర్వేశ్వరత్వమును సర్వోపాస్యత్వమును ప్రదిపాదించు వాక్యములతో గల అస్మచ్ఛబ్దము అంతర్యామిపరమైనదని నిశ్చయించుటకే "యాదవులలో వాసుదేవుడ" నని చెప్పఁబడినది.

ఒకవేళ అంతర్యామి పరము కాదనినచో — వాసుదేవుఁడే వాసుదేవుని విభూతి కావలసివచ్చును. అట్టితఱి ఆత్మాశ్రయ దోషము సంఘటించును. వాసుదేవుని మూలరూపమగు విష్ణువు - అంతర్యామి యని చెప్పుట "ఆదిత్యానా మహం విష్ణుః" అనుటచే ఉపపన్నము కాజాలదు. అందువలన శ్రీకృష్ణునకు విష్ణు భగవానునకు నంతర్యామి పరమేశ్వరుఁడే నని అగతికముగ నంగీకరించుట అనివార్యమైనది.

శ్లో॥ దండోదమయతా మస్మి-నీతి రస్మి జిగీషతాం ।
మౌనం చైవాస్మి గుహ్యానాం-జ్ఞానం జ్ఞానవతా మహమ్ ॥ 38

శిక్షించువారి సంబంధము గల నిగ్రహము; గెలుపుఁగోరువారి ఉపాయము (నీతి) రహస్యములలో మౌనము (మాటలాడకుండుట) జ్ఞానము గలవారిలోని జ్ఞానంబు పరమేశ్వరుఁడేను!

శ్లో॥ యచ్చాపి సర్వభూతానాం-బీజం తదహ మర్జున! ।
న తదస్తి వినా యత్స్యా-న్మయా భూతం చరాచరమ్ ॥ 39

అర్జునా! ప్రాణులందరికి కారణము - పరమేశ్వరుఁడేను; పరమేశ్వరుఁడు లేనట్టి వస్తువు (చరము స్థిరంబు) ఉండజాలదు.

శ్లో॥ నాంతోఽస్తి మమ దివ్యానాం-విభూతీనాం పరంతప ।
ఏష తూద్దేశతః ప్రోక్తో-విభూతే ర్విస్తరో మయా ॥ 40

పరంతపా! పరమేశ్వరుని దివ్యవిభూతులకు అవధి లేదు. ఇఁట—ప్రత్యేకించి విభూతివివరణము సంక్షేపముగనే చెప్పఁబడినది.

శ్లో॥ యద్య ద్విభూతిమ త్సత్త్వం-శ్రీమ దూర్జిత మేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం-మమ తేజోఽంశసంభవమ్ ॥ 41

ఏ యే ప్రాణి-ఐశ్వర్యము కలదో, సంపన్నమో, బలిష్ఠంబుగ నుండునో- ఆ యా ప్రాణిని పరమేశ్వరుని శక్తిఁదగు అంశవలన నుదయించినదానిగ గుర్తింపుము!

శ్లో॥ అథవా బహునైతేన-కిం జ్ఞాతేన తవార్జున ?
విష్టభ్యాహ మిదం కృత్స్న-మేకాంశేన స్థితో జగత్ ॥ 42

అర్జునా! ఈ చెప్పఁబడిన అనేక విభూతుల వరిజ్ఞానమే గాక-ఈ జగత్తు నంతయు పరమేశ్వరుఁడు -తన-ఏకాంశముతో వ్యాపించి యున్నాఁడను భావన కలవాడవు కమ్ము!

వివరణ — ఆ యా వర్గములలో శ్రేష్ఠములైనవి - పరమేశ్వరుని దివ్య విభూతులగునని మాత్రము తెలిసికొనుటయే గాక, ఏకాంశముతో పరమేశ్వరుఁడు చరాచరము నంతట నున్నాడని గుర్తించుటయు ముఖ్యమగును. పరమేశ్వరుఁడు- తన సంకల్పము నతిక్రమింపకుండుటకు చరాచర ప్రాణులను స్వాధీనపఱచు కొని యుండువాడు. ఇందుకు "పాదోఽస్య విశ్వా భూతాని" ఇత్యాది శ్రుతివాక్యము ఆధారము.

ఈ సందర్భమున పరమేశ్వరుఁడు-తెలియ నలవి గాని మహిమ గలవాడని విదితమైనది.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం, వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాను ఉపనిషత్సు, బ్రహ్మ
విద్యాయాం, యోగశాస్త్రే, శ్రీ కృష్ణార్జున సంవాదే,
విభూతియోగో నామ దశమోఽధ్యాయః

ఇయ్యది
శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీమత్ భగవద్గీతా భాష్యముఁ
దగు "మనోరంజన" మను శాంకరీయ ఆంధ్రానువాదమున
పదియవ అధ్యాయము

ఓమ్

శ్రీ మహా గణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శ్రీ భగవద్గీత

## ఏకాదశాధ్యాయము

"మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాద సహితము

అర్జున ఉవాచ -

శ్లో॥ మదనుగ్రహాయ పరమం-గుహ్య మధ్యాత్మసంజ్ఞితం ।
యత్త్వయోక్తం వచస్తేన-మోహోఽయం విగతో మమ ॥ 1

నా శోకము నివర్తింప ననుగ్రహించి నీవు చెప్పిన రహస్యమైన శ్రేష్ఠమైన పరమేశ్వర తత్త్వము వలన నా యవివేక (పరమేశ్వర తత్త్వ అజ్ఞాన)ము తొలగినది.

వివరణ - దశమాధ్యాయాంతమున "ఈ జగమునంతయు నాక్రమించి అదుపులో నుంచుకొందు" నని భగవదుక్తి ననుసరించి-విశ్వవ్యాపకమైన పరమేశ్వరుని స్వరూపము నర్జునుఁడు చూడఁగోరినవాడై భగవానుని ప్రశ్నించెనని భావము.

శ్లో॥ భవాప్యయౌ హి భూతానాం-శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష! మాహాత్మ్య మపి చావ్యయమ్ ॥ 2

పుండరీకదళేక్షణా! కృష్ణా! ప్రాణులఁజెందిన సృష్టిప్రళయములను పరమేశ్వరుని అవ్యయంబగు సర్వైశ్వర్యమును నీ వలన విపులముగా వింటిని.

వివరణ - పరమేశ్వరుఁడు జగత్తుగ పరిణమించినను వికారము లేని వాడగుటయు, శుభాశుభ కర్మలను జీవులచే చేయించువాడైనను పక్షపాతము లేని వాడగుటయు, బంధమోక్షాది ఫలముల నొసఁగువాడైనను సంగరహితుఁడై ఉదాసీనుఁడుగ నుండుటయు, పరమేశ్వరుని సర్వైశ్వర్య మగునని భావము.

శ్లో॥ ఏవ మేత ద్యథాఽఽత్థ త్వ-మాత్మానం పరమేశ్వర! (రం)
ద్రష్టు మిచ్ఛామి తే రూప-మైశ్వరం పురుషోత్తమ! ॥ 3

పురుషోత్తమా! నీ అంతరాత్మయగు పరమేశ్వరు నుద్దేశించి ఎవ్విధము వక్కాణించితివో, ఆ యీ విషయము నంగీకరించి విశ్వసించుచున్నాను. ఐతే పరమేశ్వరుని విశ్వవ్యాపకమైన - లేక — నిరంతర శివాహంభావనా సిద్ధమగు నీ అసాధారణమైన విశ్వరూపమును చూడఁగోరుచున్నాను.

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం- మయా ద్రష్టు మితి ప్రభో!
యోగేశ్వర! తతో మే త్వం - దర్శయాత్మాన మవ్యయమ్ ॥ 4

ప్రభో! యోగేశ్వరా! విశ్వరూపమును చూచుట నాకు శక్యమని భావింతు వేని—నీవు వెంటనే అవ్యయంబగు పరమేశ్వరుని దివ్యరూపమును చూపెట్టుము!

వివరణ - ఎల్లకాలము ఎడతెగని శివాహంభావనారూపమైన యోగముచే సిద్ధుఁడగుటచే పరమేశ్వరుని విశ్వరూపమును చూపెట్టు సామర్థ్యము గల వాఁడు - శ్రీకృష్ణుఁడని పార్థుఁడు గుర్తించి — అట్టి ఐశ్వరరూపమును ప్రదర్శించుమని భగవానుని ప్రార్థించెనని భావము.

శ్రీ భగవా నువాచ -

శ్లో॥ పశ్య మే పార్థ! రూపాణి - శతశోఽథ సహస్రశః।
నానావిధాని దివ్యాని - నానావర్ణాకృతీని చ ॥ 5

పార్థా! అనేకవిధములు దివ్యములు నానావిధ వర్ణములు గలిగిన ఆకారములతో నుండునవియు నగు పరమేశ్వరుని రూపములను నూర్లకొలది, వేలకొలదియు నవలోకింపుము! సావధానుఁడవై గమనింపుము!

శ్లో॥ పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా-నశ్వినౌ మరుత స్తథా ।
బహూన్యదృష్టపూర్వాణి-పశ్యాశ్చర్యాణి భారత! ॥ 6

భారతా! ద్వాదశాదిత్యులను అష్టవసువులను ఏకాదశ రుద్రులను అశ్వినీ దేవత లిరువురిని సప్తమరుత్తులను చూచుటయే గాక నీవుగాని ఇతరుఁడుగాని ఈ వరకు చూడనట్టి అద్భుత దృశ్యముల ననేకములఁజూడుము!

శ్లో॥ ఇహైకస్థం జగత్ కృత్స్నం-పశ్యాద్య సచరాచరం ।
మమ దేహే గుడాకేశ! యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి ॥ 7

గుడాకేశా! చరాచర ప్రాణులతోకూడిన సమస్త జగత్తు నీ పరమేశ్వరుని శరీరమునందు ఒకచో నున్నదానిగ నవలోకింపుము! జయపరాజయములు మొదలగు వానిలో దేనిని చూడఁగోరుదువో అద్దాని నంతయు చూడుమని భగవానుఁడు వచించెను.

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టు-మనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః-పశ్య మే యోగ మైశ్వరమ్ ॥ 8

ఈ చర్మనేత్రముతో పరమేశ్వరుని చూడఁజాలవు. అందువలన దివ్య నేత్రము నొసఁగుచున్నాను. అట్టి దివ్య దృష్టితో నా శివధ్యానయోగములో గోచరించు పరమేశ్వరుని విశ్వరూపము నవలోకింపుము!

వివరణ – "నేను చూడఁగలుగుదునని నీవు భావించినచో విశ్వరూపమును చూపెట్టుమని" అర్జునుఁడు నాలుగవ శ్లోకమున అడిగిన విషయమునకు పై ఎనిమిదవ శ్లోకమునందు భగవానుని సమాధానము కలదని తెలియవలెను.

సంజయ ఉవాచ -

శ్లో॥ ఏవ ముక్త్వా తతో రాజన్-మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ-పరమం రూప మైశ్వరమ్ ॥ 9

ధృతరాష్ట్ర మహారాజా! ఇట్లు వచించి మహాయోగీశ్వరుఁడైన శ్రీహరి-అర్జునునకు-సర్వోత్కృష్టమైన పరమేశ్వరుని అసాధారణరూపమును చూపెట్టెను.

వివరణ — మహాయోగ మనఁగా — శివాహంభావమును నిరంతరము భావించుట యను శివధ్యానయోగ మగును. అట్టి యోగము నభ్యసించుటలో పరిపూర్ణతనొంది శివునితో నేకీభవించిన స్థితి గలవాఁడు-మహాయోగేశ్వరుఁడనఁ బఱఁగును. పరమేశ్వరుని అసాధారణరూపమనఁగా-సామాన్య భక్తులకు గోచరించునది గాక-అర్జునునిఁబోలిన ఏకాంత భక్తులకు సాక్షాత్కరించునది కాగా—అట్టి తేజోమయ విశ్వరూపమును శ్రీకృష్ణభగవానుఁడు-శివధ్యానయోగ మహిమచే చూపఁగలిగెనని సారాంశము.

శ్లో॥ అనేక వక్త్రనయన-మనేకాద్భుత దర్శనం ।
అనేక దివ్యాభరణం-దివ్యానేకోద్యతాయుధమ్ ॥ 10

"దివ్య మాల్యాంబరధరం - దివ్యగంధానులేపనం ।
సర్వాశ్చర్యమయం దేవ-మనంతం విశ్వతోముఖమ్ ॥ 11

అనేకములైన ముఖములు, బహునేత్రములు, నానావిధములైన ఆశ్చర్య దృశ్యములు, అనేకములగు దివ్యాలంకారములు, ఎత్తఁబడిన అనేక దివ్యాయుధములు, దివ్యపుష్పమాలికలు, మణిమయవస్త్రములు, దివ్యపరిమళముగల శ్రీగంధానులేపనము, సర్వవిధ ఆశ్చర్యములు గలదియు; అనంతఁబు, సద్యోజాతాది పంచముఖములు ప్రాగాదిదిశలయందు గలదియు నగు పరమేశ్వరుని విశ్వరూపమును పార్థుఁడు గాంచుచుండెను.

వివరణ—"సర్వాననశిరోగ్రీవః-సర్వభూతగుహాశయః,
సర్వవ్యాపీ చ భగవాన్-తస్మా త్సర్వగత, శివః"

అను శ్రుతి ననుసరించి పరమేశ్వరుఁడు అనేక ముఖాదులు గలవాఁడను నంశము, మరియు "త మాదిమధ్యాంతవిహీన మేకం" ఇత్యాది శ్రుతినిగల-ఆదిమధ్యాంతములు లేనివాఁడై విశ్వతోముఖుండను నంశంబు-గీతలయందు అనువదింపఁబడినదని విదితమైనది.

శ్లో॥ దివి సూర్యసహస్రస్య-భవే ద్యుగప దుత్థితా ।
యది భాః సదృశీ సా స్యాత్-భాస స్తస్య మహాత్మనః ॥ 12

ఆకసమున అసంఖ్యాక సూర్యుల కాంతి-ఏకకాలమున ఆవిర్భవించునేని-అట్టి కాంతి-విశ్వరూపము గల మహేశ్వరుని కాంతితో సమాన మగును.

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం-ప్రవిభక్త మనేకధా ।
అపశ్య ద్దేవదేవస్య-శరీరే పాండవ స్తథా॥ 13

అర్జునుఁడు_అనేకరీతుల విభజింపఁబడినదగు జగత్తునంతయు పరమేశ్వరుని శరీరమునందు ఒకచో నున్నదానిగ నవలోకించెను.

శ్లో॥ తతః స విస్మయావిష్టో-హృష్టరోమా ధనంజయః ।
ప్రణమ్య శిరసా దేవం-కృతాంజలి రభాషత ॥ 14

ధనంజయుఁడు _ విశ్వరూపముఁగాంచిన పిమ్మట-ఆశ్చర్యపడుచు వులకాంకురములు (గగుర్పాటు) గలవాడై మహాదేవుని శిరస్సుతో ప్రణమిల్లి-అంజలిఁ ఘటించియు చెప్పఁబోవు రీతిని సంభాషించెను.

అర్జున ఉవాచ.

శ్లో॥ పశ్యామి దేవాం స్తవ దేవ దేహే-సర్వాం స్తథా భూతవిశేషసంఘాన్।
బ్రహ్మాణ మీశం కమలాసనస్థ-మృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్॥

పరమేశ్వరా ! నీ శరీరమున_దేవతల నందరిని, మరియు భూతవిశేష (శేషప్రాణి) సంఘములను, చతుర్దశలోకాధిపతి కమలాసనస్థుఁడు నగు బ్రహ్మదేవుని, ఋషులందరిని_దివ్యసర్పములను చూచుచున్నాను.

వివరణ_ఇఁటగల ఈశ శబ్దమునకు యాథ్యర్థమును చెప్ప నలవి గాదు. "ఈశః" అనఁగా శంకరుఁడని రూఢ్యర్థమున్నను "కమలాసనస్థం" అనునది_బ్రహ్మ శబ్దమునకు విశేషణమగుటచే ఈశ శబ్దముఁగూడ బ్రహ్మశబ్దమునకు విశేషణము కావలసినదేను. విశేషణ విశేష్యముల మధ్య మరియొక విశేష్యముండుట-కూడనిది. అందువలన కమలాసనమునందు కూర్చున్నట్టి, సమస్త లోకాధీశ్వరుఁడైన బ్రహ్మదేవు నర్జునుఁడు గాంచెనని చెప్పుటయే సమంజసమగును. అట్లు కానిచో విశ్వరూపము "ఐశ్వరం" పరమేశ్వరునిదగుటచే "పరమేశ్వరుని శరీరమున పరమేశ్వరు నవలోకించె" నని చెప్పునెడ_ఆత్మాశ్రయదోషము సంఘటించును. అందువలన ఉక్తార్థమే యుక్తతమమైనదని తెలియవలెను.

శ్లో॥ అనేక బాహూదరవక్త్రనేత్రం-పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపం।
నాంతం న మధ్యం న పున స్తవాదిం-పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప॥

హస్తములు ఉదరము (కడుపు)లు ముఖములు నేత్రములు ననేకములుగ కలిగినట్టి, సర్వవ్యాపకుఁడు అనంత (అవధిలేని) రూపములు గలవాడు నగు పరమేశ్వరుని చూచుచున్నాను. విశ్వరూపా! విశ్వేశ్వరా! ఈ పరమేశ్వర రూపమునకు ఆదిమధ్యాంతములు కనఁబడుట లేదు.

వివరణ-విశ్వరూపా! అని సంబోధించుటచే పరమేశ్వరుఁడు-జగత్తునకు ఉపాదానకారణము (కుండకు మట్టివలె) ననియు; విశ్వేశ్వరా! అని పిలుచుటచే (కుండకు కుమ్మరి వలె) నిమిత్తకారణమనియు ద్యోతకమగుచున్నయది.

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణం చ -తేజోరాశిం సర్వతో దీప్తిమంతం।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా-ద్దీప్తానలార్కద్యుతి
మప్రమేయమ్ ॥ 17

కిరీటము మొదలగు ఆభరణములఁదాల్చినట్టి; గద చక్రము మున్నగు ఆయుధములను ధ్రపట్టుకొనినట్టి; అంతట వెలుగొందు తేజఃపుంజమగునట్టి; మండుచున్న అగ్ని సూర్యుల కాంతి గలిగినట్టి; ఇంతంతయని కొలతఁజెప్పుటకు నలవిఁగానట్టి; బ్రహ్మాండమంతయు నిండుటచే దివ్యనేత్రముతో గూడ నవలోకింపరానట్టి పరమేశ్వరు నీ సందర్భమున గమనించుచున్నాను.

శ్లో॥ త్వ మక్షరం పరమం వేదితవ్యం-త్వ మస్య విశ్వస్య పరం నిధానం।
త్వ మవ్యయః శాశ్వతధర్మగోప్తా-సనాతన స్త్వం పురుషో మతో మే॥

ఉపాసింపఁ (తెలిసికొనఁ) దగినట్టి అక్షర పరబ్రహ్మతత్త్వము పరమేశ్వరుఁడేను; (నీవేను) మరియు ఈ జగత్తునకు మూలమైన ఆశ్రయము పరమేశ్వరుఁడేను, (నీవేను) (నీవు) పరమేశ్వరుఁడు నిత్యుఁడై శాశ్వతమైన వైదిక స్వధర్మమును రక్షించువాడునై అనాదియైన పురుషుఁడు (నీవే) పరమేశ్వరుఁడేనని భావించు చున్నాను.

వివరణ-శ్రీకృష్ణుఁడు చూపెట్టు విశ్వరూపము శివునిదే నని "ఐశ్వరం" అను పదము-తేటపఱచుచున్నందున - పరమేశ్వరుని అక్షరపరబ్రహ్మత్వాదుల నారోపించి అర్జునుఁడు శ్రీకృష్ణుని ప్రశంసించినవాడని తెలియవలెను.

శ్లో॥ అనాదిమధ్యాంత మనంతవీర్య-మనంతబాహుం శశిసూర్యనేత్రం।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం-స్వతేజసా విశ్వమిదం
తపంతమ్ ॥ 19

వాసుదేవా ; నీవు శివునితో తాదాత్మ్యము నొంది చూపెట్టు విశ్వరూపమునకు-ఆదిగాని నడుముగాని, చివరగాని కనఁబడుటలేదు. పరమేశ్వరుని ప్రభావమున (మహిమ)కు మేఱ లేదు. మంటలు గల నోళ్ళ తేజస్సుచే ఈ ప్రపంచమునంతయు తపింపఁజేయునదిగ విశ్వరూపముఁ గాంచుచున్నాను.

శ్లో॥ ద్యావాపృథివ్యో రిద మంతరం హి-వ్యాప్తం త్వయైకేన దిశశ్చసర్వాః।
దృష్ట్వాఽద్భుతం రూప ముగ్రం తవేదం-లోకత్రయం ప్రవ్యథితం
మహాత్మన్ ? ॥ 20

మహాత్మా ! పరమేశ్వరుఁడొకఁడే (నీవొకఁడవే) భూమ్యాకాశముల మధ్య దిశలన్నిటిని వ్యాపించినాడు. (డవు) ఉగ్రము అద్భుతంబునగు ఈ పరమేశ్వరుని విశ్వరూపమును గాంచి ముల్లోకములు వెఱగంది వణకుచున్నవి.

శ్లో॥ అమీ హి త్వా సురసంఘా విశంతి-కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి।
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః-స్తువంతి త్వాం స్తుతిభిఃపుష్కలాభిః॥

వసువులు మొదలగు దేవతల సంఘములు – పరమేశ్వరునిలో ప్రవేశించుచున్నవి. కొందరు విశ్వరూపముఁ గాంచుచు భీతిల్లినవారై అంజలిఁఘటించి ప్రార్థించుచున్నవారు. మహర్షుల యొక్కయు సిద్ధుల యొక్కయు సముదాయములు- "జగత్తునకు శుభమగు గాక" అనుచు అర్థవంతములైన స్తోత్రములతో పరమేశ్వరుని ప్రార్థించుచున్నవారు.

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా-విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ।
గంధర్వయక్షాసుర సిద్ధ సంఘా-వీక్షంతే త్వాం విస్మితా శ్చైవ సర్వే॥

ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినీదేవతలు, ఏకోనపంచాశత్ (49) వాయుగణములు, పితరులు, గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు సనువారి సంఘములు పరమేశ్వరుని చూచుచున్నారు. మరియు అందరును ఆశ్చర్యపడుచున్నవారు.

వివరణ-"యావదుష్ణం భవే దన్నం-యావదశ్నంతి వాగ్యతాః, పితరస్తావ దశ్నంతి-యావన్నోక్తా హవిర్గుణాః" "ఆహారము వేడిగ ఉన్నంతవరకు, భోక్తలు మౌనము నవలంబించినంతవరకు, ఆహారముఁదగు గుణదోషములను చెప్పనంత వరకు-పితరులు భోక్తలకు నిడిన ఆహారములోని సూక్ష్మాంశము ననుభవింతురు" అను స్మృతి ప్రమాణముఁబట్టి పితరులు-ఉష్మపులు అనఁబడుదురు.

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రం-మహాబాహో! బహుబాహూరుపాదం।
బహూదరం బహుదంష్ట్రాకరాళం-దృష్ట్వాలోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్॥

మహాబాహో! కృష్ణా! పరమేశ్వరుని రూపము-గొప్పదగుటయే గాక పెక్కు నోరులు కన్నులు హస్తములు పాదములు ఉదరములు కలదై అనేకములైన కోఱలచే మిగుల భయపెట్టునదగుటచే-ఇట్టి విశ్వరూపము నవలోకించుచు లోకులు నేనును మిక్కిలి వెఱఁగందుచున్నాము.

శ్లో॥ నభఃస్పృశం దీప్త మనేకవర్ణం-వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రం।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా-ధృతిం న విందామి
శమం చ విష్ణో! ॥ 24

విష్ణుశబ్దవాచ్యుఁడైన పరమేశ్వరా! నీ విశ్వరూపము ఆకసముఁదాకునదై వ్యోమకేశ మనఁబఱఁగుచున్నయది. మరియు మంటలచే మండుచు పలు వన్నెలు గలదై ముఖములఁదెఱచుకొని మంటలుక్రమ్మిన విశాలనేత్రములు కలిగియున్నది. ఇట్టి పరమేశ్వరుని చూచి నేను మిక్కిలి బాధపడు మనస్సుతో ధైర్యమును గోలుపోయి ఉపశాంతిని పొందకున్నాను.

వివరణ-ఇఁట విశ్వరూపము పరమేశ్వరునిదే ఐనను విశ్వరూపమును జూపెట్టువాడు శ్రీకృష్ణుఁడగుటచే-అర్జునుడు-శ్రీకృష్ణుని మూలరూపమగు నారాయణుని నామదేయముతో "విష్ణో" అని సంబోధించుట-గీతాప్రతిపాద్యుఁడు పరమేశ్వరుఁడు" అనుటకు విరుద్ధము కాదు. ఇంతియేగాక విష్ణునామధేయము-"సర్వే దేవాః సంవిశంతీతి విష్ణుః" అను శ్రుతివాక్యము ననుసరించి-పరమేశ్వరునకు చెల్లునని. ఇందు పరమార్థము.

శ్లో॥ దంష్ట్రాకరాళాని చ తే ముఖాని-దృష్ట్వైవ కాలానిలసన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ-ప్రసీద దేవేశ జగన్నివాస॥ 25

దేవదేవా! జగదాధారా! కోఱలతో భయముఁగొలుపునవి, ప్రళయాగ్నిఁ బోలినవి యగు పరమేశ్వరుని ముఖములను చూచినంత మాత్రమున-దిశలను గుర్తింపలేనివాడనై సుఖ (మనఃసమాధాన)మును పొందుచులేను, ప్రసన్నుడవు కమ్ము!

శ్లో॥ అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః-సర్వే సహైవావనిపాలసంఘైః।
భీష్మో ద్రోణః సూతపుత్ర స్తథాऽసౌ-సహాస్మదీయైరపి యోధముఖ్యైః॥26

శ్లో॥ వక్త్రాణి తే త్వరమాణా విశంతి-దంష్ట్రాకరాళాని భయానకాని।
కేచి ద్విలగ్నా దశనాంతరేషు-సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః

ఈ ధృతరాష్ట్రుని కుమారులు (కౌరవులు) అందరు-భూపాల (రాజ) సముదాయములతో కూడ, మరియు భీష్ముఁడు. ద్రోణాచార్యుఁడు ఈ కర్ణుఁడు మా యోధముఖ్యులగు ధృష్టద్యుమ్నాదులతో కూడను.

కోఱలతో క్రిందుమీదనుండునవి భయంకరములు నగు పరమేశ్వరుని ముఖములలో ప్రవేశించుచున్నవారు. కొందరు-పగిలిన తలకాయలతో దంతసందులలో ఇరికినవారుగ కనఁబడుచున్నవారు.

వివరణ-ఇందువలన-"నేను పరాజయమును పొందుదు నను సంశయమును తొలగించుకొనినాననని" అర్జునుఁడు తన నిశ్చయమును వెలిబుచ్చెనని - ద్యోతకమగును. "దంష్ట్రాకరాళ" పదము- 23, 25, 27, శ్లోకములలో ప్రయోగింపఁబడుటచే-(అర్జునప్రోక్తముగ-శ్రీవేదవ్యాస నిరూపిత మగుటచే) అర్జునుఁడు-పరమేశ్వరుని ఉగ్రరూపమును దివ్యనేత్రముతో గూడ చూడలేక-శ్రీకృష్ణానుగ్రహ మాత్రలబ్ధ దివ్యనేత్రుఁడగుటచే-శివానుగ్రహము అందుకు తోడుపడనందునను-మిగుల వెఱఁగందినాడని. తేటపడుచున్నయది.

శ్లో॥ యథా నదీనాం బహవోऽంబువేగాః సముద్రమేవాభిముఖా ద్రవంతి।
తథా తవామీ నరలోకవీరా విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి॥ 28

అనేకములైన నదీజలప్రవాహములు-సముద్రమువైపు పరుగిడుచు సాగరములో చొఱఁబడునట్లు ఈ నరలోకవీరులు-మండుచున్నట్టి పరమేశ్వరుని నోరుల లోనికి పోవుచున్నారు.

శ్లో॥ యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః।
తథైవ నాశాయ విశంతి లోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥29

ఎవ్విధము-మిడుత పురుగులు-మండుచున్నట్టి అగ్నియందు తమ వినాశమునకై త్వరపడుచు ప్రవేశించునో, అవ్విధము ఇచటి యోధులు-పరమేశ్వరుని ముఖములయందు మిగుల తొందరతో ప్రవేశించుచున్నవారు.

శ్లో॥ లేలిహ్యసే గ్రసమానం సమంతా ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః।
తేజోభి రాపూర్య జగత్సమగ్రం భాస స్తవోగ్రాః ప్రతిపంతి విష్ణో॥ 30

విష్ణో! దుర్యోధనాది జనుల నందరిని-మంటలుగల నోరులతో మ్రింగుచు చవిఁజూచుచున్నావు! పరమేశ్వరువి ఉగ్రములైన కాంతులు తమ వెలుతురుచే జగమునంతయు నిండినవై తపింపఁజేయుచున్నవి.

శ్లో॥ ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో నమోఽస్తు దేవవర ప్రసీద!
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం న హి ప్రజానామి
తవ ప్రవృత్తిమ్॥ 31

దేవవర (మహాదేవా!) ఉగ్రస్వరూపముగల నీవు ఎవరో చెప్పుము! నీకు నమస్కార మగుగాక! ప్రసన్నుఁడవు కమ్ము! ప్రప్రథముఁడవైన నిన్ను (పరమేశ్వరుని)బాగుగ తెలిసికొనఁగోరుచున్నాను.

ఇప్పుడు ఈ విశ్వరూప ప్రదర్శనాదికమగు నీ ప్రవర్తనమును గుర్తింపకున్నాను. అని అర్జునుఁడు విశ్వరూపమును దివ్య నేత్రముతో గాంచుచు తన భయమును లోక వ్యగ్రతను అపజయనివృత్తిని చాటుచు భగవానుని ప్రార్థింపగా-

శ్రీ భగవానువాచ-శ్రీకృష్ణభగవానుడు దిగువవిధము వాక్రుచ్చెను.

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో-లోకాన్ సమాహర్తు మిహ
ప్రవృత్తః।
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే-యేఽవస్థితాః ప్రత్యనీకేషు
యోధాః॥ 32

పదునాలుగు లోకములను సంహరించు కాలాగ్ని రుద్రుడను. దుర్యోధనాది క్షత్రియులను చంపుటకు నిండుదనము గలవాడనై ఇటకు వచ్చితిని. సైన్యములలో గల భీష్మాది యోధులందరును నీ ఉద్యమ (యుద్ధ)ము లేకున్నను భువి నుండఁ జాలరు. మరణింపగలరని భావము.

శ్లో॥ తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ-జిత్వా శత్రూన్ భుంక్ష్వ
రాజ్యం సమృద్ధం।
మయైవైతే నిహతాః పూర్వమేవ-నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ౩౩॥

సవ్యసాచీ! అర్జునా! అందువలన నీవు ఉద్యుక్తుఁడవు కమ్ము! "జయింప నలవిఁగాని భీష్మప్రభృతుల నోడించినాడర్జునుఁడు" అను కీర్తిని పొందుము! దైవ హతులైన పగతుఱ నోడించి-సంపన్నమైన రాజ్యము ననుభవింపుము! దుర్యోధనుఁడు మొదలగు వీరిని పరమేశ్వరుఁడే పరాజితుల నొనర్చి నీ ఉద్యమ (బాణ ప్రయోగ) మునకు ముందే సంహరించును. ఇందు నిమిత్తమాత్రుఁడవు కమ్ము!

శ్లో॥ ద్రోణం చ భీష్మంచ జయద్రథం చ-కర్ణం తథాఽన్యానపి
యోధవీరాన్। మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠాః-
యుధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్॥ 34

ద్రోణాచార్యుని, భీష్మాచార్యుని, జయద్రథుని, కర్ణుని, పోరాడు వీరుల నందరిని-పరమేశ్వరునిచే సంహరింపఁబడువారిగ భావించి జయించుటకు యుద్ధముఁ జేయుము! రణరంగమున శత్రువులను గెలుచువాడ వగుదువు గాక!

"గెలువనలవిఁగాని భీష్మాదుల నెట్లు జయింతు" నని బెంగపడకుము!

సంజయ ఉవాచ-

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య-కృతాంజలి ర్వేపమానః కిరీటీ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం-సగద్గదం-
భీతభీతః ప్రణమ్య॥ 35

(అకిరీటి ర్జునుఁడు)- ఇవ్విధము కేశవుని వాక్యమును విని-వణకుచు దోసి

లొగ్గినవాడై కృష్ణునకు ప్రణమిల్లి మిగుల భయపడుచు-కంఠస్వరము తడబడు చుండగా-సంతోషమును భయమును ఆపుకునలేనివాడై మరల నిట్లు ప్రార్థించెను.

అర్జున ఉవాచ—

శ్లో॥ స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా-జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి-సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః॥

హృషీకేశ! కృష్ణా! శివాంతర్యామ్యభిన్న భావనతో నీవు చూపెట్టిన విశ్వ రూపము(దగుమహిమచే సమస్త జగత్తు-సంతోషాతిశయమును భరింపనిదై పునఃపునః విశ్వరూపమును చూడవలెనని-అనురాగము గలదగుచున్నది. రక్కసులు వెఱఁ గందినవారై నలుదిసలకు పరుగిడి వెళ్లుచున్నారు. సిద్ధుల సముదాయములు మ్రొక్కులిడుచున్నవి. ఇదంతయు నాకు సమంజసముగ తోచుచున్నయది.

శ్లో॥ కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్-గరీయసే బ్రహ్మణోఽ
ప్యాదికర్త్రే। అనంత! దేవేశ! జగన్నివాస!-త్వమక్షరం
సదసత్తత్పరం యత్॥ 37

మహాత్మా! చతుర్ముఖబ్రహ్మకు కూడ జనకుఁడు పరాత్పరుఁడు నగు పర మేశ్వరునకు అందరు ఎందుకు నమస్కరింపరు? అనంత! జగన్నివాస! చేతనాచేతనవర్గము ఆద్దానిని మించిన అక్షరంబును పరమేశ్వరుఁడేను, అనఁగా పరమేశ్వరుఁడు నీలో సంపూర్ణముగ భాసించుచుండుటచే నీవు అనంతుఁడవని, జగన్నివాసుఁడవని భావించుచున్నాను.

శ్లో॥ త్వ మాదిదేవః పురుషః పురాణ-స్త్వమస్య విశ్వస్య పరం నిధానం।
వేత్తాఽసి వేద్యం చ పరంచధామ-త్వయా తతం విశ్వమనంతరూప॥

అనంతరూపా కృష్ణా! నీవు ఆదిదేవుడవు, పురాణ పురుషుఁడవు, ఈ విశ్వమునకు శ్రేష్ఠమైన ఆధారము నీవగుదువు, తెలియువాడు తెలియఁదగినది నీవేను; పరమపదము (లేక) పరంజ్యోతి నీవేను; ప్రపంచమును నీవు వ్యాపించి తివి.

విశ్వవ్యాపకత్వము, పురాణపురుషత్వము, జగదాధారత్వము, సర్వజ్ఞత్వము

మొదలగు పరమేశ్వరుని ధర్మములచే "గురురేన మహేశ్వరః" అను న్యాయము ననుసరించి-అర్జునుఁడు- ఈశ్వరసంబంధమైన విశ్వరూపమును దివ్యనేత్రమున గాంచి పరమసంతోషమున సద్యఃపర నిర్వృతి గలవాడై గురుభక్తిని శ్రీకృష్ణ భగవానుని ప్రశంసించుట-ఇందు పరమార్థము.

శ్లో॥ వాయు ర్యమోఽగ్ని ర్వరుణః శశాంకః-ప్రజాపతి స్త్వం
ప్రపితామహశ్చ । నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ
భూయోఽపి నమో నమస్తే ॥ 39

వాయుదేవుఁడు, యమధర్మరాజు, అగ్నిదేవత, వరుణదేవుఁడు, చంద్రుడు, బ్రహ్మదేవుఁడు, బ్రహ్మదేవుని పుట్టించువాడును నీవేను, నీకు వేయితడవలు నమస్కారము, మరల మరలఁగూడ నమస్కారము.

వివరణ—"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః" అన్నట్లు-వాయు యమ అగ్నివరుణ చంద్ర చతుర్ముఖాది సర్వదేవతాస్వరూపుడవు నీవని శ్రీకృష్ణు నర్జునుఁడు-కొని యాడుట-విహితమైనది.

శ్లో॥ నమః పురస్తా దథ పృష్ఠత స్తే-నమోఽస్తు తే సర్వత ఏవ శ(స)ర్వ॥
అనంత వీర్యామితవిక్రమ స్త్వం-సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః॥

శివాభిన్నభావనాదార్ఢ్యము గలవాడా! (శర్వ) చరాచరాంతర్యామ్యభిన్న స్థితి గలవాడా! (సర్వ) ముందు, వెనుక, అంతటను నీకు నమస్కారమగుగాక; నీవు శివతాదాత్మ్యభావన గలవాడ వగుటచే-అవధిలేని మహిమ, అమితమైన పరాక్రమము గలవాడవు; సమస్తమును వ్యాపించుచున్నావు; అందువలన సర్వ శబ్దవాచ్యుండవగుదువు.

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం-హే కృష్ణ హే యాదవ హే సఖేతి।
అజానతా మహిమానం తవేదం-మయా ప్రమాదా త్ప్రణయేన వాఽపి॥

యచ్చాపహాసార్థ మసత్కృతోఽసి-విహార శయ్యాఽసన భోజనేషు।
ఏకోఽథవాఽప్యచ్యుత! తత్సమక్షం—తత్ క్షామయే త్వా మహమప్ర
మేయమ్॥ 42

సమానవయస్కుఁడ వను భావనతో- కృష్ణా! యాదవా! మిత్రమా! అని నీ ఈ మహిమను గుర్తింపని నేను పొరపాటున గాని స్నేహముతో గాని-విహార మున పడకయందు సింహాసనమునను పంక్తి భోజనమందును పరిహాసమునకై ఏమేమి మాట్లాడితినో, అవమానించితినో! అచ్యుతా! అట్టి నీ ముందు జరిగిన సందర్భమునంతను క్షమిఁపుమని-అప్రమేయుఁడవైన నిన్ను ప్రార్థించుచున్నాను.

శ్లో॥ పితాఽసి లోకస్య చరాచరస్య-త్వ మస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్
న త్వత్సమోఽప్యధికః కుతోఽన్యో-లోకత్రయేఽప్యప్రతిమప్రభావ॥

చరాచర ప్రపంచమునకు జనకుఁడవు; ఈ జగత్తున పూజ్యతముఁడవు నీవేను; నీతో సరిదూగువాడు లేనప్పుడు నిన్ను మించినవాడు ఇతరుఁడు ఎక్కడుండును? ముల్లోకములయందును నీ ప్రభావము- అసమానమై విరాజిల్లునది.

శ్లో॥ తస్మా త్ప్రణమ్య ప్రణిధాయ కాయం-ప్రసాదయే త్వా మహ
మీశ మీడ్యం । పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః-ప్రియః ప్రియా
యార్హసి దేవ! సోఢుమ్॥ 44

అందువలన దేవా! నమస్కరించి శరీరమును పడవేసియు నేను నుతింపఁదగినట్టి, పరమేశ్వరాంశ సంభూతుఁడవైన నిన్ను ప్రార్థించుచున్నాను. కుమారుని తండ్రివలె, మిత్రుని స్నేహితునివలె, భార్యను భర్తవలెను క్షమింపుము!

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా-భయేన చ ప్రవ్యథితం
మనో మే । తదేవ మే దర్శయ దేవ! రూపం-ప్రసీద దేవేశ!
జగన్నివాస॥ 45

దేవా! దేవేశా! జగన్నివాసా! పూర్వము చూడనట్టి విశ్వరూపమును గాంచి సంతోషించినాను. మరియు నా మనస్సు-భయముతో మిగుల వ్యథఁజెందినది. నీ సహజ రూపమునే చూపెట్టుము! అనుగ్రహింపుము!

శ్లో॥ కిరీటినం గదినం చక్రహస్త-మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన-సహస్రబాహో! భవ! విశ్వమూర్తే॥ 46

సహస్రబాహో! విశ్వమూర్తే! నిన్ను-కిరీటము గద చక్రము గల శ్రీకృష్ణ

నిగ చూడఁగోరుచున్నాను. నాలుగు చేతులు గల ఆ నీ పూర్వరూపము తోడనే ఉండుము!

శ్రీ భగవానువాచ-

శ్లో॥ మయాప్రసన్నేన తవార్జునేదం-రూపం పరం దర్శిత మాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వమనంత మాద్యం-యన్మే త్వదన్యేన నదృష్టపూర్వమ్॥

అర్జునా! నీయందలి అనుగ్రహముతో- శివధ్యానయోగబలమున- నీవు దక్క నితరునిచే పూర్వము చూడఁబడనిదియు, తేజోమయంబు, అనంతము, ఆద్యంబు నగు పరమేశ్వరుని శ్రేష్ఠమైన విశ్వరూపమును చూపెట్టితిని.

వివరణ- శ్రీకృష్ణ భగవానుఁడు. అర్జునునిచే- ప్రార్థింఁబడినవాడై 'నేను చూపెట్టిన పరమేశ్వరుని విశ్వరూపము-నిన్ను భయపెట్టుటకు కాదనియు నిన్ననుగ్రహించుటకే ననియు" ఊఱడించెనని భావము.

శ్లో॥ న వేద యజ్ఞాధ్యయనైర్నదానై-ర్నచక్రియాభి ర్న తపోభి రుగ్రైః॥
ఏవం రూపః శక్య అహం నృలోకే-ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥

కురుప్రవీరా! నాలుగువేదములఁ జదువుటతోడను సమస్తయజ్ఞముల నాచరించుటతోడను షోడశ మహాదానముల తోడను అగ్నిహోత్రాది కర్మలన్నిటి తోడను ఉగ్ర (కఠిన)ములైన తపస్సులతోడను మానవలోకమున నీవు దక్క నితరుఁడు-ఇట్టి విశ్వరూపము గల పరమేశ్వరు నతికష్టముగనైన చూడఁజాలడు.

శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో-దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదం । వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం-తదేవ మే రూప మిదం ప్రపశ్య॥ 49

భయంకరము, అనేక ముఖాదులు గలది యగు పరమేశ్వరుని విశ్వరూపమును చూచినావు గాన బాధపడకుము! మనస్సును కలవరపెట్టకుము! భయమును విడనాడి మనస్సును కుదుటపఱచుకొనియు నీవు మరల ఆ నా కృష్ణరూపమునే బాగుగా నవలోకింపుము!

సంజయ ఉవాచ-

శ్లో॥ ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా-స్వకం రూపం దర్శయామాస భూయః।
ఆశ్వాసయామాస చ భీతమేనం-భూత్వా పునః సౌమ్యవపు ర్మహాత్మా॥

వాసుదేవుఁడు-అర్జునుఁడు కోరిన విధము-పార్థునకు-తన రూపమును మఱల చూపెట్టెను. ఉగ్రమైన విశ్వరూపమును చూచుటచే వెఱఁగందిన అర్జునుని శాంత మూర్తియై-ఊరడించెను. విశ్వరూపము శ్రీకృష్ణునిది గాక పరమేశ్వరునిదే నని సంజయోక్తి చేతను నిర్ధారింపవచ్చును.

అర్జున ఉవాచ-

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం-తవ సౌమ్యం జనార్దన।
ఇదానీ మస్మి సంవృత్తః-సచేతాః ప్రకృతిం గతః॥ 51

జనార్దనా! ఇప్పుడు ఈ నీ మానవ సౌమ్యరూపమును గాంచి స్వభావసిద్ధమైన నిలుకడతో మనస్సులో కలిగిన కలవరమును పోగొట్టుకొని నిదానించితిని.

శ్రీ భగవానువాచ-

శ్లో॥ సుదుర్దర్శ మిదం రూపం-దృష్టవా నసి యన్మమ।
దేవా అప్యస్య రూపస్య-నిత్యం దర్శనకాంక్షిణః॥ 52

అతికష్టముగ నైన చూడనలవి గానట్టి పరమేశ్వరుని ఈ విశ్వరూపము నవలోకించితివి గాన ధన్యుడవైతివి. ఈ విశ్వరూపము నమరులు గూడ నెల్ల కాలము చూడఁగోరుచుందురు.

వివరణ- విశ్వరూపము దంష్ట్రాకరాళమైనను భూతభవిష్యద్వర్తమాన దృశ్యములు గలదగుటచే- చూపరులకు జన్మసార్థకతను కలుగఁజేయునదని తెలియుము! దేవతలు గూడ దీని నవలోకింప నాకాంక్షింతురు కాని వారికి గూడ నిది గోచరము కానట్టిది. అట్టి రూపమును నీకు చూపెట్టితిని గాన నీవు శివానుగ్రహపాత్రుడవైనావని భగవానుఁడు వాక్రుచ్చెను.

శ్లో॥ నాహం వేదై ర్న తపసా-న దానేన న చేజ్యయా।
శక్య ఏవం విధో ద్రష్టుం-దృష్టవా నసి మాం యథా॥ 53

అర్జునా! పరమేశ్వరుని ఏ విధము గలవానిగ చూచితివో, అవ్విధమగు విశ్వరూపము గల పరమేశ్వరుని-వేదాధ్యయనములతోడను, తీవ్రమైన తపస్సు చేతను గొప్ప గొప్ప దానముల వలనను, జ్యోతిష్టోమాది యాగములచేతను చూడ నలవిఁగాదు.

వివరణ-న వేద యజ్ఞాధ్యయనై:" ఇత్యాది శ్లోకమున చెప్పఁబడిన అంశమునే ఈ శ్లోకమున చెప్పుట-పునరుక్తి దూషితమని భావింపరాదు. శాస్త్రమర్యాద ననుసరించి ఇయ్యది అభ్యాసమని గ్రహింపవలెను.

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య-అహ మేవంవిధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన-ప్రవేష్టుం చ పరంతప॥ 54

పరంతపా! పరమేశ్వరుఁడు-పరమార్థముగ తెలియుటకు, సాక్షాత్కరింప జేసికొనుటకు, సాయుజ్యము క్రిచే పొందుటకును "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అన్నట్లు తదేకనిష్ఠారూపమగు స్నేహపూర్వకధ్యానము అనఁదగు అనన్యభక్తిచేతనే సాధ్యపడువాడు. అట్టి విశ్వరూప సందర్శనము నీకు ఘటించుటచే నీవు నావలె శివానన్యభక్తుఁడుగ గుర్తింపఁబడుచున్నావని వివేకము.

శ్లో॥ మత్కర్మకృ న్మత్పరమో-మద్భక్త: సంగవర్జిత:।
నిర్వైర: సర్వభూతేషు-య స్స మామేతి పాండవ॥ 55

పాండుపుత్రా! "పరమేశ్వరుని ఆరాధనము" అను భావనతో వేదవిహితములగు సంధ్యావందనాది కర్మల నాచరించుచు-పరమేశ్వరుఁడే సర్వాధికుఁడు-అను దృఢభావము గలవాడై పరమేశ్వరుని నిత్యము ధ్యానించుచు పూజించుచును బంధుస్నేహవర్జితుఁడై ప్రాణులందరియందు వైరము లేనివాడుగ నుండు పురుషశ్రేష్ఠుఁడు-దేహాంతమునందు పరమేశ్వరుని పొందును.

వివరణ-పగవారియందు గూడ ద్వేషమును విడనాడినచో-సమభావన ఏర్పడును. అట్టి సమభావము శివారాధనముగ పరిణమించునని "సర్వోపకార

కరణం-సర్వానుగ్రహణం తథా! సర్వాభయప్రదానం చ-శివస్యారాధనం విదుః" అను శివమహాపురాణ శ్లోకము-ధృవీకరించినది.

పరమేశ్వరునివలన లభించిన గీతాశాస్త్రముఁదగు అర్థసారము పై శ్లోకమున గలదని చదువరులు గుర్తింతురు గాక!

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మ
విద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,
విశ్వరూపసందర్శనయోగో నామ ఏకాదశోఽధ్యాయః

ఇయ్యది - శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీ మద్భగవద్గీతా
భాష్యమున "మనో రంజనం" బను శాంకరీయ ఆంధ్రానువాదమున
పదునొకండవ అధ్యాయము



---

## శ్రీ నందికేశ్వర పురాణము-అను-మోక్షసామ్రాజ్యపథము

ఆరాధ్య శైవులకు ఇతర శైవులకు నుపయోగింపవలెనని-గరుడ పురాణం దిరి-14 అధ్యాయములలో-పురాణములనుండి సేకరింపఁబడిన సంస్కృత కములను తెలుగర్థముతో వ్రాశినాను. ఇందు- అవసానకాలమున చేయవలసిన ధానములు; 12 రోజులు-కర్త-ఆచరింపఁదగిన కర్మకాండ; అన్నదానాది మహిమ, మహాకైలాసము అనఁదగు మోక్షసామ్రాజ్యముయొక్క మార్గము, పాపాత్ముల అనుభవములు, పుణ్యాత్ముల ప్రభావము, భైరవలోకవర్ణనము, సానందశివశర్మ కథాదులు వ్రాయఁబడినవి. మహేశ్వర నందికేశ్వరసంవాదమగు ఈ గ్రంధమును ముద్రించుటకు సజ్జనులనుండి ఆర్థిక సహకారమును కోరు చున్నాను.

నిర్మల శంకరశాస్త్రి

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శ్రీ భగవద్గీత

## ద్వాదశాధ్యాయము

"మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాదసహితము

**అర్జున ఉవాచ -**

శ్లో॥ ఏవం సతతయుక్తా యే-భక్తా స్త్వాం పర్యుపాసతే ।
యే చాప్యక్షర మవ్యక్తం-తేషాం కే యోగవిత్తమాః? ॥ 1

ఇవ్విధము సర్వకర్మార్పణము మొదలగు వానితో ఏ భక్తులు పరమేశ్వరుని సాకారునిగ ఎల్లకాలము పరమేశ్వరనిష్ఠ గలవారై ఉపాసింతురో, ఎవరైతే భక్తులు-నిర్దేశింపనలవిగానట్టి నిరాకారంబు నగు మహాలింగస్వరూపము నుపాసింతురో; వారిలో ఎవరు శ్రేష్ఠులు? అని అర్జునుఁడు ప్రశ్నించెను.

వివరణ-"మత్కర్మకృత్" ఇత్యాదిని పరమేశ్వరు నుపాసించుట-ముఖ్యమగునని-ఏకాదశాధ్యాయము యొక్క చివరన చెప్పబడినందున- "త మాది మధ్యాంతవిహీన మేకం-విభుం చిదానంద మరూప మద్భుతం" ఇత్యాదిని శ్రుతిని నిరాకారుఁడుగను "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం" ఇత్యాది శ్రుతిని సాకారుఁడుగను వినంబడుటచే-పరమేశ్వరుని సాకారోపాసనము శ్రేష్ఠమా? నిరాకారోపాసనము మిన్నయా? అని అర్జునుఁడు ప్రశ్నింపవలసివచ్చెను.

ఇఁట అక్షరపదము నిర్గుణపరమని వ్యాఖ్యానించువారు, జీవాత్మ పరమని

వివరించువారు, లక్ష్మీపరమని భ్రమపడువారును వైదిక మార్గమును విసర్జించిన వారని తేటపడుచున్నయది.

ఎట్లనఁగా? నిర్గుణ బ్రహ్మతత్త్వము-శ్రుతిసూత్రసమ్మతము కానట్టిది. నిర్గుణము ఉపాస్యము కాదని పరులంగీకరించుటచే "పర్యుపాసతే" అనునది పరుల వాదమునకు విరుద్ధమైనది. "శివ ఏకో ధ్యేయః" ఇత్యాది శ్రుతి ననుసరించి శివేతరము అనుపాస్యమగుటచే-జీవాత్మ-ఉపాస్యుఁడు కానట్టివాడు; లక్ష్మీపరంబనుటలో వాసుదేవుఁడు అసమర్థుఁడని ద్యోతక మగును.

శ్రీ భగవానువాచ-

శ్లో॥ మయ్యావేశ్య మనో యే మాం-నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతా-స్తే మే యుక్తతమా మతాః॥ 2

ఏ భక్తులైతే ఆకారసహితుఁడగు పరమేశ్వరునందు మనస్సు నిలిపి అత్యంతశ్రద్ధ (మిక్కుటమైన పట్టుదల)తో కూడినవారై నియమిత సమయములలో నిత్యము ధ్యానించుచు పరమేశ్వరు నారాధింతురో-అట్టి సాకార భక్తులు శ్రేష్ఠులుగ పరమేశ్వరునకు ఇష్టులగుదురు.

శ్లో॥ యే త్వక్షర మనిర్దేశ్య-మవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగ మచింత్యం చ-కూటస్థ మచలం ధ్రువమ్॥ 3
సంనియ మ్యేంద్రియగ్రామం-సర్వత్ర సమబుద్ధయః।
తే ప్రాప్నువంతి మామేవ-సర్వభూతహితే రతాః॥ 4

"ఇద మిత్థ" మని నిర్దేశింపనలవి గానిది, శాశ్వతము, సర్వవ్యాపకము, తెలియరానిది, వికారరహితము, స్థిరము, సత్యంబు నగు అవ్యక్తమనఁదగు మహాలింగమును- ఇంద్రియములను విషయములనుండి మఱల్చి శత్రు మిత్రాదుల యందు సమానబుద్ధి గలవారై సర్వప్రాణుల హితమునందు ఆసక్తి గలవారై-ధ్యానింతురో-అట్టి నిరాకారోపాసకులును పరమేశ్వరునే పొందుదురు.

వివరణ- నిరాకారమనఁగా-కరచరణాదిరహితమగు మహాలింగమనఁబఱుగుచు సూక్ష్మాతిసూక్ష్మంబగునది. అట్టి భావలింగము నుపాసించువారును శివసాయుజ్యము నొందుదురని భావము.

శ్లో॥ క్లేశో౽ధికతర స్తేషా-మవ్యక్తాసక్త చేతసాం।
అవ్యక్తా హి గతి ర్దుఃఖం-దేహవద్భి రవాప్యతే॥ 5

మహాలింగోపాసనమునందు ఆసక్తిగల భక్తులకు-శ్రమ-మిక్కుటమగును. ఎందుకనఁగా? శరీరధారులకు నిరాకారము నుపాసించుట-కష్టముగ సిద్ధించు నట్టిది.

వివరణ- శివతత్త్వము-ఇష్టప్రాణభావలింగాత్మకము కాగా ఇంద్రియ గోచరమగు ఇష్టలింగమును, మనోగ్రాహ్యమగు ప్రాణలింగము నుపాసింపక-కేవలము భావలింగము నుపాసించుట-భక్తులకు కష్టసాధ్యమగునని భావము. శివ షడక్షరీ మహామంత్రజపముతో ప్రాణలింగోపాసనము, శివాగమోక్త రీతిని బాహ్యో పచారముల నర్చించుటతో ఇష్టలింగోపాసనము ఘటించినచో భావలింగధ్యానము సుకరమగునని వివేకము.

శ్లో॥ యే తు సర్వాణి కర్మాణి-మయి సన్న్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన-మాం ధ్యాయంత ఉపాసతే॥ 6
తేషా మహం సముద్ధర్తా-మృత్యుసంసారసాగరాత్।
భవామి న చిరాత్ పార్థ-మయ్యావేశితచేతసామ్॥ 7

పార్థా! ఏ భక్తులైతే కర్మల నన్నిటిని పరమేశ్వరునకు సమర్పించుచు-పర మేశ్వరుఁడే పరాత్పరుఁడని భావించుచు-అన్యదేవతలను ఇతరమంత్రములను భిన్నభిన్న క్రియలను విడనాడి- "శివో౽హం" అను భావన యనఁదగు ధ్యాన యోగముతో పరమేశ్వరుని చింతించుచు నుపాసింతురో, పరమేశ్వరునందే చిత్త మును నిలిపినట్టి భక్తవర్యులను-మృత్యుమయము సాగరమువంటిదియు నగు సంసారబంధమునుండి విముక్తులఁ జేయును.

వివరణ-"శివో ఏకో ధ్యేయః, శివంకరః సర్వమన్యత్ పరిత్యజ్య" అను శ్రుతి ననుసరించి శివేతరదేవతాధ్యానము-ముముక్షువులకు కూడదనియు, నాకంటె పరదైవము వేరని భావించువాడు- పశుతుల్యుఁడగును గాన "శివో౽హం" భావ నచే శివుఁడగుననియు తెలియవలెను. వస్తుతః శివుఁడు-ఉపాసకునికన్న వేరైనను మాంత్రికుని గరుత్మంతుఁడు వలె ఉపాసకుని-తన స్వరూపప్రదానముతో నను గ్ర హించును. "యదా చర్మవదాకాశం-వేష్టయిష్యంతి మానవాః, తదా శివ మవి జ్ఞాయ-దుఃఖస్యాంతో భవిష్యతి" అను శ్రుతి-శివోపాసకునకే మోక్షము సులభ

మగునని నొక్కి వక్కాణించుటచే-అనన్యభక్తిచే శివు నుపాసింపవలెనని విదిత మైనది.

శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ-మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ-అత ఊర్ధ్వం న సంశయః ॥ 8

అందువలన- సంకల్పవికల్పాత్మకమైన మనస్సును పరమేశ్వరునందే నిలుపుము! నిశ్చయాత్మకమగు బుద్ధిని పరమేశ్వరునందే నెలకొలుపుము! ఇట్లు ప్రవర్తింతువేని- ఈ శరీరమునుండి వెళ్ళగానే పరమేశ్వరుని చెంతనే నివసింతువు!

వివరణ-చంచలమగు మనస్సును స్థిరపఱచినచో-దృఢ నిశ్చయము గలవాడవై-పరమేశ్వరుఁడే సర్వాత్మనా ఆరాధింపఁదగినవాడను ఏకాగ్రభక్తితో శివసాయుజ్యము నొందుదువని భావము.

శ్లో॥ అథ చిత్తం సమాధాతుం-న శక్నోషి మయి స్థిరం ।
అభ్యాసయోగేన తతో-మామిచ్ఛాప్తుం ధనంజయ ॥ 9

ధనంజయా! చిత్తమును స్థిరము నొనర్చి-పరమేశ్వరునందు నిలుపుటకు నలవి గానిచో-అటునిటు పరుగిడు మనస్సును మాటిమాటికి మఱల్చునట్టి అభ్యాసము అను ఉపాయముతో పరమేశ్వరుని ధ్యానించుటకై ప్రయత్నించుము!

శ్లో॥ అభ్యాసేఽప్యసమర్థోఽసి-మత్కర్మపరమో భవ ।
మదర్థ మపి కర్మాణి-కుర్వన్ సిద్ధి మవాప్స్యసి ॥ 10

పార్థా! అభ్యాసమును గూడ చేయఁజాలనిచో-పరమేశ్వరారాధన బుద్ధిని సత్కార్యముల నాచరింపుము! పరమేశ్వరు నుద్దేశించి యైనను పుణ్యకార్యములఁ జేయుచుండినయెడల-శివానుగ్రహమువలన మోక్షముఁ జెందగలవు!

శ్లో॥ అథైతదప్యశక్తోఽసి-కర్తుం మద్యోగ మాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం-తతః కురు యతాత్మవాన్ ॥ 11

పరమేశ్వరునికై పుణ్యముల నొనర్చుటకు మనస్సు స్థిరపడనిచో "పరమేశ్వరుఁడే శరణము" అను భావము నాశ్రయించి-సమస్తసత్కార్యముల ఫలితమును-మనోనిగ్రహమును-అపేక్షింపకుము!

శ్లో॥ శ్రేయోఽ హి జ్ఞాన మభ్యాసాత్-జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్ కర్మఫలత్యాగ-స్త్యాగా చ్ఛాంతి రనంతరమ్॥ 12

పరమేశ్వరభక్తి లేనట్టి అభ్యాసమునకంటె-పరమేశ్వరుని స్వరూపమహిమలను గుర్తించు జ్ఞానము (శివభక్తి) శ్రేష్ఠమగును. అట్టి జ్ఞానమునకన్న-శివధ్యానము మిన్నయగునది. శివధ్యానమున కంటె-కర్మఫలత్యాగము-వరిష్ఠమగును. కర్మఫలత్యాగముచే శివానుగ్రహము కలుగును గాన వెనువెంటనే ముక్తి లభించును.

వివరణ—"తతస్తు తం పశ్యతే నిష్కళం ధ్యాయమానః" "పరమేశ్వరుని పరిపూర్ణునిగ ధ్యానించువాడు-ధ్యానావసానమున పరమేశ్వరుని దర్శించును" అను శ్రుతి ననుసరించి-ఇట-శివధ్యానము ప్రశంసింపఁబడినది. శివధ్యానమునకు వలయు చిత్తశుద్ధి-సర్వకర్మఫలత్యాగముతో నేర్పడును గాన ధ్యానసాధనముఖ్యముగ- కర్మఫలత్యాగము-పేర్కొనఁబడినది. సాధ్యమునకన్న సాధనము మిన్న యనుటచే సాధకుఁడు సాధనము నవశ్యమవలంబించునని ఇట నివ్విధము భగవానుఁడు వక్కాణించెనని తెలియవలెను.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం-మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకారః-సమదుఃఖసుఖః క్షమీ॥ 13

ప్రాణులందరిని ద్వేషింపనివాడై స్నేహభావముతో భూతదయ గలవాడై మమకారము అహంకారములేనివాడై సుఖదుఃఖములను సమానములుగ భావించుచు ఓర్పు గలవాడునై యుండవలెను.

వివరణ. తనకు అపకారమును చేయువారినైనను ద్వేషింపకుండుట; మనస్సులో గూడ ద్రోహచింత లేకుండుట; దుఃఖపడువారిని కరుణించుట; శరీరమునందు ఇంద్రియములయందును మమకారమును తగ్గించుకొనుట; నేను సర్వశ్రేష్ఠుఁడనను దురహంకారము లేకుండుట, సుఖము దుఃఖము ఒకటేనను సమభావన కలిగియుండుట; వికారము లేకుండుటయు(ఓర్పు) పరమేశ్వరానుగ్రహము భక్తునకు లభించుటకు-లక్షణములగునవి.

శ్లో॥ సంతుష్టః సతతం యోగీ-యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధి-ర్యో మద్భక్తః స మే ప్రియః॥ 14

లాభనష్టములందును ప్రసన్నమైన మనస్సు గలిగి- ఎల్లకాలము పరమేశ్వరుని స్మరించుచు-మనస్సు నరికట్టి-ప్రారంభింపఁబడిన శాంభవవ్రతాంగముల నాచరించుటయందు పట్టుదలతో పరమేశ్వరునందు మనోబుద్ధులను నిలిపియుండు భక్తుఁడు-పరమేశ్వరునకు ప్రియుఁడగును.

శ్లో॥ యస్మా న్నోద్విజతే లోకో-లోకా న్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయోద్వేగై-ర్ముక్తో యః స చ మే ప్రియః ॥ 15

ఎవనివలన లోకము భయపడదో, ఎవఁడు ఇతరుని వలన భీతిఁజెందడో, హర్ష (తనకు వస్తువు దొరికినచో సంతోష)ము; అమర్షము=(పరులకు ఏదేనిలభించినచో సహింపకుండుట) భయము; ఉద్వేగము (చిత్తమును పరితపింపఁజేయుట) అను అవగుణములు లేనట్టివాడు-పరమేశ్వరునకు ప్రియుఁడగును.

శ్లో॥ అనపేక్షః శుచి ర్దక్ష-ఉదాసీనో గతవ్యథః ।
సర్వారంభపరిత్యాగీ-యో మే భక్తః స మే ప్రియః ॥ 16

ఎట్టి కోరికలు లేనివాడై బాహ్యాభ్యంతరములయందు పరిశుభ్రత గలవాడై గుర్తించుటకు చేయుటకును సమర్థుఁడునై పక్షపాతము (భేదబుద్ధి) లేనివాడునై మనోవ్యాధిరహితుఁడై సర్వవిధములైన ఉద్యమములను ప్రారంభింపనివాడునైనట్టి భక్తుఁడు-పరమేశ్వరునకు సన్నిహితుఁడగును.

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి-న శోచతి న కాంక్షతి ।
శుభాశుభపరిత్యాగీ-భక్తిమాన్ య స్స మే ప్రియః ॥ 17

ఇష్టమైనది లభించినచో సంతోషింపకుండుట; ఇష్టముకానిది ముందున్నచో ఆగ్రహింపకుండుటయు; ప్రియమైనది పోయినయెడల దుఃఖింపకుండుటయు; ఎంత ప్రయత్నించినను ఏదేని దొరుకనిచో అద్దాని నపేక్షింపకుండుటయు; పాపములను వలె పుణ్యములను పరిహరించుటయు ఏకాగ్రభక్తుని లక్షణములు-అట్టివాడు-పరమేశ్వరునకు ప్రియుఁడగును.

శ్లో॥ సమః శత్రౌ చ మిత్రే చ-తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు-సమః సంగవివర్జితః ॥ 18

శత్రువులయందు మిత్రులయందును సమదృష్టి గలవాడై మానము నవమానమును పరిగణింపనివాడునై దేనియందును ఆసక్తి లేనివాడునై శీతోష్ణములను సుఖదుఃఖములను సమానములుగ ననుభవించువాడు-శివప్రియుఁడగును.

శ్లో॥ తుల్యనిందాస్తుతి ర్మౌనీ-సంతుష్టో యేన కేనచిత్ ।
అనికేతః స్థిరమతి-ర్భక్తిమాన్ మే ప్రియో నరః ॥ 19

తన నిందను పొగడ్తను సమముగ భావించుచు మితముగ సంభాషించుచు సహజముగ లభించుదానితో సంతోషించుచు ఒకేచోట స్థిరనివాసమునందు ఆసక్తి లేనివాడై స్థిరబుద్ధిమంతుఁడునై భగవద్భక్తి గలిగియుండు మానవుఁడు పరమేశ్వరునకు ప్రియుఁడగుమ.

శ్లో॥ యే తు ధర్మ్యామృత మిదం-యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్దధానా మత్పరమా-భక్తా స్తేఽతీవ మే ప్రియాః ॥ 20

ఎవరైతే అమృతత్వము అనఁబడు మోక్షమునకు సాధనమైనందున అమృతంబు, పరమేశ్వరునందు మనస్సు నిలుపుట మొదలగు ధర్మములతో కూడినదియునగు; ఈ ద్వాదశాధ్యాయమందలి ఉపదేశమును- శాస్త్రోక్తరీతి ననఁగా స్వసంప్రదాయ పద్ధతిని-పట్టుదలతో పరమేశ్వరునందు నిష్ఠతోడ నాచరింతురో, అట్టి భక్తులు-పరమేశ్వరునకు అత్యంతప్రియులగుదురు.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం, వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మ
విద్యాయాం, యోగశాస్త్రే, శ్రీ కృష్ణార్జున సంవాదే,
భక్తియోగో నామ ద్వాదశోఽధ్యాయః
ఇయ్యది

శ్రీ సీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీమత్ భగవద్గీతా భాష్యముఁ
దగు "మనోరంజన" మను శాంకరీయ ఆంధ్రానువాదమున
పంద్రెండవ అధ్యాయము

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః.

# శ్రీ భగవద్గీత

## త్రయోదశాధ్యాయము

"మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాద సహితము

(భగవద్గీతలోని మూడవ షట్కమున ఉపాసనా దార్ఢ్యమునకు వలయు అనేకాంశములు వివరింపఁబడుచున్నవి).

శ్రీ భగవానువాచ-

శ్లో॥ ఇదం శరీరం కౌంతేయ- క్షేత్ర మిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః- క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ 1

కౌంతేయా! బహిరంతరింద్రియ సహితము, సుఖదుఃఖభోగస్థానము-కను పడునదియు నగు ఈ శరీరము-కర్మఫలసిద్ధి గలదగుటచే-క్షేత్రమని చెప్పఁబడును. దీని నెవఁడు- "నాది" అను అభినివేశముతో-పోషించుకొనునో అట్టి జీవాత్మ క్షేత్రజ్ఞుఁడనఁబడుఁగునని-క్షేత్రక్షేత్రజ్ఞపరిజ్ఞానము గల మహానుభావులు వక్కాణింతురు.

వివరణ-పశువు (జీవాత్మ) పాశము (సంసారము) పతి (పరమేశ్వరుఁడు) అనువానిఁ జెందిన పర అపర అనఁబడు రెండు ప్రకృతులు సప్తమాధ్యాయమున నిర్దేశింపఁబడినవి. క్షేత్రజ్ఞుఁడనఁదగు పశువు రూపముగా గల పరాప్రకృతి యొక్కయు, క్షేత్రమనఁదగు పాశము రూపముగా గల అపరాప్రకృతియొక్కయు స్వరూపమును నిరూపించుటద్వారా-పతి యనఁదగు పరమేశ్వరుని లక్షణమును

పరిశీలించి నిర్ణయించుటకు—క్షేత్రక్షేత్రజ్ఞ విభాగము గల ఈ అధ్యాయము ప్రారంభింపఁబడినది. ఆరెంటిలో పాశరూపయగు అపరాప్రకృతి-సత్త్వరజస్తమో గుణాత్మికమై భోగ్య భోగోపకరణ భోగాయతన రూపముగ పరిణమించి పశువునకు—దేహేంద్రియాకారమగుచున్నయది. అదియే ఈ శరీరము; ఇద్దానిని భగవానుఁడు పై శ్లోకమున వివరించెను.

భోగ్యములనఁగా—శబ్ద స్పర్శరూప రస గంధాది విషయములు;

భోగోపకరణములు—త్వక్ చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణాది ఇంద్రియములు;

భోగాయతనము—శరీరము;

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి-సర్వక్షేత్రేషు భారత!।
క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం-యత్తత్ జ్ఞానం మతం మమ॥ 2

భరతవంశోద్భవా అర్జునా! శరీరములన్నిటియందును జీవాత్మ ఉన్నాదనియు పరమేశ్వరుడు జీవాత్మను ప్రేరేపించుటకు శరీరములలో అంతరాత్మగా నివసించుచున్నాడనియు తెలియుము! "ద్వా సుపర్ణా సయుజా సఖాయా—సమానం వృక్షం పరిషస్వజాతే" "సువర్ణములగు రెండు పక్షులు (జీవపరమాత్మలు) స్నేహితులవలె కూడి వృక్షముఁబోలిన ఒకే శరీరమునందు నివసించుచున్నవి" "గుహాం ప్రవిష్టా వాత్మానౌ హి తద్దర్శనాత్" "జీవేశ్వరులు—హృదయగుహఁ బ్రవేశించినవారని శ్రుతియందు గానంబడుచున్నయది" ఇత్యాది శ్రుతిసూత్రములఁ బట్టి జీవపరమాత్మలు-ప్రతిశరీరమునందు ప్రేర్య ప్రేరక భావమున నున్నవారని విదితమగుటచే-క్షేత్రజ్ఞం=జీవాత్మను; మాం చాపి = పరమేశ్వరుని గూడ ననియుట ప్రతిపాదించుట సమంజసమైనది.

క్షేత్రమెట్టిదో క్షేత్రజ్ఞుఁడెట్టివాడో క్షేత్రజ్ఞుని వెంటాడు పరమేశ్వరుఁడెట్టివాడో గుర్తించుట-జ్ఞానమగుననని పరమేశ్వరుని యభిమత మగునని పై శ్లోకభావార్థము.

శ్లో॥ తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ-యద్వికారి యతశ్చ యత్।
స చ యో యత్ప్రభావశ్చ-తత్సమాసేన మే శ్రుణు॥ 3

అట్టి శరీరము-ఏ యే రూపము గలదో, ఎట్టి ధర్మములతో కూడినదో ఎట్టి

ఇంద్రియాదివికారములు గలదియో, ఎద్దాని (ప్రకృతిపురుష సంయోగము)వలన సంభవించునో, క్షేత్రజ్ఞుఁడు పరమేశ్వరుఁడును ఎట్టి స్వభావము ప్రభావము గలవారో, అట్టి విషయమును సంగ్రహముగ నావలన వినుము!

శ్లో॥ ఋషిభి ర్బహుధా గీతం-ఛందోభి ర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ-హేతుమద్భి ర్వినిశ్చితైః ॥ 4

వేదవ్యాసాది ఋషులు, అనేకములైన ఉపనిషద్వాక్యములు, యుక్తియుక్తములు నిశ్చితార్థకములు నగు బ్రహ్మమీమాంసాన్యాయములును, పెక్కుభంగిమల చెప్పినట్టి-పై క్షేత్రక్షేత్రజ్ఞాది విషయమునంతయు చెప్పెద నని భావము.

శ్లో॥ మహాభూతా న్యహంకారో-బుద్ధి రవ్యక్త మేవ చ ।
ఇంద్రియాణి దశైకం చ-పంచ చేంద్రియగోచరాః ॥ 5

భూమి జల తేజో వాయు ఆకాశములు అను పంచ మహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, కర్మజ్ఞానేంద్రియములు పది. మనస్సు జ్ఞానేంద్రియ విషయములు ఐదు నను ఇరువదినాలుగు తత్త్వములు—

శ్లో॥ ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం-సంఘాత శ్చేతనా ధృతిః ।
ఏతత్ క్షేత్రం సమాసేన-సవికార ముదాహృతమ్ ॥ 6

రాగద్వేషములు, సుఖదుఃఖములు గలదై పంచభూతముల కూడిక-జీవాత్మశరీరధారణమునకు ఆధారము నగు నీ క్షేత్ర (శరీర)ము తన వికార (కార్య)ములతో కూడియుండునని-సంగ్రహముగా—నుడువఁబడినది.

వివరణ-అహంకారము-పంచమహాభూతముల చేరికను కలిగించునదనియు; బుద్ధియనఁగా—అహంకారమును కలిగించు మహత్తత్త్వమనియు; సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రధానము మూలప్రకృతి యనఁబడుఁగునదియై మహత్తత్త్వమును సంభవింపఁజేయునదనియు, ఇదియే అవ్యక్త మనఁబడుననియు, ఎనిమిది తెఱఁగులు గలది-ప్రకృతి యనియు సాంఖ్యమత సిద్ధాంతము.

అవ్యక్తమనఁగా—పరమేశ్వరుని శక్తియగు మాయయని "మాయాం తు ప్రకృతిం విద్యాత్-మాయినం తు మహేశ్వరమ్" అను శ్రుతి వక్కాణించినదనియు; సృష్ట్యాదిని పరమేశ్వరుని ఆలోచన (ఈక్షణము) బుద్ధి యనఁబడుగు

ననియు, ఇదియే చిచ్ఛక్తి యనియు; "బహుస్యాం ప్రజాయేయ" అను శ్రుతి వాక్యము ననుసరించి—పరమేశ్వరుని సంకల్పము-అహంకారమనియు, ఇదియే ఇచ్ఛాశక్తి యనియు వైదికమతసిద్ధాంతము.

"తస్యైవ శక్తిర్వివిధైవ శ్రూయతే—స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" "ఇచ్ఛా జ్ఞాన క్రియలు గలిగినది సహజసిద్ధంబు నగు పరమేశ్వరుని చిచ్ఛక్తియే—బహువిధములు గలదిగా వినఁబడుచున్నది" అను శ్రుతియందు గల "స్వాభావికీ" అను విశేషణము-మాయ కల్పితంబను వ్యామోహమును నివారించుచున్నయది.

శ్లో॥ అమానిత్వ మదంభిత్వ-మహింసా క్షాంతి రార్జవం।
ఆచార్యోపాసనం శౌచం-స్థైర్య మాత్మవినిగ్రహః ॥ 7

ఇంద్రియార్థేషు వైరాగ్య-మనహంకార ఏవ చ।
జన్మమృత్యుజరావ్యాధి-దుఃఖదోషానుదర్శనమ్ ॥ 8

తన ప్రశంసను ఇష్టపడకుండుటయు; ఆడంబరము లేకుండుటయు; ఇతరులను పీడింపకుండుటయు; ఓర్పు; సరియైన ప్రవర్తనము; సద్గురువును సేవించుటయు; వెలుపల లోపలను పరిశుభ్రత; స్థిరమైన బుద్ధి; శరీరమును ఇంద్రియముల నదుపులో నుంచుటయు; ఇంద్రియములఁ జెందిన శబ్దాదివిషయములయందు ఆసక్తి లేకుండుయు; గర్వపడకుండుటయు ఇవి- క్షేత్రజ్ఞుఁడైన జీవాత్మను మరియు పరమాత్మను గుర్తించుటకు సాధనములగును. ఇవియే గాక జననమునందు గర్భవాసదుఃఖము; మరణమున శరీరగతమర్మస్థానములను భేదించుటయు; ముసలితనమున తెలివిమొదలగునని తగ్గుటయు, రోగమున శరీరబాధ యన దోషములను తలచుకొని ముందు జాగ్రతపడుచుండవలెను.

శ్లో॥ అసక్తి రనభిష్వంగః-పుత్రదారగృహాదిషు।
నిత్యం చ సమచిత్తత్వ—మిష్టానిష్టోపపత్తిషు ॥ 9

మయి చానన్యయోగేన—భక్తి రవ్యభిచారిణీ।
వివిక్తదేశ సేవిత్వ-మరతి ర్జనసంసది॥ 10

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం-తత్త్వజ్ఞానార్థదర్శనం।
ఏతత్ జ్ఞాన మితిప్రోక్త—మజ్ఞానం యదతోఽన్యథా ॥ 11

ఆత్మకంటె వేరైన శరీరేంద్రియాదులయందు ఆసక్తి లేకుండుట, భార్యాపుత్రగృహాదులపై స్నేహ (మమకార)ము లేకుండుటయు; ఇష్టమైనది లభించినపుడు సంతోషము, ఇష్టముకానిది తారసిల్లినపుడు బాధపడుటయు లేక ఎల్లకాలము సమచిత్తుఁడై యుండుటయు; పరమేశ్వరునందు అనన్య-ఏకాగ్రభక్తియు; ఏకాంతనివాసము; జనసమూహమునందు అభిరుచి లేకుండుటయు; జీవేశ్వరులను గుర్తించు కృషియందు నిలుపుదల; పశుపాశపతులనఁబడు మూడు తత్త్వములను పరామర్శించుటయు; ఇవి-జ్ఞాన సాధనములగుటచే-జ్ఞానమని చెప్పఁబడును. దీనికి వ్యతిరిక్తమైనది. అజ్ఞాన మనఁబడును.

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి-యద్జ్ఞాత్వాఽమృత మశ్నుతే।
అనాది మత్పరం బ్రహ్మ-న సత్తన్నాస దుచ్యతే॥ 12

తెలియఁదగినదేదో దానిని చెప్పుచున్నాను-జ్ఞేయమును తెలిసికొనినచో ముక్తిని పొందును. జ్ఞేయము-ఆది అంతము లేనిదై-నారాయణునికన్న శ్రేష్ఠమునై పరశివాభిదేయంబగునది-మరియు నది-సత్తని గాని అసత్తు అనిగాని చెప్పనలవి గానిది;

వివరణ-"మత్పరం" అనుచో "మత్తః నారాయణాత్ పరం" అని చెప్పుట సమంజసము. ఎందుకనఁగా? "శబ్ద విశేషాత్" అను బ్రహ్మసూత్రమున వేదవ్యాసుఁడు-నారాయణునికన్న శ్రేష్ఠమైనది. పరశివాఖ్య పరబ్రహ్మంబని నిర్ధారించుటయే గాక "తద్విష్ణోః పరమం పదం" ఇత్యాది శ్రుతులు పరమేశ్వరుఁడు నారాయణుని మించినవాడని-ప్రతిపాదించుచున్నందున ఈ యర్థమునే "మత్పరం" అను పదముతో భగవానుఁడు నిర్వచించెనని తెలియవలెను.

సత్తు అని గాని అసత్తు అని గాని చెప్పరాదనుటలో-బ్రహ్మము కార్యదశయందు స్థూలమగుటచే సద్రూపము, కారణదశయందు సూక్ష్మమగుటచే అసద్రూపము అని చెప్పవలసియున్నను స్థూల సూక్ష్మదశలు శక్తికే గాని శివునకు ఉండవను పరమార్థము ఇమిడియున్నది. స్థూలసూక్ష్మదశలతో నుండు శక్తి నెడఁబాయని వాడగుటచే శివుఁడు సత్తనియు అసత్తనియు గౌణముగ వ్యవహరింపఁబడువాడు అని సారాంశము.

కొందరు "అనాదిమత్ పరం బ్రహ్మ" అనుచో గల మత్ప్రత్యయము పాద

పూరణార్థక మైనదని నిరూపించుచున్నవారు. మరికొందరు "అహం పరో యస్మా తత్" "నేను పరుఁడుగా గలది" అను వ్యుత్పత్తి ననుసరించి "వాసుదేవుఁడు పరబ్రహ్మమని" ప్రతిపాదించుచున్నవారు. వీరిద్దరి నిర్వచనములు-గీతాశాస్త్రము నకు విరుద్ధములైనవి. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమగుటచే-ఇఁట-బ్రహ్మపదము జీవపరంబని చెప్పుట. సముంజసము కాదు. "యత్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే" బ్రహ్మ పదవాచ్యమైన పరమాత్మను కనుగొనుటచే మోక్షము లభించునని-భగవద్గీత చెప్పుటయే గాక "తమేవం విదిత్వాఽమృత ఇహ భవతి" 'నాన్యః పంథాఽయ నాయ విద్యతే" "ఈశం తం జ్ఞాత్వాఽమృతా భవంతి" ఇత్యాది శ్రుతులు పర మేశ్వరుని తెలిసికొనుటవలననే మోక్షఫలము చేకూరు-నని నిర్వచించుటఁ జేసి పై నిర్వచనములు రెండును శ్రుతివిరుద్ధములగుచున్నవి-మరియు గీత వేద విరుద్ధార్థము గలదని నిరూపించినట్లగునని వివేకము.

శ్లో॥ సర్వతః పాణిపాదం త-త్సర్వతోఽక్షిశిరోముఖం।
సర్వతః శ్రుతిమల్లోకే-సర్వమావృత్య తిష్ఠతి ॥ 13

శరీరములన్నిటిలో హస్తములు పాదములు గలదియు, దేహములన్నిటి యందు నేత్రములు శిరస్సులు ముఖములు గలదియు; సమస్త అంగములఁ జెందిన కర్ణము (చెవు)లు గలదియు; లోకమున సమస్తమును తన జ్ఞానదీప్తితో వ్యాపించియుండునదియు.

వివరణ-జీవాత్మ- అనాదికాలమునుండి శివాపచారము గలవాడగుటచే ఈశ్వరసంకల్పమువలన సర్వజ్ఞత్వాది సంపన్నమగు నిజరూపమును మఱుగు పఱచుకొనినవాడై-పరమాత్మకంటె తక్కువస్థితి గలవాడగును. బంధవిముక్తి ఐనతటి-నిజరూపము ఆవిర్భూతమగుటచే శివసమానస్థితి గలవాడై శివుఁడుగ గుర్తింపఁబడును. అందువలన పరమేశ్వరుని సర్వగతత్వాది ధర్మములు గల వాఁడు-ముక్తాత్మయను తాదాత్మ్యభావనతో నిట ఆత్మతత్త్వము నిర్దేశింపఁబడినదని తెలియవలెను.

"సంసారమోక్ష స్థితి బంధ హేతుః" "పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" "నిరంజనః పరమం సామ్య ముపైతి" ఇత్యాది శ్రుతివాక్య ములు-మరియు "పరాభిధ్యానాత్తు తిరోహితం తతోహ్యస్య బంధ విపర్యయౌ" "ఈ

ఆత్మయొక్క నిజరూపము-పరమాత్మయొక్క సంకల్పముచే మరుగుపడినది. జీవాత్మకు సంసారబంధము మోక్షమున్ను పరమేశ్వరుని వలననే సంభవించును" "ఉత్తరాచ్చే దావిర్భూత స్వరూపస్తు" "ఆకలి దప్పి మొదలగునవి లేనివాడు ఆత్మ అను అనంతర ప్రకరణమువలన ఆత్మ—మొదటినుండియే సర్వజ్ఞత్వాది సంపన్నమగు శివస్వరూపము గలవాడనునెడ- ముక్తదశయందు నిజరూపము ఆవిర్భవించుటచే ముక్తాత్మ-శివుఁడుగ ప్రతిపాదింపఁబడినవాడు" ఇత్యాది బ్రహ్మ సూత్రములును "పరమేశ్వరుని లక్షణములు ఆవిర్భూతస్వరూపుఁడగు జీవాత్మకు మాత్రము ఉండునని ప్రతిపాదించినవి. "అచేతనములగు ఇంద్రియములను తమ తమ వ్యాపారములయందు ప్రవర్తింపఁజేయువాడు జీవాత్మయగుటచే-జీవాత్మ నంతర్యామియగు పరమాత్మ జీవాత్మద్వారా—సమస్త శరీరగతములగు పాణి పాదాది ఇంద్రియములు గలవాడు' అని-జీవేశ్వరాభేదదృష్టి నిట ఆత్మలక్షణము ప్రతిపాదింపఁబడినదని రహస్యార్థము.

శ్లో॥ సర్వేంద్రియగుణాభాసం-సర్వేంద్రియవివర్జితం ।
అసక్తం సర్వభృచ్చైవ-నిర్గుణం గుణభోక్తృ చ ॥ 14

ఆత్మతత్త్వము-ఇంద్రియముల నన్నిటిని, అవ్వాని గుణములగు విషయములను ప్రకాశింపఁజేయునదియు; సమస్త ఇంద్రియములు లేనిదియు; శరీర ఆసక్తి లేనిదియు, బ్రహ్మాండమునంతయు భరించునదియు; ఆకలి దప్పి మొదలగు ప్రాకృతగుణములు లేనిదియు, సత్త్వరజస్తమో గుణముల ననుభవించునదియు నగును

శ్లో॥ బహి రంత శ్చ భూతానా—మచరం చర మేవ చ ।
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం—దూరస్థం చాంతికే చ తత్ ॥ 15

చరాచరప్రాణులయొక్క లోన బయట నుండునదియు; స్థిరమైనదియు, శరీరేంద్రియముల ద్వారా కదలునదియు; ఇంద్రియములకు గోచరము కానిదై మిక్కిలి సూక్ష్మమైనఁదగుటచే తెలియనలవిఁగానిదియు; అమానిత్వాది గుణములు లేనివారికి దూరముండునదియు: గుణవంతులకు చేరువ నుండునదియు నగును.

శ్లో॥ అవిభక్తం చ భూతేషు—విభక్తం మివ చ స్థితం ।
భూతభర్తృ చ తద్జ్ఞేయం—గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ 16

చరాచరప్రాణులలో కారణరూపమున వేరు గానిదైనను, కార్యరూపమున వేరుగ నున్నదియు; ప్రాణులను పోషించునదియు; ప్రళయమున సమస్తమును భక్షించునదియు, సమస్తమును పుట్టించునదియు నగును.

వివరణ—ప్రాణులలో జ్ఞాతగా ఏకరూపముగ నుండు ఆత్మ- దేవమానవాది శరీరములఁజెందిన భేదము వలన భిన్నముగ కనఁబడును ప్రాణులకు శరీరములకై నొకచో కూడిన పృథివ్యాది పంచభూతముల యధిపతియై శరీరవియోగకాలమున నవ్వాని సూక్ష్మాంశములను తనలో నిమిడ్చుకొనును గాన "గ్రసిష్ణు" అని చెప్పఁబడెను. "మహాగ్రాసాయ" అను శ్రుతి ఇందుకు తార్కాణము జగత్తును శాసించుటకు పుట్టించునదగును.

శ్లో॥ జ్యోతిషా మపి తజ్జ్యోతి-స్తమసః పర ముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం-హృది సర్వస్య ధిష్ఠితమ్ ॥ 17

ఆవిర్భూత నిజస్వరూపుఁడగు ముక్తాత్మతో పృథక్స్థితి లేని బ్రహ్మము ముక్తాత్మయు నొకటే నను అభేదభావనతో నిట ఆత్మతత్త్వము నిరూపింపఁబడినది.

సూర్యాది జ్యోతిస్సులఁ గూడ ప్రకాశింపఁజేయునది, (అథవా) జ్ఞానసాధనములగు త్వక్ (ఒడలు తొడుగు) మొదలగువానికి తెలివిఁగలిగించునదియగు బ్రహ్మము-తమస్సునకంటె శ్రేష్ఠముగ చెప్పఁబడుచున్నది.

జ్ఞానము గుణముగ గలది; వేదాంతములచే-లేక-ధ్యానయోగముచే తెలియఁదగినది; జ్ఞానసాధనమగు ధ్యానాదికముచే పొందఁదగినదియు నగు బ్రహ్మము-ప్రాణిజాతముయొక్క హృదయమున నెలకొనియున్నది.

"యేన సూర్య స్తపతి తేజసా" "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" ఇత్యాది శ్రుతివాక్యములు—పై యంశమును బలపఱచునవి. "త్వగాదుల తెలివి-ప్రాణోత్క్రాంతి సమయమున లోపించును గాన నయ్యవి స్వయం ప్రకాశమానములు కాని వగుటచే—జీవితమునఁగూడ నవ్వానికి తెలివిఁ గలిగించునది బ్రహ్మమే నని భావము.

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం-జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏతద్విజ్ఞాయ-మద్భావాయోపపద్యతే ॥ 18

"మహాభూతాని" ఇత్యాది రెండు శ్లోకములలో క్షేత్రము; "అమానిత్వం" ఇత్యాది ఐదు శ్లోకములలో జ్ఞానము (జ్ఞానసాధనములు) "అనాదిమత్పరం" ఇత్యాది ఐదు మరియు సగం శ్లోకములలో జ్ఞేయమున్ను సంగ్రహముగ నిట చెప్పఁబడినవి.

పరమేశ్వరుని భక్తుఁడు. ఇద్దానిని స్మరించినచో-శివసాయుజ్య మను మోక్షమునకు అర్హుఁడగును.

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ-విద్ధ్యనాదీ వుభావపి ।
వికారాంశ్చ గుణాం శ్చైవ-విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ 19

ఈశ్వరుని సహజశక్తియగు ప్రకృతి-పరమేశ్వరుని అంశమగు పురుషుఁడు. (జీవాత్మ) రెండును అనాదులని గుర్తింపుము! మరియు దేహేంద్రియాదివికారములు, సుఖదుఃఖమోహాదులును ప్రకృతివలన సంభవించునని తెలియుము!

శ్లో॥ కార్యకారణ కర్తృత్వే- హేతుః ప్రకృతి రుచ్యతే ।
పురుషః సుఖదుఃఖానాం-భోక్తృత్వే హేతు రుచ్యతే ॥ 20

శరీరము ఇంద్రియములు అనునవి ఉపయోగించుటకు పురుషాధిష్ఠితమైన ప్రకృతి-కారణమనియు, పురుషుఁడు-సుఖదుఃఖముల ననుభవించుటకు కారణమనియు కపిలాదులు చెప్పుదురు.

శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి-భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।
కారణం గుణసంగోఽస్య-సదసద్యోనిజన్మసు ॥ 21

ప్రకృతి నంటిపెట్టుకొనియుండు జీవాత్మ-సత్త్వరజస్తమోగుణముల వలన సంభవించు సుఖదుఃఖాదుల ననుభవించును. ఎందుకనఁగా? పురుషునకు శబ్దాది విషయములందు కలుగు ఆసక్తియే-దేవాది ఉత్తమజన్మలు పశుపక్ష్యాది నికృష్ట జన్మలును ఏర్పడుటకు కారణమగుచున్నయది.

శ్లో॥ ఉపద్రష్టాఽనుమంతా చ-భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో-దేహేఽస్మిన్ పురుషః పరః ॥ 22

సమీపమున సాక్షిగ నుండువాఁడు, ఇంద్రియవ్యాపారముల ననుమోదించు

వాడు, దేహేంద్రియములను నిలుపువాడు, విషయముల ననుభవించువాడు, బ్రహ్మాదులకు అధిపతియు నగు నీ పురుషుఁడు-దేహేంద్రియాదుల నతిక్రమించు పరుఁడనియు, ఆవిర్భూతనిజరూపుఁడ గుటచే పరమాత్మ యనియు పేర్కొనఁబడును.

వివరణ-నిజరూపమును ఆవిర్భవింపఁజేసికొనిన జీవాత్మ-బంధవిముక్తుఁడై శివసమానుఁడగు నను అంశమును వ్యక్తపఱచుటకు-పురుషుని మహేశ్వరునిగ నిర్దేశింపవలసివచ్చినది. కాని వస్తుతః ఇఁట మహేశ్వర శబ్దము పరమేశ్వరునే రూఢిని తెలుపునదగుటఁజేసి-ముక్తాత్మ-మహేశ్వరకోటిలో చేరునని భావించి మహేశ్వర శబ్దము యౌగికముగ ముక్తాత్మయందు ప్రయోగింపఁబడినదనుట-పరమార్థమైనది.

శ్లో॥ య ఏవం వేత్తి పురుషం—ప్రకృతిం చ గుణైః సహ।
సర్వథా వర్తమానోఽపి-న స భూయోఽభిజాయతే॥ 23

ఎవఁడు—ఆత్మను ప్రకృతిని—ఈ వరకు చెప్పఁబడిన గుణములు గలవానిగ గుర్తించునో, అట్టివాడు—తన ఇష్టప్రకారము ప్రవర్తించినను మరల జన్మనొందఁజాలడు.

శ్లో॥ ధ్యానేనాత్మని పశ్యంతి-కేచి దాత్మాన మాత్మనా।
అన్యే సాంఖ్యేన యోగేన-కర్మయోగేన చాపరే॥ 24

ఇఁట—ఆత్మశబ్దము-మనస్సును శరీరముఁగూడ జెప్పును. కొందరు-శరీరమునందలి ఆత్మను-సమాధియందు మనస్సుతో నవలోకింతురు. మరికొందరు-ప్రకృతిపురుషవివేకము అను సాంఖ్యయోగము నవలంబించి ఆత్మఁగాంతురు. ఇంక కొందరు—ఈశ్వరార్పణముగ చేయఁబడు కర్మయోగముతో ఆత్మఁజూడఁగలుగుదురు.

శ్లో॥ అన్యే త్వేవ మజానంతః-శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాతితరంత్యేవ-మృత్యుం శ్రుతిపరాయణాః॥ 25

ఈ చెప్పఁబడిన విధముగ ఆత్మను కనుఁగొనఁజాలని అశక్తులు వేదశాస్త్రశివాగమాద్యభిజ్ఞులైన గురువుల వలన సావధానముగ విని ఆత్మను గురించి

చింతించుచు గురుచరేశ్వరరూపముల నారాధించుచుందురు. శ్రుతి (శ్రవణము) (ఏకార్థనిశ్చయము) యందు ఆసక్తి గలిగి పట్టుదలతో ప్రయత్నించు నవ్వారు గూడ-జననమరణాత్మకమగు సంసారసముద్రమును దాటఁగలుఁగుదురు.

శ్లో॥ యావ త్సంజాయతే కించిత్-సత్త్వం స్థావరజంగమం।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా-త్తద్విద్ధి భరతర్షభ ॥ 26

భరతర్షభా! స్థిరము చరము నగు ప్రాణివర్గమంతయు-క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగము వలననే జన్మించునదని తెలియుము!

శ్లో॥ సమం సర్వేషు భూతేషు-తిష్ఠంతం పరమేశ్వరం।
వినశ్యత్స్వవినశ్యంతం-యః పశ్యతి స పశ్యతి॥ 27

స్థిరచరప్రాణులన్నిటియందు సమాన (ఏకరూప)ముగ నివసించువాని గాను దేహములు నశించినను నశింపనివానిగాను ఆత్మను పరమేశ్వరు నెవఁడు భావించునో వాడే జ్ఞాని యనఁబడును.

వివరణ—ఆత్మచైతన్యము-దోమయందు ఏనుగయందును ఒకే రూపమున నుండుననియు, ఆత్మలో పరమాత్మగూడ నదే విధముగ నివసించుననియు భావించువాడే జ్ఞానియని సారాంశము.

తన శరీరములో హృదయమున ఆత్మలో శివుఁడు ఉన్నవాడని నిరంతరము భావించుచు శివుని సపర్యకై శరీరమును మనస్సును ఇంద్రియములను ఉపయోగించు శివయోగి ధన్యుఁడగునని వివేకము.

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర-సమవస్థిత మీశ్వరం।
న హినస్త్యాత్మనాఽఽత్మానం-తతో యాతి పరాం గతిమ్॥ 28

సర్వభూతములయందు సమానముగ- జీవాత్మను నియమించువానిగ పరమేశ్వరుఁడు ఉండునని భావించువాడు—తనను తాను హింసించువాడు కాడు. అట్టి భావనవలన ముక్తి నొందువాడగును.

వివరణ- తనలో పరమాత్మ ఉన్నవాడని భావించువాడు- ఇతర ప్రాణులలో గూడ నట్లే నుండునని గుర్తించినచో- ఆత్మలో పరమాత్మను దర్శింపఁ

గలుఁగును. అందువలన శాశ్వతకాలము శివానందము ననుభవించుటకు పరమ పదమునఁ బ్రవేశింపఁజాలునని సారాంశము.

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి-క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాఽఽత్మాన-మకర్తారం స పశ్యతి ॥ 29

దేహము ఇంద్రియములు మున్నగువాని రూపమున నుండు ప్రకృతియే కర్మలన్నిటిని చేయుచున్నదని భావించుచు తాను కర్త కానని గుర్తించువాడు-జ్ఞాని యగును.

వివరణ-పరమేశ్వరుఁడే ప్రకృతిద్వారా శరీరేంద్రియాదివ్యాపారములను చేయుచున్నవాడనియు-తాను నిమిత్త మాత్రుఁడననియు భావించి అహంకార మమకారములకు లోను కానివాడు-పరమేశ్వరానుగ్రహపాత్రుఁడగునని భావము.

శ్లో॥ యదా భూతపృథక్భావ-మేకస్థ మనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం-బ్రహ్మ సంపద్యతే తదా ॥ 30

ప్రాణులయొక్క వేరువేరు స్థితిని ప్రళయకాలమున పరమేశ్వరుని శక్తి యందున్నదాని గాను, సృష్టికాలమున పరమేశ్వరుని శక్తివలననే ఆవిర్భావము గలవానిగాను గుర్తించుతఱి-శక్తివిశిష్టుఁడైన పరమేశ్వరునితో సాయుజ్యమును పొందగలుఁగును.

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వాత్-పరమాత్మాఽయ మవ్యయః ।
శరీరస్థోఽపి కౌంతేయ-న కరోతి న లిప్యతే ॥ 31

కౌంతేయా! వినాశము లేనట్టి, జన్మరహితుఁడు ప్రాకృతగుణములు లేనివాడు, దేహేంద్రియాదులకంటె పరుఁడు నగు ఈ ఆత్మ-శరీరమునందుండియు ఎట్టి కర్మను చేయువాడు కానందున కర్మఫలము ననుభవించువాడును కాజాలడు.

వివరణ-శుద్ధాత్మ-పరమాత్మయొకటే నను భావనతో ఆత్మలక్షణము ఇట నిరూపింపఁబడినను "తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి" అను శ్రుతి ననుసరించి జీవాత్మ ప్రకృతిబద్ధుడై వివిధ కర్మలఁజేయుచు కర్మఫలము ననుభవించువాడని తెలియుచున్నందున- ఆత్మప్రేరణచే ప్రకృతి- దేహేంద్రియాదిరూపములతో

కర్మను చేయునది కాగా ప్రకృతితో పెనవేసికొనిన-ఆత్మ-కర్తగాను భోక్తగాను పేర్కొనఁబడుచున్నయది.

వస్తుతః ప్రకృతిపురుషవివేకము గలవాడు "ప్రకృతి నేను కాదు" అని దృఢముగ భావించి-ప్రకృతికృతములగు సత్కర్మలన్నిటి నీశ్వరార్పణముఁజేసి ఫలాంకురము నుదయింపఁజేసికొనువాడు కాడని సారాంశము.

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యా-దాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే-తథాఽఽత్మా నోపలిప్యతే ॥ 32

సర్వగతమైన ఆకాశము- అతిసూక్ష్మమగుటచే- బురదమున్నగువాని సంబంధము లేనిదగునట్లు-సర్వవిధము అనఁగా నిర్మలము మలినంబునగు శరీరమునందుండు పరమాత్మ (పరమాత్మ నుపాసించు జీవాత్మయు) కర్మ ఫలముతోగు సంబంధము లేనివాడగును.

శ్లో॥ యథా ప్రకాశయత్యేకః-కృత్స్నం లోక మిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం-ప్రకాశయతి భారత ॥ 33

భరతవంశోద్భవా! సూర్యుఁడు-ఒకఁడే యైనను ఈ ప్రపంచమునంతయు తన కాంతిచే ప్రకాశింపఁజేయునట్లు—క్షేత్రజ్ఞుఁడు (జీవాత్మద్వారా పరమాత్మ) శరీరమునంతయు ప్రవర్తింపఁజేయును.

వివరణ—క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" ఈ అధ్యాయమున రెండవ శ్లోకమున 'క్షేత్రజ్ఞం మామపి" "క్షేత్రజ్ఞుడైన జీవాత్మను పరమేశ్వరుని గూడ గుర్తింపుము" అని భగవానుఁడు నిర్వచించుటచే-ఇఁట "క్షేత్రీ" అను పదమునకు-జీవాత్మ పరమాత్మయు నని చెప్పుట సమంజసంబగుచున్నయది.

శ్లో॥ క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ-మంతరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతిమోక్షం చ-యే విదు ర్యాంతి తే పరమ్ ॥ 34

క్షేత్రమనఁగా—శరీరముగ పరిణమించిన ప్రకృతి;

క్షేత్రజ్ఞుఁడనఁగా—శరీరగతములైన విశేషములను కనుకొను జీవాత్మ,

జీవాత్మద్వారా పరమాత్మయు క్షేత్రజ్ఞుఁడనఁబడుగును.

ఇట్టి క్షేత్ర క్షేత్రజ్ఞుల అంతర (భేద)మును, ప్రాణులు ప్రకృతిబంధము నుండి విడిబడుటను జ్ఞానదృష్టితో గుర్తించువారు-అనఁగా-నేను దేహేంద్రియాదులు కాను, ప్రత్యగాత్మను-అని దృఢముగ భావించువారు-దేహేంద్రియాదులపై మమకారము లేనివారై తమ నంతర్యామిగ నుండు పరమేశ్వరుని దివ్యధామముఁ జెంది-శివానందము ననుభవించువారగుదురు.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మ
విద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,
క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః
ఇయ్యది

శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీమత్ భగవద్గీతా భాష్యమున
"మనోరంజనం" బను శాంకరీయ ఆంధ్రానువాదమున
పదమూడవ అధ్యాయము.



---

## ఆవేదన-నివేదన

ఒకానొక పుణ్యాత్ముడు-ఏతన్ముద్రణమునకు విశేష ఆర్థిక సహకారము నొనర్చి నన్ను ప్రోత్సహించినందున ఈ గీతాభాష్యము నాంధ్రీకరించి-వెనువెంటనే అచ్చునకు ఇచ్చి మిగత ఆర్థికసహకారమునకై శివకేశవులను ప్రార్థించుచు ఉదారులైన శైవమహాజనులు ఇందుకు తోడువడుదురని ఆశించి-గ్రంథమును త్వరలోనే ప్రకాశింపఁజేసితిని. ఐతే మాహేశ్వరులు మతాభిమానముతో నను కృతార్థుఁజేసినందుకు-అభ్యుదయము గలవారని భావించుచున్నాను.

నిర్మల శంకరశాస్త్రి

ఓమ్

శ్రీ మహా గణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శ్రీ భగవద్గీత

## చతుర్దశాధ్యాయము

"మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాద సహితము

శ్రీ భగవానువాచ-

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి-జ్ఞానానాం జ్ఞాన ముత్తమం।
యత్ జ్ఞాత్వా మునయః సర్వే-పరాం సిద్ధి మితో గతాః ॥ 1

కర్మకర్తృత్వ కర్మఫలభోక్తృత్వాదులఁజెందిన జ్ఞానములలో ఉత్తమంబు శ్రేష్ఠంబు నగు-మోక్షవిషయకమైన జ్ఞానమును-మరల వివరింతును. నే చెప్పఁబోవు జ్ఞానమును మననము నొనర్చిన మహానుభావులందరు- ఈ శరీరేంద్రియాది బంధమునుండి విడిబడి శివసాయుజ్యము నొందిరి.

వివరణ-పూర్వాధ్యాయమున-జన్మించు ప్రాణులందరు-క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగ స్వరూపులనియు, సృష్టికి ప్రకృతిపురుషసంయోగము కారణమైనను అద్ది పరమేశ్వరేచ్ఛచే సంభవించు ననియు, ప్రకృతిపురుషసంయోగమునకు సత్త్వరజస్తమోగుణసంబంధము సన్నిహిత హేతువనియు, సంగ్రహముగ చెప్పి గుణములు బంధహేతువులగుటను, గుణములనుండి విడిబడు మార్గము నీ పదునాలుగవ అధ్యాయమున విశదముగ భగవానుఁడు వక్కాణింపఁదలచి "పరం భూయః" ఇత్యాదిని ప్రారంభించెనని పరమార్థము.

శ్లో॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య-మమ సాధర్మ్య మాగతాః ।
సర్గేఽపి నోపజాయంతే-ప్రళయే న వ్యథంతి చ ॥ 2

ఈ చెప్పబోవు జ్ఞాన (ఉపాసన)ము నవలంబించినవారు_పరమేశ్వరునితో సమానత్వమును పొందినవారై - మహాసృష్టియందును జన్మింపక - మహాప్రళయమున బాధపడువారు కారు.

అనఁగా అట్టివారికి జన్మరాహిత్యము కలుగు నని భావము.

శ్లో॥ మమ యోని ర్మహ ద్బ్రహ్మ-తస్మిన్ గర్భం దధామ్యహం ।
సంభవః సర్వభూతానాం-తతో భవతి భారత ॥ 3

భారతా ! జగత్తునకు ఉత్పత్తిస్థానమగు మూలప్రకృతి యందు-పరమేశ్వరుఁడు "చేతనులను ప్రవేశింపఁజేయుట" అను గర్భమును కలిగించును. అట్టి చేతనాచేతనసంయోగము వలన ప్రాణులందరు_పుట్టుచుందురు.

వివరణ_ ఇఁట గల మహచ్ఛబ్దము_ మూలమై ప్రపంచముగ పరిణమించునది- అను నర్థముఁ జెప్పును. బ్రహ్మశబ్దము_ ప్రకృతిని బోధించును. పరమేశ్వరుని చేతనాచేతన సంయోగక్రియ అను గర్భాధానమునకు - పంచ మహాభూతాదులకు మూలమగు ప్రకృతి_యోని యగునది.

శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ-మూర్తయః సంభవంతి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోని-రహం బీజప్రదః పితా ॥ 4

కౌంతేయా ! దేవ గంధర్వ మానవ పశుపక్ష్యాది యోనులయందు సంభవించు మూర్తులన్నిటికిని ప్రకృతి - యోని కాగా - పరమేశ్వరుఁడు గర్భమును కలిగించు జనకుఁడగునని తెలియుము !

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి-గుణాః ప్రకృతిసంభవాః ।
నిబధ్నంతి మహాబాహో-దేహే దేహిన మవ్యయమ్ ॥ 5

మహాబాహో ! సత్త్వము, రజస్సు, తమస్సు, అనునవి _ ప్రకృతివలన జన్మించు గుణములై- శరీరమునందు అవ్యయుఁడైన ఆత్మను - సుఖదుఃఖమోహాదులతో బంధించును. అనఁగా - జీవాత్మ - సత్త్వరజస్తమో గుణసంబంధమున ప్రకృతి బద్ధుఁడగునని భావము.

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వాత్-ప్రకాశక మనామయం ।
సుఖసంగేన బధ్నాతి-జ్ఞానసంగేన చానఘ ॥ 6

ఆ మూటిలో సత్త్వగుణము- స్వచ్ఛమగుటచే- శరీరేంద్రియాది విశిష్టమగు ఆత్మను ప్రకాశింపఁజేయును మరియు బాధ లేనిదగుటచే - సుఖ సంబంధముతో జ్ఞానమునందు ఆసక్తిని కలిగించి- జీవాత్మను బంధించును.

వివరణ - నేను జ్ఞానిని సుఖపడువాడ నను భావమును కలిగించు సత్త్వగుణము - జ్ఞాన సుఖసాధనములగు సత్కర్మలయందు ఆత్మను ప్రవర్తింపఁ జేయును. అందువలన తత్ఫలము ననుభవింపఁదగు ఉత్తమజన్మలు సంభవించును గాన సత్త్వగుణము-సంసారసాఫల్య నిదాన మగునని భావము.

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి-తృష్ణాసంగసముద్భవం ।
తన్నిబధ్నాతి కౌంతేయ-కర్మసంగేన దేహినమ్ ॥ 7

ఆశ ఆసక్తి అనువానివలన జన్మించునది, కోరికల రూపమున నుండు నదియు రజోగుణంబని తెలియుము ! కౌంతేయా ! అట్టి రజోగుణము - ఆశను ఆసక్తిని ఫలింపఁజేయు కర్మలయందు జీవాత్మను ప్రవర్తింపఁజేయును.

వివరణ- పొందఁబడని వస్తువుపై కోరిక-తృష్ణ యనఁబడును.

పొందఁబడిన వస్తువునందు ప్రేమ-సంగ మనఁబడును.

ఇంద్రియ విషయములయందు అభిరుచి-రాగమనఁబడును.

కామ్యబుద్ధి- కర్మసంగ మనఁబడఁగును.

రజోగుణము గలవాడు — అర్థ కామ సముపార్జనమునందే ప్రవర్తించునని భావము.

శ్లో॥ తమ స్త్వజ్ఞానజం విద్ధి-మోహనం సర్వదేహినాం ।
ప్రమాదాలస్యనిద్రాభి- స్తన్నిబధ్నాతి భారత ॥ 8

భారతా ! తమోగుణము - అజ్ఞానమువలన పుట్టునదై ప్రాణులందరికి భ్రాంతిని కలుగఁజేయునట్టిదని గుర్తింపుము ! అట్టి తమోగుణము ప్రమాదము (పొఱపాటు) ఆలస్య (వంగలేనితన)ము, నిద్ర యనువానిని జీవాత్మకు నొనఁగూర్చును.

వివరణ- అజ్ఞానమనఁగా ? ప్రకృతియొక్క భాగమగు అవరణము (జీవాత్మను పరమాత్మవైపు పోనీయని ఒకానొక తెఱ) భ్రాంతియనఁగా ? ఒకదాని యందు మరియొకటి భాసించుటయగును.

శ్లో॥ సత్త్వం సుఖే సంజయతి-రజః కర్మణి భారత ।
జ్ఞాన మావృత్య తు తమః-ప్రమాదే సంజయత్యుత ॥ 9

అర్జునా ! సత్త్వగుణము - దుఃఖములను సఱకుసేయక – శరీరేంద్రియాది ప్రసన్నత నాపాదించు ఆత్మతృప్తిని (సుఖమును) కలిగించును. ఇఁక రజోగుణమైతేనో - సుఖపడు యోగమును తప్పించి పరిశ్రమపరు నొనర్చును. తమోగుణము—జీవాత్మకు గల తెలివిని తగ్గించి ప్రమాదముల (పొఱపాట్ల)ను అనఁగా- చెడుపనులను చేయించును.

శ్లో॥ రజ స్తమ శ్చాభిభూయ-సత్త్వం భవతి భారత ।
రజ స్సత్త్వం తమశ్చైవ-తమః సత్త్వం రజ స్తథా ॥ 10

అర్జునా ! సత్త్వగుణము స్థిరపడినచో రజోగుణమును తమోగుణమును పారదోలును. రజోగుణము పెంపొందినయెడల– సత్త్వతమోగుణములను దరికి రానీయదు. తమోగుణము పాదుకొనినచో– సత్త్వరజోగుణముల నణికట్టును.

అనఁగా – తొమ్మిదవ శ్లోకమున చెప్పఁబడినట్లు - సత్త్వరజస్తమోగుణములు - ప్రత్యేకముగ నొక్కొకటి నిండు నుండినదై తమ సుఖాది కార్యములను మానవులచే చేయించునని భావము.

శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్-ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా, తదా విద్యా-ద్వివృద్ధం సత్త్వ మిత్యుత ॥ 11

ఎప్పుఁడు ఈ శరీరమున నేత్రాది ఇంద్రియములలో రూపాదులగు విషయములను గుర్తించు వికాసము కలుగునో, అప్పుడు సత్త్వగుణము సమృద్ధము(నిండుకొనినది) ఐనదని గుర్తెరుగవలెను.

సత్త్వగుణము గలవారికి ఇంద్రియములన్నియు ప్రసన్నములుగ నుండునని భావము.

శ్లో॥ లోభః ప్రవృత్తి రారంభః-కర్మణా మశమః స్పృహా।
రజస్యేతాని జాయంతే-వివృద్ధే భరతర్షభ॥ 12

భరతర్షభా! రజోగుణము స్థిరపడినపుడు -లోభము (అత్యాశ) ప్రవృత్తి, (ఎల్లకాలము ప్రయత్నపరత్వము) కర్మణా మారంభః = కామ్యకర్మలను ప్రారంభించుట, తృప్తిలేకుండుట (అశమము) కోరిక (స్పృహ) ఇవి ఆవిర్భవించి-మానవునకు విశ్రాంతి లేకుండఁజేయును.

శ్లో॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ-ప్రమాదో మోహ ఏవ చ।
తమస్యేతాని జాయంతే- వివృద్ధే కురునందన॥ 13

కురునందనా! తమో గుణము- పాదుకొనినతఱి- అవివేకము, ప్రయత్నశూన్యత, పొరపాటు, విపరీతజ్ఞాన (మోహ)ము అనునవి - తారసిల్లుటచే మానవుఁడు- జీవితమును దుర్భర మొనర్చుకొనును.

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధే తు-ప్రళయం యాతి దేహభృత్।
తదోత్తమవిదాం లోకా-నమలాన్ ప్రతిపద్యతే॥ 14

సత్త్వగుణము నిండుకొనిన వేళ మరణించినవారు - పుణ్యాత్ముల యొక్క సుఖప్రదములైన లోకములను పొందుదురు

శ్లో॥ రజసి ప్రళయం గత్వా-కర్మసంగిషు జాయతే।
తథా ప్రలీనస్తమసి-మూఢయోనిషు జాయతే॥ 15

రజోగుణము ప్రబలిన తఱి మరణించువాడు - పుణ్యపాపమిశ్రములగు మానవలోకమున జన్మించును. మరియు తమోగుణమున తనువును త్యజించినవాడు- పశుపక్ష్యాది జన్మల నొందును.

శ్లో॥ కర్మణః సుకృతస్యాహుః-సాత్త్వికం నిర్మలం ఫలం।
రజసస్తు ఫలం దుఃఖ-మజ్ఞానం తమసః ఫలమ్॥ 16

సత్త్వగుణప్రధానమగు పుణ్యకర్మకు - నిర్మలమైన జ్ఞానము, విహితమైన సుఖంబు ఫలములని కపిలముని మొదలగువారు- చెప్పుదురు. రజోగుణకృతమగు కర్మకు- దుఃఖము ఫలమనియు; తమోగుణముచే చేయఁబడిన కర్మకు - అజ్ఞాన (అవివేక)ము ఫలమని అభిజ్ఞులు వక్కాణింతురు.

శ్లో॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం-రజసో లోభ ఏవచ।
ప్రమాదమోహౌ తమసో-భవతోఽజ్ఞాన మేవ చ॥ 17

సత్త్వగుణము నవలంబించుటచే వివేకము కలుగుటవలన శరీరేంద్రియాది ప్రసన్నతతో ఆత్మతృప్తి కలుగుచుండును. ఇంక రజోగుణము గలవారికి - ఇహ పరజన్మలయందును అత్యాశచే అసంతృప్తి - ఆవహించుచుండును తమోగుణమును పీడనివారు- పదే పదే పొరపడుచు- అవివేకముతో విశ్రాంతి లేనివారై కట కటపడుచుందురు.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా-మధ్యే తిష్ఠంతి రాజసాః।
జఘన్య గుణవృత్తిస్థా-అధో గచ్ఛంతి తామసాః॥ 18

సత్త్వగుణవృత్తి గలవారు. తమ సత్త్వగుణముఁదగు హెచ్చుతగ్గుల నను సరించి ఇంద్రాది లోకములలోని సుఖము ననుభవించువారగుదురు. రజోగుణ ప్రవర్తనఁ గలవారు భూలోకమున మరల మరల జన్మింతురు. తమోగుణశీలురు- నీచ ప్రవర్తనముఁ జేయుచు క్రింది జన్మలను అనఁగా పశుపక్ష్యాది జన్మలను - అథవా నరకములఁ బొందుదురు.

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం-యదా ద్రష్టాఽను పశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి-మద్భావం సోఽధిగచ్ఛతి॥ 19

వివేకము గలవాడు - బుద్ధిరూపమున పరిణమించు సత్త్వరజస్తమోగుణ ములకన్న నితరమైనది కర్త గాదనియు, పరమాత్మ - గుణములకు కట్టుబడి యుండువాడు కాదనియు గుర్తించిన యెడల- శివ సాయుజ్యము నొందును.

శ్లో॥ గుణా నేతా నతీత్య త్రీన్-దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై-ర్విముక్తోఽమృత మశ్నుతే॥ 20

శరీరమును పుట్టించు మూడు గుణముల నతిక్రమించినచో జన్మతో మరణముతో ముసలితనముతో దుఃఖముతోడను విడిబడి మోక్షమును పొందును.

అర్జున ఉవాచ -

శ్లో॥ కైర్లింగై స్త్రీన్ గుణా నేతా-నతీతో భవతి ప్రభో
కిమాచారః కథం చైతాం-స్త్రీన్ గుణా నతివర్తతే? 21

ప్రభో! మూడు గుణముల నతిక్రమించినవాడు - ఎట్టి లక్షణములతో గుర్తింపఁబడును? ఎట్టి ప్రవర్తన గలవాడగును? ఈ మూడు గుణముల నతిక్రమించుట-ఎట్లు సాధ్యమగును?

అని అర్జునుఁడు ప్రశ్నింపగా-భగవానుఁడు చెప్పఁదొడఁగెను.

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ-మోహ మేవ చ పాండవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని-న నివృత్తాని కాంక్షతి॥ 22

పాండుపుత్రా! గుణాతీతుఁడు- శరీరేంద్రియ సుఖవాంఛను, కామ్యకర్మ-ప్రవృత్తిని. అవివేకమును పొందఁజాలడు. ముందు వచ్చినవానిని ద్వేషింపక-ముందుకు రానివానిని కోరనివాడగును.

శ్లో॥ ఉదాసీనవదాసీనో - గుణై ర్యో న విచాల్యతే।
గుణా వర్తంత ఇత్యేవం-యోఽవతిష్ఠతి నేంగతే॥ 23

తటస్థుని వలె నున్నవాడై ఇంద్రియముల యొక్క తెలివి, విషయానందము మొదలగు తన గుణములకు లొంగనివాడై శరీరగత ప్రకృతిగుణములు తమ కార్యములయందు ప్రవర్తించుచున్నవని భావించుచు తాను కర్త కానని సాక్షిగ నుండువాడు ఇంద్రియములఁ జెందిన దుర్విషయములకు లోను గాకుండును.

శ్లో॥ సమదుఃఖసుఖః స్వస్థః - సమలోష్టాశ్మకాంచనః।
తుల్యప్రియాప్రియో ధీర - స్తుల్యానిందాత్మసంస్తుతిః॥ 24

మానావమానయో స్తుల్య - స్తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారంభపరిత్యాగీ - గుణాతీతః స ఉచ్యతే॥ 25

సుఖదుఃఖములను సమానముగ భావించుచు ఆత్మయందు నిలకడ గలవాడై మట్టిరాయి బంగారు ననువానిని సమముగ నెంచుచు ఇష్టమును, ఇష్టము కానిదానిని, తన నిందను పొగడ్త నొకేరీతిగ తలచుచు గౌరవము నగౌరవమును శత్రుమిత్రపక్షములను సమముగ చూచుచు ఐహిక ఆముష్మిక ఫలముల నొసఁగు కర్మల నన్నిటిని పరిత్యజించువాడు- గుణాతీతుఁడని చెప్పఁబడును.

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ - భక్తియోగేన సేవతే।
స గుణాన్ సమతీత్యైతాన్ - బ్రహ్మభూయాయ కల్పతే॥ 26

ఎవఁడు పరమేశ్వరుని- అనన్యభక్తితో సేవించునో అట్టి మహాపురుషుఁడు- ఈ సత్త్వాదిగుణముల నదుపులోనికి తెచ్చుకొని శివసాయుజ్యము నొందుటకు అర్హుఁడగును.

శ్లో॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ - మమృతస్యావ్యయస్య చ।
శాశ్వతస్య చ ధర్మస్య - సుఖస్యైకాంతికస్య చ॥ 27

ఎందుకనఁగా - సత్త్వాదిగుణములకు మూలమైన ప్రకృతికి- శాశ్వత మోక్షమునకు- నిత్యమైన ధర్మమునకు-సర్వాతీతమైన శివానందమునకును ఆధారము పరమేశ్వరుఁడేను;

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం, వైయాసిక్యాం, భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు, ఉపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే, గుణత్రయ విభాగయోగో నామ చతుర్దశాధ్యాయః.

ఇయ్యది- శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీమద్భగవద్గీతా భాష్యమున "మనోరంజన" మను శాంకరీయ ఆంధ్రానువాదమున పదునాలుగవ అధ్యాయము.



ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శ్రీ భగవద్గీత

## పంచదశాధ్యాయము

"మనోరంజన" మను శాంకరీయ ఆంధ్రానువాదసహితము.

శ్రీ భగవానువాచ-

శ్లో॥ ఊర్ధ్వమూల మధఃశాఖ - మశ్వత్థం ప్రాహు రవ్యయం ।
ఛందాంసి యస్య పర్ణాని - య స్తం వేద స వేదవిత్ ॥ 1

అవ్యయమైన సంసారవృక్షమునకు – మూలము – పరమేశ్వరుఁడనియు; బ్రహ్మాదులు కొమ్మలనియు; వేదములు ఆకులనియు గుర్తించువాడు – వేదవేత్త యని చెప్పఁబడును.

వివరణ- పదునాలుగవ అధ్యాయపు చివర- "మాం చ యోఽవ్యభిచారేణ- భక్తియోగేన సేవతే" అను శ్లోకమున భక్తియోగమే ముక్తిసాధన మని చెప్పఁబడినది. అట్టి అనన్యభక్తియోగము - సంసారమునందు విరక్తి కలుగనిది- సంభవించునది కాదు. సంసారబంధము- మోక్షమార్గమునకు ఆటంకమును కలిగించునదగుటఁజేసి సంసారమును వృక్షరూపమున నిరూపించి అద్దానిని ఛేదింపనిది-ముక్తిస్థానమునకు వెళ్ళరాదు. అందువలన సంసార బంధమును విడదీయుటకు సంసారస్వరూపము ఈ మొదటి శ్లోకమున ప్రదర్శింపఁబడినది.

"మాయాం తు ప్రకృతిం విద్యాత్-మాయినం తు మహేశ్వరం"

అను శ్రుతి ననుసరించి - సర్వాతీతుఁడైన పరమేశ్వరుఁడే - సంసార వృక్షమునకు మూలమగుననియు; క్రింది లోకములలోని బ్రహ్మాదులు- శాఖలు కాదగినవారనియు; రేపటివరకు గూడా నమ్మకములేని స్థితి గలదగుటచే సంసారము— అశ్వత్థ మనఁబఱఁగు ననియు; "ఊర్ధ్వమూలోఽర్వాక్ శాఖ ఏషోఽశ్వత్థః సనాతనః" ఇత్యాది శ్రుతులు — ఇందుకు ప్రోద్బలకములనియు; వేదములు- ధర్మము నధర్మమును ప్రతిపాదించుట ద్వారా నీడఁబోలిన కర్మఫలములతో జీవాత్మలందరికి ఆశ్రయములగుటచే- పర్ణము (ఆకు)లుగ నిరూపింపఁబడిన వనియు వివేకము.

శ్లో॥ అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా-గుణప్రవృద్ధా విషయప్రవాళాః।
అధశ్చ మూలా న్యనుసంతతాని-కర్మానుబంధీని మనుష్యలోకే॥ 2

సంసారవృక్షము యొక్క- శాఖలు- క్రిందిలోకముల యందు పైలోకముల యందును ప్రసరిం (వ్యాపిం)చినవై సత్త్వ రజస్తమోగుణములు అను జలధారలతో పెంపొందుచు ఇంద్రియ విషయములు ఇగురులుగ గలిగియుండును. వృక్షము యొక్క- ముఖ్యమైన మూలము పరమేశ్వరుఁడైనను ముఖ్యమూలము ఆధారముగా గల అనుమూలములు (ఉత్తమ మధ్యమ అధమ జన్మలకు కారణములగు ధర్మాధర్మరూపములగునవి) శుభాశుభ కర్మల నాచరించుటచే జన్మించునవై మానవ లోకమున- సుఖదుఃఖప్రదేశములయందు వ్యాపించియుండునవి.

వివరణ- సంసారవృక్షము - అనుమూలములచే మానవలోకము నావరించుటయే గాక శాఖోపశాఖలచే పదునాలుగు లోకములయందు నిండియున్నదనియు; భూలోకమున పుణ్యపాపముల నాచరించి కర్మఫలములను- సత్త్వరజస్తమోగుణములు ఇంద్రియార్థములును - సేకరించు ననియు; ముఖ్యముగా సంసారవృక్షము పెరుగుటకు మానవలోకమే ఆధార మనియు సారాంశము.

శ్లో॥ న రూప మస్యేహ తథోపలభ్యతే-నాంతో న చాది ర్నచ సంప్రతిష్ఠా।
అశ్వత్థమేనం సువిరూఢమూల-మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా॥ 3
తతః పదం తత్ పరిమార్గితవ్యం - యస్మిన్ గతా న
నివర్తంతి భూయః।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే-యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥

ఈ సంసారవృక్షము యొక్క రూపము ఈ భూలోకవాసులకు అవగతము కాదు. ఇద్దాని చివరగాని మొదలుగాని నిలుకడగాని ఎవరికిని గోచరములు కావు. గట్టిగా పాదుకొనిన వేరులు గల ఈ సంసారవృక్షమును భార్యాపుత్ర ధనాదులయందు విరక్తి అను దృఢమైన అసంగశస్త్రముతో ఛేదించి (నఱికి) అటు పిమ్మట వేదాంతప్రసిద్ధంబగు బ్రహ్మము (పరమేశ్వరు) నుపాసించి పొందవలెను. అట్టి శివలోకమునఁ బ్రవేశించినవారు మరల నీ సంసారవృక్షము నాశ్రయింపరు.

ఎవఁడు తననుండి శక్తిని విడదీసి జగద్రూపమున పరిణమింపఁజేయునో అట్టి ఆద్యపురుషుని శరణముగ ప్రార్థించువాడను.

వివరణ- "సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" అను శ్రుతివాక్యము— పరమ పురుషునే దొరికించుకొని ఉపాసింపవలెనని బోధించుచున్నయది- మరియు నేను ఆద్యపురుష నాశ్రయించుచున్నానని శ్రీకృష్ణభగవానుఁడు- ఇఁట కంఠరవేణ చెప్పుటచే- గీతలో ప్రయోగింపఁబడిన "అహం" పదమునకు అంతర్యామ్యర్థముఁ జెప్పుట- విహితమగును.

"ప్రపద్యే" అను ఆత్మనేపదమును "ప్రపద్యేత్" అని పరస్మైపదముగ మార్చుటయు, "ప్రపద్య ఇయతః" అను పదవిభాగంబును, స్వమత సిద్ధాంత దురభిమానమూలములై—దివ్యకన్య నవయవభంగముతో ఆకర్షించు అసురుల దుశ్చేష్టితములఁ బోలినవని—విబుధులు గ్రహింతురుగాక!

శ్లో॥ నిర్మానమోహా జితసంగదోషా-అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వంద్వై ర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై-ర్గచ్ఛంత్యమూఢాః పద
మవ్యయం తత్ ॥ 5

పరమేశ్వర (శివ) సాయుజ్యము నొందుటకు అర్హులగు వారి నీ శ్లోకమున చెప్పుచున్నవారు.

అహంకారము మరియు తెలివితక్కువ లేనివారు, కళత్రపుత్ర విత్తాది మమకారము అను దోషమును అదుపులో పెట్టినవారు, పరమేశ్వరునియందే సంపూర్ణ నిష్ఠ గలవారు, కోరికల నణచుకొనినవారు. సుఖదుఃఖములు మొదలగు జతలతో వెతలఁజెందనివారు నగు విజ్ఞానులు (శివోపాసకులు) శాశ్వతమైన పరమేశ్వరానంద స్వరూపము గలవారగుదురు.

వివరణ–ఇష్ట ప్రాణ భావ లింగోపాసనము–అహం మమకారముల పరిమితి గలవారికే సిద్ధించుననియు; ఇష్టప్రాణభావాత్మకుఁడగు పరమేశ్వరుఁడే ధ్యేయుఁడు ప్రాప్యుఁడు ననియు; హరిబ్రహ్మాదులు శివ విభూతిలో చేరినవారనియు; అవిహితములు అసాధ్యములు నగు కామ్యముల నపేక్షింపక సుఖమును దుఃఖమును తత్కారణముల నుపేక్షించుచు వివేక (బుద్ధిబలము) విజ్ఞానములు– (ఆజన్మాంతము ప్రతిదినము శివు నుపాసించుట) గలవారే శివసాయుజ్యమునకు అర్హులగుదురనుట– ఇందు పరమార్థము.

శ్లో॥ న తత్ భాసయతే సూర్యో-న శశాంకో న పావకః ।
యద్గత్వా న నివర్తంతే-తద్ధామ పరమం మమ ॥ 6

రవిచంద్రులు అగ్నియు పరమేశ్వరుని స్వరూపమును ప్రకాశింపఁ జేయఁ జాలరు. ముక్తపురుషులు ఎందు ప్రవేశించి మరలిరారో; అట్టి పరమపదము పరమేశ్వరునిదేను,

"న స పున రావర్తతే" ఇత్యాదిశ్రుతి– ఇందుకు తార్కాణము.

శ్లో॥ మమైవాంశో జీవలోకే - జీవభూతః సనాతనః ।
మనఃషష్ఠానీంద్రియాణి - ప్రకృతిస్థాని కర్షతి ॥ 7

తన నివాసమగు ప్రపంచమున – ప్రాణధారియై అనాదికాలము నుండి ప్రవర్తించు జీవుఁడు — పరమేశ్వరుని అంశమగువాడు– ఇట్టి జీవాత్మ– ప్రకృతి యొక్క పరిణామముఁదగు దేవ మానవాది శరీరములయందు నెలకొనినట్టి మనః షష్ఠములగు (మనస్సుతో ఆరగు) జ్ఞానేంద్రియములను— తన భోగమునకై ఆకర్షించుకొనును.

వివరణ– జీవాత్మ–సనాతనుఁడనియు, ఈశ్వరాంశమనియు ఇఁట పేర్కొనుటచే– జీవాత్మ అనిత్యుడు, మిథ్యకాదనియు తేటపడుచున్నది.

"నిత్యో నిత్యానాం, చేతన శ్చేతనానాం" ఇత్యాది శ్రుతివాక్యము– ఇందుకు ఆధారము అని గుర్తింపవలెను.

శ్లో॥ శరీరం యదవాప్నోతి - యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి - వాయు ర్గంధా నివాశయాత్ ॥ 8

ప్రాణమునకు ఇంద్రియములకును ప్రభువైన జీవాత్మ- ఎప్పుడెప్పుడు రెండవ శరీరమును పొందునో, ఎప్పుడెపుడు ప్రస్తుత శరీరమునుండి లేచునో, అప్పుడప్పుడు "వాయువు కుసుమాకరమునుండి పరిమళములను వలె" ఈ ఇంద్రియములను వెంటనిడుకొని పయనించును.

శ్లో॥ శ్రోత్రం చక్షుః స్పర్శనం చ - రసనం ఘ్రాణ మేవ చ ।
అధిష్ఠాయ మన శ్చాయం - విషయా నుపసేవతే ॥ 9

ఈ జీవాత్మ- చెవి, కన్ను, త్వక్కు, నాలుక ముక్కు అను బాహ్యేంద్రియములను, అంతరింద్రియమగు మనస్సు నధిష్ఠించి– ఇంద్రియ విషయములు (వినుట, చూచుట, తాకుట, రుచిఁజూచుట, వాసన) అనునవి- మనస్సుచే ప్రేరేపింపఁబడగా–జీవాత్మచే మనస్సు కదలికతో అనుభవింపఁబడుచుండును.

శ్లో॥ ఉత్క్రామంతం స్థితం వాఽపి - భుంజానం వా గుణాన్వితం ।
విమూఢా నానుపశ్యంతి - పశ్యంతి జ్ఞానచక్షుషః ॥ 10

రెండవ శరీరముఁ బ్రవేశింప నీ దేహమునుండి బయలుదేరువాడు, ప్రస్తుత శరీరమున నుండువాడు, శరీరస్థితుఁడై ఇంద్రియ విషయముల ననుభవించువాడు, సుఖదుఃఖాదులతో కూడియుండువాడు నగు జీవాత్మను– ఆత్మానాత్మవివేకము లేనివారు గుర్తింపరు– జ్ఞానదృష్టిగల బుద్ధిమంతులే కని పెట్టుదురు.

శ్లో॥ యతంతో యోగిన శ్చైనం- పశ్యంత్యాత్మ న్యవస్థితం ।
యతంతోఽ ప్యకృతాత్మానో - నైనం పశ్యంత్యచేతసః ॥ 11

ధ్యానము మొదలగు ప్రయత్నముఁజేయు యోగులు- సూక్ష్మశరీరమున గల ఈ జీవాత్మను చూడఁగలుఁగుదురు ప్రయత్నపరులైనను చిత్తశుద్ధిలేనివారగుచో మందబుద్ధి గలవారై ఈ ఆత్మను గుర్తింపఁజాలరు.

వివరణ- పూజా జప స్తోత్ర ధ్యానములచే చిత్తశుద్ధి గలవారై హృదయమందలి జీవాత్మను లోచూపుతో కనుగొని జీవాత్మలోని పరమాత్మను దర్శింపవలెనని సారాంశము.

శ్లో॥ యదాదిత్యగతం తేజో–జగద్భాసయతేఽఖిలం ।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ - తత్తేజో విద్ధి మామకమ్ ॥ 12

సూర్యునిలో చంద్రునియందు అగ్నినిఁ గల తేజస్సు - ప్రపంచమును ప్రకాశింపఁజేయును. అట్టి తేజస్సు (వెలుతురు) పరమేశ్వరునిదని గుర్తింపుము!

శ్లో॥ గా మావిశ్య చ భూతాని-ధారయామ్యహ మోజసా ।
పుష్ణామి చౌషధీః సర్వాః - సోమో భూత్వా రసాత్మకః ॥ 13

పరమేశ్వరుఁడు- భూమియందుండి-ఆత్మశక్తిచే ప్రాణులను పోషించు చున్నవాడు. మరియు అమృతపూర్ణుఁడైన చంద్రుఁడై ఓషధు (వ్రీహియవాదు) లనన్నిటిని పెంపొందించుచున్నవాడు.

ప్రాణుల జీవనము ఓషధుల అభివృద్ధియు ఈశ్వరాధీనములైనవని భావము.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా - ప్రాణినాం దేహ మాశ్రితః ।
ప్రాణాపాన సమాయుక్తః - పచామ్యన్నం చతుర్విధమ్ ॥ 14

పరమేశ్వరుఁడు- జఠరాగ్ని రూపమున ప్రాణుల శరీరమునఁబ్రవేశించి ఒడలునందుండు ప్రాణ అపానములను మేళవించియు నాలుగు తెఱఁగులగు ఆహారమును జీర్ణింపఁజేయును.

భక్ష్య భోజ్య లేహ్య చోష్యములు- ఆహారభేదములు.

భక్ష్యమనఁగా- దంతములతో కొఱికి తినునది; నాలుకచే లోనికి విడువఁబడునది- భోజ్యమనఁబడును. నాలుకపై ఉంచి రుచిగ్రహణముతో మ్రింగునది- లేహ్య (పాయసాదిక) మనఁబఱఁగును. దంతములచే నమిలి సారాంశము గ్రహింపఁబడునది- చోష్యముగ నుదహరింపఁబడునని వివేకము.

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో - మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనంచ ।
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో-వేదాంతకృ ద్వేదవిదేవ చాహమ్॥

పరమేశ్వరుఁడు - శరీరధారి ప్రాణులందరి హృదయమునఁ బ్రవేశించి యున్నవాడు. పూర్వము అనుభవింపఁబడిన ఇంద్రియార్థములను తలచుకొనుట,

(స్మృతి) ఇంద్రియములు విషయములతో నేకీభవించిన తెలివి, (జ్ఞానము) స్మృతి జ్ఞానములు లోపించుటయు పరమేశ్వరుని వలన- జీవాత్మకు సంభవించును. వేదాగమస్మృతి పురాణేతిహాసములన్నిటిచే తెలియఁదగినవాడు- పరమేశ్వరుఁడేను; వేదాంతము (ఉపనిషత్తు)లు పరమేశ్వరునుండి యావిర్భవించినవి. వేదార్థమును బాగుగా గుర్తించువాడు- శివుఁడేను;

శ్లో॥ ద్వా విమౌ పురుషౌ లోకే—క్షర శ్చాక్షర ఏవ చ ।
క్షరః సర్వాణి భూతాని – కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ 16

లోకమున- క్షరుఁడు అక్షరుఁడు నని పురుషులిద్దరు పేర్కొనఁబడుదురు. చేతనుల శరీరములన్నియు క్షరమనఁబడును. శరీరములు నశించినను శిలారాశి (రాళ్ళకుప్ప)వలె కదలకనుండువాడు- అక్షరుఁడని చెప్పఁబడును. శరీరము పురుషునకు ఆశ్రయమగుటచే ఇఁట పురుషశబ్దనిర్దిష్టమైనది.

"క్షరం ప్రధానం, అమృతాక్షరం హరః, క్షరాత్మానా వీశతే దేవఏకః"

"పంచభూతాది ప్రకృతి- ప్రకృతి పరిణామమగు శరీరము క్షరమనియు, శరీరము నశించినను మరణము లేని జీవాత్మ- అక్షరుఁడనియు, ప్రకృతి జీవులను శాసించువాడు పరమాత్మయనియు చెప్పఁబడును" అను శ్రుతి- ఇట గమనార్హము.

శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః-పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య-బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ 17

క్షరాక్షరశబ్దములచే చెప్పఁబడు పాశపశువులకన్న వేరైన పరమపురుషుఁడు- పరమాత్మయని కీర్తింపఁబడును. శాశ్వతుఁడైన పరమాత్మయగు ఈశ్వరుఁడు- ముల్లోకములను వ్యాపించి పోషించుచున్నవాడు.

వివరణ— జీవాత్మలందరిలో నివసించి యవ్వారిని నియమించువాడగుటచే ఈశ్వరుఁడు పరమాత్మ యనఁబడుననియు, ఈశ్వర శబ్దము- లోకమునందు వేదమునందును అనన్యవిషయముగ శివునకే చెల్లుననియు; "యః పృథివ్యాం తిష్ఠన్" ఇత్యాది శ్రుతులచే పరమేశ్వరుఁడు జగత్తునంతయు వ్యాపించువాడని తెలియుచున్నదనియు విదితమైనది.

శ్లో॥ యస్మాత్ క్షర మతీతోఽహ - మక్షరా దపి చోత్తమః।
అతోఽస్మి లోకే వేదే చ - ప్రథితః పురుషోత్తమః॥ 18

ఎందువలన పరమేశ్వరుఁడు - నశించు స్వభావము గల శరీర (పాశ) మును, అక్షరుఁడనఁబడు పరాధీనకర్తయగు జీవాత్మ (పశువు)ను మించిన వాఁడై నాఁడో, అందువలన లోకమునందు వేదమునందును పురుషోత్తముఁడని ప్రఖ్యాతిం గాంచెను.

పురుషాభ్యాం = శరీర జీవాత్మలకంటె, ఉత్తమః = ఉత్తముఁడు పురుషోత్తముఁడనఁబఱఁగునని వివేకము.

పురుషాత్ = విష్ణోః, ఉత్తమః = పురుషోత్తమః అని మరియొక నిర్వచనము.

శ్లో॥ యో మా మేవ మసంమూఢో - జానాతి పురుషోత్తమం।
స సర్వవి ద్భజతి మాం - సర్వభావేన భారత॥ 19

భారతా! ఎవఁడు పరమేశ్వరుని పశుపాశవిలక్షణుఁడైన పురుషోత్తమునిగ గుర్తించునో, వాడు సర్వజ్ఞుఁడై త్రికరణశుద్ధిగ పరమేశ్వరుని సేవింపఁగలుఁగును.

వివరణ- "ఏకవిజ్ఞానముతో సర్వవిజ్ఞానము కలుగు"నను భావనతో పరమేశ్వరునే భజించువాడు- సర్వజ్ఞుఁడగునని సారాంశము.

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర - మిద ముక్తం మయాఽనఘ!।
ఏతత్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ - కృతకృత్యశ్చ భారత!॥ 20

అనఘా! ఇట్లు అతిరహస్యమగు పరమేశ్వర తత్త్వజ్ఞానము గల ఈ శాస్త్రమును వక్కాణించితిని. భారతా! ఇద్దానిని గుర్తించి మనస్సునందిడుకొనినవాడు- జ్ఞానియై కృతార్థుఁడగును.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం, వైయాసిక్యాం, భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మ విద్యాయాం, యోగశాస్త్రే, శ్రీ కృష్ణార్జున సంవాదే,

పురుషోత్తమ ప్రాప్తియోగో నామ పంచదశాధ్యాయః
ఇయ్యేది

శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీమత్ భగవద్గీతా భాష్యముఁ
దగు "మనోరంజన" మను శాంకరీయ ఆంధ్రానువాదమున
పదునైదవ అధ్యాయము



---

## అభ్యర్థనము

ఈ నీలకంఠీయ భగవద్గీతాభాష్యాంధ్రానువాదమును ముద్రించుటకు. విరాళాలు ప్రకటించి- సకాలమున అందజేసినవారు ధన్యులై తమ పేరు ఆచంద్ర తారార్కము శాశ్వతముగ నొనర్చి యుపకరించినందుకు-అట్టి స్వధర్మపరాయణు లైన ఉదారులందరు- ప్రశంసింపఁదగినవారైనారు

భగవద్గీతలో-శివుఁడు-ఉపాస్యుఁడు; కృష్ణుఁడు-ఉపాసకుఁడు; శివోపాసన ఫలము మోక్షము నని "తమేవ చాద్యం పురుషం ప్రపద్యే" ఇత్యాది ముఖ్యశ్లోకముల ననుసరించి-శ్రుతిస్మృతి పురాణానుగుణముగా-శ్రీమదప్పయ దీక్షితేంద్రాది మహామహుల అడుగుజాడలలో - నిరూపింపఁ బడినది. విబుధులు యథార్థముఁ గ్రహించి- గీతాపరమార్థము శివారాధనమే నని అవధరింతురు గాక !

నిర్మల శంకరశాస్త్రి

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శ్రీ భగవద్గీత

## షోడశాధ్యాయము

### "మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాదసహితము

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధి-ర్జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ-స్వాధ్యాయ స్తప ఆర్జవమ్ ॥ 1
అహింసా సత్య మక్రోధ-స్త్యాగః శాంతి రపైశునం ।
దయా భూతేష్వలోలత్వం-మార్దవం హ్రీ రచాపలమ్ ॥ 2
తేజః క్షమా ధృతిః శౌచ-మద్రోహో నాతిమానితా ।
భవంతి సంపదం దైవీ-మభిజాతస్య భారత ॥ 3

భారతా! నిర్భయత్వము, చిత్తశుద్ధి, శివజ్ఞానసాధనమగు ధ్యానయోగమునందు నిష్ఠ, ఉదారత్వము, బహిరింద్రియనిగ్రహము, శివారాధనమనఁబడు యజ్ఞము, రుద్రాధ్యాయాదివేదపఠనము, సోమవారనక్తవ్రతాదితపస్సు, నిష్కపట స్వభావము, పరుల ననవసరముగ బాధింపకుండుట, (అహింస) యథార్థభాషణ (సత్య)ము, మనస్సులో వికారముఁ జెందకుండుట, (అక్రోధము) అత్యాశను పరిహరించుట, (త్యాగము) మనః సమాధానము (శాంతి) పరుల దోషములను బయటపెట్టకుండుట, (అపైశునము) దుఃఖపడువారిని కరుణించుట, (భూతదయ) చంచలస్వభావమును తగ్గించుట, (అలోలత్వము) క్రూరత్వము లేకుండుట, (మార్దవము) తప్పుడు పనులఁగురించి సిగ్గుపడుట (హ్రీః) వ్యర్థములైన పనులు

చేయకుండుట, (అచాపలము) గంభీరస్వభావము, (తేజస్సు) తన తిరస్కృతి సంభవించినను ఆవేశపడకుండుట (క్షమ) దుఃఖములు తారసిల్లినను స్థిరచిత్తుఁడగుట, (ధృతి) బాహ్యాభ్యంతరములలో పరిశుభ్రత, (శౌచము) ఇతరులను హింసించు-లేక-సంహరించు తలంపు లేకుండుట, (అద్రోహము) తాను అతి పూజ్యుఁడ నను గర్వము లేకుండుట, (నాతిమానిత) ఈ గుణములు-దైవీసంపత్తును (సత్త్వగుణశాంతప్రవృత్తిని) తారసిల్లఁజేసికొని జన్మించువానికి-పూర్వపుణ్య పరిపాకమున-ఏర్పడును.

శ్లో॥ దంభో దర్పోఽతిమానశ్చ-క్రోధః పారుష్య మేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య-పార్థ! సంపద మాసురీమ్ ॥ 4

ప్రఖ్యాతి కావలెనను కోరికతో ధర్మము నాచరించుట, (దంభము) నేను సర్వశ్రేష్ఠుఁడ నను భావ (దర్ప)ము, తన పెంపును తాను చెప్పుకొనుట, (అతిమానము) క్రోధము, కఠినస్వభావ(పారుష్య)ము, అవివేకము, (యుక్తాయుక్త పరిజ్ఞానశూన్యత) ఈ గుణములు-రాక్షస (ఆసురీ) సంపత్తును (రజోగుణ రాగద్వేషప్రవృత్తిని) ముఖ్యముగ నవలంబించి-జన్మించినవానికి-పూర్వజన్మసంస్కారమున-సంభవించును.

శ్లో॥ దైవీ సంప ద్విమోక్షాయ-నిబంధాయాసురీ మతా ।
మాశుచః సంపదం దైవీ-ముపజాతోఽసి పాండవ ॥ 5

పాండవా! అర్జునా! అభయము మొదలగు గుణములతో నుండు దైవీసంపత్తు-మోక్షమునకు కారణమగును. దుఃఖాది దుర్గుణములు గల ఆసురీసంపత్తు-నిరంతరము సంసారబంధమునందు చిక్కుపడఁజేయును. ఐతే నీవు దైవీసంపన్నుడవై జన్మించితివి గాన మోక్షార్హుఁడవగుదువు. చింతింపకుము!

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్-దైవ అసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్త-ఆసురం పార్థ! మే శ్రుణు! ॥ 6

పార్థా! ఈ మనుష్యలోకమున-దైవమనియు ఆసురమనియు రెండు విధములు గల మానవసముదాయములు ఉండును. వీనిలో దైవీసంపన్నుని లక్షణము విశదీకరింపఁబడినది. ఇఁక రాక్షసప్రవృత్తి గలవారి లక్షణమును చెప్పుచున్నాను. వినుము!

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ-జనా న విదు రాసురాః ।
న శౌచం నాపి చాచారో-న సత్యం తేషు విద్యతే ॥ 7

అసత్య మప్రతిష్ఠం తే-జగదాహు రనీశ్వరం ।
అపరస్పరసంభూతం-కిమన్యత్ కామహేతుకమ్ ॥ 8

ఏతాం దృష్టి మవష్టభ్య-నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవంత్యుగ్రకర్మాణః-క్షయాయ జగతోఽహితాః ॥ 9

కామ మాశ్రిత్య దుష్పూరం-దంభమానమదాన్వితాః ।
మోహా ద్గృహీత్వాఽసద్గ్రాహాన్-ప్రవర్తంతేఽశుచివ్రతాః ॥ 10

చింతా మపరిమేయాం చ-ప్రళయాంతా ముపాశ్రితాః ।
కామోపభోగపరమా-ఏతావదితి నిశ్చితాః ॥ 11

ఆశాపాశశతై ర్బద్ధాః-కామక్రోధపరాయణాః ।
ఈహంతే కామభోగార్థ-మన్యాయేనార్థసంచయాన్ ॥ 12

ఆసురీసంపత్తు గల జనులు-ధర్మమునందు ప్రవృత్తి (ఆసక్తి)ని అధర్మము నుండి నివృత్తిని (తొలగుటను) గుర్తింపరు. మరియు వారికి పరిశుభ్రత, సదాచారము, సత్యసంభాషణంబు నుండదు.

ఇంతియే గాక—అసురీసంపన్నులు—జగత్తు మిథ్యయనియు, ధర్మము అధర్మము అనువాని- నిబంధన లేనిదనియు, ఈశ్వరుఁడు కర్తగా లేనిదనియు, స్త్రీపురుషసంయోగమువలననే సంభవించునదగుటచే కామము కారణముగ గలదనియు, కామమునకంటె వేరైన ఈశ్వరుని సంబంధము లేనిదనియు, చెప్పుదురు.

'ఈశ్వరుఁడు జగత్కారణము కాదనువారు అనీశ్వరులనఁబఱఁగుచు-జగన్మిథ్యాత్వమును నిరూపించుచుందురు" అను నర్థము "అనీశ్వరాః" అను ప్రాచీనపాఠముఁబట్టి—విదితమగుచున్నది.

ఇట్టి నాస్తికమతము నవలంబించి-వివేకము లేనివారై-స్వల్పబుద్ధితో క్రూర (కఠిన) కార్యములఁజేయుచు జనసముదాయమును ద్వేషించుచు ఆత్మవినాశనము నకై ప్రవర్తించుచుందురు.

అవధి లేని కోరికఁ గలవారై ఆడంబరము అహంకారము గర్వము అను నవి ఉట్టిపడుచుండగా-అత్యాశతో దుష్టదానములఁ బరిగ్రహించుచు అపవిత్ర కార్యములఁ జేయుచుందురు.

మరణము అవధిగా గల దుర్భరమైన చింత గలవారై కామభోగమే పరమపురుషార్థమనియు, కామముదక్క ఇతరమైనవి లేదనియు నిశ్చయము గల వారై యుందురు.

ఆశలు అనెడు పాశశతములచే బంధింపఁబడినవారై కామభోగమునకై అన్యాయముగ అర్థరాశులను పొందవలెనని అపేక్షించుచుందురు. కామభోగమునకు ఆటంకము కలుగునెడ కోపపడుచుందురు.

శ్లో॥ ఇద మద్య మయా లబ్ధ-మిమం ప్రాప్స్యే మనోరథం।
ఇద మస్తీద మపి మే-భవిష్యతి పున ర్ధనమ్॥ 13
అసౌ మయా హతః శత్రు-ర్హనిష్యే చాపరా నపి।
ఈశ్వరోఽహ మహం భోగీ-సిద్ధోఽహం బలవాన్ సుఖీ॥ 14
ఆఢ్యోఽభిజనవా నస్మి-కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య-ఇత్యజ్ఞానవిమోహితాః। 15
అనేకచిత్త విభ్రాంతా- మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు-పతంతి నరకేఽశుచౌ॥ 16

ఇప్పుఁడు ఈ ధనమును సంపాదించితిని. ఇద్దాని యనంతరము నా మనస్సులో గల కోరికను ఫలింపఁజేసికొనగలను. ప్రస్తుతము ఇంత ధనము నావద్ద కలదు. మరికొంత ధనము లభించును. ఈ శత్రువును నేను చంపితిని. ఇంక నాకు విరుద్ధముగ నుండువారిని సంహరింపగలను నేను సమర్థుఁడను. సుఖము ననుభవించువాడను నేనే; శ్రీమంతుఁడను నేను; బలవంతుడను; సుఖము అనునది నాకే కలదు, గొప్పవాడను నేనే; మంచి వంశమునఁ బుట్టినవాడనగుటచే నాతో సమానుఁడెవఁడు కలడు? సోమయాగము నొనర్తును. యాచకులకు ధనము నొసఁగువాడను. సంతోషాతిశయము గలవాడను.

ఇవ్విధము అవివేకముతో మోహముఁజెంది-పలురకములైన సంకల్పము

లతో భ్రాంతి గలవారై మోహము అనెడు వలలో చిక్కుకొనినవారై కామభోగములయందు అత్యాసక్తి గలవారునై మరణానంతరము విణ్మూత్రాదుల నిండియుండు నరకములో పడుదురు.

శ్లో॥ ఆత్మ సంభావితాః స్తబ్ధా-ధనమానమదాన్వితాః ।
యజంతే నామయజ్ఞైస్తే-దంభేనావిధిపూర్వకమ్ ॥ 17

అహంకారం బలం దర్పం-కామం క్రోధం చ సంశ్రితాః ।
మా మాత్మపరదేహేషు-ప్రద్విషంతోఽభ్యసూయకాః ॥ 18

నేనే శ్రేష్ఠుఁడ నని తమను తాము గౌరవించుకొనువారు, వినయము లేని వారు, ధనము వలన కలుగు దురభిమానము పరనింద అనువానితో కూడినవారు, ప్రసిద్ధ కామనతో అవిధిపూర్వకముగ నామమాత్ర యజ్ఞములఁజేయువారు, గర్వమును ఆర్థికబలమును అవసరమైన పరతిరస్కారమును కామక్రోధముల నవలంబించి-తమ శరీరములయందు ఇతరుల దేహములలో నంతర్యామిగ నుండు పరమేశ్వరుని ద్వేషించువారునై పరుల మేలు నోర్వకుందురు.

శ్లో॥ తా నహం ద్విషతః క్రూరాన్-సంసారేషు నరాధమాన్ ।
క్షిపా మ్యజస్ర మశుభా-నాసురీష్వేవ యోనిషు ॥ 19

ఆసురీం యోని మాపన్నా-మూఢా జన్మని జన్మని ।
మా మప్రాప్యైవ కౌంతేయ-తతో యాంత్యధమాం గతిమ్॥ 20

దుర్మార్గులై పరమేశ్వరుని భావింపక తమ ఇష్టప్రకారము ప్రవర్తించు క్రూరు (కఠినచిత్తు)లై పాపాత్ములగు (ఆ)నరాధములను ఆసురీసంపత్తు గల వ్యాఘ్రాది జన్మలయందే చాలకాలము పరమేశ్వరుఁడు పడవేయును.

కౌంతేయా! ఇవ్విధము అసురీయోనిని పొందిన మూఢులు-ప్రతిజన్మయందును పరమేశ్వరుని సన్నిధిని పొందకయే-వ్యాఘ్రాదిజన్మలకంటె నీచములైన జన్మల నొందినవారై-అధమగతిని-అనఁగా-నరకయాతనల ననుభవింతురు.

శ్లో॥ త్రివిధం నరకస్యేదం-ద్వారం నాశన మాత్మనః ।
కామః క్రోధ స్తథా లోభ-స్తస్మా దేతత్త్రయం త్యజేత్ ॥ 21

కామము, క్రోధము, లోభము అనునవి-నరకముయొక్క-ముప్విధములగు ద్వారములై జీవాత్మయొక్క ఉత్తమలోకప్రాప్తికి ఆటంకములుగనుండును. అందు వలన వీనిని పరిమితముగ నుపయోగించుచు-కాలక్రమమున నిగ్రహశక్తితో పూర్తిగా విడువవలెను.

శ్లో॥ ఏతై ర్విముక్తః కౌంతేయ-తమోద్వారై స్త్రిభి ర్నరః।
ఆచరత్యాత్మనః శ్రేయ-స్తతో యాతి పరాం గతిమ్॥ 22

అర్జునా! నరకద్వారములగు కామ క్రోధ లోభములను విసర్జించి తనకు శ్రేయస్సు నిచ్చునట్టి ధ్యాన జప పూజాదికము నొనర్చునెడల-అట్టి సుకృతము వలన ముక్తిని పొందఁగలుఁగును.

శ్లో॥ యః శాస్త్రవిధి ముత్సృజ్య-వర్తతే కామకారతః।
న స సిద్ధి మవాప్నోతి-న సుఖం న పరాం గతిమ్॥ 23

పరమేశ్వరశాసనము వేదశాస్త్ర విహితంబు నగు ధర్మమును విడనాడి ఎవఁడు-స్వేచ్ఛాచారపరుఁడగునో, అట్టివాఁడు-శివానుగ్రహపాత్రుఁడు కాకుండు టయే గాక-ఇహలోకసుఖమును పొందఁజాలఁడు. మరియు మోక్షమునకు దూర మగును.

వివరణ-కామక్రోధములను ఆపుటకు లోభమును తగ్గించుటకును వేద స్మృతి పురాణాదిశాస్త్రము ఉపకరించును గాన యజ్ఞయాగాది సత్కర్మలను శాస్త్ర సమ్మతముగ నాచరించుచు అశ్రద్ధాది దుర్గుణములకు లోను గానివాఁడు- ఇహ పర సాధకుఁడగునని సారాంశము.

శ్లో॥ తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే-కార్యాకార్యవ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం-కర్మ కర్తు మిహార్హసి॥ 24

అందువలన-చేయఁదగినది, చేయఁదగనిది అనువానిని నిర్ణయించుట విషయమై (నీకు) మానవసమాజమునకు వేద శివాగమాది రూపమైన శాస్త్రము ప్రమాణమగును. శాస్త్రమునందు చెప్పఁబడిన విధిని గమనించి సుకృత (స్వధర్మ)ము నాచరింపుము!

వివరణ-శాస్త్రోక్త సుకృతముల నాచరించుచు నవ్వాని ఫలము ఈశ్వర ప్రీతియే యని దృఢముగ విశ్వసించువాడు-దైవీ సంపన్నుఁడగునని భావము.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మ
విద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,
దైవాసురసంపద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః

ఇయ్యది - శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీ మద్భగవద్గీతా
భాష్యమున "మనో రంజనం" బను శాంకరీయ ఆంధ్రానువాదమున
పదునారవ అధ్యాయము

---

## ప్రకటన

### విద్యాభ్యసనం వ్యసనం-అథవా శివపాదసేవనం-వ్యసనమ్.

ప్రస్థానత్రయములో ఉపనిషత్తులు మొదటివగుటచే ఆరాధ్యశైవులకు మరియు శివభక్తులందరికిని ఉపయోగించుటకై-సంస్కృత భాష్యములకు తెలుగు వ్రాయఁదలచి- ఈశ కేన కఠోపనిషత్తుల ననువదించి-ప్రశ్నాద్యుపనిషత్తుల సారాంశమును శివాద్వైతపరముగ వ్రాయుచున్నాను. ఉపనిషత్తులన్నియు శివునినే ప్రతిపాదించు తాత్పర్యము గలవని-శ్రీ నీలకంఠ భగవత్పాదులు, శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి వరేణ్యులు నిరూపించిరి. శ్రీవారి ననుకరించుటయే ఈ నా తెలుగుసేత యని మాహేశ్వరులు గుర్తింతురు గాక!

నిర్మల శంకరశాస్త్రి

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః.

# శ్రీ భగవద్గీత

## సప్తదశాధ్యాయము

"మనోరంజన" శాంకరీయ ఆంధ్రానువాద సహితము

అర్జున ఉవాచ-

శ్లో॥ యే శాస్త్రవిధి ముత్సృజ్య-యజంతే శ్రద్ధయాఽన్వితాః।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ!-సత్త్వ మాహో రజ స్తమః॥ 1

కృష్ణా! ఎవరైతే అలసత్వమువలన వృద్ధాచారమును పాటించుచు శ్రద్ధ (పట్టుదల) గలవారై పరమేశ్వరు నారాధింతురో, అవ్వారి నిష్ఠ-సాత్త్వికమగునా! లేక రాజస మగునా? తామస మగునా? విశదీకరింపుమని పార్థుఁడు ప్రశ్నింపగా-

శ్రీ భగవానువాచ-శ్రీకృష్ణభగవానుడు చెప్పఁదొడఁగెను.

శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా-దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ-తామసీ చేతి తాం శృణు॥ 2

మానవులకు పూర్వజన్మ సంస్కారమున సంభవించు శ్రద్ధ-త్రివిధ (మూడు తెఱఁగులు) మగునది. అయ్యది సాత్త్వికి, రాజసి, తామసి యనఁబడును. అట్టి శ్రద్ధను వివరించెదను. వినుము!

వివరణ-త్రివిధంబగు శ్రద్ధ- లోకాచారము ననుసరించి మెదలువానికి

మాత్ర ముండుననియు; శాస్త్రజ్ఞానమువలన ప్రవర్తించువాడు-పరమేశ్వరు నారాధించుటకు ఒకే విధమైన సాత్త్వికియగు శ్రద్ధ గలవాడగుననియు విదితమైనది. నిశ్చయాత్మకమైన బుద్ధి ఒకే విధముగ నుండునని భగవద్గీతలో ఈ వరకు చెప్పఁబడినది-ఇఁట గమనార్హము

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్వ-శ్రద్ధా భవతి భారత! ।
శ్రద్ధామయోఽయం పురుషో-యో యచ్ఛ్రద్ధః స ఏవ సః ॥ 3

అర్జునా! ప్రతివానికి-శ్రద్ధ- అంతఃకరణస్వభావము ననుసరించునదిగ నుండును. ఎవఁడు ఎట్టి శ్రద్ధ గలవాడో అట్టి శ్రద్ధతోనే ప్రవర్తించును గాన నీ పురుషుఁడు-శ్రద్ధామయుఁడని చెప్పఁబడును.

శ్లో॥ యజంతే సాత్త్వికా దేవాన్-యక్షరక్షాంసి రాజసాః ।
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే-యజంతే తామసా జనాః ॥ 4

సత్త్వగుణము గలవారు— సాత్త్వికులైన దేవతల నారాధింతురు.

రజోగుణవంతులు— రాజసులైన యక్షులను రక్కసుల నర్చింతురు.

తదితరులైన తామసులు— తమఃప్రకృతి గల ప్రేతలను భూతగణములను పూజింతురు.

శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం—తప్యంతే యే తపో జనాః ।
దంభాహంకారసంయుక్తాః—కామరాగబలాన్వితాః ॥ 5

కర్శయంతః శరీరస్థం-భూతగ్రామ మచేతసః ।
మాం చైవాంతఃశరీరస్థం-తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్ ॥ 6

డాబుసరి, అహంకారము గలవారై కోరిక, ఆసక్తి, మొండిపట్టుదల అనువానితో కూడి—శరీరమును నిర్మించు పృథివ్యాది పంచభూతములను శుష్కోపవాసాదులతో కృశింపఁజేయుచు—అంతర్యామిగ హృదయములో నుండు పరమేశ్వరునిఁగూడ బాధపెట్టువారునై-వేదమునందు శివాగమములు మొదలగు ధర్మశాస్త్రమునందును చెప్పఁబడనట్టి భయంకరంబు నగు తపస్సుఁ జేయుచుందురు.

ఇట్టి జనులు ఆసురీసంపత్తు గలవారనియు, రాజసులనియు, తామసులనియు పేర్కొనఁబడుదురు.

శ్లో॥ ఆహార స్త్వపి సర్వస్య-త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞ స్తప స్తథా దానం-తేషాం భేద మిమం శృణు ॥ 7

సాత్త్విక రాజస తామస భేదముతో ముప్విధంబగు జనమునకు - అన్నాది ఆహారము, మరియు యజ్ఞదాన తపస్సులును త్రివిధంబులుగ నుండునవి అవ్వాని భేదమును చెప్పుచున్నాను. వినుము !

శ్లో॥ ఆయుఃసత్త్వబలారోగ్య-సుఖప్రీతి వివర్ధనాః ।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా-ఆహారాః సాత్త్వికప్రియాః । 8

జీవిత స్వాస్థ్యమును ఉత్సాహమును శరీరబలమును ఆరోగ్యమును సుఖమును ప్రీతిని పెంపొందించునవి, రుచికరములు, ఘృతాది స్నేహము గలవి, రసరక్తాదిరూపమున దేహమున చాలకాల ముండునవి, ఇంపైనవియు నగు భక్ష్యభోజ్యాది ఆహారములు—సత్త్వగుణము గలవారికి- ప్రియములగును.

శ్లో॥ కట్వామ్లలవణాత్యుష్ణ-తీక్ష్ణరూక్ష విదాహినః ।
ఆహారా రాజసస్యేష్టా-దుఃఖశోకామయప్రదాః ॥ 9

చేదు లేక ఒగరు. ఉప్పు, వేడి, తీక్ష్ణత, రూక్షత-(జిగురు లేకుండుట) తపింపఁజేయుట యను గుణములు గల ఆహారములు- రాజసులకు ఇష్టములగును. అయ్యవి—మనోబాధను శరీరక్లేశమును వ్యాధిని కలుగఁజేయునవి

శ్లో॥ యాతయామం గతరసం-పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం-భోజనం తామసప్రియమ్ ॥ 10

ఒక జాము గడచినది, రసములేనిది, దుర్గంధము, నిన్నటిది. (పర్యుషితము) ఎంగిలిది, అపవిత్రంబు నగు భోజనము — తామసులకు ప్రియమగును.

శ్లో॥ అఫలాకాంక్షిభి ర్యజ్ఞో-విధిదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్య మేవేతి మనః-సమాధాయ స సాత్త్వికః ॥ 11

వేదవిధిని నిర్దేశింపఁబడినదనియు యజింపవలె ననియు మనస్సున నిశ్చయించి- ఫలము నభిలషింపక చేయఁబడు—యజ్ఞము సాత్త్వికమనఁబడును,

శ్లో॥ అభిసంధాయ తు ఫలం-దంభార్థ మపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ-తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ 12

భరతశ్రేష్ఠా! స్వర్గసుఖము నపేక్షించియైనను లోకమున "సోమయాజి" మొదలగు బిరుదములతో తమ గొప్పఁదనమును ప్రకటించుకొనుటకైనను గావింపఁబడు యజ్ఞము- రాజస మనఁబడుఁగును.

శ్లో॥ విధిహీన మసృష్టాన్నం-మంత్రహీన మదక్షిణం ।
శ్రద్ధావిరహితం యజ్ఞం-తామసం పరిచక్షతే ॥ 13

శాస్త్రవిధి లేనిదియు, అన్నదానశూన్యము, మంత్రోచ్చారణజ్ఞానహీనము, ఋత్విక్ దక్షిణల నొసఁగనిదియు, శ్రద్ధ లేనిదియు నగు యజ్ఞమును తామసముగ విబుధులు చెప్పుదురు.

శ్లో॥ దేవ ద్విజ గురు ప్రాజ్ఞ-పూజనం శౌచ మార్జవం ।
బ్రహ్మచర్య మహింసా చ-శారీరం తప ఉచ్యతే ॥ 14

పరమేశ్వరుని (ఇష్టలింగమును) మాహేశ్వరు (ఆరాధ్య బ్రాహ్మణు) లను శాంభవదీక్షా గురువును పండితులను పూజించుటయు; ఉదకము మొదలగు వానితో శరీరమును పరిశుభ్రపఱచుటయు, కపటము లేకుండుటయు; పరస్త్రీ సంబంధము లేకుండుటయు; ప్రాణులను హింసింపకుండుటయు; ఇది యంతయు శరీరముతో చేయఁబడు తపస్సగును.

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం-సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ-వాఙ్మయం తప ఉచ్యతే ॥ 15

మనస్సును పరితపింపఁజేయనిది, నిజము, వినుటకు ప్రియంబు, చివరన మేలు నొనర్చునదియు నగు వాక్యము నుచ్చరించుట (మాటలాడుట) ప్రణవ పంచాక్షరి, రుద్రాధ్యాయము మొదలగువాని నభ్యసించుటయు వాఙ్మయ తపస్సుగ చెప్పఁబడును.

శ్లో॥ మనఃప్రసాదః సౌమ్యత్వం-మౌన మాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధి రిత్యేత-త్తపో మానస ముచ్యతే ॥ 16

మనస్సున మలినము లేకుండుట; కఠిన స్వభావము లేకుండుటయు; ఈశ్వర విభూతిని చింతించుటయు; మనోబుద్ధ్యహంకార చిత్తముల నదుపులో పెట్టుటయు; పరమేశ్వరునికంటె వేరైనదాని నాలోచింపకుండుటయు (భావసంశుద్ధి) మానసిక తపస్సుగ పేర్కొనఁబడును.

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం-తపస్త త్త్రివిధం నరైః।
అఫలాకాంక్షిభి ర్యుక్తైః-సాత్త్వికం పరిచక్షతే ॥ 17

గొప్ప పట్టుదలతో మానవులు చేయు తపస్సు - మూడు విధములు గలది కాగా- ఫలము నపేక్షింపక - సిద్ధియందును అసిద్ధియందును సమానమైన భావన కలిగియుండెనేని- సాత్త్వికంబగునని విజ్ఞానులు నుడువుదురు.

శ్లో॥ సత్కారమానపూజార్థం-తపో దంభేన చైవ యత్ ।
క్రియతే తదిహ ప్రోక్తం-రాజసం చల మధ్రువమ్ ॥ 18

"ఈతడు సజ్జనుఁడు శివనిష్ఠగలవాడు" అని మూర్ఖులచే చేయఁబడు పొగడ్త-సత్కార మనఁబడును. ఎదురువెళ్ళుట మొదలగువానితో గౌరవించుట- మాన మనఁబడుఁగును. ధనప్రాప్తి మొదలగునది- పూజ యనఁజెల్లును. సత్కార మాన పూజలకై దాంబికముగ చేయఁబడు తపస్సు - రాజస మనఁబడును. అద్ది చంచలము అస్థిరంబు నగును.

శ్లో॥ మూఢగ్రాహేణాత్మనో యత్-పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా-తత్తామస ముదాహృతమ్ ॥ 19

వివేకము లేనివారై మొండితనముతో శరీరమును బాధపెట్టుచు గావింపఁబడు తపస్సు, మరియు ఇతరుని వినాశమునకై చేయఁబడునదియు తామసముగ నుదహరింపఁబడినది.

శ్లో॥ దాతవ్య మితి యద్దానం-దీయతేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ-తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ 20

శ్రీశైలాది పవిత్ర ప్రదేశమునందు, మహాశివరాత్ర్యాది పర్వకాలమున శివనిష్ఠ గల మాహేశ్వరునకు - ప్రత్యుపకారము నపేక్షింపక - శాస్త్రవిధి వశమున "ఈయవలె" నను దృఢ నిశ్చయముతో సమర్పింపఁబడు దానము - సాత్త్వికమని చెప్పఁబడును.

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం-ఫల ముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం-తద్రాజస ముదాహృతమ్ ॥ 21

మరల నుపకారమును చేయునని ఉద్దేశించియైనను ఫలమును కోరియైనను మనస్సులో బాధపడుచు చేయఁబడు దానము- రాజస మనఁబడుఁగును.

శ్లో॥ అదేశకాలే యద్దాన-మపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృత మవజ్ఞాతం-తత్తామస ముదాహృతమ్॥ 22

అపవిత్ర దేశమున మరియు పర్వకాలము లేకున్నను యోగ్యులు గానివారికి ఇవ్వఁబడునది, దేశకాలపాత్రలు మంచివైనను ఆదరింపక నవమానించుచు నొసఁగబడునదియు తామసదానమని మహర్షులు- వక్కాణించిరి.

శ్లో॥ ఓం తత్సదితి నిర్దేశో-బ్రహ్మణ స్త్రివిధః స్మృతః।
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ-యజ్ఞాశ్చ విహితాః పురా॥ 23

పరమేశ్వరుని అభిధాన (నిజనామధేయ)ము- "ఓం" "తత్" "సత్" అను ముప్పిధంబులు గలదని- వేదార్థజ్ఞులు నిరూపించిరి. అందువలన అట్టి పరమేశ్వరాభిధానముతో పూర్వకాలము బ్రహ్మదేవుఁడు- బ్రాహ్మణులను వేదములను యజ్ఞములను పుట్టించెను.

వివరణ- యజ్ఞాదులు తఱచుగా రాజసములు-లేక-తామసములు నగు గాన నవ్వాని నాచరించుటవలన ప్రయోజనము లేదని భగవానుఁడు శంకించుకొని- యజ్ఞాదులు సప్రయోజనములగుటకై పై శ్లోకమునుండి సమాధానము నొసఁగుచున్నవాడని విదితమైనది.

శ్లో॥ తస్మా దోమిత్యుదాహృత్య-యజ్ఞ దాన తపఃక్రియాః।
ప్రవర్తంతే విధానోక్తాః-సతతం బ్రహ్మవాదినామ్॥ 24

అందువలన వేదవిదులు- మొదట "ఓమ్" అని ఉచ్చరించి- విధివిహితములైన యజ్ఞ దాన తపస్సుల నెల్లకాలము- అనఁగా- జీవితాంతమువరకు ఆచరించుచుందురు. అయ్యవి శ్రేష్ఠములని చెప్పఁబడును.

శ్లో॥ తదిత్యనభిసంధాయ-ఫలం యజ్ఞతపః క్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః-క్రియంతే మోక్షకాంక్షిభిః ॥ 25

మోక్షమును మాత్రము అపేక్షించువారు "తత్" అని ఉచ్చరించి యజ్ఞ దాన తపస్సులు అను వివిధములైన పుణ్యకర్మలను ఫలము నపేక్షింపకయే చేయుదురు.

శ్లో॥ సద్భావే సాధుభావే చ-సదిత్యేతత్ ప్రయుజ్యతే ।
ప్రశస్తే కర్మణి తథా-సచ్ఛబ్దః పార్థ ! యుజ్యతే ॥ 26

"సత్" అనునది — ఉనికియందు శ్రేష్ఠత్వమునందు ఉచ్చరింపఁబడును పార్థా ! వివాహాది శుభకార్యములను సత్కార్యములుగ పరిగణింతురు.

శ్లో॥ యజ్ఞే తపసి దానే చ-స్థితిః సదితి చోచ్యతే ।
కర్మ చైవ తదర్థీయం-సదిత్యే వాభిధీయతే ॥ 27

యజ్ఞ తపో దానముల యందలి నిష్ఠ గూడా "సత్" అని నుడువఁబడును. శివ ప్రీత్యర్థము చేయఁబడు అన్నదానాది సుకృతంబు సత్తనియే చెప్పఁబడును. యజ్ఞ తపో దానములను ప్రోత్సహించుటయు సత్తగునని భావము

వివరణ- "ఓమ్ "తత్" "సత్" అనువానిలో నొక్కొకటియే ప్రశస్తమగుచుండగా- మూడిటి నుచ్చరించి చేయఁబడు పుణ్యకార్యములు- పరమేశ్వర ప్రీతి జనకములై మోక్షము నొదవఁజేయునని వేరు చెప్ప నవసరము లేదని-ఇఁట గమనింపవలెను.

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం-తప స్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ ! న చ తత్ప్రేత్య నో ఇహ ॥ 28

పార్థా ! శ్రద్ధ లేకుండ చేయఁబడు హవనము, దానము, తపస్సు, ఇతర పుణ్యమున్ను "అసత్" అని చెప్పఁబడును. శ్రద్ధలేనట్టి పుణ్యము- ఈ లోకమున అపకీర్తిని కలుగఁజేయుటేగాక- పరలోకమునందును సుఖప్రదము కాజాలదు.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం,
భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మ

విద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,
శ్రద్ధాత్రయవిభాగ యోగో నామ సప్తదశోఽధ్యాయః
ఇయ్యది

శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్య విరచితంబగు శ్రీమత్ భగవద్గీతా భాష్యమున
"మనోరంజనం" బను శాంకరీయ ఆంధ్రానువాదమున
పదునేడవ అధ్యాయము.



---

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శ్రీ భగవద్గీత

## అష్టాదశాధ్యాయము

"మనోరంజన" మను శాంకరీయ ఆంధ్రానువాదసహితము.

అర్జున ఉవాచ-

**శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో! - తత్త్వ మిచ్ఛామి వేదితుం।**
త్యాగస్య చ హృషీకేశ! - పృథక్కేశి నిషూదన!॥ 1

మహాబాహో! హృషీకేశా! కేశినిషూదనా! కృష్ణా! సన్న్యాసముయొక్క స్వరూపమును త్యాగముఁదగు లక్షణమును వేరు వేరు నీవలన తెలియఁగోరుచున్నాను. అని అర్జునుఁడు ప్రశ్నింపగా-భగవానుఁడు చెప్పఁదొడఁగెను.

ఈ గీతాశాస్త్రమునందు మొదటినుండి చెప్పిన అంశమునంతయు ఉపసంహరించుటకు ఈ అధ్యాయము ప్రారంభింపఁబడినది. ఐతే త్యాగము సన్న్యాసము వేరు వేరా? ఒకటేనా? అని అర్జునుఁడు ప్రశ్నింపవలసిన అవసరము-ఈ వరకు ఈ అంశము స్పష్టముగ ఇందు లేనందున- తటస్థించినదని తెలియవలెను.

శ్రీ భగవా నువాచ-

**శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం-సన్న్యాసం కవయో విదుః।**
సర్వకర్మఫలత్యాగం-ప్రాహు స్త్యాగం విచక్షణాః॥ 2

పుత్రకామేష్టి, స్వర్గకామయాగము మొదలగు కర్మలను విడనాడుట- సన్న్యాసమగునని కొందరు పండితులు గుర్తించుచున్నారు. ఇఁక నిత్యనైమిత్తికాది సర్వవిధ కర్మఫలమును విసర్జించుట- త్యాగమగునని మరికొందరు విద్వాంసులు నిరూపించుచున్నవారు.

వివరణ— అర్జున ప్రశ్నకు "న కర్మణా న ప్రజయా ధనేన, త్యాగేనైకేఽమృతత్వమానశుః" అను శ్రుతిని త్యాగశబ్దముండుటయు, "వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః- సన్న్యాసయోగా ద్యతయః శుద్ధసత్త్వాః" అనుచో గల సన్న్యాస శబ్దంబు బీజములైనవని సారాంశము.

వస్తుతః- సన్న్యాస త్యాగ శబ్దములు-ఒకటేయైనను-కామ్యకర్మన్యాసము- సన్న్యాసమనియు, సర్వకర్మఫలవిసర్జనము- త్యాగమనియు మతభేదము గలదని భగవానుఁడు సూచించి- ఇంక నొక మతభేదమును దిగువ శ్లోకమున ప్రదర్శించుచున్నవాడు.

శ్లో॥ త్యాజ్యం దోషవదిత్యేకే - కర్మ ప్రాహు ర్మనీషిణః ।
యజ్ఞ దాన తపః కర్మ - న త్యాజ్యమితి చాపరే ॥ 3

కొందరు విద్వాంసులు (సాంఖ్యులు) హింసాదిదోషములు గలదగుటచే సంసారబంధమునకు కారణ మగుటచేతను వేదోక్తమైన జ్యోతిష్టోమాది యాగ రూపమగు కర్మ-విడువఁదగినదని చెప్పుదురు. మరికొందరు వైదికులు (మీమాంసకులు) యజ్ఞదానతపోరూపమైన కర్మ- ఆచరింపఁదగినదే నని నిరూపించుచున్నవారు.

శ్లో॥ నిశ్చయం శ్రుణు మే తత్ర - త్యాగే భరతసత్తమ !
త్యాగో హి పురుషవ్యాఘ్ర - త్రివిధః సంప్రకీర్తితః ॥ 4

పార్థా! భరతసత్తమా! అట్టి త్యాగము విషయమై నా నిశ్చయమును వినుము! పురుషవ్యాఘ్రా! త్యాగము - ముత్త్రెఫఁబని బాగుగా కీర్తింపఁబడినది.

వివరణ - సన్న్యాసము త్యాగము అనువాని స్వరూపమును తెలియఁ గోరుదునని అర్జునుఁడు ప్రశ్నించినందున - కామ్యకర్మత్యాగము సన్న్యాసమనియు, సర్వకర్మఫలము నపేక్షింపకుండుట - త్యాగమనియు శ్రీకృష్ణుఁడు

ప్రవచించినందునను సన్న్యాసము వేరు, త్యాగము వేరునని ఆపాతతః స్ఫురించు చున్నను - "నిశ్చయం శ్రుణు మే పార్థ - త్యాగే భరతసత్తమ" అనుచో భగవానుఁడు త్యాగ శబ్దమును సన్న్యాసత్యాగశబ్ద ఏకార్థకముగ వ్యవహరించుటఁ జేసి - నియతమైన కర్మను మోహవశమున త్యజించుట. తామసంబగు - ననుచో సన్న్యాస త్యాగ శబ్దములను పర్యాయపదములుగ నుదహరించుటవలనను సన్న్యాసత్యాగశబ్దములు - ఒకే అర్థము గలవని బోధపడుచున్నయది. త్యాగము త్రివిధంబని చెప్పుటచే సన్న్యాసము గూడ త్రివిధంబని - అర్థాత్ ఏర్పడుచున్నది. అందువలననే - సన్న్యాసమును త్యాగభిన్నముగ గ్రహించి - వేరర్థమును చెప్ప లేదు. గాన రెండు నేకార్థకములని విశదమైనది

శ్లో॥ యజ్ఞ దాన తపః కర్మ-న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ-పావనాని మనీషిణామ్ ॥ 5

యజ్ఞ దాన తపోరూపమైన పుణ్యమును విడువక - నవశ్య మాచరింప వలెను. యజ్ఞదానతపస్సులు - ముముక్షువులకు శివోపాసనయందు తారసిల్లు విఘ్నములను పాఱఁదోలునట్టివి

వివరణ - శివోపాసనమువలననే మోక్షము చేకూరినను ఉపాసనకాలమున కలుగు అనారోగ్యాదులను - మృత్యుంజయమంత్రజపాది రూపమగు తపస్సు, అతిథి అభ్యాగత భోజన పానీయ సమర్పణాది రూపమైన దానము; సంధ్యా వందన బ్రహ్మయజ్ఞ దేవర్షి పితృతర్పణాది రూపమైన యజ్ఞంబు - నివారింపఁ జేయునని సారాంశము.

శ్లో॥ ఏతాన్యపి తు కర్మాణి- సంగం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యానీతి మే పార్థ - నిశ్చితం మత ముత్తమమ్ ॥ 6

"నేను చేస్తున్నాను" అను అభిమానమును ఫలములను విసర్జించి "పరమేశ్వరారాధన బుద్ధిని కర్తవ్యములు" అను భావనతో నీ యజ్ఞ దాన తపస్సులు చేయఁదగినవే నని నిశ్చితమైన నా యభిప్రాయము.

శ్లో॥ నియతస్య తు సన్న్యాసః-కర్మణో నోపపద్యతే ।
మోహా త్తస్య పరిత్యాగ-స్తామసః పరికీర్తితః ॥ 7

నిత్యమైన సంధ్యావందనాది కర్మను త్యజించుట-యోగ్యము కాదు. అవివేకమువలన నిత్యకర్మ నాచరింపకుండుట-తామస త్యాగమనఁబడును.

శ్లో॥ దుఃఖ మిత్యేవ యత్కర్మ-కాయక్లేశభయా త్త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం-నైవ త్యాగఫలం లభేత్ ॥ 8

దుఃఖమును కలుగఁజేయునని ఉద్దేశించి-శరీరాయాసమగు నను భయముతో నిత్యకర్మను విడచునెడల-అట్టి త్యాగము రాజస మనఁబడుఁగును. అద్దానితో త్యాగముఁదగు ఫలము (ఈశ్వరప్రీతి) లభింపదు.

శ్లో॥ కార్య మిత్యేవ యత్కర్మ - నియతం క్రియతేఽర్జున!
సంగం త్యక్త్వా ఫలంచైవ-స త్యాగః సాత్త్వికో మతః ॥ 9

అర్జునా! చేయదగినదే నను నిశ్చయముతో కర్తృత్వాభిమానమును ఫలాభిసంధిని తొలగించుకొని నిత్యకర్మఁజేయవలెను. అట్టి అభిమాన ఫల త్యాగము-సాత్త్విక మగునట్టిది.

శ్లో॥ న ద్వేష్ట్యకుశలం కర్మ-కుశలే నానుషజ్జతే ।
త్యాగీ సత్త్వసమావిష్టో - మేధావీ ఛిన్నసంశయః ॥ 10

సత్త్వగుణము, పశుపాశపతులను గుర్తించు మేధస్సు గలిగి-సంశయము లేనివాడు-క్లేశకరమైన ప్రాతఃస్నానాదికర్మ సేవగించుకొననివాడై-సుఖకరమగు మాధ్యాహ్నిక స్నానాది కర్మయందే ఆసక్తి గలిగి యుండఁజాలడు.

శ్లో॥ న హి దేహభృతా శక్యం - త్యక్తుం కర్మాణ్యశేషతః ।
య స్తు కర్మఫలత్యాగీ - స త్యాగీ త్యభిధీయతే ॥ 11

శరీరధారియగు మానవుఁడు కర్మల నన్నిటిని పరిత్యజింపఁజాలడు. సంధ్యావందన జప శివపూజనాదుల ఫలమును విసర్జించువాడే - త్యాగి యనఁబడును.

వివరణ - కర్మలఁజేయుచు నవ్వాని ఫలమును విడనాడుటకన్న-కర్మలఁజేయకుండుటయే శ్రేష్ఠము కాదా? అను ప్రశ్నకు-సమాధానము పై శ్లోకమగును. సర్వకర్మత్యాగము సాధ్యము కాదనుటలో- శరీరమును పోషించుటకు కావలసిన

ఆహారపానీయాదులను సంపాదించుటకై పరిశ్రమను విడనాడుట పొసఁగదను అర్థము ఇమిడియున్నది.

శ్లో॥ అనిష్ట మిష్టం మిశ్రంచ-త్రివిధం కర్మణః ఫలం।
భవత్యత్యాగినాం ప్రేత్య - న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ 12

కర్మఫలము నపేక్షించువారికి- నరకదుఃఖము అను విరుద్ధఫలము. స్వర్గ సుఖము అను అనుకూలఫలము, మానవలోకమున సుఖదుఃఖ మిశ్రఫలంబు- మరణానంతరము చేకూరును.

కర్మలఁజేయుచు అవ్వాని ఫలము నీశ్వరార్పణముఁజేయువారు- పూర్వోక్త సుఖదుఃఖముల ననుభవింపక-నిర్లిప్తులుగ నుందురు.

ఇఁటగూడ (త్రివిధమైన కర్మఫలమును త్యజించువారి సంచితమంతయు నశించునని సూచించుచు) సన్న్యాసిపదముతో త్యాగి నిర్వచింపఁబడుటచే సన్న్యాస త్యాగ పదములు-భిన్నార్థకములు కావని తేటపడినది.

శ్లో॥ పంచైతాని మహాబాహో!-కారణాని నిబోధ మే।
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని - సిద్ధయే సర్వకర్మణామ్ ॥ 13

మహాబాహో! అర్జునా! కర్మలన్నియు సిద్ధించుటకై- ఐదు కారణములు- కపిలతంత్రమునందు చెప్పఁబడినవి. అవ్వానిని చెప్పెదను. నావలన తెలిసికొనుము!

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా - కరణం చ పృథక్విధం।
వివిధా చ పృథక్ చేష్టా-దైవం చైవాత్ర పంచమమ్ ॥ 14

శరీరము (అధిష్ఠానము) జీవాత్మ (కర్త) నేత్రములు మున్నగు అనేక విధములగు ఇంద్రియములు (పృథక్విధం కరణం) ప్రాణ అపానాదులయొక్క పలుతెఱఁగులగు ప్రవర్తనములు (పృథక్చేష్టాః వివిధాః) ఈ నాలుగే గాక ఐదవదగు కారణము దైవంబు నని తెలియపలెను.

వివరణ- ఇఁట దైవమనఁగా - పరమేశ్వరుఁడేనని "ఈశ్వరః సర్వ

భూతానాం- హృద్దేశేఽర్జున తిష్ఠతి" ఇదే అధ్యాయమున నిర్ణయింపఁబడుట- గమనింపఁదగినది.

శ్లో॥ శరీరవాఙ్మనోభి ర్యత్-కర్మ ప్రారభతే నరః।
న్యాయ్యం వా విపరీతం వా-పంచైతే తస్య హేతవః॥ 15

శరీరముతో వాక్కుతో మనస్సుతోడను మానవుఁడు ప్రారంభించు కర్మ- పుణ్యమైనను పాపమైనను అట్టి కర్మకు ఈ వరకు చెప్పఁబడిన శరీరాదులగు కారణములు ఐదుండును.

వివరణ— పదునాలుగవ శ్లోకమున మొదటి కారణము శరీర మనుటలో- శరీరవాక్మనస్సులు కలవని తెలియవలెను.

శ్లో॥ తత్రైవం సతి కర్తార - మాత్మానం కేవలం తు యః।
పశ్యత్యకృతబుద్ధిత్వా - న్న స పశ్యతి దుర్మతిః॥ 16

కర్తృత్వ విషయమై ఐదు కారములుండగా తానే కర్తనని భావించువాడు- శాస్త్ర ఆచార్యోపదేశము లేనివాడై వివేకమును గోలుపోయినందున విజ్ఞానశూన్యుఁడగును.

శ్లో॥ యస్య నాహంకృతో భావో - బుద్ధి ర్యస్య న లిప్యతే।
హత్వాఽపి స ఇమాం+ల్లోకా—న్న హంతి న నిబధ్యతే॥ 17

నేనే కర్త నను భావము ఎవనికి నుండదో, ఎవని బుద్ధి- కర్మఫలమును తగులుకొనదో, అట్టివాడు ప్రాణులందరిని చంపినను హంతకుఁడు కాజాలడు. మరియు హింసాదోషము వానికి ఘటింపదు.

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా-త్రివిధా కర్మచోదనా।
కరణం కర్మ కర్తేతి—త్రివిధః కర్మసంగ్రహః॥ 18

జ్ఞానము (చేయఁదగిన కర్మవిషయమై జాగృతి) జ్ఞేయం (చేయఁదగిన కర్మ) పరిజ్ఞాత (కర్మఁజేయువాడు) అను ముప్విధములు గలది—కర్మవిధి యనఁబడును. ఈ మూడిటి చేరికయే—విడచుట తీసికొనుట మొదలగు పనులను ప్రారంభింపఁజేయునట్టిది. మరియు కరణము (సాధించు ఇంద్రియము) కర్మ

(కర్తకు ఇష్టమైన క్రియ) కర్త (క్రియను నెరవేర్చువాడు) ఈ మూడు కర్మకు ఆశ్రయములగునట్టివి.

వివరణ-సాత్త్వికమైన కర్మయే ఫలాపేక్షలేనిదగుటచే అట్టికర్మను విశదీకరింపఁదలచి-కర్మవిధి కర్మాశ్రయంబు మూడు తెఱఁగులు గలదని పై శ్లోకమున నిరూపింపఁబడినది.

శ్లో॥ జ్ఞానం కర్మ చ కర్తా చ-త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసంఖ్యానే-యథావచ్ఛృణు తాన్యపి ॥ 19

సత్త్వరజస్తమో గుణములను బాగుగా ప్రతిపాదించునది సాంఖ్యశాస్త్రమగును. జ్ఞానము, కర్మ, కర్త యనునవి_గుణభేదము ననుసరించి మూడు విధములు గలిగియుండునని సాంఖ్యశాస్త్రమునందు చెప్పఁబడినది. అవ్వానిని శాస్త్రరీతిని వినుము!

వివరణ_జ్ఞానము జ్ఞేయము పరిజ్ఞాత, అను త్రివర్గము; కరణము కర్మ కర్త అను త్రివర్గంబు-సత్త్వరజస్తమోగుణముల సంబంధముచే త్రివిధంబులగునని పై శ్లోకమున సూచింపఁబడినది.

శ్లో॥ సర్వభూతేషు యేనైకం-భావ మవ్యయ మీక్షతే ।
అవిభక్తం విభక్తేషు-తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ 20

ఏ జ్ఞానము (తెలివి)తో విడివిడిగ నున్నట్టి ప్రాణులందరిలో శాశ్వతమైన ఒకే పరమాత్మచైతన్యము కలదని గుర్తించునో, అట్టి జ్ఞానము సాత్త్వికమని తెలియుము!

శ్లో॥ పృథక్త్వేన తు యద్జ్ఞానం-నానాభావాన్ పృథక్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు-తద్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥ 21

ఏ జ్ఞానము_వేరు వేరుగ నున్నట్టి ప్రాణులందరిలో భిన్నభిన్నభావములను విడివిడిగ గుర్తించునో_అట్టిది-రాజసజ్ఞానమని గ్రహింపుము!

శ్లో॥ యత్తు కృత్స్నవ దేకస్మిన్-కార్యే సక్త మహైతుకం ।
అతత్త్వార్థవదల్పం చ-తత్తామస ముదాహృతమ్ ॥ 22

పరిపూర్ణుఁడైన పరమేశ్వరుఁడు ప్రతిమ మొదలగు ఒకే చిన్న వస్తువునందు ఉండుననను భావము గలదియు; తగు సమర్థనము లేనిదియు; యథార్థము కానిదియు; స్వల్పంబు నగు జ్ఞానము తామసమని చెప్పఁబడును.

వివరణ-తనకు మాత్రము ఇష్టమైనదే దైవమనియు, వేరైనదంతయు ఎన్నదగినది కాదనియు మొండితనముతో చలకనయగు జ్ఞానము-తమోగుణము గలవారికి నెలకొనియుండుననియు, శాస్త్రము అభిజ్ఞులు ప్రబోధించు విషయమును పెడచెవిఁబెట్టుదురనియు సారాంశము.

శ్లో॥ నియతం సంగరహిత-మరాగద్వేషతః కృతం ।
అఫలప్రేప్సునా కర్మ-యత్త త్సాత్త్విక ముచ్యతే ॥ 23

నిత్యము, ఫలాసక్తి లేనిదియు, రాగద్వేషములు లేనిదియు, కర్తను నేనను అభిమానము లేనిదియు నగు కర్మ-సాత్త్వికమని నుడువఁబడినది.

శ్లో॥ యత్తు కామేప్సునా కర్మ-సాహంకారేణ వా పునః ।
క్రియతే బహుళాయాసం-తద్రాజస ముదాహృతమ్ ॥ 24

ఫలాపేక్షతో గర్వముతోడను మిగుల శ్రమతోడను చేయఁబడు కర్మ-రాజసముగ నుదాహరింపఁబడును.

శ్లో॥ అనుబంధం క్షయం హింసా-మనపేక్ష్య చ పౌరుషం ।
మోహా దారభ్యతే కర్మ-యత్తత్తామస ముచ్యతే ॥ 25

శుభము అశుభంబు నగు ఫలమును, ధనవ్యయమును, పరపీడనమును, తన సామర్థ్యమును విచారించుకొనకయే అవివేకముతో చేయఁబడు కర్మ-తామసమనఁబడును.

శ్లో॥ ముక్తసంగోఽనహంవాదీ-ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః-కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26

ఫలము నపేక్షింపక, "నేను కర్త" నని విఱ్ఱవీగనివాడు, ధైర్యముతో ప్రయత్నించువాడు, సిద్ధించినను సిద్ధింపకున్నను సంతోషమును గాని దుఃఖమును గాని పొందనివాడు నగు కర్త-సాత్త్వికుఁడనఁబడును.

శ్లో॥ రాగీ కర్మఫలప్రేప్సు-ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
హర్షశోకాన్వితః కర్తా-రాజసః పరికీర్తితః ॥ 27

కీర్తిని కర్మఫలము నపేక్షించువాడు, అవసరమైన వ్యయమును సహింపనివాడు, పరులను బాధించువాడు, శాస్త్రోక్తమైన పరిశుభ్రత లేనివాడు, లాభమైతే సంతోషించువాడు, నష్టమైతే వగచువాడు నగు కర్త-రాజసుఁడగును.

శ్లో॥ అయుక్తః ప్రాకృత స్స్తబ్ధః-శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ-కర్తా తామస ఉచ్యతే ॥ 28

స్థిరచిత్తము వివేకము లేనివాడు, పెద్దలకు లొంగనివాడు ఇతరులను మోసగించువాడు, పరులను తిరస్కరించువాడు, వంగలేక ప్రయత్నింపనివాడు, కటకటపడువాడు, అనర్థము నాలోచించువాడు నగు కర్త తామసుఁడనఁబఁడుఁగును.

శ్లో॥ బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ-గుణత స్త్రివిధం శృణు ।
ప్రోచ్యమాన మశేషేణ-పృథక్త్వేన ధనంజయ ॥ 29

ధనంజయా! బుద్ధి, ధైర్యము అనునవి-గుణములతో మూడు విధములుగ నుండును. అవ్వాని నన్నిటిని వేరువేరుగ చెప్పుచున్నాను. వినుము!

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ-కార్యాకార్యే భయాభయే ।
బంధం మోక్షం చ యా వేత్తి-బుద్ధిః సా పార్థ సాత్త్వికీ ॥ 30

పార్థా! ధర్మప్రవర్తనమును అధర్మనివర్తనమును దేశకాలముల ననుసరించి చేయఁదగుటను చేయరానిదనుటను అర్థమును అనర్థమును పాశస్వరూపమును మోక్షమార్గమును పాటించు బుద్ధి-సాత్త్వికమనఁబడును.

శ్లో॥ యయా ధర్మ మధర్మం చ-కార్యం చాకార్య మేవ చ ।
అయథావత్ ప్రజానాతి-బుద్ధిః సా పార్థ! రాజసీ ॥ 31

ధర్మశాస్త్రముచే విధింపఁబడిన ధర్మమును, నిషేధింపఁబడిన అధర్మమును కర్తవ్యమును అకర్తవ్యమును ఉన్నది ఉన్నట్లు గుర్తింపనట్టి బుద్ధి-రాజసమని చెప్పఁబడును.

శ్లో॥ అధర్మం ధర్మమితి యా-మన్యతే తమసాఽఽవృతా ।
సర్వార్థాన్ విపరీతాం శ్చ-బుద్ధి స్సా పార్థ! తామసీ ॥ 32

పార్థా! అధర్మమును ధర్మముగా భావించుచు సమస్త సమీచీన విషయములను విపరీతములుగ తలచుచుండు బుద్ధి-తమోగుణము నిండియుండుటచే తామసి యనఁబడును.

ఇఁక ధైర్యముఁ గూర్చి దిగువవిధము భగవానుడు నిర్వచించెను.

శ్లో॥ ధృత్యా యయా ధారయతే-మనః ప్రాణేంద్రియక్రియాః ।
యోగేనావ్యభిచారిణ్యా-ధృతిః సా పార్థ! సాత్త్వికీ ॥ 33

పార్థా! వ్యభిచారము (చాంచల్యము) లేనట్టి నిలకడతో మనస్సు ప్రాణము ఇంద్రియములు అనువాని వ్యాపారములను నిగ్రహించు (అదుపునఁబెట్టు) ధైర్యము సాత్త్విక మనఁబడును.

శ్లో॥ యయా తు ధర్మకామార్థాన్-ధృత్యా ధారయతేఽర్జున! ।
ప్రసంగేన ఫలాకాంక్షీ-ధృతిః సా పార్థ! రాజసీ ॥ 34

అర్జునా! కర్త నను అభిమానముతో ఫలము నపేక్షించుచు ధర్మమును కామమును అర్థమును పోషించువాని ధైర్యము రాజసమని, తెలియుము! పార్థా!

శ్లో॥ యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ ।
న విముంచతి దుర్మేధా-ధృతిః సా పార్థ! తామసీ ॥ 35

పార్థా! దుష్టబుద్ధి గలవాడై అతినిద్రను అనవసరభయమును గతస్మృతి వలన కలుగు దుఃఖమును విషాదము (ఇంద్రియముల బలహీనత)ను ఇంద్రియ సుఖలోలత్వమును విడువఁజాలనట్టి ధైర్యము-తామస మనఁబడుఁగును.

సుఖము గూడ త్రివిధంబని దిగువ నుదాహరింపఁబడుచున్నయది.

శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం-శృణు! మే భరతర్షభ !
అభ్యాసా ద్రమతే యత్ర-దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥ 36

యత్తదగ్రే విషమివ-పరిణామేఽమృతోపమం ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త-మాత్మబుద్ధి ప్రసాదజమ్ ॥ 37

భరతర్షభా! ఈ సందర్భమున సుఖము మూడువిధములు గలదని నా ప్రబోధము నాలకింపుము!

ఏ సుఖము విషయమై అతిపరిచయముతో సంసార దుఃఖముయొక్క అవసానమును గమనించి-ముందు విషముఁబోలినదై చివర నమృతముతో సమానమై పరమేశ్వరభావనను-నిద్రాలస్య ప్రమాదములు లేకుండ-నిలుపునో, అట్టి సుఖము సాత్త్విక మగునని నుడువఁబడినది.

శ్లో॥ విషయేంద్రియసంయోగా-ద్యత్తదగ్రేఽమృతోపమం ।
పరిణామే విషమివ-తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ 38

ఇంద్రియములు విషయముల నంటుకొని-మొదట అమృతసమానమై అవసానమున విషతుల్యంబునై యుండు సుఖము-రాజస మనఁబడును.

శ్లో॥ యదగ్రే చానుబంధే చ-సుఖం మోహన మాత్మనః ।
నిద్రాఽఽలస్యప్రమాదోత్థం-తత్తామస ముదాహృతమ్ ॥ 39

ముందు వెనుకలు తనను మోహింపఁజేయునట్టి, నిదురించుటతో జాగు సేయుటతో పొఱపాటువలనను సంభవించు సుఖము-తామసముగ నుదహరింపఁబడినది.

శ్లో॥ న తదస్తి పృథివ్యాం వా-దివి దేవేషు వా పునః ।
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం-యదేభిః స్యా త్త్రిభి ర్గుణైః ॥ 40

భూలోకమున మానవులు మొదలగువానిలో నైనను మరియు స్వర్గమున దేవతలలో నైనను ప్రకృతివలన జన్మించు నీ సత్త్వరజస్తమోగుణములతో విడువబడిన ప్రాణి (చేతనుఁడు, అచేతనంబు) లేదనియే చెప్పవచ్చును.

ఇంతవరకు చెప్పినవిధమున ప్రాణులందరు - సత్త్వరజస్తమో గుణాత్మక మగు ప్రకృతిఁదగు స్వరూపము గల అనాది పాశముచే బంధింపఁబడి యుండువారు గదా! అట్టి తఱి-ప్రకృతిబంధము నుండి విముక్తి-ప్రాణికెట్లు సంభవించు

నని ఆశంకించి-తమ తమ అధికారముల ననుసరించి పరమేశ్వరారాధనభావనతో స్వధర్మము ననుష్ఠించుటచే ప్రసన్నుఁడగు పరమేశ్వరుని అనుగ్రహము వల ననే ప్రాణులకు విముక్తి సంభవించునని విశదీకరించుచు-గీతార్థసారము నంతయు నుపసంహరించుటకై దిగువ ప్రకరణము ప్రారంభింపఁబడినది.

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియ విశాం-శూద్రాణాం చ పరంతప ।
కర్మాణి ప్రవిభక్తాని-స్వభావప్రభవై ర్గుణైః ॥ 41

పరంతపా అర్జునా! బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు నను వారికి - పూర్వజన్మసంస్కారము వలన కలుగు సత్త్వాదిగుణములతో శమదమాది కర్మలు బాగుగా విభజింపఁబడియున్నవి.

వివరణ-"శూద్రాణాం" అను పదమును విడిగా చెప్పుట-శూద్రులు. వేదాధి కారము లేనివారని స్ఫురింపఁజేయుచున్నది. రజోగుణము తమోగుణంబు అప్ర ధానములై సత్త్వగుణము ముఖ్యముగ నుండు స్వభావము – బ్రాహ్మణులదగును. సత్త్వతమోగుణములు అప్రధానములుగ, రజోగుణము ముఖ్యముగ నుండు స్వభా వము–క్షత్రియులకు చెల్లును. తమోగుణ సహకృతమగు రజోగుణము – వైశ్యు లకు స్వభావమగును. శూద్రుల స్వభావమైతేనో – రజోగుణము ఒక భాగముగ నుండు తమోగుణంబగును.

"వర్ణాశ్రమాచారములను శివుఁడే ఏర్పరచుటచే నవ్వానిని పాటింపకుం డుట – శివాజ్ఞను ధిక్కరించుట యగును. రాజాజ్ఞఁ జవదాటువారికి శిక్ష యెట్లు విధింపఁబడునో - అట్లే శివాజ్ఞ నుల్లంఘించువారికి నరకయాతన విధింపఁబడును" అని శంకరసంహిత- ఉద్ఘాటించినది. "యమేవైష వృణుతే తేన లభ్యః" ఇత్యాం శ్రుతులు – శివానుగ్రహము వలననే మోక్షము లభించునని చెప్పుటచే – శివా గ్రహము - స్వధర్మాచరణము వలన సంభవించును గాన - స్వవర్ణాశ్రమాచార ములు– అవశ్యకర్తవ్యములని తేటపడినది.

శ్లో॥ శమో దమ స్తపః శౌచం-క్షాంతి రార్జవ మేవ చ ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం-బ్రాహ్మం కర్మ స్వభావజమ్ ॥ 42

మనఃశాంతి, బహిరింద్రియ నిగ్రహము, నక్తవ్రతాది ప్రయుక్తమైన తపస్సు, స్నానాదులచే పరిశుభ్రత, ఓర్పు, కపటము లేనట్టి ప్రవర్తనము. వేద

శాస్త్ర శివాగమాది జ్ఞానము, పతి పశు పాశ లక్షణ పరిజ్ఞానము, "పరలోకము పరమేశ్వరుఁడు ఉన్నారను దృఢవిశ్వాసము = బ్రాహ్మణజాతి యొక్క సత్త్వగుణ ప్రధానమైన స్వభావమువలన నేర్పడు సదాచారమగును. అనఁగా - జన్మతః బ్రాహ్మణుఁడైన వాని స్వధర్మములు- మనఃశాంత్యాదులగునని భావము.

శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం-యుద్ధే చాప్యపలాయనం ।
దాన మీశ్వరభావశ్చ-క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥ 43

పౌరుషము, దీనత్వము లేకుండుట, ధైర్యము, నేర్పు, యుద్ధమున విముఖుఁడు కాకుండుట, ఉదారత్వము, శిక్షించు అధికారము ననునవి క్షత్రియునకు స్వభావసిద్ధములైన ధర్మములగును.

శ్లో॥ కృషిగోరక్ష్యవాణిజ్యం-వైశ్యకర్మ స్వభావజం ।
పరిచర్యాత్మకం కర్మ—శూద్రస్యాపి స్వభావజమ్ ॥ 44

భూవ్యవసాయము, పశుపోషణము, వర్తకము ననునవి- వైశ్యునకు స్వభావసిద్ధములైన (అనఁగా - జన్మనుండియే) కర్తవ్య ధర్మములగునవి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు ఉపకరించుట- అనఁగా—అవ్వారి యనుమతిని ప్రవర్తించుట— శూద్రుని స్వభావసిద్ధమైన ధర్మ మగును.

శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరతః-సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతః సిద్ధిం-యథా విందతి తచ్ఛృణు ॥ 45

తన వర్ణాశ్రమములకు విహితమైన కర్మయందు ఆసక్తిగల మానవుఁడు- మోక్షమును పొందును. స్వధర్మము ననుష్ఠించువాడు ఎవ్విధము ముక్తి నొందునో అవ్విధమును చెప్పుచున్నాను. వినుము !

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం-యేన సర్వ మిదం తతం ।
స్వకర్మణా త మభ్యర్చ్య-సిద్ధిం విందతి మానవః ॥ 46

ఎవని నుండి చరాచరప్రాణులు పుట్టుచున్నవో, ఎవనిచే ఈ జగత్తంతయు వ్యాపింపఁబడినదో, అట్టి పరమేశ్వరుని మానవుఁడు తన వర్ణమునకుఁ దగు కర్మతో నారాధించినచో పరమముక్తిని పొందఁగలుఁగును.

వివరణ- "యతో వా ఇమాని భూతాని జాయంతే" "ఎవనివలన ఈ ప్రాణులందరు ఆవిర్భవించుచున్నారో, అట్టి పరశివు నుపాసింపుము" "వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేక-స్తే నేదం పూర్ణం పురుషేణ సర్వం" "పరమేశ్వరుఁడొకఁడే దివ్యాంతరిక్షమున వృక్షమువలె కదలక నున్నవాడు. అట్టి పురుషునిచే ఈ సమస్తము నిండియున్నది." "సర్వవ్యాపీ చ భగవాన్, తస్మాత్సర్వగతః శివః" "భగవానుఁడు సమస్తమును వ్యాపించును. అందువలన శివుఁడు సర్వగతుఁడనఁబడుఁగును" ఇత్యాది శ్రుతులు పై శ్లోకార్థమును సమర్థించునవి.

స్వధర్మమును పరమేశ్వరారాధన బుద్ధితో విధివిహితముగ ననుష్ఠించినచో శివానుగ్రహపాత్రుఁడై పునర్జన్మ లేనట్టి శాశ్వత శివలోకము నొందునని సారాంశము.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః-పరధర్మా త్స్వనుష్ఠితాత్ ।
స్వభావ నియతం కర్మ-కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ ॥ 47

బాగుగా ఆచరింపఁబడు పరధర్మమున కన్న-తన ధర్మము విశేషఫలము లేనిదైనను-శ్రేష్ఠమగును. సత్త్వగుణము మొదలగు వానితో తన వర్ణమునకు ఉచితమైన కర్మ - దోషము గలదైన నద్దాని నాచరించినచో పాపము సంఘటింపదు.

పరధర్మములగు భిక్షాటనాదులకంటె - బంధువధాదులు గల స్వధర్మమే క్షత్రియునకు విహితమైనదని భగవదాశయము.

శ్లో॥ సహజం కర్మ కౌంతేయ !-సదోష మపి న త్యజేత్ ।
సర్వారంభా హి దోషేణ-ధూమేనాగ్ని రివావృతాః ॥ 48

కౌంతేయా ! సహజమైన కర్మ దోషయుక్తమైన నద్దానిని విడువరాదు. ఎందుకనఁగా? అగ్ని-ధూమము (పొగ)తో కూడియుండునట్లు ధర్మములన్నియు యత్కించిద్దోషము గలిఁగియే యుండును.

శ్లో॥ అసక్తబుద్ధిః సర్వత్ర-జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం-సన్న్యాసేనాధిగచ్ఛతి ॥ 49

కర్మఫలాదుల యందంతట ఆసక్తి లేని బుద్ధి గలవాడై మనస్సును నిగ్ర

హించి- పరమేశ్వరుఁడే కర్తయని నిశ్చయించుకొని తాను కర్త కానని భావించియు కామ్య నిత్య నైమిత్తిక కర్మగతములైన ఫలముల నెన్నటికైన ననుభవింతునను అంతర్భావమును విడనాడవలెనని యీ గీతాశాస్త్రమునందు నిర్ణయింపఁబడిన సన్న్యాసముతో అత్యంతోత్కృష్టమైన ముక్తిఁ బడయఁజాలును.

శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ-తథాఽఽప్నోతి నిబోధ మే।
సమాసేనైవ కౌంతేయ-నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50

కుంతీపుత్రా ! ముక్తపురుషుఁడు - బ్రహ్మము నెట్లు పొందునో, అవ్విధమును మరియు జ్ఞాన మనఁదగు ఉపాసనముఁదగు అవధి ఎట్టిదో, సంగ్రహముగా చెప్పుచున్నాను. వినుము !

శ్లో॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో-ధృత్యాఽఽత్మానం నియమ్య చ।
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా-రాగద్వేషౌ వ్యుదస్య చ ॥ 51

,, వివిక్తసేవీ లఘ్వాశీ-యత వాక్కాయమానసః।
ధ్యానయోగపరో నిత్యం-వైరాగ్యం సముపాశ్రితః ॥ 52

,, అహంకారం బలం దర్పం-కామం క్రోధం పరిగ్రహం।
విముచ్య నిర్మమః శాంతో-బ్రహ్మభూయాయ కల్పతే ॥ 53

నిర్మలమైన మనస్సుతో కూడినవాడై, సాత్త్వికమైన ధైర్యముతో మనస్సును నిగ్రహించి, శబ్దశ్రవణము మొదలగు విషయములపై అత్యాసక్తిని విడనాడియు రాగద్వేషములను తగ్గించి, ఏకాంతమున నివసించుచు, మితముగ భుజించుచు, మనోవాక్కాయముల నదుపులో పెట్టియు, శివపూజా సమయమున నిత్యము శివధ్యానముఁ జేయుచు, వైరాగ్యము గలవాడై, ఆత్మ కానట్టి శరీరాదులపై ఆత్మాభిమానమును ఆత్మాభిమానమూలమగు విషయవాసనాబలమును గర్వమును కామక్రోధములను కామభోగమునకు వలయు సాధనసామగ్రిని విసర్జించి, మమకారము లేనివాడై చిత్తములో మార్పు లేనివాడై ఉండుచెడ - నిరంతరము "శివోఽహం" భావనను కొనసాగించుకొన నర్హుఁడగును.

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా-న శోచతి న కాంక్షతి।
సమః సర్వేషు భూతేషు-మద్భక్తిం లభతే పరామ్ ॥ 54

ఎడతెగని "శివోఽహం" భావన గలవాడు- క్లేశకర్మాదులతో కలుషితము గాని చిత్తము గలవాడై నష్టమైనదానిఁ గూర్చి పరితపింపడు. అప్రాప్తము నభిల షింపడు; ప్రాణులందరియందు ఆత్మదృష్టితో సమానభావము గలవాడై పరమేశ్వ రునియందు పరమప్రేమానుభవరూపమైన భక్తిని పొందును.

శ్లో॥ భక్త్యా మా మభిజానాతి-యావాన్ యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా-విశతే తదనంతరమ్ ॥ 55

అట్టి భక్తిచే పరమేశ్వరుఁడు - సర్వజ్ఞత్వాది గుణములతో విభూతితోడ స్వరూపముతోడ నెట్టివాడో యథార్థముగ నెవఁడు పరిశీలించునో, ఇట్లు యథార్థముగ గుర్తించిన తరువాత పరమేశ్వరుని పొందును

వివరణ- "తతస్తు తం పశ్యతే నిష్కళం ధ్యాయమానః" "శివారాధన సమగ్రతలో శివుని పరిపూర్ణునిగ ధ్యానించు శివయోగి- పరమాత్మను తన హృద యమున సాక్షాత్కరించుకొనును" అను శ్రుతి- పరమేశ్వరుని సాక్షాత్కారమును సమర్థించుచున్నది. "అస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణా భినిష్పద్యతే" "ఈ ప్రారబ్ధశరీరము నుండి-శివ యోగసిద్ధుఁడు బయలు దేరి- పరంజ్యోతిఁజేరి — పూర్వము తిరోహితమైన నిజరూపము నావిష్కరింపఁ జేసికొనును" అనుశ్రుతి- శరీరమునందు కలుగు శివసాక్షాత్కారమున- మూర్ధన్య నాడీమార్గముద్వారా ప్రయాణము సిద్ధించుటఁజేసి శరీర నిర్గమనానంతరమే పరమ పదముఁజేరి నిజరూపావిష్కార పూర్వకముగ శివసముఁడగు నను నంశమును ఎలపఱచుచున్నదని సారాంశము.

శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా-కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
తత్ప్రసాదా దవాప్నోతి-శాశ్వతం పద మవ్యయమ్ ॥ 56

నిత్య నైమిత్తిక కామ్య కర్మల నన్నిటిని చేయుచున్నను పరమేశ్వరునకు శరణాగతుఁడైనచో శివానుగ్రహమువలన ఆదిమధ్యాంతములు లేనట్టి శాశ్వతంబు నగు పరమపదముఁ జేరఁగలుఁగును.

శ్లో॥ చేతసా సర్వకర్మాణి-మయి సన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగ ముపాశ్రిత్య-మచ్చిత్తః సతతం భవ॥ 57

సమస్త సుకృతములను మనస్సుచే పరమేశ్వరునకు సమర్పించి - "పరమేశ్వరుఁడే పొందఁదగినవాడు" అను దృఢవిశ్వాసము గలవాడవై ఉపాసనాత్మక జ్ఞానయోగము నవలంబించి పరమేశ్వరునందే చిత్తము గలవాడవు కమ్ము!

శ్లో॥ మచ్చిత్తః సర్వదుర్గాణి-మత్ప్రసాదా త్తరిష్యసి ।
అథ చేత్త్వ మహంకారా-న్న శ్రోష్యసి వినంక్ష్యసి ॥ 58

అర్జునా! పరమేశ్వరునందు చిత్తము గలవాడవైనచో పరమేశ్వరుని అనుగ్రహమున సంసారదుఃఖముల నన్నిటిని పోగొట్టుకొనఁగలుఁగుదువు. అహంకారముతో నా మాట విననిచో పరమపురుషార్థ ప్రాప్తికి దూరమగుదువు.

శ్లో॥ యద్యహంకార మాశ్రిత్య-న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయస్తే-ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥ 59

అహంకారముఁ జెందినవాడవై "బంధువులతో పోరాడ"నని భావింతువేని ఈ నీ నిశ్చయము వ్యర్థమగును. ఎందుకనఁగా? చరాచర ప్రపంచమూల మగు ప్రకృతి-నిన్ను యుద్ధమునందు ప్రవర్తింపఁజేయును

శ్లో॥ స్వభావజేన కౌంతేయ-నిబద్ధః స్వేన కర్మణా ।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్-కరిష్యస్యవశోఽపి తత్ ॥ 60

కౌంతేయా! క్షత్రియ సహజమగు శౌర్యాదిగుణ ప్రయుక్తమైన కర్మకు కట్టుబడి మోహమువలన దేని నొనర్ప నభిలషింపవో, అట్టి యుద్ధమును పరతంత్రుఁడవై చేయుదువు?

శ్లో॥ ఈశ్వరః సర్వభూతానాం-హృద్దేశేఽర్జున! తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని-యంత్రారూఢాని మాయయా ॥ 61

అర్జునా! శివుఁడు ప్రాణులందరి హృదయగుహయందు నివసించి కర్మ ప్రయుక్తమైన శరీరయంత్రము నధిష్ఠించిన ప్రాణులందరిని తన శక్తిద్వారా స్వధర్మములయందు ప్రవర్తింపఁ జేయువాడు.

వివరణ— "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" ఇత్యాది నీ గీతాశాస్త్రమునందు చెప్పఁబడిన "నేను సమస్తప్రాణుల హృదయమునందున్నాను" అను విష

యము - అంతర్యామి దృష్టితోడచే సర్వకారణత్వము స[illegible] [illegible] లగు లక్షణములు పరమేశ్వరునివే - అను సంశమును సమర్థించు[illegible] శ్లోకమునందు విదితమైనది.

"య ఆత్మని తిష్ఠన్నాత్మాన మంతరో యమయతి" [illegible] "పరమేశ్వరుఁడే జీవాత్మలో ఉంటూ జీవాత్మను ప్రేరేపించు[illegible]" [illegible]

పాశము (ప్రకృతి) పశువు (జీవాత్మ) ఈ రెండు [illegible] ఏమియు చేయఁజాలవనియు. పతియగు శివుఁడే [illegible] సమస్తకర్మలఁ జేయించు ననియు ఇందు పరమార్థము

శ్లో॥ తమేవ శరణం గచ్ఛ-సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్ పరాం శాంతిం-స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ 62

భరత వంశోత్భవా ! అర్జునా ! అట్టి పరమేశ్వరునే స[illegible] లతో శరణము నొందుము ! పరమేశ్వరానుగ్రహము వలన-జ[illegible] భరిత సంసారముయొక్క విరామమును (పరాంశాంతిం నిత్యమై[illegible] పొందగలవు !

వివరణ- స్వధర్మము నాచరించుచున్నను శరణాగతుఁడు కానిచో [illegible] గ్రహము ప్రసరింపదనియు, శరణాగతుఁడు - యత్నించి ధర్మము [illegible] నను శివానుగ్రహ పాత్రుఁడై ముక్తుఁడగు నని సారాంశము

శ్లో॥ ఇతి తే జ్ఞాన మాఖ్యాతం-గుహ్యాత్ గుహ్యతరం మయా ।
విమృశ్యైత దశేషేణ-యథేచ్ఛసి తథా కురు ॥ 63

అర్జునా! ఇట్లు రహస్యాతిరహస్యమగు శివజ్ఞానమును నేను నీకు [illegible] దీనినంతయు బాగుగా విచారించుకొని నీ యిష్టప్రకారము నడుచుకొనుము!

వివరణ-ప్రకృతి నియమించుననియు ఈశ్వరుఁడు ప్రేరేపించు[illegible] చెప్పినట్లు చేయనియెడల పరమార్థమునుండి భ్రష్టుఁడవగుదువనియు [illegible] శాసనరూపమున వక్కాణించిన శ్రీకృష్ణభగవానుఁడు ఇఁట యథేచ్ఛము [illegible] ర్తించుమని బుజ్జగించుటచే భగవానుఁడు జీవాత్మకు కర్తవ్యాకర్తవ్యములను [illegible] యించుకొను శక్తిని ప్రసాదించు కరుణాంతరంగుఁడని తేటపడినది.

శ్లో॥ సర్వగుహ్యతమం భూయః-శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసి మే దృఢమితి-తతో వక్ష్యామి తే హితమ్ ॥ 64

సమస్త జ్ఞానములలో ఉత్తమమగు వాక్యమును-నీవు నాకు సంపూర్ణముగ ప్రియుండవగుటచే-నీకు హితముఁజెప్పుచున్నాను. ఆలకింపుము!

వివరణ-శాస్త్రదృష్టి న్యాయమున స్వాంతర్యామ్య భిన్నస్థితి నుపదేశించిన జ్ఞానమును మరల నదే దృష్టితో నుపసంహరింప దిగువ విధము భగవానుఁడు వక్కాణించెను.

వస్తుతః శాస్త్రార్థమంతయు 62వ శ్లోకమువరకే పరిసమాప్తమైనను "ఆవృత్తి రసకృదుపదేశాత్" అనేక పర్యాయములు ఉపదేశించుటచే విషయముఁదగు పునరావృత్తి-ప్రబోధదార్ఢ్యము నాపాదించునని సమాధానపడవలెను.

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో-మద్యాజీ మాం నమస్కురు! ।
మామేవైష్యసి సత్యం తే-ప్రతిజానే ప్రియోఽసి మే ॥ 65

పరమేశ్వరునందు మనస్సు భక్తియు గలవాడవై పరమేశ్వరునే పూజించుచు నమస్కరించుచున్నచో పరమేశ్వరునే పొందుదువు. నీవు నాకు ప్రియుండవని సత్య (యథార్థ)ముగ ప్రతిజ్ఞఁజేయుచున్నాను.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య-మామేకం శరణం వ్రజ! ।
అహం త్వా సర్వపాపేభ్యో-మోక్షయిష్యామి మా శుచః 66

వర్ణములు ఆశ్రమములు అనువాని ననుసరించిన ధర్మముల నాచరించిన నవ్వాని ఫలితముల నీశ్వరార్పణ బుద్ధితో విడనాడి పరమేశ్వరునొకనినే శరణము నొందుము! అట్టి తఱి పరమేశ్వరుఁడు నిన్ను సమస్త దురితములనుండి విడుదల జేయును. దుఃఖింపకుము!

ఒకవేళ నిత్యనైమిత్తిక కామ్యకర్మలు క్లేశభూయిష్ఠములని యవ్వాని నాచరింప నలవిఁగానిచో యథాశక్తి శివారాధనాంగములుగ వర్ణాశ్రమ ధర్మముల ననుష్ఠించుచు బంధమోక్షములకు ఈశ్వరుఁడే ఆధారమని భావించి "శివా! శంభో!"

పాహి" అనుచు "నీవే గతి" యనుచును సర్వాత్మనా పరమేశ్వరునకు విధేయుఁడై శరణాగతుఁడు నైనచో ముక్తుఁడగునని సారాంశము.

శ్లో॥ ఇదం తే నాతపస్కాయ-నాభక్తాయ కదాచన।
న చాశుశ్రూషవే వాచ్యం-న చ మాం యోఽభ్యసూయతి॥ 67

నీకు ఇంతవరకు చెప్పఁబడిన ఈ విజ్ఞానమును-తపస్సు (శాంభవదీక్ష) లేనివానికి, శివభక్తి లేనివానికి, గురుపరిచర్యఁ జేయనివానికి, శివద్వేషము గలవానికి చెప్పఁగూడదు.

శ్లో॥ య ఇదం పరమం గుహ్యం-మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా-మామేవైష్యత్యసంశయః॥ 68

ఎవఁడు ఉత్కృష్టము రహస్యంబు నగు ఈ గీతాశాస్త్రమును శివభక్తులకు ఉపదేశించునో, అట్టివాడు శివునియందు అనన్యభక్తి గలవాడై శాశ్వత శివసాయుజ్యము నొందును.

శ్లో॥ న చ తస్మాన్మనుష్యేషు-కశ్చిన్మే ప్రియకృత్తమః।
భవితా న చ మే తస్మా-దన్యః ప్రియతరో భువి॥ 69

శివభక్తులకు గీతాశాస్త్రము నుపదేశించువానికన్న ప్రియతముఁడు నాకు ఎవఁడును కాడు. భూలోకమున మానవులలో అట్టివానికంటె నత్యంత ప్రియుఁడు మరియొకడు ఉండడని గట్టిగా చెప్పుచున్నాను.

వివరణ_"శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వమన్యత్ పరిత్యజ్య" ఇత్యాది శ్రుతివాక్యము "సర్వధర్మాన్ పరిత్యజ్య" ఇత్యాది శ్లోకార్థమును సమర్థించుటచే ఈశ్వరశరణాగతియే ముఖ్యమని ఇందు తేటపడినది.

శ్లో॥ అధ్యేష్యతే చ య ఇమం-ధర్మ్యం సంవాద మావయోః।
జ్ఞానయజ్ఞేన తేనాహ-మిష్టః స్యామితి మే మతిః॥ 70

ధర్మమునకుఁ జెందిన ఈ మన సంవాదమగు గీతాశాస్త్రము నెవఁడు అర్థ

పరిశీలనముతో పఠించునో, వానిచే పరమేశ్వరుఁడు పూజింపఁబడునని నా యభిప్రాయము.

శ్లో॥ శ్రద్ధావా ననసూయ శ్చ-శృణుయా దపి యో నరః ।
సోఽపి ముక్త శ్శుభాంల్లోకాన్-ప్రాప్నుయాత్ పుణ్యకర్మణామ్॥

ఏ మానవుఁడు-శ్రద్ధ (పట్టుదల)తో ఓర్పుతోడ నీ గీతాశాస్త్రమును వినునో, వాడు గూడ పాపపంజరమునుండి విడిబడి-అశ్వమేధాది పుణ్యముల నొనర్చిన వారి లోకములను పొందును.

శ్లో॥ కచ్చి దేతచ్ఛ్రుతం పార్థ!-త్వయైకాగ్రేణ చేతసా।
కచ్చి దజ్ఞాన సమ్మోహః-ప్రణష్టస్తే ధనంజయ! ॥ 72

పార్థా! ఈ నా యుపదేశమును ఏకాగ్రమైన మనస్సుతో విన్నావా! ధనంజయా! ధర్మాధర్మ లక్షణములను గుర్తింపనట్టి నీ వ్యామోహము తొలగినదా!

అర్జున ఉవాచ-

శ్లో॥ నష్టో మోహ స్స్మృతి ర్లబ్ధా-త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత!।
స్థితోఽస్మి గతసందేహః-కరిష్యే వచనం తవ ॥ 73

అచ్యుతా! కృష్ణా! నీ యనుగ్రహప్రబోధము-నా విపరీతజ్ఞానమును పోగొట్టినది. పతి పశు పాశజ్ఞానమును కలిగించినది. ఏది కర్తవ్యము? ఏది కర్తవ్యము కాదు? అను సందేహమును పారదోలినది. నన్ను స్థిరనిశ్చయు నొనర్చినది. గాన నీ యానతి నవశ్యము గావింతు నని అర్జునుఁడంగీకరించెను.

సంజయ ఉవాచ- సంజయుఁడు ధృతరాష్ట్రునితో నిట్లు నుడివెను.

శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య-పార్థస్య చ మహాత్మనః ।
సంవాద మిమ మశ్రౌష-మద్భుతం రోమహర్షణమ్॥ 74

ఇవ్విధము నేను మహాత్ముఁడైన వాసుదేవునకు పార్థునకు సంఘటించినట్టి గగుర్పాటు కలిగించునట్టి అద్భుతంబు నగు నీ సంవాదమును ఆలకించితిని.

శ్లో॥ వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా-నేతత్ గుహ్యతమం పరం।
యోగం యోగేశ్వరాత్ కృష్ణా-త్సాక్షా త్కథయతః స్వయమ్॥

నాకు దివ్యనేత్రమును దివ్యశ్రోత్రము మొదలగువానిని ప్రసాదించిన శ్రీ వేదవ్యాసు ననుగ్రహమున, స్వయముగ అర్జునుని ముందుండి శ్రీకృష్ణ భగవానుఁడు వక్కాణించుచుండగా-రహస్యమైన శ్రేష్ఠంబు నగు ఈ యోగశాస్త్ర మును వింటిని.

శ్లో॥ రాజన్ సంస్మృత్య సంస్మృత్య-సంవాద మిమ మద్భుతం।
కేశవార్జునయోః పుణ్యం-హృష్యామి చ ముహుర్ముహుః॥ 76

ధృతరాష్ట్ర మహారాజా! అద్భుతము పుణ్యప్రదము నగు కేశవార్జునుల సంవాదమును స్మరించినకొలఁది—సంతోషముతో పరవశుఁడ నగుచున్నాను

శ్లో॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య-రూప మత్యద్భుతం హరేః।
విస్మయో మే మహాన్ రాజన్-హృష్యామి చ పునః పునః॥ 77

రాజా! శ్రీహరి—తన శివయోగసిద్ధమైన అత్యద్భుతంబు నగు విశ్వరూప మును పార్థునకు చూపెట్టిననుండి ఆ విశ్వరూపమును తలచి తలచి ఆనందాతిశయ ముతో మైమఱచుచున్నాను. అప్పుడప్పుడు అత్యంతము ఆశ్చర్యంబు కలుగు చున్నది.

శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో-యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీ ర్విజయో భూతి-ర్ధ్రువా నీతి మతి ర్మమ॥ 78

ఏ ధర్మరాజు పక్షమున యోగేశ్వరుఁడైన శ్రీకృష్ణుఁడు, గాండీవధారి యగు అర్జునుఁడు నుందురో, అనన్యభక్తుల నెపుఁబాయనట్టి పరమేశ్వరుఁడు ప్రచ్ఛన్నరూపమున నుండునో, ఆచోట వాసుదేవ సర్ధాంగియగు లక్ష్మీదేవి, సర్వత్ర విజయశాలియగు అర్జునుని విజయము, ధర్మము ననుసరించు న్యాయ మున్ను శాశ్వతములుగ స్థిరపడు నని నా యభిమతము.

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం, వైయాసిక్యాం, భీష్మపర్వణి, శ్రీమత్ భగవద్గీతాసు, ఉపనిషత్సు, బ్రహ్మ

విద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,
మోక్షోపదేశ యోగో నామ అష్టాదశోఽధ్యాయః.

ఇయ్యది
శ్రీ నీలకంఠ భగవత్పాదారాధ్యకృతియగు-గీతాభాష్యమునకు
మహోపాధ్యాయ, లోకారాధ్య, శివయోగి, ముదిగొండ నాగలింగశాస్త్రివరేణ్య
కృత-లఘుచంద్రికా వ్యాఖ్యానమునకును
"మనోరంజన" మను శాంకరీయ ఆంధ్రానువాదమున
పదునెనిమిదవ అధ్యాయము సర్వంబు సమాప్తము.
శివార్పణమస్తు.
ఓం తత్సత్.

నిర్మల శంకరశాస్త్రి



శ్రీ మహాగణాధిపతయే నమః

ఈ గీతాభాష్యము యొక్క ఆంధ్రానువాదమును ముద్రించుటకు స్వసంతోషముతో విరాళాలు సమర్పించిన సజ్జనుల నభినందించుచు వారి నామధేయములను దిగువ పేర్కొననైనది.

నిర్మల శంకరశాస్త్రి

1. శివశ్రీ॥ కందుకూరి-శివానందమూర్తిగారు, భీమునిపట్నం, శైవమహాపీఠ-ఉపాధ్యక్షులు. (శివాంశ సంభూతులు)
2. శివశ్రీ॥ మడిపల్లి- వీరభద్ర (వీరయ్య) ఆరాధ్యులు, నిర్మల. (నిష్కపట హృదయులు)
3. శ్రీమాన్, కుంభం-పోచిరెడ్డిగారు. చెన్నూరు. (అంతరంగిక భక్తులు)
4. సర్వశ్రీ॥ ఉత్తూరి శంకర శ్రేష్ఠిగారు, నిర్మల. (దైవభక్తాగ్రేసరులు)
5. శివశ్రీ॥ చామర్తి పరదేశిరావుగారు, హైదరాబాద్. (సహృదయులు)
6. సర్వశ్రీ॥ కుంద కృష్ణమూర్తి, సౌ॥ అంజమ్మగారలు, వెస్టుమారేడుపల్లి, (సహజ సమాచీన స్వభావులు)
7. సర్వశ్రీ॥ కుంద రమేశ్, సౌ॥ పద్మజ గారలు, (ఉదారస్వభావులు)
8. శివశ్రీ॥ గూడూరు సిద్ధరామేశ్వర శర్మగారు, సికిందరాదాద్ (సంస్కృతాంధ్ర కోవిదులు)
9. శివశ్రీ॥ రామగిరి సిద్ధరామేశ్వర శర్మగారు. సికిందరాబాద్. సంస్కృత సాహిత్యాలంకారులు,
10. శివశ్రీ॥ కొమ్మరాజు, శేషగిరిరావు, జనార్ధనరావు, ధర్మారావు, జ్ఞానకుమార్ గారలు, (సోదరులు) సౌజన్య సంపన్నులు, సికిందరాబాద్.

11. శివశ్రీ॥ ముత్యంపేట గణేశ శర్మగారు, మల్కాజిగిరి, సికిందరాబాద్.
(శాంత స్వభావులు, నిగర్వులున్ను).

12 శివశ్రీ॥ లోకారాధ్య, కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు గారు,
(శివ విజ్ఞానఘనులు) M.A.B.L.EX, M.P మచిలీపట్నం.

13. ,, తాడికొండ నాగమల్లయ్యగారు (గుంటూరు) హైదరాబాద్.
(వేదవిదగ్రేసరులు).

14. ,, ములుగు హనుమంతరావుగారు, హైదరాబాద్.
(మితహితప్రవర్తనులు)

15. సర్వశ్రీ॥ కత్తూరి కృష్ణగారు, మలాసీబిల్డింగ్, సికిందరాబాద్.
(విమర్శ నిపుణులు)

16. శివశ్రీ॥ శివలెంక అమరవీరేశ్వర శాస్త్రిగారు, వెస్ట్ మారేడుపల్లి.
(విశ్రాంత సమున్నత పదవీకులు)

17. ,, ముదిగొండ మార్కండేయ, సౌ॥ సుబ్బలక్ష్మి గారలు,
వెస్ట్ మారేడుపల్లి. రిటైర్డ్ జడ్జి, (సహజ పాండితీమండితులు)

18. సర్వశ్రీ పులుగిళ్ళ దేవేంద్ర గుప్త, సౌ॥ సులోచన గారలు,
(ఆదర్శ పుణ్యదంపతులు)

19. శివశ్రీ॥ డాక్టర్-అత్తలూరు మృత్యుంజయశర్మగారు, వరంగల్.
(శైవమహాపీఠ పండిత మండల్యగ్రేసరులు)

20. శ్రీమతి॥ సమతం వెంకటరత్నం గారు, నరసాపురం, ప.గో.జి.
(శాంతస్వభావ వినయ శోభితురాలు)

21. సర్వశ్రీ॥ కొండూరి బసవరాజుగారు, వరంగల్. (శివభక్తాగ్రేసరులు)

22. శివశ్రీ॥ తాడికొండ వీరభద్రయ్యగారు, హైదరాబాద్.
(ఉచ్చతమ న్యాయవాదులు, సహృదయులున్ను)

23. సర్వశ్రీ॥ కె బి.ఎన్. ప్రసాద్‌గారు, కపిలేశ్వరపురం.
(నిఃస్వార్థ హృదయులు)

24 శ్రీమాన్॥ పుల్లయాచారి గారు (విశ్వబ్రహ్మ) పాత కడప.
(శాస్త్రజిజ్ఞాసు శ్రేష్ఠులు)

25. శ్రీమాన్ గౌరిసెట్టి సాంబమూర్తిగారు, జగిత్యాల. (ఆస్తిక శిఖామణులు)

26. శివశ్రీ॥ ములుగు బుచ్చయ్యగారి హనుమంతరావుగారు, హైదరాబాద్.
(శైవమహాపీఠ కర్తవ్య యాజకాగ్రగణ్యులు)

27. సర్వశ్రీ॥ అరుణార్తుల శంకరయ్యశ్రేష్ఠి, సౌ॥ వజ్రమ్మ గారలు,
(ఔదార్య గాంభీర్యగుణ సంపన్నులు) సికిందరాబాద్.
మరియు శ్రీ సినివాసరావు, సౌ॥ సంధ్యారాణి,
శ్రీ బాలమురళీకృష్ణ, సౌ॥ వసుధ,
శ్రీ రమేశకుమార్, సౌ॥ సవిత గారలు.

28 శ్రీమాన్॥ బి. హనుమంతరావు, సౌ॥ జయప్రద గారలు,
(ఉదారస్వభావులు) రామచంద్రాపురం-హైదరాబాద్.

29. శివశ్రీ॥ ఆరాధ్య స్మార్త శైవసంఘము, కొత్తపల్లి-అగ్రహారం.
(విద్వన్మాహేశ్వర ప్రియులు)

30. ,, అయిలూరి విశ్వనాథంగారు, అర్ధవరం, ప.గో.జి.
(గురుభక్తి పరాయణులు)

31. ,, కాశేశ్వరం తేజోలింగం గారు, సిద్దిపేట.
(యథార్థ హృదయులు)

32. ,, తాడికొండ లింగమూర్తిగారు, హైదరాబాద్.
(సమయోచిత కార్యసాధన దక్షులు)

33. ,, డాక్టర్- ముదిగొండ శివప్రసాద్ గారు, హైదరాబాద్.
(సమంజస ప్రవచన ధురీణులు)

34. ,, కాశీనాథుని అనందభైరవ ప్రసాద్ గారు, ,,
(సౌమ్య స్వభావులు)

35. సర్వశ్రీ॥ బచ్చు వీరేశం గుప్తగారు, (స్నేహపాత్రులు) వెస్ట్ మారేడుపల్లి.

36. శివశ్రీ॥ డాక్టర్ బెండపూడి శరభలింగ శర్మగారు, విశాఖపట్టణం.
(ఉదార గంభీర హృదయులు)

37. బ్రహ్మశ్రీ॥ ఆశుకవి-దేశపతి గోపాలకృష్ణశర్మ గారు, సిద్దిపేట.
(స్మార్త శైవాభిమానులు)

38. సర్వశ్రీ॥ రాపెల్లి భాస్కర్‌గారు, C2,F,2, కృపాకాంప్లెక్స్, మారేడుపల్లి.
(శ్రద్ధా భక్తి సంపన్నులు)

39. ,, ఉపలంచి బాలరాజయ్యగారి శ్రీనివాసరావు, మరియు సోదరులు, కుటుంబ సభ్యులు, సికిందరాబాద్. (సౌజన్య పరిపూర్ణులు)

40. ,, చిలుకూరి ఉదయభాస్కరరావు, సౌ॥ విజయలక్ష్మి గారలు, వెస్ట్ మారేడుపల్లి. (స్వార్జిత సంపన్నులు)

41. ,, వెంకటరమణ బనారస్ సిల్క్‌హౌస్‌వారు, సికిందరాబాద్
(దానపుణ్య పరిపూర్ణులు)

42. ,, చిలమంతుల కాంతయ్యగారు, మెటుపల్లి. (సరళస్వభావులు)

43. ,, ఉప్పలపాటి శ్రీనివాసరావు, సౌ॥ పద్మవతి గారలు, మారేడుపల్లి
(స్వయంకృషి నిపుణులు)

44. శ్రీమాన్॥ దుబ్బాక నాగేశ్వరరావు, సౌ॥ స్వరూపరాణి గారలు,
సికిందరాబాద్. (ఉత్తమస్వభావ శోభితులు)

45. శివశ్రీ॥ శివపురం స్వయంభువు గారు, విజయవాడ.
(స్వమతాభిమాన పరిపూర్ణులు)

46. ,, ముదిగొండ మల్లికార్జునరావుగారు, నల్లకుంట, హైదరాబాద్.
(ఆధ్యాత్మిక ప్రియులు)

47. సర్వశ్రీ॥ నడిపినేని సూర్యనారాయణ గారు, ఎం.ఏ. కందుకూరు.
(జిజ్ఞాసా పరిపూర్ణ హృదయకోవిదులు)

48. శివశ్రీ॥ శివలెంక (చంద్ర)శేఖర్‌గారు, విజయవాడ.
(అనవరత శైవప్రచారకులు)

49. సర్వశ్రీ॥ తేలుకుంట నారాయణరావు, అశోక్‌కుమార్, నరసింహరావు గారలు, శ్రీ విజయలక్ష్మి సిల్క్స్. జనరల్ బజార్, సికిందరాబాద్. (ధర్మబుద్ధిమంతులు)

50. శివశ్రీ॥ కొంపల్లి శంకరరావు గారు, హైదరాబాద్, (నిఃస్వార్థ ధర్మపరాయణులు)

51. ,, ముదిగొండ విద్యాసాగర్, సౌ॥ పర్వతవర్ధనమ్మ గారలు, హైదరాబాద్ (శివవిభూతి సంపన్నులు)

52. ,, సింగరాజు చలపతిరావుగారు, గాంధీనగర్, కాకినాడ. (మధురప్రియ భాషణులు)

53. ,, చాగంటి శాస్త్రిగారు, విజయవాడ, (శివవిజ్ఞాన ఘనులు)

54 సర్వశ్రీ॥ పి. లచ్చన్నగారు, 3-3-418, మహంకాళి స్ట్రీట్, ప్రొప్రయిటర్ పి జంగయ్య, సికిందరాబాద్. (దానసమర్థులు)

55. శ్రీయుత॥ డి (దాదే) సురేందర్, సౌ॥ సౌభాగ్య గారలు, వెస్ట్ మారేడుపల్లి.

56. ,, అడప యతిరాజు, సౌ॥ కమలమ్మ గారలు, వెస్ట్ మారేడుపల్లి. (ఆదర్శ పుణ్యదంపతులు)

57. ,, ఏ. (ఆడికె) రఘువీరగారు, ,,

58. ,, ఆర్. (రౌతు) వెంకట్రావు గారు, ,,

59. శివశ్రీ॥ శంకరప్రియ గారు, శీల. తూ గో.జి. (విచక్షణ విశారదులు)

60 సర్వశ్రీ॥ పులుగిళ్ళ ఆనందమోహన్, సౌ॥ పద్మ గారలు, మారేడుపల్లి (అనుపమ సౌజన్యసంపన్నులు)

61. ,, సూరేపల్లి నరసింహ, సౌ॥ లావణ్య గారలు, కిరాణాదుకాణం, మార్కెట్ స్ట్రీట్, సికిందరాబాద్. (అమృతహృదయులు)

62. ,, పనుపర్తి-వీరేశలింగం, సౌ॥ లక్ష్మిగారలు, 9-3-425, రిజిమెంటల్ బజార్, సికిందరాబాద్ (దైవభక్తి పరిపూర్ణులు)

63. శివశ్రీ॥ ముదిగొండ వీరభద్రయ్యగారు, ప్రొఫెసర్, సెంట్రల్ యూనివర్సిటీ,
హైదరాబాద్. (అనర్గళ వాగ్ధాటీ సభారంజకులు)

64. సర్వశ్రీ॥ అడప దాము (దామోదర్) సౌ॥ పద్మజ
అడప సురేశ్, లీల గారలు, మారేడుపల్లి. (స్నేహపాత్రులు)

65. శివశ్రీ॥ శివలెంక- చంద్రశేఖరశాస్త్రిగారు, అడ్వకేటు, 26/366 బి.
బుట్టయ్యపేట, మచిలీపట్నం. (సహృదయాగ్రగణ్యులు)

66. శ్రీయుత- శ్రీరాం హనుమంతరావుగారు, వెస్ట్ మారేడుపల్లి,
సౌ॥ శ్రీరాం రేఖ, చి॥ కుమారుడున్ను (విశ్వాసపాత్రులు)

ఇంక నెవరైన విరాళం సమర్పించునెడల వారి పేరులు - తరువాతి గ్రంథములో ప్రకటింపఁబడును.

